# శ్రీమద్రామాయణము

## కిష్కింధా కాండ



రచన

డా॥ జి. ఎల్. ఎన్. శాస్త్రి, M. Sc., M. Phil, Ph. D.

రీడర్, భౌతికశాస్త్ర విభాగాధ్యక్షులు

టి. జె. పి. యస్. కళాశాల, గుంటూరు.




జగద్గురు పీఠము - గుంటూరు శాఖ

( The World Teacher Trust – Guntur Branch )

గుంటూరు – 522 002.

శ్రీమద్రామాయణము

కిష్కింధాకాండ



ప్రతులకు

1. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
జి. ఎల్. ఎన్. శాస్త్రి
"మైత్రేయ నిలయం"
5-10-4, 2/9, బ్రాడీపేట, గుంటూరు-522 002
ఫోన్ : 33995

2. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
14-38-2, "రాధామాధవమ్"
ముప్పిడి కోలనీ, విశాఖపట్టణము-530 002.
ఫోన్ : 65291

వెల : సాధారణ ప్రతి రూ. 55/-
గ్రంథాలయ ప్రతి రూ. 70/-

ముఖ చిత్రం : బాలి

ముద్రణ ;

మాస్టర్ ప్రింటింగ్ ప్రెస్
ఐ. సి. సి. బిల్డింగు వద్ద, జిన్నాటవర్,
గుంటూరు - 522 001.
ఫోన్ : 23789

# అంకితము



## ప్రత్యక్ష గురువు

తే॥ గీ॥ సూర్య శిష్యుడు, మారుతి సుచరితుడును,
సూర్య పుత్రుడు, సుగ్రీవ సుకపిరాజు;
సూర్య వంశోత్త మారాధ్య సుగుణ మూర్తి
రామచంద్రుల - సంగమ రమ్యమైన
హృదయ సంబంధ మైత్రిని ఎఱుక పరచు
నట్టి, కాండమ్ము కిష్కింధ నంకితమ్ము—
'మంచి కార్యము లన్నియు మైత్రి తోడ
చక్క బెట్టుట సులువ'ని నొక్కి చెప్పి
ఆచరించుచు సాధించి నట్టి వారు,
మధుర వాత్సల్య భావాల మహిత మూర్తి,
హృదయ మందలి సద్గురు వెక్కిరాల
కృష్ణమాచార్య కులపతి కిత్తు నేను. —గ్రంథకర్త

# పరోక్ష గురువు



బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు

గీ॥ సర్వ సాహిత్య రీతుల సార్వభౌమ !
సరస గంభీర వేదార్థ సత్కవీంద్ర !
వివిధ సద్గ్రంథకర్త శ్రీ విశ్వనాథ !
హృదయ పూర్వక నతులయ్య సదయమూర్తి !

# విషయ సూచిక

# ముందుమాట

ఈ ముందుమాట చదివిన తర్వాతనే పాఠకులు మిగతా పుస్తక భాగాన్ని చదువుతారనే "న్యాయమైన కోర్కె"తో ఈ ముందుమాటను వ్రాస్తున్నాను.

ఇది శ్రీమద్రామాయాణంలోని కిష్కింధాకాండకు సంబంధించిన గ్రంథం. కిష్కింధాకాండ ప్రధానంగా మైత్రికి సంబంధించిన కాండ అని, ఒక విధంగా చూస్తే అన్ని కాండలలోకి ఒక విశిష్ట స్థానాన్ని కలిగి, రామాయణానికి హృదయ కేంద్రంలాగా భాసిస్తుందని "సాధకులకు మాత్రమే !" అన్న శీర్షికలో చెప్పబడింది. ఇందుకు తగ్గట్టుగానే ఈ గ్రంథం-అభిమానుల, ఆప్తుల, మిత్రుల ప్రోత్సాహ, సహకారాలతోనే - ఇలా వెలుగులోకి వచ్చింది.. శ్రుతి కలవడం (Tuning) అంటే ఇదేగా మరి !

రామ సుగ్రీవుల సఖ్యం, వాలి వధ ఈ కిష్కింధాకాండలో కొంత వరకు విమర్శకు లోనైన ఘట్టాలు. కథా భాగంలో ఈ రెంటిగురించీ వున్నా, మళ్లీ ప్రత్యేకంగా ముందుగా "ముఖచిత్ర రహస్యాలు" అన్న శీర్షిక క్రింద "సుగ్రీవుని మనస్తత్వ విశ్లేషణ", – చివరగా "అనుబంధం" శీర్షిక క్రింద "వాలి వధ ధార్మికమా? అధార్మికమా?" అన్న విషయ విశ్లేషణ పాఠకులు సూటిగా తెలుసుకునేందుకు ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి. (అనుబంధంలోని వాలి వధ విషయం శ్రీరామనామ క్షేత్రం వారి 'రామకోటి మహోత్సవ వజ్రోత్సవ సంచిక'లో నేను వ్రాసిన "వాలి వధ ధార్మికమా? అధార్మికమా ?" అన్న వ్యాసం నుండి గ్రహింపబడింది.) ఇలా ఈ రెంటి మధ్య కథాభాగాన్ని పొందుపరచడంలో గూడా ఒక ఔచిత్యం వుంది.

సుగ్రీవుడు మనలో ప్రాణనాడికి సంబంధించిన ఉచ్ఛ్వాసకు ప్రతీక అయితే, వాలి అపాన నాడికి సంబంధించిన నిశ్వాసకు ప్రతీక. [ఈ విషయం పూర్తిగా అర్థమవాలంటే నేను వ్రాసిన అరణ్యకాండలోని, ఈ పుస్తకంలోని 'సాధకులకు మాత్రమే !' అన్న శీర్షికలు చదువుకోవాలి.] ఉచ్ఛ్వాసం - ప్రారంభాన్ని, నిశ్వాసం -ముగింపును సూచిస్తాయి కాబట్టి ఈ కిష్కింధాకాండ కథా భాగం ఈ రెంటి మధ్య పొందుపరచబడింది.

వాలి పరాఙ్ముఖుడై వున్నపుడు శ్రీరాముడు వాలిపై బాణము వేసినట్లు వాల్మీకి వ్రాశాడు.

"పరాఙ్ముఖవధం కృత్వా....తాడితః"
(కిష్కింధ, 17 సర్గ 15 శ్లో॥)

వాలి తనను చూడనప్పుడు, తనతో యుద్ధం చేయనపుడు రాముడు వాలి మీద బాణం వేశాడు. ఇలాంటప్పుడు చాటునుండి లేదా చెట్టు చాటు నుండి బాణం వేశాడన్నా తప్పు కాదనే ఉద్దేశ్యంతో ఈ గ్రంథంలోను చివర అనుబంధ శీర్షికలోను గూడా రాముడు చాటు నుండి వాలిపై బాణం వేశాడని వ్రాశాను. రాముడు వాలిని ఎలా చంపినా గూడా అధర్మం ఏమీ అవదనే విషయం ఎలాగూ చర్చించబడి నిర్ధారింపబడింది గూడా ! [వాలి తరపున వకాల్తా తీసుకునే వారి మాట ఏమో గాని వాలి మాత్రం రాముని సమాధానాలకు సంతృప్తి చెందాడు ! ] దీని పూర్తి విశ్లేషణ కావాలంటే ఈ గ్రంథం చదవండి.

తార తెలివి 'ఇంతటిది' అని నిర్ణయించడం కష్టం. ఆ తెలివికి అవధుల్లేవు. ఆమె మాట్లాడగలిగినట్లు ఎవ్వరూ మాట్లాడలేరు ! ఈ విషయం మీ అంతకు మీరే తెలుసుకోవాలంటే ఈ గ్రంథంలో తార మాటలు చదవండి. అలాగే హనుమ రాముని మొదట సందర్శించినపుడు, చివరి ఘట్టాల్లో అంగదునితోను ఎలా మాట్లాడాడో గూడా ఈ కిష్కింధాకాండ చదివి తెలుసుకోండి.

సుగ్రీవుడు తెలిపిన భారతదేశపు నలుదిశల భూ భాగ వివరాలు తెలుసుకోవాలంటే ఈ కిష్కింధాకాండను చదవండి.

రామ – లక్ష్మణులు, వాలి – సుగ్రీవులు, సంపాతి – జటాయువులు అన్నదమ్ముల జంటలే ! అయినప్పటికీ, ఈ మూడు జంటల మధ్య తేడా విస్పష్టంగా తెలుసుకోవాలంటే ఈ కిష్కింధాకాండ చదవండి.

రామాయణానికి, కుండలినీ యోగానికి మధ్యగల సమన్వయం అర్థమవాలన్నా, కిష్కింధాకాండ గొప్పతనం అర్థం కావాలన్నా ఈ గ్రంథం చదవండి. ఇది పూర్తిగా నవ్యదర్శనం.

'ఇంతటి విలువైన యోగ, ధర్మపరమైన విషయాలున్న కాండ' ఈ కిష్కింధాకాండ అని మరొక్కసారి గుర్తుచేస్తూ, పాఠకులు ఈ గ్రంథాన్ని తప్పకుండా చదివి, ఆనందిస్తారని తలుస్తూ, ఇట్టి ఉపయోగ కరమైన పుస్తకాన్ని ప్రచురించడానికి దోహదపడిన వారందరికీ, ముఖ్యంగా ప్రధాన దాతలైన కీ॥ శే॥ పోలిశెట్టి సీతారామాంజనేయులు గారికి మరియు డా॥ జి. వి. కృష్ణారావు గారికి, వారి సతీమణి ఇందిర గారికి కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు తెలుపుకుంటున్నాను.

—గ్రంథకర్త

# కృతజ్ఞతలు

నాకు భౌతికమైన శరీరాన్నిచ్చి, పెంచి, పోషించి, ఈనాడు ఇలా గ్రంథ రచన చెయ్యడానికి అవకాశాన్ని కలుగజేసిన మా "అమ్మా –నాన్న" లకు హృదయంలోనే నమస్కరిస్తున్నాను.

ఈ గ్రంథ రచనకు కావలసిన జ్ఞాన సంపత్తిని ప్రసాదించి, మా కుటుంబ సభ్యులను అన్నివేళలా కంటికి రెప్పలా కాపాడుతూ వుండే గురువర్యులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారికి సాష్టాంగ దండ ప్రణామములు.

రామాయణ కల్పవృక్షం ద్వారా ప్రభావితుణ్ణై, నేను పరోక్ష గురువుగా ఆరాధిస్తున్న బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికి నా హృదయపూర్వక ప్రణామములు.

విరిసిన ముఖం, విప్పారిన హృదయం, మెరిసే కను కాంతులతోను ఉన్న హనుమ - రామ సుగ్రీవుల మైత్రికి అనిర్వచనీయమైన సంతృప్తిని పొందు తున్నట్లు గాను, అన్నిటికీ మించి చిత్రాన్ని చూస్తున్న మనకేవో సుఖాను భూతి కలిగేట్లుగాను, అద్భుతంగా 'రామ సుగ్రీవ సఖ్య' ముఖచిత్రాన్ని చిత్రించిన "శ్రీ బాలి"కి నా హృదయపూర్వక కృతజ్ఞతలు, ధన్యవాదములు.

ముఖచిత్ర ముద్రణలో సహకరించిన చి॥ Ch. S. N. రాజుకు, చి॥ ఆచారికి నా నిండు దీవెనలు, శుభాకాంక్షలు.

ఇక

ఆచరణపూర్వక ఆధ్యాత్మిక మార్గంలో శబ్దరహితంగా సాధనను కొనసాగిస్తూ, ప్రధాన ఋత్విక్‌గా వ్యవహరించి, ఈ గ్రంథ ప్రచురణా యజ్ఞాన్ని ఫలవంతం చేసిన చి॥ సూరపరాజు హనుమాన్‌ప్రసాద్‌కు, అతనితో పాటుఅత్యవసర సమయాల్లో తమవంతు సహకారాన్ని అందించిన అతని సోదరులు చి॥ సత్యం, చి॥ శ్రీనివాసులకు –

గ్రంథాన్ని సుందరంగా ముద్రించి ఇచ్చిన మాస్టర్ ప్రింటింగ్ ప్రెస్ అధినేత చి॥ జంపని సంజీవరావుకు, అతని ముద్రణాలయ సిబ్బందికి -

నా కృతజ్ఞతా పూర్వక శుభాశీస్సులు. వీరందరూ అన్ని విధాలా అభివృద్ధిని పొందవలెనని శ్రీరామచంద్రుని ప్రార్థిస్తున్నాను

ఈ గ్రంథం వెలుగులోకి రావడానికి ఇంకా ప్రత్యక్షంగాను, పరోక్షం గానూ దోహదపడిన వారుంటారు. వారందరికీ ఈ పుస్తకముఖంగా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

—గ్రంథకర్త.

ఈ కిష్కింధాకాండ గ్రంథ ప్రచురణకు నా యందు మా "జగద్గురు పీఠ" సంస్థ యందు గల ప్రేమాదరాభిమాన గౌరవములతో తమవంతు సహాయముగా విరాళముల నందించిన దాతల పేర్లు.

1. కీ॥ శే॥ కాట్రపాటి లక్ష్మీకాంతారావు గారి జ్ఞాపకార్థం వారి కుమారులు, గుంటూరు, సర్వశ్రీ సీతారామశర్మ, సత్యనారాయణ ప్రసాద్, జానకిరామశర్మ, సాయిప్రసాద్, వజ్రేశ్వరశర్మ, దుర్గాప్రసాద్ రూ. 1116/-
2. శ్రీమతి ఎన్. సీతాదేవి, విశాఖపట్నం 500/-
3. కీ॥ శే॥ రజనీ కుమారి జ్ఞాపకార్థం తండ్రి సుంకర రంగారావుగారు, గుంటూరు 216/-
4. ఘంటసాల సత్యనారాయణ గారు, గుంటూరు. 216/-
5. కంచర్ల సాంబశివరావు గారు, గుంటూరు. 216/-
6. గద్దె శ్రీనివాసరావు గారు, గుంటూరు. 216/-
7. ఎన్. ఆంజనేయశాస్త్రి గారు, గుంటూరు. 200/-

8. తాడేపల్లి బాబూరావు గారు, గుంటూరు. 116/-

9. బండారు దుర్గాప్రసాదు గారు, గుంటూరు. 116/-

10. హరితశ్రీ, గుంటూరు. 116/-

11. ఎమ్. శివలింగప్రసాదు గారు, గుంటూరు. 116/-

12. కన్నెగంటి సాంబశివరావు గారు, గుంటూరు. 116/-

13. డి. సూర్యనారాయణరావు గారు, గుంటూరు. 116/-

14. వావిలాల రామకృష్ణశాస్త్రి, గారు, బళ్లారి 101/-

15. యడ్లపాటి వెంకటేశ్వర్లు, పుష్పావతి దంపతులు 101/-

16. ఎమ్. శకుంతలాదేవి గారు, గుంటూరు. 100/-

ఈ సహృదయులందరికీ - వ్యక్తిగతముగా, కుటుంబపరముగా - అన్ని విధములా ఆనుకూల్యము, అభివృద్ధి సిద్ధించి, అందరూ ఆయురారోగ్యైశ్వర్యములతో వర్ధిల్లవలెనని శ్రీరామచంద్రుని ప్రార్థిస్తూ, వారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు తెలియజేయుచున్నాను.

**G. L. N. శాస్త్రి**



# ఆత్మీయుల అండదండలు



( పుస్తక ప్రచురణకు ప్రధాన దాతలు )

ఈ కిష్కింధాకాండను వ్రాయడం నేను ఏడాది క్రిందటే పూర్తి చేసినప్పటికీ ముద్రణ మాత్రం వెంటనే కాలేదు. కారణం అందుకు అవసరమయే ఆర్థిక వనరులు లేకపోవడమే ! అయితే దానికి సంబంధించిన వారు ఎప్పుడూ వుంటారనే నమ్మకం నాకుంది ఎందుకంటే నా పుస్తకాలన్నీ అలానే అచ్చవుతున్నాయి కాబట్టి. ఆ నమ్మకాన్ని మరింత గట్టి పరుస్తూ ఈ "కిష్కింధాకాండ" కూడా ఇప్పటికి ఇలా ఒక చక్కని గ్రంథంలాగా రూపు దిద్దుకొన్నది. ఇందుకు ప్రధానంగా తోడ్పడినవారు కీ॥ శే॥ పోలిశెట్టి సీతా రామాంజనేయులు గారి తరఫున వారి పుత్రులు చిరంజీవులు నారాయణమూర్తి, రామదాసు, నాగసుందర్ మరియు డా॥ గార్లపాటి వెంకటకృష్ణారావు గారు వారి సతీమణి శ్రీమతి ఇందిర గారు. వీరితో నాకు వృత్తి రీత్యాను, ప్రవృత్తి రీత్యా గూడా ఆత్మీయతా సంబంధం ఉన్నది.

నేను విశాఖపట్నంలోని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో భౌతికశాస్త్రంలో పరిశోధన చేస్తున్నపుడు — గుంటూరులో క్రొత్తగా ప్రారంభించిన **T. J. P. S.** కళాశాలలో ఫిజిక్స్ లెక్చరర్ పోస్టుకు అప్లైచేశాను. కొన్ని రోజులకు నాకు టెలిఫోన్ ద్వారా పిలుపు వచ్చింది. ఏంతో ఆదరంగా అలా నన్ను పిలిచినవారు అప్పటి కళాశాల స్థాపక కార్యదర్శి అయిన డా॥ G. V. కృష్ణారావు గారు. ఈ పిలుపు మేరకు నేను ఆ కళాశాలలో భౌతిక శాస్త్ర విభాగాధ్యక్ష బాధ్యతను 19-10-71 నుండి నిర్వహిస్తున్నాను.

కృష్ణారావు గారు మంచి హుందాగా వుండే వ్యక్తి. మంచి ఒడ్డూ, పొడుగూ, అందుకు తగ్గ అందము కలిగిన రూపం ఆయనది. కాలేజీలో నేను చేరిన రోజునే నన్ను కృష్ణారావు గారు తన కారులో తీసుకు వెళ్లి శ్రీ పోలిశెట్టి సీతారామాంజనేయులు గారిని, శ్రీ తెల్లాకుల జాలయ్య గారిని పరిచయం చేశారు. అటుపైన వారి స్వగృహానికి తీసుకువెళ్లి వారి సతీమణిని పరిచయం చేశారు. కృష్ణారావు గారికి మించిన ఆపేక్షతో, అదరాభిమానాలతో శ్రీమతి ఇందిర గారు నాతో మాట్లాడారు. మా ఇద్దరికీ గురువులైన శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు నేపథ్యంలో వుండి ఆనందించారు. అప్పటి నుండి ఇప్పటి వరకు మా, మా కుటుంబ సభ్యుల మధ్య సన్నిహిత బాంధవ్యం కొనసాగుతూ వస్తోంది. నేను ప్రప్రథమంగా సైకిల్ కొనుక్కోవడం దగ్గఱ నుండీ, ఒక స్వంత ఇంటివాణ్ణి అయేంత వరకు వివిధ సమయాల్లో ఎన్నోరకాలుగా నన్ను ఈ దంపతులు ఆదుకుంటూ నా ప్రగతిని చూసి హృదయపూర్వకంగా ఆనందించే వారు. మా అబ్బాయి చి॥ శివసుందర్ వాళ్ల నర్సింగ్ హోమ్‌లోనే 1977వ సంవత్సరంలో పుట్టాడు. సహజంగానే ఉన్నత ఆధ్యాత్మిక భావాలు కలిగిన వారు- వారి నర్సింగ్ హోమ్‌లోనే నా చేత కొన్ని వారాలు ఆధ్యాత్మిక ప్రసంగాలు కూడా ఏర్పాటు చేశారు. మా జగద్గురు పీఠం నిర్వహించే సేవా కార్యక్రమాలు నచ్చి గాయత్రీ పుస్తక ప్రచురణకు లోగడ రూ. 500/- విరాళంగా ఇచ్చారు. ఇప్పటి ఈ కిష్కింధాకాండకు మళ్లీ రూ. 5000/- లు విరాళంగా ఇచ్చి ప్రోత్సహించారు.

డా॥ కృష్ణారావుగారు గుంటూరులో నాకు ప్రప్రథమంగా పరిచయం చేసిన వ్యక్తి శ్రీ పోలిశెట్టి సీతారామాంజనేయులు గారు (అ తర్వాత తెల్లాకుల జాలయ్య గారిని గూడా పరిచయం చేశారు. ఈ ఇద్దరి కుటుంబాల వారు మా టి. జె. పి. యస్. కళాశాలకు ప్రధానదాతలు. ఈ

ఇద్దరికీ నేనంటే చాలా ప్రేమ, అభిమానము, ఆదరము. అందుకే ఈ ఇరువురి కుటుంబ వ్యక్తులు గూడా నాకు ఆత్మీయులు) ఆ రోజుల్లో ఆంజనేయులుగారు సాంబశివపేటలోని వారి స్వగృహంలో వుంటూ వుండేవారు. పరిచయమైన నాడు ఆంజనేయులుగారిని చూసినప్పటి దృశ్యం నాకిప్పటికీ గుర్తే! ఫాలభాగంలో కొట్టవచ్చినట్లు కనబడే మూడు విభూతి రేఖలు, కలిగి ప్రశాంతంగా సోఫాలో కూర్చుని వున్న ఆయన ముఖంలో మంచి వర్చస్సు, ఒక స్వచ్ఛత గోచరించాయి. వారు ఎన్నో సంస్థలకు, దేవాలయాల నిర్మాణ, నిర్వహణాకృషికి భూరి విరాళాలను, ఏంతో మంది బీద విద్యార్థులకు ఉపకార వేతనాలను ఉత్తమ విద్యార్థులకు స్వర్ణ పతకాలను ఇచ్చి ప్రోత్సహించిన వదాన్యులు. 'గురుభక్త రత్న' బిరుదాంకితులు, స్థానిక సంపత్ నగర్‌లోని శారదా దేవాలయానికి ధర్మకర్తలు.

నేను 1972 వ సంవత్సరం నుండి ఒక ఉచిత హోమియో వైద్యాలయాన్ని నిర్వహిస్తూ వుండేవాడిని. ఒకనాడు నాకు పోలిశెట్టి సీతారామాంజనేయులు గారి వద్ద నుండి పిలుపు వచ్చింది. ఆయన కారులోనే వాళ్లింటికి వెళ్లాను. వారికి దీర్ఘకాలిక చర్మ వ్యాధి (Skin All-rgy) వుండేది. దాని నిర్మూలనకు వారు ఎన్నో రకాల మందులను వాడారుట! ఎంతో డబ్బు వెచ్చించారుట! కాని లాభం లేక పోయింది. అప్పుడు చివరకు నేను ఇచ్చిన హోమియో మందులతో పూర్తిగా నయమైంది. తత్కారణంగా మా ఇద్దరి మధ్య సాన్నిహిత్యం బాగా పెరిగింది. వారి కుటుంబ సభ్యులకు గూడా హోమియో మందులు ఇస్తూ వుండే వాణ్ణి. నేను నడిపే ఉచిత హోమియో వైద్యాలయానికి అవసరమయే మందుల కొనుగోలుకై వారు ఆర్థిక సహాయం చేసేవారు. ఆనాటి చిన్న వైద్యాలయమే ఈనాడు బ్రాడీపేటలోని మా స్వగృహం వద్ద ఒక పెద్ద ఉచిత వైద్యాలయంగా రూపొందింది.

మా సంస్థ తరపున నేను నిర్వహించే ఇతర ఆధ్యాత్మిక సేవాకార్యక్రమాల పట్ల గూడా ఆంజనేయులుగారు ఎక్కువగా ఆసక్తి చూపేవారు.

మేము ఉచితంగా సామూహిక ఉపనయనాలు నిర్వహించినపుడు, పెద్ద ఎత్తున సప్తాహ జ్ఞాన యజ్ఞ. గురు పూజాది కార్యక్రమాలు నిర్వహిస్తున్నప్పుడు వారు భూరి విరాళాలు ఇస్తూ ప్రోత్సహించే వారు. ఒకసారి 'నావాణి' మాస పత్రికలో ధారావాహికంగా నేను వ్రాస్తున్న 'రాముడు-రామాయణం' వ్యాసం చదివి- 'చాలా బాగుంది' అన్నారు. 'పుస్తక రూపంలోకి వస్తే ఇంకా బావుంటుంది ? అన్నాను నేను. వారు 'చూద్దాం! ముందు రచన పూర్తి చెయ్యండి అన్నారు. కాని వారు కొద్ది రోజలలోనే దేహ తాగ్యం చేశారు–

—అంజనేయులుగారి నిర్యాణానంతరం వారి సోదరులు శ్రీ ఏకనాథ గుప్తగారు గూడా మా సేవా కార్యక్రమాలకు యథోచితంగా చేయూత నిస్తూ ఆదుకుంటూనే వున్నారు. అంజనేయులు గారి జ్ఞాపకార్థం వారి పుత్రులైన చి॥ నారాయణమూర్తి, చి॥ రామదాసు చి॥ నాగ సుందర్ కిష్కింథాకాండ ప్రచురణార్థం భూరి విరాళాన్నిచ్చి పితృ భక్తిని, రామాయణ పఠనాసక్తిని వ్యక్తపరచి వాళ్ల నాన్నగారు 'చూద్దాం' అన్న చిన్న మాటకు 'అర్థ' వంతం చేశారు. అంజనేయులు గారు దేహత్యాగం చేసినా (ఈ విధంగా) తమ వాగ్దానాన్ని పుత్రుల ద్వారా చెల్లించుకున్నారు.

ఈ విధంగా ప్రధానంగా పోలిశెట్టి వారి, గార్లపాటి వారి భూరి విరాళాల సహాయంతో, ఈ కిష్కింథాకాండ గ్రంథం ఈ రూపాన్ని సంతరించు కున్నది.

ఇలా, మా కుటుంబ సభ్యుల పైన, మా సంస్థ నిర్వహించే ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాల పైన అపారమైన ఆదరాభిమానాలు చూపిస్తూ, ఆత్మీయులుగా ఉండి ఎల్లప్పుడూ అండదండలుగా వుంటున్న డా॥ జి. వి. కృష్ణారావు గారికి, వారి శ్రీమతి ఇందిరగారికి వారి కుటుంబ సభ్యులకు; శ్రీపోలిశెట్టి సీతారామాంజనేయులుగారి కుటుంబ సభ్యులకు శ్రీ సీతారాములు అన్ని విధాలా అనుకూలిస్తూ, ఆయురారోగ్య ఐశ్వర్యాలను అనుగ్రహించాలని ప్రార్థించడం తప్ప-ఇంకో విధంగా పుస్తకముఖంగా వారికి ఎలా నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకో గలను ?

# స్పందన

డా॥ పి. అనంతలక్ష్మి
ఆంధ్రోపన్యాసకులు,
రైల్వే డిగ్రీ కళాశాల, హైదరాబాదు.

రామాయణం ! మళ్లీ రామాయణమేనా ? ఔను రామకథే ! రమణీయమైనది రామకథ ఒక్కటే కదా ! మనిషిని తొలిగా కవిని చేసిందీ, కవులందరికీ నవనవోన్మేషంగా దర్శనమిస్తూ కల్పవృక్షమైనదీ రామచరితమే. రామకథ రాయని తెలుగు కవులు, ఆధునిక రచయితలు (కమ్యూనిష్టులతో సహా) లేరు. రామకథ, లేదామహత్తరమైన సీత చరిత్ర ఎంత మనోహరమైనదో, మానవ స్వభావానికి ఎన్ని దృక్కోణాల్లో అద్దం పడుతుందో జీర్ణించుకున్న వాడు వాల్మీకి అనడంకంటే, అందులో లీనమైపోయాడనటం సరైనదేమో ! అందువల్లే నిత్యసత్యము, సత్యసుందరము సుందర నవ్యము అయిన రామ కథలో తాదాత్మ్యం చెందిన వాల్మీకి రామాయణాన్ని లలిత, ప్రౌఢ, కమనీయ కావ్యంగా మలిచాడు. ఆ రామాయణ సాగరంలో లభించని రత్నము లేదు. ఎవరు ఏ పాత్ర (పాత్రత) తో వెడితే అదినిండుతుంది. కథతో తృప్తిపడిన వారి ప్రాప్తము అంతే ! కావ్యగుణాలు వెతికే వారికవి కొల్లలు. రచనా శిల్పానికి అదే పరమావధి. అధ్యాత్మ విషయాలకి రామాయణంలోని ప్రతి పాత్ర ఒక ప్రతీక. మానవ స్వభావం, సౌభాగ్యం, మనస్తత్వం (Psychology), రాజనీతి మొదలైన అనేక విషయాలకి ఆకరమేకాదు, ఈ నాటికీ అన్వయించేట్లే ఉంటుంది రామాయణం. ఇది చరిత్రే అయినా, ప్రతిఘట్టం నడుస్తున్న చరిత్రకి అన్వయిస్తూనే ఉంటుంది. అగాధమూ, విశాలమూ అయిన రామాయణ

సాగరంలో నుంచి యోగసాధకుల కుపయుక్తమైన రత్నాలను తీసి ఏడు చక్రరూప పతకాలతో నున్న కంఠాభరణంగా రూపొందిస్తున్నారు శ్రీ జి. యల్. యన్. శాస్త్రి గారు. తలమునకలుగా మునిగి, వెలికితీసిన శ్రమ శ్రీ శాస్త్రి గారిది. వారి సోదరులైన సౌభాగ్యం వల్ల అనుభవం మన అందరిదీను.

ఏడు చక్రాలమాలలో నాల్గవది అయిన మధ్య పతకము హృదయ సంబంధమైన అనాహతము. ఈ అనాహతము వాయుతత్త్వ సంబంధి కనకనే వాయు పుత్రుని పరిచయం ఈ కాండలోనే కలుగుతుంది. ఈ కాండము వాయుపుత్రుని ప్రశంసతోనే పూర్తి అవుతుంది దానికి కొసమెరుపుగా శ్రీ శాస్త్రి గారు తమ కిష్కింధాకాండం చివరలో వాయు పుత్రుని స్తోత్రం కూర్చారు. వాయువులాగా ఇందులో రహస్యాలు ఎవరెగుప్పెటలోను ఇముడవు అందినట్లే ఉంటాయి, అనుభూతికి వస్తూ ఉంటాయి, కాని పట్టిచూపుదా మంటే వేళ్ల సందుల్లోంచి చల్లగా జారుకుంటాయి. కాని సాధకులకి మాత్రం గాలిని బంధించడం పెద్దపనేమీ కాదుగా! అటువంటి వాటికొక ఉదాహరణ వాలి వధ.

పురాణేతిహాసాల గురించి, ధర్మా ధర్మాల గురించి మాట్లాడటం చేతనవునను కున్న ప్రతివాళ్లలా మాట్లాడేదీ, ప్రశ్నించి తమ ఆధిక్యం ప్రదర్శించుదామనుకునే వాళ్లందరూ ప్రశ్నించేదీ వాలి వధ గురించే! అందరికీ అంతరాంతరాలలో తెలుసు అది ధర్మమేనని. కాని ఈనాటి ధర్మశాస్త్రాల ననుసరించి నిరూపించటం మాత్రం చేయలేరు. మరి శ్రీ శాస్త్రి గారు సంతరించిన ఈ కిష్కింధాకాండ చదివినవారు సహేతుకంగా ఆ విషయం విశదీకరించి, నిరూపించి, ధృవీకరించగలరు. రాముడు సుగ్రీవునికి సహాయంగా ఉన్నాడన్న సంగతి అంగదుడు వేగుల ద్వారా విన్నాడని తార వారితో చెబుతుంది వాల్మీకంలో, దానిని రమణీయంగా, నాటకీయంగా మలిచారు శ్రీ శాస్త్రి గారు. సుగ్రీవుని మంత్రులే అంగదునికి రాముని విషయం చెప్పి, సగం మనిషి, సగం జంతువు కనక చెట్టు చాటు నుంచి

చంపవచ్చునని కూడ సూచించినట్టు దర్శించడం, వాలి సుగ్రీవుల అభిప్రాయాలు. మనోభావాలు. తార బుద్ధి సూక్ష్మత చిత్రీకరించటం ఈ విషయమై ఎటువంటి సందేహానికి తావు లేకుండా చేస్తాయి.

సంభాషణల్లోను, ఓదార్పుల్లోను మామూలు మాటలకన్నా జ్ఞానయోగ విషయాలు, సాధకుని కుపయుక్తమయ్యే అంశాలు అధికంగా ప్రాధాన్యమీయబడినాయి. పాత్రల మనోభావాలను చిత్రీకరించేప్పుడు పాత్రోన్మీలనానికి పనికివచ్చే అంశాలు జోడించటం గ్రంధకర్త, మనస్తత్వ పరిజ్ఞానానికి నిదర్శనమే. ఈ అంశాలు అవాల్మీకమేమీ కావు. కాని వాల్మీకి చెప్పీ చెప్పనట్లుగా సూచించిన విషయాలు. ధర్మసూక్ష్మం (ధర్మ శాస్త్రం వేరు, ధర్మ సూక్ష్మం వేరు కదా !) తెలియని అనేకమందికి తరువాతి కాలంలో వివాదాస్పదంగా తయారైనాయ్. అటువంటి గ్రంథి గ్రంథులను విడగొట్టి పాఠకుల మనస్సులలో ఎటువంటి అనుమానాలు లేకుండా చేసి, సాధన అవిచ్ఛిన్నంగా సాగేందుకు దోహదం చేసేట్లుగా రూపొందించబడింది గ్రంథం.

ఉదాహరణకి అంగదుడు ప్రాయోపవేశ సమయంలో సుగ్రీవుని గూర్చి పలికిన విరసపు మాటలకు కారణాన్ని హనుమంతుడు విశ్లేషించి సమర్థించిన తీరు, వెంటనే సంపాతి తన కథను చెపుతూ తమ్ముడుని కాపాడటానికి తన రెక్కలను కప్పి వాటిని భస్మం చేసుకున్న విషయం చెప్పగానే అంగదుడి ప్రతిస్పందన. అంటే తన తండ్రి తమ్ముడైన సుగ్రీవుని వాత్సల్యంతో కాపాడటం పోయి బాధించడం గుర్తుకువచ్చి సుగ్రీవుడి పట్ల మెత్తపడటం - మొదలైనవి. ఈ రెండు సంఘటనలు చేర్చటం వల్ల అంగదుడి వ్యక్తిత్వానికే కాక, సుగ్రీవుడి వ్యక్తిత్వానికి కూడ మెరుగులు దిద్దినట్లైంది అంతేకాదు. ఇక్కడ రచయిత కథాసంవిధాననైపుణ్యం కూడ తెలుస్తుంది. తార పాత్ర వాల్మీకి దర్శించిన తీరులో పాఠకులకి దర్శనమిచ్చేట్లు చెయ్యటంలో కూడా రచయిత సఫలీకృతులయ్యారు.

అదే విధంగా తనకు వదినగారి నూపురాలు మాత్రమే తెలుసునని లక్ష్మణుడన్నపుడు సుగ్రీవుడి ప్రతి స్పందన కూడ మనస్తత్వ విశ్లేషణకి

అర్థంపడుతుంది. హనుమ సైగ చేయగా ఒక కోతి వచ్చి ఆభరణాలను వ్యత్యస్తంగా అలంకరించుకుని దుఃఖ వివశుడైన రాముని నవ్వించినట్టుగా చేసిన కల్పన హాస్యరసం యొక్క పరమావధిని సూచిస్తుంది. ఇలా ఇందులో విశేషాలు చెప్తూపోవటం కన్న 'సాధకులకు మాత్రమే' అన్న కర దీపిక సాయంతో అనాహత చక్ర సాధనా రహస్యాలను అనుభూతికి తెచ్చు కోవటం ఉత్తమం. ఎందు కంటే-ఎంత చెప్పినా ఇంకా మిగిలే ఉంటాయి.

"తార స్థాయిలౌక్యం", "సుగ్రీవాజ్ఞలు" లాంటి శీర్షికలు పాఠకుణ్ణి ఒక్క నిమిషం ఆగి ఆలోచింప చేస్తాయి. ఇవి పదార్థ విజ్ఞాన శాస్త్ర పారంగతు లైన డా॥ శాస్త్రిగారి పద అర్థ విజ్ఞానానికి మచ్చుతునకలు.

వాల్మీకి రచనా శైలి అనుపమానం. తు, చ, లు కూడ అధికంగా లేనంత పకడ్బందీగా రచిస్తూనే, మధుర మనోజ్ఞం చేశాడు వాల్మీకి, శ్రీ శాస్త్రి గారు ఆ కవితా సౌందర్యం అందుకొని దానికి చిరుమెరుగులు (ఈనాటి పాఠకుల సౌలభ్యం కోసం మాత్రమే సుమా!) దిద్దటమే కాదు ముఖచిత్రంలో కూడ కవిత్వాన్ని, భావుకతని ప్రదర్శిస్తున్నారు. బొమ్మలో కవిత్వం అన్న మాట. కిష్కింధాకాండ ఆయువు పట్టు (సూర్య సంబంధమైన ముగ్గురి స్నేహం) గుర్తించి దాన్ని, ముఖ చిత్రంగా అలంకరింపచేయటం ఔచిత్యా నికి పరాకాష్ఠ.

ఈనాటి విందులో ఈ పదార్థాలున్నాయి అని పట్టిక ఇచ్చినట్టు మాత్రమే ఈ మాటలు. ఇంక విందు భోజనానికి సిద్ధమౌదాం.

ఇలాగే మిగిలిన రామాయణ కాండలు కూడ సాధకుల ఉపయోగార్థం శ్రీ శాస్త్రిగారు అందించగలరని ఆశిస్తూ............

29-10-93 }
హైదరాబాదు }

అనంతలక్ష్మి

# ముఖచిత్ర రహస్యాలు

కిష్కింధా కాండ మైత్రికి సంబంధించిన కాండ. అందుకే ఈ పుస్తక ముఖపత్రం (మొదటి అట్ట) మీద మైత్రికి సంబంధించిన విషయమే చిత్రీకరించ బడింది. ఈ చిత్రంలో ముఖ్యంగా సూర్య శిష్యుడైన హనుమ. సూర్య పుత్రుడైన సుగ్రీవుడు, సూర్యకుల దీపకుడైన శ్రీరాముడు, వీరి మధ్య జ్వలిస్తున్న అగ్నిహోత్రుడు వున్నారు. శ్రీరామ సుగ్రీవుల మధ్య హనుమ ద్వారా, అగ్ని సాక్షిగా జరిగిన సఖ్యాన్ని ఈ చిత్రం సూచిస్తుంది. అయితే నిర్మలమైన స్నేహానికి దస్తావేజులు (Affidavits), సాక్ష్యాలు (Witness), నమోదులు (Registrations) అవసరమా ? ప్రాణస్నేహితుల మధ్య ఇలాంటివి వుండవు గదా ! విభీషణుడి విషయంలో ఏ సాక్ష్యమూ లేదే ? మరి ఎందుకు ఇక్కడ అగ్ని సాక్ష్యం అవసరమైంది? అన్నది ప్రశ్న. అయితే విభీషణుడు రాముని దగ్గఱకు శరణాగతునిగా వచ్చాడు గాని సఖ్యం కోసం రాలేదు. శరణానికి, సఖ్యానికి తేడావుంది. "శరణాగతునికి బేషరతుగా అభయం ఇవ్వడమే !" అన్న ధర్మాన్ని నియమంగా పెట్టుకున్న శ్రీ రాముని దగ్గఱకు - అన్నగారి పద్ధతులు నచ్చక – 'శత్రు పక్షంలోని వాడైనా రాముడు ధర్మ స్వరూపుడనే భావంతో' - పూర్తిగా శరణాగతుడైన వాడు విభీషణుడు. స్వంత అన్నగారిని చంపించడంలో సహాయం కోసం రామునితో సఖ్యం కోరినవాడు సుగ్రీవుడు. అంటే ఈ సుగ్రీవునితో సఖ్యం-సఖ్యార్థంలో అంత ఉన్నతమైనది, ఉదాత్తమైనదీ కాదా ? అందుకే అగ్ని సాక్ష్యమా ? అయితే తొందరపడి మాత్రం ఒక నిర్ణయానికి వచ్చెయ్య కూడదు. ఈ విషయంలో సుగ్రీవుని మనస్సులోని అంతర్యం ఏమిటో కూడా బాగా తెలుసుకున్న తర్వాతే నిర్ణయానికి రావాలి.

సుగ్రీవుని మనస్తత్వాన్ని తెలిపే సన్నివేశాలకు సంబంధించిన ప్రశ్నలు కొన్ని వున్నాయి.

1) 'రావణుడెవరో', 'ఎక్కడుంటాడో' మొదలైన వివరాలు ఏమైనా తెలిస్తే చెప్పు, అని శ్రీరాముడు సుగ్రీవుణ్ణి అడుగుతాడు అందుకు సుగ్రీవుడు రావణుని గురించి తనకేమీ తెలియదని చెబుతాడు. కాని-సీతాన్వేషణకై దక్షిణ దిశ వైపు వానరులను పంపినపుడు—' బాగా దక్షిణ దిక్కుగా వెళ్తే లంకాద్వీపం వస్తుందని, అక్కడ రావణుడుంటాడని, సీతను అక్కడే దాచినా దాచవచ్చని, వెళ్ళి గాలించండనీ' వారిని ఆజ్ఞాపిస్తాడు. ఇంతకూ సుగ్రీవునికి రావణుని గురించి తెలిసినట్లా? తెలియనట్లా? తెలిస్తే శ్రీ రామునితో ముందు తనకేమీ తెలియదని ఎందుకు చెప్పినట్లు? అన్నది మొదటి ప్రశ్న.

2) వాలిని గురించి చెప్పమని శ్రీ రాముడు సుగ్రీవుని అడిగినప్పుడు గూడా - వాలి దుందుభిని, మాయావిని చంపిన సంగతులు, సప్త తాళ విదళనం సంగతి చెప్పాడేగాని – వాలి రావణుని ఇబ్బంది పెట్టిన సంగతి (62వ పేజీ) వాలి ముందు రావణుడు దుర్బలుడే నన్న సంగతీ – చెప్పడు. అయితే ఈ సంగతి సుగ్రీవునికి తెలుసునను కోవాలా? తెలియదను కోవాలా? అన్నగారి బల పరాక్రమాలకు సంబంధించిన ఈ విషయం స్వంత తమ్ముడైన సుగ్రీవునికి ఆ మాత్రం తెలియదను కోడానికి వీల్లేదు. మరైతే రామునితో ఈసంగతి ఎందుకు చెప్పలేదు? అన్నది రెండవ ప్రశ్న.

3) పై రెండు సన్నివేశాలను బట్టి సుగ్రీవుడు అంత నిజాయితీపరుడు (Honest, Sincere and plain man) కాదను కోవాల్సి వస్తుంది. ఇలాంటి వారితో ఒప్పందాలు కుదుర్చుకునే వ్యవహారాల్లో తప్పని సరిగా

సాక్ష్యాలు అవసరమే అని కూడా అనుకోవలసి వస్తుంది. అయితే సుగ్రీవు డలాంటి వాడని శ్రీ రామునికి ముందే తెలిసి అగ్ని సాక్షిగా సఖ్యం చేసుకున్నాడా ? అన్నది మూడవ ప్రశ్న

పై ప్రశ్నలకు వెనకవున్న సన్నివేశాలను సరిగ్గా విశ్లేషిస్తేగాని అసలు విషయం ద్యోతకం కాదు. ఇక్కడ ఒక్క విషయం గుర్తుపెట్టుకోవాలి. కబంధుడు శాప విమోచనమైన తరువాత ఊర్ధ్వలోకాలకు పోతూ రామునితో- "సుగ్రీవుడు చాలా బుద్ధిశాలి, కృతజ్ఞుడు, సత్యసంధుడు, అధర్మబుద్ధిలేనివాడు, అతనితో నువ్వు అగ్నిసాక్షిగా సఖ్యం చెయ్యి. ఆ సుగ్రీవుని సహాయంతో సీతాన్వేషణ జరుగుతుంది. నీ సీత నీకు దక్కుతుంది.'' అని చెప్తాడు. కాబట్టి తొందరపడి సుగ్రీవుణ్ణి అబద్ధాల కోరుగానో, నిజాయితీలేనివాడుగానో అపార్థం చేసుకోకూడదు ముందుపై ప్రశ్నలకు సమాధానాలను విశ్లేషించి చూద్దాం.

1) రావణుని గురించి సుగ్రీవునికి తెలుసునా ? తెలియదా ? శ్రీ రాముడు అడిగినప్పుడు తెలియక పోవచ్చు. కాని వాలివధ తర్వాత తార ద్వారా తెలుసుకుని వుండవచ్చు. (తన భార్య అయిన తారతో వాలి చెప్ప కుండా వుండడు గదా !) తార ద్వారా తర్వాత తెలుసుకున్నాడు గాబట్టి వానరులను దక్షిణ దిక్కుకు పంపేటప్పుడు సుగ్రీవుడు వారికి రావణుని గురించి చెప్పివుండవచ్చు. కాబట్టి సుగ్రీవుడు అబద్ధాల కోరు కాదన్న మాటే గదా !

అయితే రావణుని సంగతి వాలి తన తమ్ముడైన సుగ్రీవునితో ముందే చెప్పివుంటే – అప్పుడు సుగ్రీవుడెలాంటి వాడను కోవాల్సి వుంటుంది ? అప్పుడు కూడా తొందరపడి నిర్ణయానికి రాకూడదు. ఎందుకంటే, సుగ్రీవుడు బుద్ధిశాలి. ముందే తెలిసినా రావణుని సంగతి శ్రీ రామునికి చెప్పక

పోవడంలో ఏదో ఆంతర్యం వుండి వుంటుంది. సుగ్రీవుడే కనక రావణుని సంగతి తనకు తెలుసునని ముందే చెప్పేస్తే-'అయితే సీతను చెర విడిపించేం దుకు సీతాన్వేషణా కార్యక్రమాన్ని ముందు చూద్దాం' అని రాముడు సుగ్రీవుని పని వాయిదా వెయ్యవచ్చు. అప్పుడు సీతాన్వేషణకు తనను నమ్ముకున్న కొద్ది మంది వానరులనే వినియోగించుకోవాల్సి వస్తుంది. వాలి వద్ద వున్న ఎక్కువ వానరుల్ని గూడా ఉపయోగించుకోవడం కుదరదు. అదే వాలి వధ అయిన తర్వాత అయితే-తన దగ్గఉన్న వానరులను వాలి వద్ద వున్న వానరులను కలిపి అందర్నీ సీతాన్వేషణకు వినియోగించవచ్చు. మంది ఎక్కువైతే పని తేలికవుతుందిగదా! అదీగాక రాముడు వాలిని చంపి రుమ తిరిగి సుగ్రీవునికి దక్కేలాగా చేస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. అందు వల్ల నైనా వాలి వధ ముందు జరిగేలా చూడాలి. లేక పోతే రాముని ప్రతిజ్ఞకు భంగం వాటిల్లుతుంది. కాబట్టి రాముని ప్రతిజ్ఞ చెల్లేట్లు చెయ్యాలన్నా, వాలి వద్ద వున్న వానరులను గూడా సీతాన్వేషణకు ఉపయోగించుకోవాలన్నా వాలివధ ముందే జరిగి తీరాలి!" ఇలాంటి ఉద్దేశ్యంతో రావణుని గుఱించి ముందే తెలిసినప్పటికీ సుగ్రీవుడు రాముడికి చెప్పి వుండకపోవచ్చు. కాబట్టి ఈ విషయంలో సుగ్రీవుడిది దూరాలోచనే గాని దురాలోచన కాదన్న మాటేగదా!

2) వాలి ముందు రావణుడు దుర్బలుడన్న సంగతి శ్రీ రామునికి సుగ్రీవుడెందుకు చెప్పలేదు? ఈ విషయం గూడా సుగ్రీవునికి ముందు తెలియకపోవచ్చు. వాలివధ అనంతరం తారద్వారా తెలుసుకుని వుండవచ్చు. (ఆక్షేపణకు దారితీసే సంగతులు చెప్పక పోవచ్చునేమోగాని, 'రావణుడు లాంటివాణ్ణి ఇలా ఏడిపించాను' అని తన బలపరాక్రమాల గొప్ప తనం గుఱి ంచినసంగతి తన భార్య అయిన తారతో వాలి చెప్పకుండా వుండడు గదా!) అలాగైతే మంచిదే! సుగ్రీవుణ్ణి అపార్థం చేసుకోవక్కర్లేదు. కాని తార

ద్వారా తెలియాల్సిన అవసరం లేకుండా ఈ సంగతి వాలి ద్వారానే సుగ్రీవునికి ముందే తెలిసి వుంటే రామునితో ఆ సంగతి చెప్పకపోవడం తప్పు కాదా ?' అని అనిపించవచ్చు. కాని, అప్పుడు గూడా తొందర పడకూడదు. 'వాలి ముందు రావణుడు దుర్బలుడు' అని సుగ్రీవుడు రామునితో ముందే చెప్పివుంటే-అప్పుడు 'రాముడు తన పని తొందరగాను, తేలిగ్గాను పరిష్కారమవడంకోసం సుగ్రీవునివదిలి వాలినే ఆశ్రయించవచ్చు. అప్పుడు సుగ్రీవుని పని ఏమౌతుంది ? – ఇలా కనక ఊహించి రామునికి చెప్పక పోతే-సుగ్రీవునిది స్వార్థదృష్టే అవుతుంది, సుగ్రీవుడు స్వార్ధపరుడే అవుతాడు – అని వెంటనే అనుకోవాల్సివస్తుంది. కాని, ఇక్కడ కూడా కొద్దిగా నిదానించాలి. తన భార్య సీతను తిరిగి పొందడం తేలిగ్గా పరిష్కారం అవుతుంది గదా అని రాముడు వాలినే కనక అడిగినా, ఆశ్రయించినా - బల మద మూర్ఖత్వ లక్షణాలు గల వాలి సహాయం చెయ్యకపోగా, ఎద్దేవాగా అనకూడని మాటలు ఏమైనా అని రాముణ్ణి అగౌరవ పరచవచ్చు. ఉత్తముడైన రామునికి ఇలా జరగకుండా నివారించాలని దూరం ఆలోచించి సుగ్రీవుడు చెప్పి వుండకపోవచ్చు. కాబట్టి ఇలా చెప్పక పోవడం సుగ్రీవుని దూరాలోచననే తెలియపరుస్తుంది గదా !

ఇక్కడ ఇంకో సంగతి గూడా గమనించాలి. తన స్వంత తమ్ముని భార్యను తమ్ముడి వద్ద నుండి అపహరించిన వాలి ఏ విధమైన నైతిక బలంతో – 'పరాయివాడి భార్యను అపహరించడం అధర్మం, అన్యాయం తిరిగి శ్రీ రామునికి సీతను అప్పచెప్ప'మని రావణునితో మాత్రం చెప్ప గలడు? చెప్పేవి 'శ్రీ రంగ నీతులు దూరేవి దొమ్మరి గుడిశెలు' లాగా ఉండదూ ? అందుకే ఈ విషయం గూడా సుగ్రీవుడు ఆలోచించి-చెప్పి వుండకపోవచ్చు.

కాబట్టి ఈ సందర్భంలో గూడా సుగ్రీవుణ్ణి అనవసరంగా అపార్థం చేసుకోవాల్సిన పని లేదుగదా !

3) శ్రీ రామునికి సుగ్రీవుని సంగతి ముందే తెలుసునా ? ఏమో ! 'ఈ విషయం మాత్రం నిర్ధారించి చెప్పలేం' అన్నదే – దీనికి సమాధానం కాని విభీషణ శరణాగతి సందర్భంలో ఈ విషయం కొద్దిగా తెలుస్తుంది. 'విభీషణునికి శరణు ఇచ్చి తమ పక్షంలో చేర్చుకో వచ్చా?' అని అందరి అభిప్రాయాలను శ్రీరాముడు అడుగుతాడు. అప్పుడు అందరూ వాళ్లవాళ్ల అభిప్రాయాలు చెబుతారు. సుగ్రీవుడు మాత్రం – "స్వంత అన్నగారినే మోసం చేసి శత్రు పక్షంలో జేరడానికి విభీషణుడు వచ్చాడంటే' మరికాస్త ఆలోచించండి" అంటాడు. అప్పుడు శ్రీ రాముడు సుగ్రీవుణ్ణి చూసి ఒక్క చిరునవ్వు నవ్వుతాడు. అంతే ! ఆ చిరునవ్వుకు మనం వ్యాఖ్యానం చెప్పుకోవాలి. "ఇక్కడున్న వాళ్లలో ఒక్క నువ్వు తప్ప మిగిలిన వాళ్లలో ఏ ఒక్కళ్లు ఇలా అన్నా సబబుగానే ఉంటుంది. ఎందుకంటే – అవతల విభీషణుడు అన్నగారి పద్ధతులు నచ్చక, ధర్మం మనవైపు వుందని నిర్ధారించుకుని మన పక్షంలో జేరడానికి వచ్చాడు. కాని నువ్వు స్వంత అన్నగారిని చంపించడంలో నా సహాయం కోరిన వాడివి. ఈ సంగతి గుర్తులేక ఇలా మాట్లాడుతున్నావు" అని ఆ నవ్వుకు అర్థం చెప్పుకోవలసి ఉంటుంది.

మరో సంగతి :

"అంగదునికి నిండు ప్రేమతోనే సుగ్రీవుడు యువరాజ పదవిని ఇస్తాడు. 'సుగ్రీవుడు తనకైతమ ఈ పని చేస్తాడా ?' అని నీకు అనుమానం రావలసిన పనిలేదు. ఇది నా అభిమతం అని తెలిసిన తరువాత గూడా చెయ్యకుండా వుండడు గదా" ( 70వ పేజీ ) అంటాడు శ్రీ రాముడు

చరమ దశలో వున్న వాలితో. శ్రీ రాముని ఈ మాటలను గూడా జాగ్రత్తగా అర్థం చేసుకుంటే కొంతవరకు సుగ్రీవునిపై శ్రీ రామునికి వుండే అభిప్రాయం కొద్దిగా తెలుస్తుందేమో ? అంతే !

సుగ్రీవుణ్ణి గురించి శ్రీ రామునికి ముందే తెలిసినా, తెలియక పోయినా కంబంధుడు ముందే చెప్పినట్లు అగ్ని సాక్షిగానే సఖ్యం జరిగింది. ఎవరికీ ఏ ఇబ్బందీ, ఏ లోపమూ, ఏ దోషమూ అంటకుండా-అన్నీ సవ్యంగానే జరిగి పోయాయి. సర్వమూ శుభాంతమైంది. అదే కావల్సింది గూడా ! కాబట్టి ఈ విశ్లేషణ ఇంక ఆపేద్దాం !

— గ్రంథకర్త

# సాధకులకు మాత్రమే !

శ్రీమద్రామాయణంలోని కాండలన్నిటికీ దేని విశిష్టత దానికున్నది. రామాయణం కేవలం ఒక కావ్యమే కాదు, ఒక ఇతిహాసమే కాదు. కుండలినీ యోగంతో సమన్వయాన్నికలిగిన ఒక యోగ గ్రంథం కూడా! కుండలినీ యోగచక్రాలకూ రామాయణ కాండలకూ ఉన్న సంబంధాన్ని, సమన్వయాన్ని గూర్చి- (ప్రస్తుత కాండ కిష్కింధ కాబట్టి ఈ కాండ గురించి మరికొంత ఎక్కువగాను) సాధకుల ఉపయోగార్థం ఈ శీర్షిక క్రింద తెలియజేస్తున్నాను.

రామాయణంలో కాండలున్నట్లే కుండలినీ యోగంలో చక్రాలుంటాయి. ఉత్తర కాండతో కలుపుకుని ఉండే ఏడు కాండలకు- సహస్రారంతో కలుపు కుని వుండే ఏడు చక్రాలకు విచిత్రమైన సమన్వయాన్ని గుర్తించవచ్చు. 'పృథివ్యాపస్తేజోవాయురాకాశా'లనే పంచభూతాల వరుసక్రమాన్ని అనుస రించి కుండలినీ యోగంలోని చక్రాలపేర్లు వరుసగా 1) మూలాధారం, 2) మణిపూరకం, 3) స్వాధిష్ఠానం, 4) అనాహతం, 5) విశుద్ధి ఈ ఐదూ కాక వీటిపైన వున్న 6) ఆజ్ఞ, 7) సహస్రారాలతో కలుపుకుని మొత్తం ఏడు చక్రాలు. అలాగే వరుస క్రమాన్ని అనుసరించి రామాయణం లోని కాండలపేర్లు వరుసగా 1) బాలకాండ, 2) అయోధ్యాకాండ, 3) అరణ్య కాండ, 4) కిష్కింధాకాండ, 5) సుందరకాండ. 6) యుద్ధకాండ మరియు 7) ఉత్తరకాండ.

చక్రాలు – తత్త్వాలు :

జగద్గురువులైన ఆదిశంకరాచార్యులవారు వారు వ్రాసిన "సౌందర్య లహరి"లో కుండలినీ యోగ చక్రాలను, వాటి తత్త్వాలను తెలియజేసే శ్లోకాన్ని ఇక్కడ చదువుకోవడం సముచితం.

శ్లో॥ మ హీం మూలాధారే, కమపిమణిపూరే, హుతవహమ్
స్థితం స్వాధిష్ఠానే, హృదిమరుత, మాకాశముపరి, ।
మనో౽పి భ్రూమధ్యే సకలమపిభిత్వాకులపథమ్
సహస్రారే పద్మే (రమ్యే) సహరహసి పత్యా విహరసే॥
(సౌందర్యలహరి- 9 శ్లో॥)

[భావము : (యోగసాధకుని ఉపాసనలో) కుండలినీ శక్తి అనే అమ్మవారు- మూలాధార చక్రంవద్ద పృథివీ తత్త్వాన్ని, మణిపూరకం దగ్గఱ జలతత్త్వాన్ని, స్వాధిష్ఠానం దగ్గర అగ్ని తత్త్వాన్ని, అనాహతం వద్ద వాయుతత్త్వాన్ని, విశుద్ధి వద్ద ఆకాశతత్త్వాన్ని, కలిగిన 'కుల' మార్గాన్ని భేదించుకుంటూ పైపైకి ఉద్బుద్ధమవుతూ చిట్ట చివరకు పై కొసవద్దగల సహస్రారమనే పద్మం (లేదా గది) లో, రహస్యంగా అయ్యవారితో కలిసి విహరిస్తుంది.] *

చక్రాలు – కాండలు

మూలాధార చక్రం పృథివీ తత్త్వానికి సంబంధించినది. అంటే మనలో భౌతికమైన బలం (Physical Strength) అంతా ఈ మూలాధార చక్రంతో సంబంధాన్ని కలిగివుంటుంది. ఇది వెన్నెముక క్రింది కొసవద్ద ఉంటుంది. దీనిని ఆంగ్లంలో Base Centre అంటారు. అశ్విని, భరణి మొదలైన 27 నక్షత్రాలను మన మస్తకం నుండి పాదాల వరకు వరుస క్రమంలో న్యాసం చేస్తే - వెన్నెముక క్రింది కొస వద్దకు 'మూలా' అనే నక్షత్రం వస్తుంది.

---

* గమనిక : పంచభూతాల వరుసక్రమాన్ననుసరించి మూలాధారం తరువాత మణిపూరకం, తరువాత స్వాధిష్ఠానమయినా-వాస్తవానికి వెన్నెముక వెంబడి వుండే వరుస క్రమాన్ని అనుసరించి మూలాధారం తరువాత స్వాధిష్ఠానం, అటుపైన మణిపూరకం వుంటాయి.

అందుకే ఈ చక్రానికి 'మూలాధారచక్రం' అనే పేరువచ్చింది. ఇది ధనుస్సు రాశిలో మొట్టమొదట్లో ఉంటుంది. 'బాణం ఎక్కుపెట్టిన విల్లు'– ఈ ధనుస్సు రాశికి గుర్తు. కుండలినీ శక్తి ఇక్కడనుండి ఊర్ధ్వ గతిని పడుతుందనే కుండలినీ యోగ రహస్యాన్ని ఈ బాణం ఎక్కుపెట్టిన విల్లు తెలియజేస్తుంది. కుండలినీ యోగంలో ప్రథమ చక్రం అయిన మూలాధారచక్రం వద్దకు సాధకుని కుండలినీ శక్తి ఉద్బుద్ధమైనపుడు - అది ద్రవ్యాత్మక పృథివీ తత్త్వానికి సంబంధించినదై, భౌతికబలమంతా కేంద్రీకరింపబడి కట్టుదిట్టం కాబడే స్విచ్ లాంటిది అవటం వలన- సాధకునిలోని భౌతికబలం ఇక్కడ వ్యవస్థీకరింపబడుతుంది.

రామాయణంలోని ప్రథమకాండ అయిన బాలకాండలో గూడా భౌతిక బలాల వ్యవస్థీకరణ గురించిన సన్నివేశ విషయాలే ఉంటాయి ఇటు ఆత్మ సామ్రాజ్యానికి సంబంధించిన సూర్య వంశస్థుడైన శ్రీరాముని తరఫువారి పుట్టుపూర్వోత్తరాలు, వారి శౌర్య సంపత్తి గురించిన- అటు అహంకార సామ్రాజ్యానికి సంబంధించిన బ్రహ్మ వంశస్థుడైన రావణాసురుని తరఫువారి పుట్టుపూర్వోత్తరాలు, శౌర్య సంపత్తుల గురించిన- సన్నివేశ విషయాలు వుంటాయి. బాల్య విషయాలు ఉండడం వలన 'బాల కాండ' అన్నారనే మాట అలావుంచి, బలాబలాల విషయాలు ఉండడాన్ని బట్టి ఈ కాండను 'బాల కాండ' (బల సంబంధమైన కాండ) అనడం గూడా సమంజసమేగదా!

రెండవ చక్రమైన మణిపూరక చక్రం నాభివద్ద వుంటుంది. అందుకే దీనిని ఆంగ్లంలో Navel Centre లేదా Solar Plexus అంటారు. ఇది జల తత్త్వానికి సంబంధించినది. తల్లిని - బిడ్డను సంధాన పరచేది నాభి. అంటే ఇది తల్లీ బిడ్డలను కలిపే మమతా బంధం. ఇది ఆ ఇరువురి దేహాల మధ్య వుంటుంది కాబట్టి భౌతికమైన బంధం. 'ఈ మమతా బంధం తెగ

వలసినది' – అని బొడ్డు కోయడం సూచిస్తుంది. ప్రేమాను బంధంహృదయ సంబంధమైన ప్రేమకు సంబంధించినది - ఇది తెగవలసిన అవశ్యకతలేదు. మింగలాలు, తిమింగలాలు. మొసళ్లు మొదలైన వాటితోనిండి వుండే కోనేరు లాంటిది ఈ మణి పూరక చక్రం. ఇక్కడకు కుండలినీశక్తి ఉద్బుద్ధమైనపుడు సాధకునిలోని ఈర్ష్య, అసూయ. రాగ, ద్వేష, శోక, మమకారాలు ఒక్కసారి మకరాది జలచరాలు విజృంభించినట్లు విజృంభిస్తాయి. దీనిని దాటి కుండలీనీ శక్తి ఊర్ధ్వ మార్గానికి పోవడం చాలా కష్టం.

రామాయణంలోని రెండవకాండ అయిన అయోధ్యాకాండలో గూడా రాగద్వేష, అసూయ, ప్రకోపాలకు సంబంధించిన మంధర ప్రభోధము, కైకేయీ వరాల ప్రమేయము; శోక మమకారాలకు సంబంధించిన దశరథ రాముల (తండ్రీ బిడ్డల) వియోగము మొదలైన సన్నీవేశాలు చిత్రీకరింపబడతాయి.

మూడవ చక్రమైన స్వాధిష్ఠానం అగ్నితత్త్వానికి సంబంధించినది. దీనిని ఆంగ్లంలో **Spleen centre** అంటారు. శరీరంలోని ఉష్ణోగ్రతా సమత్వాన్ని ఆహార పానీయాదుల జీర్ణశక్తిని ఈ చక్రమే కట్టుదిట్టం (control) చేస్తుంది. అంటే ఈ చక్రం జఠరాగ్ని పైన గూడా ప్రభావాన్ని కలిగి ఉంటుందన్న మాట !

రామాయణంలోని మూడవ కాండ అయిన అరణ్యకాండతో గూడా- అగ్ని సంబంధమైన విరాధ, జటాయు, కబంధుల దహనక్రియలకు సంబంధించిన సన్నివేశాలు; భూమి యొక్క ఉత్తరార్ధ దక్షిణార్ధ గోళాల మధ్య సమత్వాన్ని, తన జఠరాగ్నితో వాతాపి వంటి రాక్షసుల దహనాన్ని చేసిన అగస్త్య మహాముని యొక్క కథా సన్నివేశాలు; అగ్ని శిఖలాంటి సీత అప

హరింపబడే సన్నివేశం (రావణుడు సీతను అపహరించడం అంటే తనతో పాటే అగ్నిని లంకకు తీసుకు వెళ్లడమేగా మరి!) ఈ కాండ లోనే చిత్రీకరింపబడతాయి.

ఇక నాల్గవ చక్రం అనాహతం – నాల్గవ కాండ కిష్కింధ. అంటే ప్రస్తుత గ్రంథానికి సంబంధించిన కాండ అన్నమాట! కాబట్టి ఈ రెంటిని గురించి మరికొంత ఎక్కువ వివరణ ఇవ్వడం సమంజసం!

అనాహతచక్రం వాయు తత్త్వానికి సంబంధించినది. ఈ చక్రానికి స్థానం హృదయం. అందుకే దీనిని ఆంగ్లంలో 'Heart Centre' అంటారు. రాశులలో సింహరాశి హృదయస్థానాన్ని తెలియజేస్తుంది. ఈ సింహరాశికి అధిపతి సూర్యుడు, సూర్యుడు ఆత్మకారకుడు ['కాలాత్మా దినకృత్ మనస్తుహినగుః....' బృహజ్జాతకం అధ్యా–2, శ్లో–1] ఈసూర్యుని పేర్లల్లో ఒక పేరు 'మిత్రుడు' అంటే మైత్రికి సంబంధించిన వాడు. అంటే కుండలినీ శక్తి నాల్గవ చక్రమైన అనాహతం వద్దకు ఉద్బుద్ధమైనపుడు సాధకునిలోని వాత్సల్యము, స్నేహము, భక్తి మొదలైన ఆత్మగుణాలు ఉత్తేజితమౌతాయి. వాస్తవానికి వాత్సల్యము, స్నేహము, భక్తి మూడూ గూడా ప్రేమ యొక్క రూపాంతరాలే! తన కన్న చిన్నవారి యందుండే ప్రేమకు 'వాత్సల్యం' అనీ, తన ఈడు వానిపై ఉండే ప్రేమను 'స్నేహ' మనీ, తన కన్న పెద్ద వారిపై ఉండే ప్రేమను 'భక్తి' అనీ అంటారు.

రామాయణంలోని నాల్గవ కాండ అయిన కిష్కింధాకాండలో గూడా– ఆత్మ సామ్రాజ్యం తరపు వాళ్లైన శ్రీరాముడు, సుగ్రీవుడు, హనుమంతుడు- కలిసే సన్నివేశాలు, వీరి మధ్య ఏర్పడే సఖ్యానికి సంబంధించిన సన్నివేశాలు, సఖ్యంతో సాధించే విషయ సన్నివేశాలు చిత్రీకరింపబడతాయి. ఈ

ముగ్గురిలో శ్రీరాముడు-సూర్య కులదీపకుడు, సుగ్రీవుడు-సూర్యాంశజనితుడు, హనుమంతుడు-వాయుసుతుడు, సూర్య శిష్యుడు-అంటే ముగ్గురూ సూర్య సంబంధీకులేనన్న మాట ! ఏడు చక్రాలలో అనాహతం నాల్గవదిగా ఉండి హృదయం దగ్గఱ కేంద్రంలాగా ఉన్నట్లే – కిష్కింధాకాండ కూడా నాల్గవ కాండగా ఉండి రామాయణానికి హృదయం లాగా కేంద్రస్థానంలో ఉంటుంది.

కృష్ణయజుర్వేదానికి ఏడుకాండలు. ఆ ఏడుకాండలలో మధ్యదైన నాల్గవ కాండలో 'హృదయం' లాగా రుద్రాధ్యాయం ఉంటుంది. ఈ రుద్రాధ్యాయములోనే మధ్యలో "ఓం నమస్సోమాయచ రుద్రాయచ...." అనేఅనువాకం వస్తుంది. ఈ అనువాకాంతంలోనే 'నమశ్శివాయ' అనే పరమపవిత్రమైన పంచాక్షరీ మంత్రం గూడా వస్తుంది. అంటే కృష్ణయజుర్వేదానికి రుద్రాధ్యాయం ఎలాంటిదో రామాయణానికి కిష్కింధాకాండ అలాంటి దన్న మాట !

సప్త వ్యాహృతులకు, సప్త కాండలకు సమన్వయాన్ని చూస్తే-

"ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః. ఓం మహః, ఓం జనః, ఓంతపః, ఓగ్ం సత్యమ్"అనే ఏడు వ్యాహృతులలో కేంద్రంలాగా మధ్యలో ఉండేదీ, నాల్గవదీ అయిన 'ఓం మహః' అనే వ్యాహృతికి సంబంధించినదిగా కిష్కింధాకాండను సమన్వయ పరచు కోవాల్సి ఉంటుంది. కాబట్టి ఒక విధంగా చెప్పుకోవాలంటే కిష్కింధాకాండ కాండలలో 'మహ' నీయమైన దన్న మాటే గదా !

ఐదవ చక్రం విశుద్ధి. ఇది కంఠం వద్ద ఉంటుంది. అందుకే దీనిని ఆంగ్లంలో 'Throat Centre', అంటారు. కంఠం శబ్దానికి ఉత్పత్తి

స్థానం. ఆకాశం శబ్ద గుణకం. అందుకని ఈ విశుద్ధి చక్రం ఆకాశ తత్త్వానికి సంబంధించినది. పైన ఉన్న బుఱ్ఱని, క్రింద ఉన్న హృదయాన్ని ఈ కంఠం సంధాన పరుస్తుంది. బుఱ్ఱ–బుద్ధికి, హృదయం–ఆత్మకి స్థానాలు. బుద్ధి–సీతను, ఆత్మ-రాముణ్ణి సూచిస్తాయి. (నేను వ్రాసిన అరణ్యకాండలోని సాధకులకు మాత్రమే! అనే శీర్షికలో ఈ విషయాలు వివరింపబడ్డాయి) ఈ ఇద్దరికీ మధ్య సంధాన కర్తలాగా, వార్తాహరుని లాగా హనుమ ఉంటాడు. ఈ హనుమ చేసే 'ఆకాశ' గమన సన్నివేశంగూడా ఈ ఐదవ కాండ అయిన సుందర కాండలోనే ఉంటుంది.

ఆరవ చక్రం ఆజ్ఞా చక్రం. ఈ చక్రానికి స్థానం ఫాల భాగంలోని భ్రూమధ్యం. అందుకే దీనిని ఆంగ్లంలో 'Brow Centre', అంటారు. ఇక్కడే జ్ఞాన నేత్రం ఉంటుందంటారు. శివునికి అగ్ని నేత్రం కూడా ఇక్కడే ఉంటుంది, అగ్ని ఎలాంటి పవిత్రమైనదో జ్ఞానం గూడా అలాంటి పవిత్రమైనది. అని సూచన! ['నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే'.... భగవద్గీత 4-38] ఈ ఆజ్ఞా చక్రం మనస్తత్త్వానికి సంబంధించినది.

ఆరవ కాండ అయిన యుద్ధకాండలో అహంకార సామ్రాజ్యానికి సంబంధించిన 'మనస్సు' అనే రావణాసురుడు, ఆత్మ సామ్రాజ్యానికి సంబంధించిన 'ఆత్మ' అనేరాముని'లోనికి లీనమవడం, 'బుద్ధి' అనేసీతకు 'జ్ఞానము' అనే అగ్నిలో శుద్ధి పరీక్ష జరగడం మొదలైన సన్నివేశాలు చిత్రీకరింపబడతాయి.

ఏడవ చక్రం సహస్రారము. ఈ చక్రానికి స్థానం బ్రహ్మ రంధ్ర ప్రాంతము. అందుకే దీనిని ఆంగ్గంలో 'Head Centre' అంటారు. ఆజ్ఞా

చక్ర స్థానం మనుష్యులకు తూర్పు దిక్కును సూచిస్తే- ఈ బ్రహ్మరంధ్ర స్థానం ఉత్తర దిక్కును సూచిస్తుంది. రామాయణంలో ఏడవ కాండ పేరు కూడా ఉత్తర కాండ. కాండలలో ఈ ఉత్తర కాండను లెక్క వేయకుండా రామాయణం 'షట్కాండ' లనీ, అలాగే చక్రాలలో సహస్రారాన్ని లెక్క వెయ్యకుండా చక్రాలను 'షట్చక్రా' లనీ, అనడం గూడా వాడుకలో ఉంది !

కిష్కింధాకాండలోని వానరాలు కుండలినీ యోగ పరంగా మనలో నాడులను సూచిస్తాయి. అంటే కిష్కింధాపురం నాడీమండల కేంద్రమైతే కిష్కింధాపుర వాసులైన వానరులు నాడీ మండలంలోని నాడులన్న మాట ! (ఉదా : సుగ్రీవుడు – ప్రాణనాడి; వాలి–అపాననాడి) నాడులు అంటే అంటే మనం కళ్ళతో చూడగలిగే నరాలు (Nerves) కాదు. కాదు. నాడులు-కాంతి కిరణాలు, అయస్కాంత బల రేఖలు విద్యుత్తు లాంటావి–అంటే ఇవి భౌతికమైన పదార్థంతో చేయబడినవి కావన్న మాట ! ఐన్ స్టీన్ చెప్పిన 'శక్తి-ద్రవ్య తుల్యతా సూత్రం' లో శక్తికి ద్రవ్యం ఎలాంటిదో నాడికి నరం అలాంటిదిగా అర్థం చేసుకోవాలి. శక్తిని మనం కళ్లతో చూడ లేము. కాని దాని ప్రభావాన్ని ద్రవ్యం ద్వారా చూడగలం. అలాగే నాడిని మనం కళ్లతో చూడ లేము. కాని దాని ప్రభావాన్ని నరాల ద్వారా చూడ గలము (విద్యుత్తును రాగితీగ ద్వారాలాగా అన్న మాట !) దీనిని బట్టి కిష్కింధలోని వానరులందరూ భౌతిక శరీరాల వారు కాదనీ, కేవలం తేజోమయ శరీరాల వారనీ యోగపరంగా అర్థం చేసుకోవాలి. చక్షుర్నాడి (చూడడానికి సంబంధించినది) శ్రోత్రనాడి (వినడానికి సంబంధించినది) రసనాడి (రుచికి సంబంధించినది) ప్రాణనాడి (శ్వాస పీల్చడానికి, అంటే ఉచ్ఛ్వాసకు, ఆకర్షణ గుణానికి సంబంధించినది)అపాననాడి(నిశ్వాసకు వికర్షణ గుణానికి సంబంధించినది). ఇలా ఎన్నో నాడులు (72,000) మనలో వుంటాయి. ఈ నాడులన్నీ కంఠం వద్ద కలిసి పైన వున్న మెద

డుని క్రింద వున్న దేహాన్ని సంధానపరుస్తూ వార్తా ప్రసారాలను చేరవేస్తూ అందిస్తూ వుంటాయి. అందుకే వానరులందరూ వార్తాప్రసార పాత్రధారులు (Communication faculties) అన్న మాట ! కంఠం దగ్గఱ కలిసే 72 వేల నాడుల సంఖ్యలోని '72' కు సూచన గానే సౌందర్యలహరిలో కంఠం దగ్గఱ వుండే ఆకాశతత్వానికి చెందిన విశుద్ధి చక్రం వద్ద కిరణాలు 72 అని చెప్పబడతాయి.

శ్లో॥ క్షితౌ షట్పంచాశ, ద్విసమధిక పంచాశ దుదకే,
హుతాశే ద్వాషష్టి, చతురధిక పంచాదానిలే,
దివి ద్విష్షట్త్రింశత్, మన సిచ చతుష్షష్టి రితితే
మయూఖా స్తే షామప్యు పరితవ పాదాంబుజ యుగమ్
—శ్లో 14

పై శ్లోకంలో 'దివి'–అంటే ఆకాశ సంబంధమైన విశుద్ధి చక్రం వద్ద, ద్విష్షట్త్రింశత్ = ద్విః + షట్ త్రింశత్ = 2 × 36 = 72 అని అర్థం.

ఇంత వరకు తెలిసిన 'కుండలినీ యోగ-రామాయణ' సమన్వయం అర్థమైనపుడు రామాయణం - 'కుండలినీ యోగ సాధనానుభవ సన్నివేశాలకు అక్షర కథా రూపమేనేమో' అనే క్రొత్త దృక్పథం (New Dimension) ఏర్పడక మానదు. అందులోను ముఖ్యంగా కిష్కింధాకాండ - హృదయ కేంద్రస్థితమైన అనాహత చక్రం లాంటిది కాబట్టి, సూర్య సంబంధితమైనది కాబట్టి - ఈ కాండ పారాయణం హృత్పద్మ వికాసానికి చక్కగా తోడ్పడు తుంది. సాధకులు ఈ అవకాశాన్ని సద్వినియోగ పరచు కొందురు గాక !

G. L. N. శాస్త్రి

# శ్రీ మ ద్రా మా య ణ ము

## ( కిష్కింధాకాండ )

### సంక్షి ప్త ఇతివృ త్తం

రామ లక్ష్మణులు పంపాసరస్సు ఒడ్డమ్మటే నడుస్తూ, అక్కడ ఉన్న అరణ్య శోభను. వివిధ ప్రదేశ సౌభాగ్యాలను తిలకిస్తూపోతూ వుంటారు. ఋష్యమూక పర్వత ప్రాంతం దగ్గఱ వీళ్లిద్దర్నీ ముందుగా దూరం నుండే సుగ్రీవుడు చూస్తాడు. తనను హతమార్చడం కోసం వాలి పంపిన వారేమో నని భయపడి, మంత్రులతో ఆ విషయం చెబుతాడు. హనుమంతుడు భిక్షుక రూపంలో వెళ్లి, రామ లక్ష్మణులతో పరిచయం చేసుకుంటాడు. వాళ్ల సంగతి చూచాయగా తెలిసిన తర్వాత తన రాజైన సుగ్రీవుని విషయం వాళ్లకు తెలియజేస్తాడు. హనుమవాక్చాతుర్యానికి రాముడు అబ్బురపడతాడు. హనుమ రామ సుగ్రీవులకు సఖ్యం కుదురుస్తాడు. రామ సుగ్రీవులు ఒకరి కొకరు సహాయపడి వారి వారి సమస్యలు పరిష్కరించుకోవాలను కుంటారు.

పూర్వం సీత జారవిడిచిన నగలమూట సంగతి సుగ్రీవుడు చెప్పి గుర్తుపట్టగలరేమో చూడమంటాడు. సీత నూపురాలను లక్ష్మణుడు గుర్తు పడతాడు. రామ లక్ష్మణులకు సీత బ్రతికే ఉన్నదని ఆశ చిగురిస్తుంది. సుగ్రీవుడు తన సోదరుడైన వాలి వల్ల తనకు జరిగిన అన్యాయాన్ని రామునికి విన్నవించుకుంటాడు. దుందుభి వృత్తాంతం, వాలి దుందుభుల యుద్ధం, మతంగముని వాలికి ఇచ్చిన శాపం అన్నీ చెప్తాడు. సుగ్రీవునికి తనపై ధైర్యం కలిగేందుకు శ్రీరాముడు సప్త తాళ వృక్షాలను ఒకే బాణంతో

కొట్టడం, దుందుభి కళేబరాన్ని పది ఆమడల దూరానికి తన్నడం చేస్తాడు సుగ్రీవునికి ధైర్యం కుదురుతుంది నమ్మకం కలుగుతుంది.

నీలుడు, తారుడు మొదలైన కొందరు వానరులు అంగదునికి శ్రీరామ లక్ష్మణుల గూర్చి, వారితో సుగ్రీవుని సఖ్యం గూర్చి రామ సుగ్రీవుల ప్రతిజ్ఞల గూర్చి చెప్తారు.

శ్రీరాముని అండ చూసుకుని సుగ్రీవుడు వాలిని తనతో యుద్ధానికి రమ్మని కేక పెడ్తాడు. వాలి ఉగ్రుడై, ఉన్నపలాన వచ్చి సుగ్రీవుణ్ణి చిత్తు చిత్తు చేస్తాడు. చెట్టు చాటున నిరీక్షిస్తున్న రాముడు వాలి సుగ్రీవులలో ఎవరు సుగ్రీవుడో ఎవరు వాలో గుర్తించలేక పోతాడు. సుగ్రీవుడు డీలాపడి రాంగానే ఓదార్చి, ఒక గజ పుష్పమాలికను సుగ్రీవుని మెడలో, వేసి మళ్లీ యుద్ధానికి పంపిస్తాడు. రెండవ సారి సుగ్రీవుడు యుద్ధానికి రావడంతో తారకు అనుమానం కలిగి. వాలిని యుద్ధానికి వెళ్లవద్దని, అవతల సుగ్రీవునికి శ్రీరాముని అండ వున్నదని హితబోధ చేసి వారిస్తుంది. అయినా వాలి సుగ్రీవునితో తలపడతాడు. అదను చూసి వాలిని శ్రీరాముడు చెట్టు చాటు నుండి బాణం వేసి వధిస్తాడు.

నేల కూలిన వాలి శ్రీరాముణ్ణి ఎన్నో ప్రశ్నలడుగుతాడు. రాముడు చేసిన పని ఎంతవరకు ధార్మికమని ప్రశ్నిస్తాడు. అన్నిటికీ తగిన సమాధానాలు చెప్పి శ్రీరాముడు వాలికి కనువిప్పు కలిగిస్తాడు. తార అంగదునితో రాంగానే, వాలి ఎదురు గుండానే సుగ్రీవుని సమక్షంలో రాముడు అంగదునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేస్తాడు. వాలి సంతోషంగా ప్రాణాలు విడుస్తాడు.

సుగ్రీవుడు పోగొట్టుకున్న రాజ్యాన్ని. భార్య రుమను, ఆమెతోపాటు తారను గూడా పొంది, భోగ విలాసాలలో మునిగిపోతాడు. శ్రీరాముడు

గ్రీష్మ వర్ష ఋతువుల్లో సీతావియోగ దుఃఖాన్ని అనుభవిస్తాడు. లక్ష్మణుడు శ్రీరాముణ్ణి ఎప్పటికప్పుడు ఓదారుస్తాడు. ఇచ్చిన గడువు పూర్తి అయినా సుగ్రీవుడు తమ విషయం పట్టించుకోవడంలేదని లక్ష్మణునికి కోపం వస్తుంది. రాముని వద్ద అనుజ్ఞ తీసికొని సుగ్రీవుని సంగతి తేల్చుకోవాలని కిష్కింధాంతఃపురానికి వెళ్తాడు. సుగ్రీవుడు హడలిపోతాడు. హనుమంతుని మంత్ర కుశలత్వంతో, తార వాక్చాతుర్యంతో లక్ష్మణుణ్ణి ప్రసన్నుని చేసుకొని, సీతాన్వేషణా కార్యక్రమానికి ఉద్యుక్తుడౌతాడు. నాలుగు దిక్కులా ఉన్న సర్వ ప్రదేశ విశేషాలను తెలిపి, నాలుగు దిక్కులకు వానర సైన్యాలను పంపిస్తాడు. ప్రత్యేకంగా దక్షిణ దిశకు అంగదుని నేతృత్వంతో హనుమంతుడు, జాంబవంతుడు మొదలైన వానరయోధుల్ని పంపుతాడు. సీతను చూచి రాగల సామర్థ్యం హనుమకున్నదనే నమ్మకంతో రాముడు తన ఉంగరాన్నిచ్చి సీతకు చూపించమని చెప్పిపంపిస్తాడు.

వానర వీరులు నాలుగు దిక్కులకు విజృంభిస్తారు. తూర్పు, పశ్చిమ ఉత్తర దిక్కుల వైపుగా వెళ్లినవారి నుండి అనుకూలమైన సమాచారం రాదు.

దక్షిణ దిక్కుకు వెళ్లిన అంగద, హనుమంతాదులు వెదకి వెదకి వేసారి నిరుత్సాహపడ్తారు వింధ్యాద్రి అంతా వెదుకుతూ వెదుకుతూ ఋక్ష బిలమనే పెద్ద సొరంగంలో చిక్కుకుంటారు. అక్కడే అపర త్రిపురసుందరి లాగావున్న "స్వయంప్రభాదేవి"ని చూస్తారు. ఆమె అనుజ్ఞతో ఆకలి దప్పులు తీర్చుకొని, ఆమె అనుగ్రహంతో బిలం నుండి బయటపడ్తారు సుగ్రీవుని ఆజ్ఞ, పెట్టిన నియమం గుర్తుకువచ్చి అంగదుడు వ్యాకులపడతాడు. వానరుల ఆలోచనలో మార్పువచ్చేట్లు మాట్లాడతాడు. అందుకు తారుడు వత్తాసు పల్కుతాడు. హనుమంతుడు వ్యవహారం చేతులు దాటుతోందని గ్రహించి

తన వాక్చాతుర్యంతో అంగదుణ్ణి, మిగిలిన కపివీరులను సరియైన దారికి తెస్తాడు. "సంపాతి" అనే విచిత్ర విహంగాన్ని చూస్తారు. సంపాతి జటాయువు అన్న గారని తెలుసుకుంటారు. సంపాతి చెప్పిన పూర్వవృత్తాంతాలు వింటారు. సీత లంకలోనే వుంటుందని నమ్మకం కలుగుతుంది. ఉత్సాహం పెరుగుతుంది. సముద్రం దగ్గఱకు వళ్లి వందయోజనాలు దూకగల సమర్థుడైన హనుమను స్తుతించి, తమను ఆదుకోమంటారు. జాంబవంతుడు హనుమంతుని జన్మవృత్తాంతాన్ని తెల్పి ఉత్సాహపరుస్తాడు. హనుమంతుడు విజృంభించి మహేంద్రగిరి శృంగానికి ఎక్కి లంఘిస్తాడు. వానరయోధులు జయ జయ ధ్వానాలతో హనుమకు వీడ్కోలు తెలుపుతారు.

శ్రీ ర స్తు

# శ్రీ మ ద్రా మా య ణ ము

## కి ష్కిం ధా కాం డ

రామలక్ష్మణులు అరణ్యశోభను తిలకిస్తూ నడుస్తున్నారు. తన కుంభ స్థలాలపై ఆకులు, పూవులు ఉంచుకొని మందంగా ఘీంకారంచేస్తూ, ప్రియా విరహంతో ఒక మగ ఏనుగు పంపానదీ తీరానికి వెళ్తోంది. చల్లగాలిలో పంపానది నీటి తుంపురులు చెట్లపూలపై పన్నీరు చల్లుతున్నాయి. వంటి నిండా కంబళ్లు కప్పుకొన్నట్లు కనబడే భల్లూకాలు చెట్లపైని తేనె పట్టుల్లోని తేనెలు త్రాగుతున్నాయి. చెట్లకు తీగలు రాచుకుంటూ ప్రణయ రాగాలు పలుకుతున్నాయి. దక్షిణ దిక్కు నుండి మలయ మారుతాలు వీస్తున్నాయి. పంపా జలంతో పెరిగిన లతలు, తీగలు, చెట్లు పచ్చదనాన్ని చేజిక్కించు కుని నేత్ర పర్వంగానూ, మనోహరంగానూ ఉన్నాయి. అడవి అంతా మన్మథుడు క్రొత్తగా కట్టుకున్న ఇల్లులాగా ముగ్ధ మనోహర కన్యకా కేళీ విలాసంగా వుంది. రేగిన గాలి దూకుడికి క్రిందపడ్డ మగ్గిన వెలగ పండ్లు కమ్మని వాసనల గాలికి వాటి చుట్టూ తేనెటీగలు మూగి ఆ గుబాళింపుకు మత్తెక్కిపోతున్నాయి.

ఆకాశమంత ఎత్తులో పూసింది జూకాలమల్లి. తొడిమపట్టు వీడిన పూలన్నీ నింగి నుండి నేలకు రాలాయి. పూల గుండెల్లో దూరి తేనెటీగలు తేనంతా జుర్రుకుంటున్నాయి. రకరకాల పూలలో తెల్లరేకులు, ఎర్రటి తొడి మలు గలిగిన కొన్నిపూలు మల్లెల కంటె అందంగా వున్నాయి. నాసా పుటా లకు విందు చేకూరుస్తున్నాయి. కుసుమశరుడు ఏదో క్రొత్త మార్గం అవలం బించినట్లుంది. లొద్దుగదుమ్ములు కళ్లల్లో జల్లుతున్నట్లు, తంగేడు

పూగుత్తుల కారపు వుండలతో గురిచూసి కళ్లల్లోకి కొడుతున్నట్లు వీర మార్గానికి కొంత వ్యతిరేకంగా ఉంది. కొన్ని చెట్లకొమ్మలు క్రిందకు వాలి నేల తల్లి వడిలో పువ్వుల నవ్వులతో కేరింతలు కొడుతున్నాయి. కొన్ని పెరిగి, పెరిగి పెద్దవై నింగి తండ్రి హద్దులు దాటడానికీ ప్రయత్నిస్తున్నాయి.

## రాముని హృదయ వేదన

కలహంస నడకలతో, మయూర పింఛ కబరితో, స్నిగ్ధ సుకుమార ముగ్ధాకృతితో రాముని చిత్తంలో సీత మొగ్గతొడిగి, సిగ్గులొలక బోసింది. మనోవీధిలోని మధురానుభూతి మరుక్షణంలోనే మటుమాయమైంది. నిట్టూర్పు, నిరాశ, నిస్పృహ చోటుచేసుకున్నాయి. ఇంకా సీత జీవించి ఉంటుందన్న ఆశ పోయింది. "ఇంకా ఆ రాక్షసులు నా సీతను ప్రాణాలతో ఉంచుతారా? హా దురాశగాని—ఈ బ్రతుకుల జగత్తు కట్టిన తశావృక్షంలో నేనొక రెమ్మని. ఈ రెమ్మకు ఎంత ఆరాటమో!" అంటూ ఓ కదంబాన్ని చూసి "నీవు నా సీతను చూశావా?" అంటున్నాడు రాముడు ఇంతలోనే "అదిగో అరుణ కిరణ కాంతులు విరజిమ్ముతున్న చీర ఇక్కడ ఆరవేసింది నా సీత" అంటూ చిగిర్చిన లేత రేలకొమ్మ దగ్గఱకు పోయి తీరెంతా భ్రాంతి అని తెలిసి నిట్టూరుస్తున్నాడు.

"తెలిసిన వయసులో నన్ను కొలవడం ఆశ్చర్యమేముంది? తెలియని వయసులోనే నన్ను ఆరాధించింది సీత. నేనే సర్వదేవతా కూటమి అనుకొన్నది. నేను రావటం ఆలశ్యమైందని తనే నన్ను వెదకటానికి ఈ అరణ్యమంతా గాలిస్తోందేమో ! పాపం పిచ్చిపిల్ల! ఈ రాక్షసమూక ఏం చేయకుండా వుంటే బావుణ్ను" అని ఏమీ తోచకపోతే ఎదురుగా వేపకొమ్మ మీద కాకి కనబడగానే "నీకు తల్లి లాంటిది సీత ఎప్పుడు తిరిగి వస్తుందో

కాస్త చెప్పు'' అన్నాడు. 'రాముడంతవాడు అలా అడిగాడుగదా' అని కనికర మైనా లేకుండా ఆ కాకి ఏమీ కూయకుండా గంతువేసి ఎగిరిపోయింది. 'బహుశః పాతపగ ఇంకా మరచిపోలేదేమో! ఛీ! ఈ కోపము, పగ–తల్లీ బిడ్డల సంబంధాన్ని కూడా చెడగొడతాయి గదా!' అనుకున్నాడు.

ఎదురుగా ముంగాళ్లమీద నుంచుని రాముణ్ణే పరకాయించి చూస్తోంది ఒక కుందేలు. సీత సంగతి తనకు తెలిసినా ఏం చెప్పగలదు ? చివరకు దక్షిణ దిశ వైపుగా ముఖం త్రిప్పి కళ్లార్పుతోంది. రాముడు దాని మూగ భాషను, భావాన్ని మనస్సులోనే అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తూ "ఆహా నోరూ, వాయిలేని ఈ జంతువులకు నేనంటే ఎందుకు ఇంతజాలి? ఈ రాక్షసులకు ఎందుకంత అకారణ వైరం? సృష్టంతా ఒక దారి అయితే ఈ రాక్షసులది మరో దారి గదా!" అనుకున్నాడు. ఇంతలోనే చీకటి పడింది. బూరుగుచెట్టుమీద మిణుగురుల్ని చూసి- 'ఇరవై కళ్ల రాక్షసుడడుగో ! వీడి పని ఇంతటితో సరి' అని రాముడు దగ్గరకు వెళ్లి తెల్లబోతున్నాడు.

రామలక్ష్మణు లిద్దరూ ముందుకు నడుస్తున్నారు. లక్ష్మణుడు రాముణ్ణి మధ్య మధ్యలో అనునయిస్తున్నాడు. ఇద్దరూ గంభీరంగా అడుగులు వేసుకుంటూ, నడుస్తూ వెతుకుతూ, ముందుకు సాగుతున్నారు. ఆ ఇద్దర్నీ దూరంగా ఉండే చూశాడు సుగ్రీవుడు.

## సుగ్రీవుని కలవరం

ఋష్యమూక పర్వత శృంగాలనే మ్రింగగల ఎత్తయిన భారీదేహాలతో, తాటి చెట్టంత ఎత్తుగల కోదండాలతో, గండు తుమ్మెదల గుంపులాగా ఉన్న జటాజూటాలతో, ఆహవనీయాగ్ని పవిత్రతకు సరిపోయేంత శరీర సౌందర్యం గలవారిని, గుబురుచెట్ల మధ్యనుండి, పర్వత శిఖరాగ్రాలమండీ, దూర్గంగా షుండి, కొంచెం దగ్గఅకొచ్చి నిక్కి నిక్కి చూస్తూ సుగ్రీవుడు–

"ఈ వీరులిద్దరూ ఎవరై ఉంటారు? మదమెక్కిన రాక్షసులను హత మార్చి, వారు కలుగజేసే యజ్ఞవిఘ్నాలకు స్వస్తిచెప్పటానికి మునులు ఏర్ప రచుకొన్న శౌర్య మహాంబుధులా? రాశీభూత తేజస్సుల్లా ఉన్నారు. లేక పోతే ఒకటై వుంటుంది. 'తానైతే ఇక్కడకు రాలేడు గదా!' అని ఆ వాలి పంతం కొద్దీ నన్నణగ ద్రొక్కటానికి ఈ మదపుటేనుగుల్ని పంపి వుండాలి. ఏనుగు తొండాల్లా వున్న వారి కోదండాల్ని చూస్తుంటే నాకు బ్రతుకు మీద ఆశ పోతోంది. ఈ ఋష్యమూకాన్ని వదిలి ఒక్క అంగుళం కూడా ఎటూ పోలేను. ఇప్పుడేం చేసేది?" అని ఆలోచనలో పడ్డాడు. వృక్షాగ్రానికెక్కి, గిరి శిఖరాగ్రానికెక్కి, నిక్కినిక్కి చూసి, దిగి ఏమీ తోచక, నడుస్తూ సాలోచ నుడై వున్న సుగ్రీవుని దగ్గఱకు ఒక్క ఉదుటున సుగ్రీవ మంత్రులు చేరారు. సుగ్రీవుడు వారిని చూసి–

"మేరు శిఖరాకారు డొకడు, నల్లని మేఘ సమీపంలో మెరిసే తటి ల్లతా కాంతి శరీరుడొకడు మన అరణ్య ప్రాంతంలో తిరుగుతూండటం మీరు చూశారా? నేను ఆ మహాయోధుల్ని చూసిన వెంటనే గుండెల్లో రాయిపడి ఒక్కక్షణం ఆలస్యం చెయ్యకుండా ఏం చెయ్యాలో ఆలోచనలో పడి నడుస్తూ వస్తున్నాను. నేను ఎఱుగున్నంతవరకు ఈ నాలుగు దిక్కుల మధ్య అలాంటివారు లేరు. అర్థంలేని కోపం, అంతులేని ఆవేశం, పరా క్రమ ప్రతీకారాలే పరమార్థంగా గల ఆ వాలి 'ఇది చేస్తాడు, అది చెయ్య డని' లేదు.ఇదివరకు ఎన్నడూ ఈ ప్రాంతాలకు రాని ఇలాంటి యోధులు ఇప్పుడిక్కడకు వచ్చారంటే నాకేదో అనుమానం, భయం రెండూ కలుగు తున్నాయి. కమలనయనాలు, మిన్నంటే చాపాగ్రాలు, సమస్త ధరణీతలాన్నీ సమకూర్చి పెట్టగల సమర్థులైన వీరి అండ వాలికి కలిగితే–అగ్నికి వాయువు తోడైనట్లే గదా! ఊహిస్తేనే గుండె బ్రద్దలయిపోతోంది. రాజో, యువ రాజో–ఏడాదో, జీవితాంతమో–భీతిలేదు, ఆరాటంలేదు గాని, ఆ మాటలలా వుండనీయండి. ఇప్పుడు వీళ్లిద్దరూ కళ్లల్లో మెదిల్తేనే కంటికి నిద్ర లేకుండా

చేసేట్టున్నారు" అన్నాడు. అప్పుడు ఆ మంత్రుల్లో ఒక చెక్కిలి మీద పెద్ద కత్తి దెబ్బ నొక్కు గలిగిన ఒక ధీశాలి--

"ఆ ఇద్దరి మూర్తుల్నీ నేను చూశాను. మరల మరల చూడాలనిపించే రూపు రేఖలు, ఫాలనేత్రుని తేజస్సుతో, జటా జూటాలతో సమస్త జగత్తుకీ వెలుగునిచ్చే దీప్తి మంతులు అయిన వారు—పుణ్యశీలురుగా కనబడ్డారు గాని పాపకార్య ప్రచోదితులుగా కనబడలేదు, అయినా ఇంకొకరి సహాయాన్ని కోరడమే ఓటమిగానూ, నీచంగానూ భావించేవాడు, స్వపరాక్రమ స్వాతిశ యోత్కృష్టుడు ఐన వాలి ఎట్టి క్లిష్ట పరిస్థితుల్లో అయినా ఇతరులను అర్థిం చడం, ఇతర సహాయాన్ని ఆశించటం నికృష్టంగా భావిస్తాడు. ఆ ఒక్క విలక్షణం వాలిలో వుంది. ఈ వీరులిద్దరూ జటాధారులై చాపాలు పట్టి ఈ పర్వతారణ్యాలలో పడి ఏదో వేరే పనిమీద తిరుగుతున్నట్లు నాకనిపి స్తోంది" అన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు "నీవు చెప్పింది న్యాయ సమ్మతంగానే వుంది గాని. వృషస్కంధాలతో, వజ్ర వక్షాలతో, సాలప్రాంశులైన ఆ ప్రౌఢ దేహాల్ని చూస్తే ఎవరికి భీతి పుట్టదు? మరి మన వాలి సంగతి మీకు తెలి యనిదేముంది? ఉన్నచోట వుండనీయకుండా నాలుగు చెరువుల నీరు తాగిం చాడు, 'ఇక ఇంతటితో పగతీరింది' అని వూరుకునే తత్త్వం కాదు. ఈ లోకంలో నేనున్నంతకాలంఆ పగతీరదు వాలికి. అందుకు ఎంతైనా తెగిస్తాడు. ఏమైనా చేస్తాడు. వాలి సంగతి తెలుసు కాబట్టి నా గుండె దడ దడ లాడు తోంది. ఏది ఏమైనా ఈ పురుషోత్తము లెవరో తెలుసుకోవాలి. ముందు అది ముఖ్యం. అటుపైన గాని గుండె దిటవు పడదు. ఈ అరణ్యాల్లో మహా జ్వాలమైన ఔషధాలకోసమై ధృత కోదండులై వచ్చారో, మరింకెందుకైనా వచ్చారో, నువ్వెళ్లి మంచి సమయం చూసి వాళ్ల అసలు ప్రవృత్తి తెలు సుకుని వెంటనే రా! నిన్ను కోతిపిల్ల అనుకుంటారేమో మరి అలాంటప్పుడు

ప్రచ్ఛన్న వేషంలోవెళ్తే బావుంటుందేమో-నీకునువ్వే ఆలోచించి నిర్ణయించు కొని వెళ్లు. అయితే వారితో విరోధమైనా పెట్టుకోవాల్సి రావచ్చు లేదా సఖ్యమైనా చేసుకోవాలి రావచ్చు. అదీ ఇదీ కాదనుకుంటే అప్పుడే చూద్దాం ఏం చెయ్యాలో'' అన్నాడు. సుగ్రీవుని మాటలు విని 'అలాగే' అని తల వూపి ఆ మహా యోధుడు ఒక్క నిమేష కాలంలో రామలక్ష్మణుల దగ్గరకు లంఘించి, భిక్షుకుని రూపంలో రాముని ఎదుట వినయంగా నిలచి అభినందన పూర్వకంగా-

## హనుమంతుని దౌత్య ఔచిత్యం

"మిమ్మల్ని ఇంతవరకు ఈ వనాల్లో కలిసి దగ్గరగా చూడలేదు. వ్యూఢోరస్కులు, వృషస్కంధులు. దీర్ఘబాహులు, మహేశ్వర తేజస్కులు, సహజస్మిత వదనారవిందులు ! కాని, ఎందుకో కించిత్ దైన్యరేఖా సమ్మిళితమైన మీ వదన నయనాలు ఎవరి కోసమో వెదుకుతున్నట్లు అనిపిస్తోంది. పుష్పసమాన సౌకుమార్యం. వజ్రసమాన దృఢత్వం ఒకేచోట చోటు చేసుకున్న మీరు ఎవరు? క్షాత్రతేజం, బ్రహ్మదీప్తి కలసి వసించిన మీరెవరు? మన్మథవసంతు లిద్దరూ కలసి వచ్చారా? హరిహరు లిద్దరూ నడచివచ్చారా? అనిమేష నిమేషాల నుండి ఉదయకల్ప క్షయకల్పాల వరకు కాలగతిని సూచించే ఆ వైనతేయుని రెక్కల జంటలాగా వున్న మీరెవరు? హృదయేశ్వర దీపికా కృతులు, అవక్ర విక్రమ పరాక్రమ సంపన్నులు, అకుటిల మూర్తులు, అయిన మీరు ఎవరు ?" అంటూ వినయ సుందరంగా, గంధ బంధురంగా. మరంద మధురంలా ప్రశ్నిస్తూనే-

"అన్న వాలి చేత దొంగిలింపబడిన రాజ్యం గలవాడు, వానరోత్తముడు.వానరేశ్వరుడు, సుగుణరత్నాకరుడు, సూర్యవంశ సంజాతుడు అయిన సుగ్రీవుని మంత్రుల్లో నేను ఒకణ్ణి. దినకర తేజస్కులైన మీతో దినకరాంశ

సంజాతుడైన మా సుగ్రీవరాజు సఖ్యం చేయాలనే కోరికతో నన్ను ఈ ప్రచ్ఛన్న వేషంతో మీ దగ్గరకు వెళ్ళిరమ్మని, మీకీ వార్త చెప్పమని పంపాడు. నా తండ్రి పేరు కేసరి. మా అమ్మ అంజనాదేవి. నా పేరు హనుమంతుడు" అనిచెప్పి ఊరుకున్నాడు.

[ఎవరైనాసరే మాట్లాడటం హనుమంతుని దగ్గరే నేర్చుకోవాలి. ముందు రామలక్ష్మణుల్ని పొగిడాడు. తరుదాత రేఖామాత్రంగా వాళ్ళకున్న కష్టాన్ని స్మరించాడు. పుష్పసమాన సౌకుమార్యం-వజ్రసమాన ధృఢత్వం; క్షాత్రతేజం - బ్రహ్మదీప్తి ఒకేచోట చోటు చేసుకోవటం ఎంత అపురూపమో మీ జంట ఇలా ఉండటం కూడా అపురూపమే! అంటూ వాళ్ల సౌకుమార్య - సౌందర్యాలను; పరాక్రమ - సామర్థ్యాలను; సాన్నిహిత్య-సమన్వయాలను వరుసగా మన్మథ వసంతులతోను, హరిహరాదుల తోను, వైనతేయుని (గరుత్మంతుని) రెక్కలతోను పోల్చడంలోనే వుంది సొగసంతా! దినకర తేజస్కులతో సుగుణ రత్నాకరుడు, దినకరాంశ సంజాతుడు అయిన మా సుగ్రీవుడు సఖ్యం చేసుకోవాలను కుంటున్నాడనటంలో- మీ ఇద్దరూ ఒకరికొకరు కావల్సినవారే! బంధువులే!! అని ఉప్పువేసి పొత్తు కలపడంలోనే వుంది గడుసుదనమంతా! తన సుగ్రీవుడు వానరోత్తము డొక్కటే కాదు, వానరేశ్వరుడు గూడాట! అంటే మా సుగ్రీవునికి కొంత మందీ- మార్బలము ఉన్నాయి అని సూచన. సుగ్రీవుడు వానరేశ్వరుడు మాత్రమే అయి వానరోత్తముడు కాకపోతే రాముడలాంటి వారితో సఖ్యం చేయకపోవచ్చు, పోనీ వానరోత్తముడు మాత్రమేఅయి వానరేశ్వరుడు కాక పోతే రామునికి ఆ సఖ్యం వల్ల పెద్ద ప్రయోజనాన్ని చూపించినట్లవదు. ఇదీ ఈ మాటల్లో కిటుకు. రామలక్ష్మణులు మన్మథవసంతుల్లా వున్నారంటే మీ సౌకుమార్య సౌందర్యాలు, దర్శన సాన్నిహిత్యాలు అంత అహ్లాదాన్ని కలుగజేస్తున్నాయని; మీ ఇద్దరూ హరిహరులు అంటే- అంత ఎదురు లేని వారని; మీరుభయులూ వైనతేయుని రెక్కలు అంటే- మా వాలిసుగ్రీవుల

సోదరత్వంలా కాక మీరి విడదీయలేని జంట- అనీ చెప్పే గడుసైన ఉప మానాలు. అంతటివారి ఎదుట తన రాజునేమీ తక్కువచేసి మాట్లాడలేదు. ఏదోపోగొట్టుకున్న దైన్యంమీకూఉంది, మా రాజుకూఉంది. మీరు రాజులైతే మా సుగ్రీవుడూ రాజే! అంటే నెయ్యానికి ఇద్దరూ సమ ఉజ్జీలే అని అర్థం. పైగా ఒకరి దైన్యాన్ని ఒకరు తీర్చుకోగల స్తోమత, అవకాశం, అందుకు తగిన ఆచరణ ఇద్దరికీ ఉందని. ఒకరి వలన ఒకరికి మంచే జరుగుతుందని' సఖ్యానికి ఇంతకంటే ప్రయోజనము మటుకు మరి వేరే ఏముంటుందని సూచన. హనుమంతుని మాటలు అంత విచిత్రార్థ స్ఫోరకంగా, ఔచిత్య బంధురంగా వుంటాయి. రామలక్ష్మణులను గూర్చి, వీళ్లను చూచి బెంబేలు పడిపోయిన తన రాజు సుగ్రీవునిగూర్చి-అంతగా మాట్లాడినా ఇంత చక్కగా దౌత్యాన్ని నెరపే తన గురించి చాలా తక్కువ చెప్పాడు. పరిచయానికి అవసరమైన కనీస విషయాలే చెప్పాడు. అలా చెప్పడంలోగూడా ముందు తన తల్లిదండ్రుల పేర్లు, తరువాత తనపేరు చెప్పాడు. సంప్రదాయం అంటే ఇదే! కార్యశూరుడైనవాడెప్పుడూ తన గొప్పదనం తను చెప్పుకోకూడదు. అవతలివాడు గుర్తించగలిగి మెచ్చుకుంటే అది మన సామర్థ్యం అవుతుంది గాని - మనంతకు మనం డబ్బా కొట్టుకుంటే కాదు - అని సూచన. ఇలా మాట్లాడడం రామాయణం మొత్తంమీద ఒక్క హనుమంతునికే చెల్లుతుంది! అందుకే రాముడంతటివాడు హనుమంతుని మాటలకు ముగ్ధుడైపోతాడు- ఇక చదవండి.]

## రాముని అభినందన

హనుమంతుని మాటలు విన్న రాముడు లక్ష్మణునితో "విన్నావా లక్ష్మణా, ఈయన మాటల తీరు? ఋగ్వేద యజుర్వేదాలను సుస్వరంగా అధ్యయనం చేసేవాడనిపిస్తోంది. సామ వేదాన్ని నిత్యమూ సమ శ్రుతిలో

గానం చేసేవాడనీ, సర్వశాస్త్ర విశారదుడై ఉండాలనీ అనిపిస్తోంది. నిత్యమూ వేదాధ్యయనం చేసేవారి తీరే వేరుగా ఉంటుంది. మామూలుగా మాట్లాడే డప్పుడు గూడా మిగతా వారికీ వీరికి తేడా కనిపెట్టవచ్చు. చెప్పదలచుకున్న విషయాన్ని ఎంత చక్కగా సూటిగా హృదయానికి నివేదించాడో చూశావా ? వినయ, గంభీర, సౌజన్య, ఔచిత్యాలు చోటు చేసుకున్న సాధుమూర్తి. ఆయన మాటలకు మలయ మారుతంతో శీతలోపచారం జరిగినట్లుంది గదూ ! ఆయన మృదుమధుర వాగ్విలాసం వెన్నెల విరజిమ్మి నట్లు, మల్లెలువిరబూసినట్లు లేదూ? నిజంగా ఆయన వాక్ స్పర్శసుఖశైత్యో పచారాన్ని కలిగిస్తోంది. చెప్పవలసినది–చెప్పవలసిన రీతిలో చెప్పి మనల్ని మెప్పించిన వాక్చాతుర్యము, వినయ సాధు ప్రవర్తనము కలిగిన ఈ కపి వీరుని తన మంత్రిగా కలిగిన ఆ కపి రాజు ఇంక ఎంతటి ఔచిత్యవంతుడై ఉండాలో ఆలోచించు. నిజంగా 'వెదుకబోయిన తీగ కాళ్ళకు తగిలినట్లు, ఆడబోయిన తీర్థమెదురైనట్లుగా వుంది. మరింక నీవు చెప్పవలసింది చెప్పు" అనంగానే లక్ష్మణుడు –

"మా యందు మీ రాజు కెటువంటి అభిప్రాయముందో మీ రాజు నందు మాకూ అదే అభిప్రాయం ఉందనీ, ఇందు కోసమే ఇక్కడకు వచ్చి మేమున్నది గూడా! అన్నాడు. లక్ష్మణుడు తాను మాట్లాడు తున్నంత సేపూ రెప్ప వాల్చకుండా హనుమంతుణ్ణే చూస్తూ ఉండిపోయాడు. హనుమంతుడు అన్నదమ్ములిద్దరి కన్నులు చూస్తూ-రాముని కన్నుల్లో పరమే శ్వరత్వాన్ని, లక్ష్మణుని కన్నుల్లో యోగీశ్వరత్వాన్ని చూశాడు. లక్ష్మణుడు పలికిన మాటలకు వేయిపడగలు విచ్చినట్లై హనుమ సుగ్రీవుని అదృష్టానికి మనస్సులోనే ఆనందపడి––

"స్వామీ! తమ్మునితో కలిసి ఈ పంపా సరోవర ప్రాంతానికి

వచ్చావు. కృపశేఖరులైన మీ రాక ఈ భూదేవికే సంతోషం కలిగేలా ఉంది. ఇంతకూ మీరెవరో తెలుసుకోవచ్చునా?" అన్నాడు. అన్న వంక చూశాడు అనుజుడు. అప్పుడు ఆ ఇద్దరూ ప్రాణబంధువుల్లా కన్పడ్డారు. హనుమంతుడికి అన్నకన్నుల్లో రేఖా మాత్రంగా అంగీకార సూచన గమనించి లక్ష్మణుడు హనుమతో--

## లక్ష్మణుని స్పందన

"యజ్ఞ యాగాదుల పొగలచే నింగి నేలల మధ్య నెయ్యాన్ని నెల కొల్పి రఘు వంశానికే తలమానికమైన దశరథ మహారాజు ప్రజాహిత పరి పాలనా దక్షుడు; అద్వేషమూర్తి, అయోధ్యా ప్రభువు. ఆ ప్రభువు యొక్క జ్యేష్ఠ పుత్రుడు, ధర్మమూర్తి ఈ రామ చంద్రమూర్తి. మేము నలుగు రన్నదమ్ములం. అన్నగారు సతీ సమేతుడై అడవులకు వస్తుంటే అన్నగారియెడ దాసభావంతో నేను వారి వెంట వచ్చాను. ఈ అన్న నాకు తండ్రి. ఆ వదిన వైదేహి నాకు తల్లే! శివ ధనుర్భంగం చేసి అన్న ఆమెను గ్రహించారు. తండ్రి ఆజ్ఞ ననుసరించి అరణ్యాలకొచ్చాడు. మార్గ మధ్యంలో రాక్షసుడెవరో మా తల్లి జానకమ్మను ఎత్తుకుపోయాడు. ఆ తల్లి సామాన్యురాలు కాదు యజ్ఞ భూమిలో పైడి నాగలి కఱ్ఱుకు వెడలిన పునీత, భూజాత, సీత. ఆమె కోసమే మేము వెదుకుతూ వస్తున్నాము శప్తుడై కబంధుడనే పేరుతో తిరుగుతున్న రాక్షసుడు పెద్ద మద్దిమొద్దులాగా మార్గానికి అడ్డుగా నిలిచాడు. చేతులు విరగ గొట్టిన తరువాత శాపవిముక్తుడై నిర్జరుడై నింగికి పోతూ సహృదయంతో ఈ సుగ్రీవుని గూర్చి చెప్పాడు. కీశపతి చాలా మంచివాడని, చెలిమికి ప్రాణ మిస్తాడని, మా అన్వేషణలో ఎంతో సహాయపడటానికి తగిన సాధన

సంపత్తి గలవాడని చెప్పాడు. ఎత్తిన చాపానికి ఎదురులేని మహా ప్రతిభా వంతుడు, శైవ వైష్ణవ ధనువులను గూడా స్పర్శ మాత్రం చేత శుష్క చాప శకలాలుగా చేసిన మా అన్న, రామన్న కపీశుడైన సుగ్రీవునికి శరణాగతుడు" అన్నాడు. లక్ష్మణుని మాటలకు-- ఒక్క రేకు ఊడి సాయంసంధ్యలో క్రొత్తగా వికసించిన చెంగలువలాగా హనుమ ముఖం విప్పారి---

## హనుమ ప్రతిస్పందన

"ఇంత సౌజన్యం, ఇంత పాండిత్యం. ఇంత శౌర్య దీప్తులు కలిగిన మిమ్మల్ని మా సుగ్రీవుడు తప్పక చూడాలి. అన్న వాలి చేత రాజ్యం పోగొట్టుకున్నవాడైనా- ఏ మాత్రం తక్కువవాడు కాదు. పరిపాలనాదక్షుడు, కార్యనిర్వహణా సమర్థుడు. అతని క్రింద మంత్రులుగా మేమున్నాము. భూజాత సీతమ్మను మేము వెదుకుతాము. అసలిలా మీరూ మీరూ కలిసి మిత్రులవడం చూడగలిగే చక్షువులు చరితార్థాలు. నిజానికి ఈ సృష్టిలో సజ్జన సాంగత్యాన్ని మించిన అదృష్ట మేముంది! రండి, దయచేయండి. సుగ్రీవుని దగ్గఱకు తీసుకొని వెళ్తాను" అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు –

"పరమ సాధుపుంగవుడు మాట్లాడిన తీరులో విరిసిన ముఖం, విప్పారిన హృదయం, మెరిసే కనుకాంతులు అన్నిటికీ మించి విన్న మన కేదో సుఖానుభూతి చూస్తున్నాం. మోసంగాని, అసత్యంగాని నాకు అనిపించదు. ఈయన వెంట వెళ్ళడం మనకు మంచే జరుగుతుంది. నీ కన్నులు గూడా విస్ఫారితాలై ఆశాకిరణాలు వెలుగులు చిమ్ముతున్నాయి. ధరణీజాతను, గుహుణ్ణి, శబరిని చూచినప్పటి కన్నుల్లాగా ఉన్నాయి." అన్నాడు:

# హనుమ విజృంభణ

హనుమంతుడు తన భిక్షుక రూపాన్ని వదిలి పరమేశ్వరుణ్ణి తనపైకి ఎక్కించుకునేందుకు సిద్ధమైన నందీశ్వరునిలాగా తన సహజ కపి దేహాన్ని పెంచి ఇద్దరికీ నమస్కరించి - "రండి ! నా భుజాల మీద అధిరోహించండి! తీసుకువెళ్తాను !". అని అనంగానే ఇద్దరూ రెండు భుజాల మీదకు ఎక్కి సుఖాసీనులయారు. మాంస పరిపుష్ట మృదులములై, మహా విశాలంగా ఉన్న హనుమ భుజద్వయం మీద అన్నదమ్ము లిద్దరూ ఏనుగు అంబారీ మీద వున్నట్లు సుఖాసీనులయారు ఆకాశంలో ఆగ్నేయ దిక్కునుండి ఈశాన్య దిక్కు వరకు విస్తరించి వినోదాన్ని కలిగించే ఇంద్రధనస్సు రెండు కొసల వద్ద ఒకవైపు వరుణుడు ఇంకొక వైపు పర్జన్యుడు ఉన్నట్లు కూర్చున్నారు. పైన కూర్చున్న రామలక్ష్మణులు, దూరంగా క్రిందనుండి చూస్తున్న సుగ్రీవాదులు పెద్దగా గమనించగలిగారో లేదోగాని ఆ దృశ్యం చూచేవారికి హనుమంతుడు పక్షిలాగా పైకి ఎగురుతున్నాడో, వానరంలాగా దూకుతున్నాడో అర్థం కానంత అద్భుతంగా ఉంది. హనుమంతుడు భుజాలపై ఇద్దర్నీ ఎక్కించుకుని అంత విచిత్రంగా యానం చేస్తున్నా - "రాముడు ఖగవాహన యానానికి అలవాటైన ప్రాణంలాగానే కన్పడు తున్నాడే !" అనిపించే విధంగా వున్నాడు. నిజంగా "ఆకాశమంతటినీ తన రెండు రెక్కల వెనుక దాచాడా అనిపించే రీతిలో యానం చేసే గరుత్మంతునిలాగా ఉన్న ఈయన ఎంత మహిమాన్వితుడు. ఆ భిక్షుక రూపంలో ఉన్న స్వల్ప రూపుడేనా ఈ అనంత మహాదేవుడు" అని అనిపించక మానదు. అనుకొన్నంత సేపు పట్టలేదు - హనుమంతుడు సుగ్రీవాదుల ముందు వ్రాలాడు. అలా పైనుండి క్రిందకు వ్రాలుతున్నపుడు హనుమంతుడు గరుత్మంతునిలాగా, రామలక్ష్మణులు ఆ గరుడిని రెండు రెక్కల్లాగానూ కన్పడ్డారు. సుగ్రీవుని వద్దకు చేరంగానే హనుమంతుడు -

# శ్రీరామ సుగ్రీవ మైత్రి

"తండ్రి మాటమీద తనకు చెందాల్సిన రాజ్యాన్ని సవతి తల్లికి వదిలి నిర్వికార నిశ్చల చిత్తంతో, మట్టిపాలతో జడలు కట్టబెట్టి, తనని వదలలేని తోబుట్టువుతోను, అర్థాంగితోను ఈ అరణ్యానికి వచ్చాడు ఈ ఇద్దరూ చూడడానికి స్నిగ్ధముగ్ధంగా ఉన్నారని నా భుజాల మీద కెక్కమన్నాను. తీరా వాళ్లు అలాగే అని నన్ను అనుగ్రహించి అధిరోహిస్తే "చిన్నప్పుడు నా దవడ మీద పడిన వజ్రఘాత భారం ఇంతెక్కడుంది ?" అనిపించింది. వీరు నిర్భయులు, ధర్మపరులు, అగ్నిజ్వాలలవంటి కార్ముకాల్ని ధరించినవారు, గంభీర మనస్కులు, మైత్రీభావ సంపన్నులు. చిన్నప్పుడే శివ ధనుర్భంగం చేసి - మైథిలేశుని కూతుర్ని వివాహమాడిన ఈ రాముడు అడవిలో ఆమెను పోగొట్టుకున్నాడు. ఒక రాక్షసుడామెను అపహరించాడు. వీళ్లు అమెను వెదుకుతూ ఇక్కడకు వచ్చారు. వీళ్లకసలు వాలి ఎవరో తెలియదు. కబంధుడు నీ పేరు, నీ మంచితనం వీళ్లకు చెప్పిన మీదట మైత్రికై నీ దగ్గఱకు వచ్చారు. జనకజాన్వేషణ వీరి ప్రస్తుత ధ్యేయం. సూర్యవంశస్తులు, ధీమంతులు, శక్తిమంతులు, సుమనస్కులు. అయిన వీరు నీకు శరణాగతులు. మరింక నీవు మరో సంకోచం లేకుండా ఈ అలౌకికాతిథులను గౌరవ పురస్సరంగా అర్ఘ్యపాద్యాదులతో, స్వాగత వచనాలతో మర్యాదచేసి సఖ్యాన్ని అర్థించు" అన్నాడు. శ్రీరాముని నిండైన మానుష రూపం చూడంగానే కారణం తెలియకుండానే సుగ్రీవునికి హృదయంలో గౌరవభావం కలిగింది. దాని కనుగుణంగా మందహాసంతో-

"మా ఆంజనేయుడు తన భుజాల మీద మిమ్మల్ని మోసుకువస్తే అది నేను తెచ్చినట్లే ! మా హనుమంతుడు నీ కథ యావత్తు చెప్పాడు. మా హనుమ రమ్మనంగానే రాజులైనా రాచరికపు బిగువు చూపించకుండా

సఖ్యం కోరి తమ్మునితో సహా నా చెంతకువచ్చి నన్ను అనుగ్రహించావు. నిన్ను మించి నా కింకేమి లేదు. రాజ్యం, రమణి దూరమవడంలో మనిద్దరం సమానమే! నేను ఈ కొండదాటి రావడానికి వీలులేని కారణ మొకటుంది. అందుకని నీ దగ్గఱకు నేనై రాలేకపోయాను. కాని దయా మయుడవు, నిర్వికారుడవు కాబట్టి నీవే ఈ స్నేహితుని దగ్గఱకొచ్చావు. ఎంతైనా కృతజ్ఞుణ్ణి. 'సచ్చిదానంద స్వరూపుడవు నీవు నా గడప త్రొక్కావు, నాకదే పదివేలు' అనడానికి గూడా నా కొక్క గడపంటూ లేదు గదా!' అని అంటూ అగ్నిహోత్రానికి హనుమంతుడు తెచ్చిన సర్వ సంభార సామగ్రులు అగ్నిహోత్రంలో వేల్చి "ఈ శరీరంలో ప్రాణమున్నంత కాలం నీ మైత్రి నాకు రక్షణ కవచమై నిర్భీతిని కలగజేస్తుంది" అన్నాడు. రాముడు గూడా అలాగే చెప్పి అగ్నిసాక్షిగా సుగ్రీవునితో సఖ్యం చేసుకున్నాడు. అలా ఇద్దరూ ప్రతిజ్ఞాపూర్వకంగా నెయ్యమాడినపుడు 'అగ్నిహోత్రుడు ఈ సఖ్యానికి ఆనంద పడ్డాడా' అన్నట్లు ఒక్కసారి జ్వాలలు రేగి దక్షిణా వృత మయాయి.

## సుగ్రీవ నివేదన

హనుమంతుడు తెచ్చి ఏర్పరచిన సాల, చందన శాఖల మీద రామ లక్ష్మణులు విశ్రమించిన తరువాత సుగ్రీవుడు రామ లక్ష్మణులను చూసి-

"మీ ఇద్దరూ పచ్చని ఆకుల శాఖల మీద పదిలంగా పడుకున్నారు. ఇద్దరూ ఇంద్ర బృహస్పతుల్లాగా ఉన్నారు. నా పూర్వ జన్మ సుకృతం వల్ల మీ స్నేహం లభించింది. సమస్త సౌకర్యాలతో, రత్న మణిమయ వేదిక లతో, సుఖ శయన తల్పాదులతో ఉండే నా గుహామణి రాజసభాంతరానికి మిమ్మల్ని తీసుకు వెళ్లి ఆతిథ్యమిచ్చి, నా గుండెకు హత్తుకుని గౌరవించే

అదృష్టం నాకు లేదు. నా అన్నగారితో వైరం నాకు గుండెల్లో బల్లెం లాగా ఉంది. భృత్యుణ్ణి గూడా కటిక నేల మీదకు, రాళ్లు, రప్పల మీదకు పోపొమ్మని నెట్టివెయ్యరే - అలాంటిది ఒకే కడుపున పుట్టిన తమ్ముడినైన నన్ను ఏమాత్రం దయాదాక్షిణ్యాలు లేకుండా బహిష్కరించడమే కాకుండా, నా భార్యను గూడా నాకు దక్కకుండా తాను అపహరిస్తే ఇంకా ఏం చెప్పను ? ఇక్కడ అన్న మీద ఈగ వాలనివ్వని తమ్ముడు, తమ్ముడు తన మూలంగా అలసిపోతాడేమోనని నోరెత్తి ఏపనీ చెప్పని అన్నగారిని చూస్తుంటే నాకెలా ఉంటుందో ఆలోచించండి. నిజానికి వాలి గూడా నాతో కలిసి లక్ష్మణునితో నీవు ఉన్నట్లు ఉండవచ్చు. కానీ అంత అదృష్టం వాలికీ లేదు నాకూ లేదు. కోపం రావడం తప్పు అనను. కోపం రావచ్చు. కాని, ఆ కోపాన్నే అంటి పెట్టుకుని ఉండటం కాపురుష లక్షణమే అవుతుంది. పోనీ నేను చేసినది యేమన్నా పెద్ద తప్పు పనా? అంటే అదీ కాదు. ఏదో చిన్న పొరపాటు నా వల్ల జరిగింది. ఆ మాత్రానికే - 'ఇంక ఈ భూమ్మీద నువ్వైనా వుండాలి లేదా నేనైనా వుండాలి. ఇద్దరూ వుండటం ఇంక అసంభవం అంతే!' అని నిర్ణయం తీసుకుని సమయం కోసం ఎదురుచూస్తున్నాడు. పొరపాటున నిద్ర పోతున్నపుడు ఒక్కసారి మెలకువ వచ్చి మత్తు వదలక నేను ఋష్యమూక పర్వతం హద్దు దాటటం జరిగితే నన్ను మింగెయ్యటానికి వాలి అప్రమత్తుడై తగిన ఏర్పాట్లతో ఎదురుచూస్తూ వుంటాడు. ఎలా రోజులు గడుపుతానో అని గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకుని కాలాన్ని వెళ్లబుచ్చుతున్నాను. నీవు నాకు చంద్రుడిలా కనపడుతున్నావు. మొట్టమొదటి సారిగా దూరంగా వుండి నిన్ను చూసినపుడు వాలి నిన్ను నా మీద కేమన్నా పంపించాడేమోనని భయం వేసింది. కాని, మా మారుతి నిన్ను నా దగ్గరకు తీసికొని వచ్చిన తరువాత అనవసరంగా భయపడ్డానని, నిన్ను అపార్థం చేసుకున్నానని అనిపించింది. వాలికి తారంటే ప్రాణం. మరి అలాంటప్పుడు రుమను గ్రహించడం దేనికి ? పోనీ భార్యగా చేసికొన్నాడా అంటే అదీ లేదు. 'రుమ'వట్టి పిచ్చిది. పాపం

రుమకు ఇప్పుడు తనను ఉంచుకున్న వాలి ప్రేమ లేదు, అసలైన భర్త చచ్చిపోయాడా?' అంటే - అదీ లేదు. ఇలా అయింది మా భార్యాభర్తల గతి అనివాపోయాడు.

## రాముని ప్రతిజ్ఞ

సుగ్రీవునిపై వాలి దురంతానికి లక్ష్మణుని కళ్లు కొద్దిగా ఎఱ్ఱబడ్డాయి. రాముడు సుగ్రీవుని చూస్తూ--

"మంచివాళ్ల మనస్సుకి కష్టం కలిగించినవాడు లోకంలో బాగుపడడులే నువ్వు బాధపడకు. నీ మంచితనం లోకానికి తెలియదు కనకనా ! నువ్వు అనవసరంగా చింతించకు. వాలిని నేను వధిస్తాను. ఏదో నీ కళ్లు, నీ బాధ చూడలేక ఈ మాట అనడం లేదు. నిజంగా నీకు వాగ్దానం చేస్తున్నాను. 'ఆ వాలిని నేను చంపుతాను.' నీ లోపల ఇంత దుఃఖం ఉందని, ఇంత అధర్మం జరిగిందని తెలిసిన తర్వాత గూడా నేను చూస్తూ ఊరుకోలేను. ఈ భూమికి ఇప్పుడు భరతుడు రాజు. ధర్మం విషయంలో తేడా రావటానికి సహించడు. ఆ భరతరాజు యొక్క ప్రతినిధులమే మేము. నువ్వు ఇంకా భయపడాల్సిన పనిలేదు. నీ భయం పోగొట్టి, నీ రాజ్యాన్ని, నీ భార్యని, నీవు మళ్లీ పొందేటట్లు చేస్తాను, 'వాలి ఫలానివాడు' అని నాకు తెలియాలి గాని మరునిమిషంలో వాలిని హతమార్చి నిన్ను కాపాడుతాను' అన్నాడు. శ్రీరాముడిలా అన్న సమయంలో లంకలో సీతకు, రావణునికి; కిష్కింధలో వాలికి ఎడమ కన్ను అదిరింది. సుగ్రీవునికి కుడికన్ను కుడిభుజం అదిరాయి. సుగ్రీవునికి ఒక్కసారి ఏదో గుర్తుకు వచ్చింది.

# నూపుర వృత్తాంతం

"స్వామీ! నా కొక సంగతి గుర్తుకు వస్తోంది. నేను నా ముగ్గురు మంత్రులు ఋష్యమూకాగ్ర మందు ఉన్నాము. మా కంటె ఎత్తుగా ఆకాశ మార్గంలో ఒక దైత్యుడు ఒక స్త్రీ మూర్తిని ఎత్తుకొని పోతున్నాడు. ఆమె తప్పకుండా సీత కావచ్చనిపిస్తోంది. ఆ అభిమానవతి ఎంతో నిస్సహాయ స్థితిలో కడు దీనంగా ఎవరినో ఉద్దేశించి పిలుస్తూ విలపిస్తూ సాగిపోయింది. బహుశః నీ పేరే అయివుండాలి. ఆవిడ పరమ ఆప్తురాలని తెలిసివుంటే - ఆనాడు అప్పటికప్పుడే ఆకాశమార్గంలో పోయే వాళ్లని ఆపి అసలు సంగతి తెలుసుకుని వుండేవాళ్లం. రావణుడు ఎత్తుకపోయిన సీతను వెదుకుతూ నీవూ, నీ తమ్ముడైన లక్ష్మణుడు ఈ అరణ్య ప్రాంతాల్లో తిరుగుతున్నారని. ఇంతకు పూర్వమే అంజనేయుడు చెప్పాడు. సీతను రక్షించడానికి ఆ పక్షి రాజు రావణుడితో ప్రాణాలకు తెగించి పోరాడి చివరకు హతుడయాడని గూడా తెలిసింది. ఇదిగో చెబుతున్నాను విను--

'ఈ నాలుగు సముద్రాల మధ్యలో ఉన్న భూమ్మీద ఎక్కడ ఆ రావణాసురుడు జానకిని దాచినా నేను వెదికించి నీకు అప్పగిస్తాను. మా అన్న వాలి సాటిలేని బాహుబల సంపన్నుడేగాని ఇంత మంది కపియోధుల్ని ఒక్క మాట మీద కూడగట్టుకోగల కార్యజ్ఞత వాలికి తక్కువనే చెప్పాలి. ఈ కపి యోధులందరూ కామరూపులు. కోట్లసంఖ్యలో ఉన్నారు. నాలుగు దిక్కుల లోపలే కాదు ఊర్ధ్వ అధో దిశల మధ్యలోకిఎక్కడికైనా వెళ్లగల సమర్థులు. తప్పకుండా సీతను వెదికి గుర్తించ గలరు. అన్నట్టు గుర్తించడం అంటే గుర్తుకు వచ్చింది – మబ్బులో మెఱుపు తీగలాగ ఆ రోజున ఆకాశమార్గంలో దైత్యుని చేత కొనిపోబడింది 'సీత' అవునో కాదో నిర్ధారించు కోవచ్చు. ఆ రోజున ఆమె చీరకొంగు చించి తన నగలు మూటగట్టి ఏదో మాట చెపూ

మేమున్న కొండ శిఖరం మీదకు జార్చింది. మేము ఆ మాటను వినలేక పోయాము గాని ఆ మూటను జాగ్రత్తగా పట్టుకొని దాచి ఉంచాము. ఒక్కసారి ఆ నగల మూట తెప్పించనా? సందేహంతీరుతుంది." అన్నాడు, సుగ్రీవుని మాటలువిని ఎక్కడలేని ఆశతో వెంటనే రాముడు– "మళ్లీ నన్ను అడగాలా ? వెళ్లు వెళ్లు. ఇంకా ఇక్కడే కూర్చున్నావేం ? అన్నాడు. రాముడలా అన్న వెంటనే సుగ్రీవుడు ఒక్కగెంతులో గుహలోకి వెళ్లి నగల మూట పట్టుకు వచ్చి 'ఇదిగో' అని చూపించాడు.

ఒక నిరుపేదకు మణిమయమైన నిధిని చూస్తే ఎలా ఉంటుందో రాముడికి నగల మూటను చూడంగానే అలా అయి తట్టుకోలేక నేల మీద మూర్ఛిల్లాడు. లక్ష్మణుని సపర్యలో రాముడికి మళ్లీ తెలివి రావడంతోనే "ఓ సీతా! మనోహరీ! వైదేహీ! ప్రియసఖీ!" అంటూ హృదయం ద్రవించి పోయేలా విలపిస్తున్నాడు. కళ్లనిండా నీరు ఉండడంతో రాముడు నగలను ఏ మాత్రం గుర్తుపట్టే స్థితిలో లేడు. 'అనవసరంగా చూపించానే', అని బాధ పడుతూ 'ఆ భార్యాభర్తల మధ్య ప్రేమ మాధుర్యానికి ఆశ్చర్యపడ్డాడు.' సుగ్రీవుడు.

## లక్ష్మణుని సౌశీల్యం

సుగ్రీవుడు అసలు విషయం నిర్ధారణ చేసుకునేందుకు "సౌమిత్రీ! ఈ నగలు చూసి కాస్త గుర్తు పట్టు నాయనా! అనుమానం తీరుతుంది" అన్నాడు, లక్ష్మణుడు నగలన్నీ ఒక్కొక్కటే తీసి చూస్తూ ప్రక్కన పెడుతున్నాడు. లక్ష్మణుడు నగలను ఒక్కొక్క దానిని ప్రక్కనతీసి పెట్టుతూ ఉంటే 'కొంప దీసి ఇవి సీతవి కాదేమోనని సుగ్రీవునికి అనుమానం పెరుగుతోంది. ఇంతట్లో లక్ష్మణుడు మూటలోంచి అందెలను తీసి "ఆఁ! మిగతావి నాకు తెలియదు

గాని ఈ అందెలు మాత్రం మా తల్లి సీతమ్మవే! ఇవి నాకు బాగా గుర్తే! ఈ పదమూడేళ్ళ ప్రతిరోజు రెండు సంధ్యాకాలాల్లో తల్లి పాదాలకు నమస్కరిస్తూన్నపుడు ఇవే కనబడేవి! నాకింకేమీ తెలియదు" అన్నాడు.

(లక్ష్మణుని శీల స్వభావాలను గూర్చి చెప్పాలంటే ఈ సన్నివేశంలోని లక్ష్మణుడన్న పై మాటలు చాలు. 'లక్ష్మణుడలాంటి వాడు ఇలాంటి వాడు' అంటూ ఓ యాభై పద్యాలు శ్లోకాలు చెప్పినా లక్ష్మణుడన్న పై మాటలకు చాలవు. కొందరు పాత్రపోషణ అంటూ పాత్రను చింతపండుతోను, సర్ఫ్‌తోను తోమినట్లు క్రిందామీదా పడి వరసగా అన్ని వృత్తాల్లోను కొన్ని పద్యాలు వ్రాసి గ్రంథాన్ని పెంచుతూ ఏదో సాధించినట్లు గర్వపడతారు, లక్ష్మణుని గూర్చి తెలుసుకోవాలంటే ఈ సన్నివేశంలో వాల్మీకి వ్రాసిన

నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే
నూపురే త్వభి జానామి
నిత్యం పాదాభి వందనాత్ ॥

(కిష్కింధ – 6-22)

అన్న ఒక్క శ్లోకం చాలు. పాత్ర పోషణ అంటే ఇదిగాని సత్తాచూపించి పాత్రకై పద్యాలల్లడం కాదు. కొందరు ఇలా పద్యాలు గుప్పించడం వల్ల ఒక్కొక్కప్పుడు ఔచిత్యం దెబ్బతింటుందని గూడ గ్రహించరు. ఉదా :- రాముడు శివ ధనుస్సును ఎక్కుపెట్టే ఘట్టంలో, రాముడెలా ధనుస్సును పట్టుకున్నది, ఎత్తినది, నారి సంధించి లాగింది, చివరకు ఆ ధనస్సు ఎలా విరిగింది ఇవన్నీ వర్ణిస్తూ ఒక ఇరవై పద్యాలు వ్రాసినవారు, వ్రాసేవారు కూడా వున్నారు. దీని వల్ల శివ ధనస్సును ఎక్కుపెట్టడానికి ఇరవై పద్యాల్లో

చెప్పినంత కాలం అన్ని విధాల కష్టపడాల్సి వచ్చింది అని గూడా అర్థం వస్తుంది. అందుకే విశ్వనాథ సత్యనారాయణగారు కల్పవృక్షంలో – ఒకే పద్యంలో అది గూడా తేట గీతిలో చెబుతూ చివరి పాఠంలో "చెఱకుగడవోలె నడుముకు విఱిగె ధనుసు" అని తేలికైన పదాలలో అవలీలగా చెప్పారు. ఈ తేలికతనం, అవలీల, అందుకు పట్టిన కాలం శివ ధనుర్భంగానికి గూడ వర్తించి ఔచిత్యం కాపాడబడుతుందని గుర్తుంచుకోవాలి అటుపైన ధనుస్సు విరిగినపుడు పుట్టిన ఫెళ ఫెళ మనే ధ్వని అన్ని లోకాల్లోను ఏ విధమైన ప్రభావం చూపిందో కర్కశమైన పద్యాలతో సమాస భూయిష్టంగా వృత్త పద్యాలు చెప్పారు. ఔచిత్యం పాటించడ మంటే ఇది. ఇక చదవండి.

## నాగరికతల్లో తేడాలు

లక్ష్మణుని మాటలకు, నృపుల నాగరికతకు సుగ్రీవునికి వళ్లంతా గగుర్పొడిచింది. (కిష్కింధలో వానరరాజ్యంలో తమ్ముడు చనిపోతే ఆ తమ్ముని భార్యను అన్నగారు ఏలుకోవచ్చు. అలాగే అన్నగారు చనిపోతే ఆ అన్నగారి భార్యను తమ్ముడు ఏలుకోవచ్చు – అది వానరుల నాగరికత. ప్రస్తుతం లక్ష్మణుడు సీతారాములతో కలసి 13 ఏళ్ల అరణ్యంలో వున్నపుడు ప్రతిరోజూ రెండు సంధ్యల్లోనూ అన్నగారి భార్య సీత పాదాలకు నమస్కరించడం తప్ప కన్నెత్తి ఆమెను, ఆమె వంటిని, వంటి మీద నగలను గూడా ఎఱుగడు. ఇది అయోధ్యాపుర నృపుల నాగరికత. మరి ఈ రెండు నాగరికతలకు నక్కకు నాగలోకానికి ఉన్నంత తేడా లేదూ ? అందుకే లక్ష్మణుని మాటలకు సుగ్రీవునికి మేను గగుర్పొడిచింది.)

# చిగురించిన ఆశ

రాముడు లక్ష్మణుని మాటలు విన్నాడు. "భూజాత సీత కనబడకుండా ఆమె నగలు కనిపించడం ఏమనుకోవాలి" ఇది అదృష్టమో - దురదృష్టమో, ఆశపడాలో నిరాశపడాలో తెలీటం లేదు. వర్షా కాలపు మబ్బుల్లో సూర్యుడు కనిపించకుండా సూర్య రథ సారథి మాత్రమే కనిపించినట్లుంది పరిస్థితి. (అంటే సూర్యుడున్నాడు అనే గాని లేడనే భావాన్ని సూచించదు) కళ్లల్లో నీళ్ల మూలాన నేను ఆ నగలను గుర్తు పట్టలేను. నా సీత కాలి అందెలను మాత్రమే ఎఱుగున్న తమ్ముడితడు. ఇలాంటి తమ్ముళ్లను, అలాంటి జానకిని నాకు దైవమిచ్చాడు. వాళ్లంతా దేవతాసమానులు - తన క్షేమాన్ని ఆశించే ఇలా ఈ నగల మూటను భూమ్మీదకు పడేసి ఉంటుంది. వీటిని చూడడం, గుర్తు పట్టడమనేది జరిగితే తప్పకుండా తనను దక్కించుకుంటారనే నమ్మకంతో తన క్షేమాన్ని ఆశించి చేసిన పనే! సరిగా ఇలా జరిగిన చోటనే నాకూ ఈ సుగ్రీవునికీ స్నేహం ఏర్పడడం- ఇదంతా చూస్తే- ఇక ముందు జరగవలసిన పనికి త్రోవ చూపించి నాకు చెప్పినట్లుంది" అనుకొని రాముడు కొంచెం తేరుకుని - సీత కాపరానికి వచ్చి పెద్దదైన తరువాత మా తండ్రి దశరథుడు చేయించిన నగలివి. సీత పోతూ మా నగలను మా కప్పచెప్పి వెళ్లినట్లుంది! నాయనా! లక్ష్మణా! నగల్ని చూస్తుంటే నా గుండె తరుక్కు పోతోంది. ద్రవించి పోతోంది. వీటిని చూడనప్పుడే నయం. అప్పుడు నా గుండె బండరాయిలా నిద్రపోయుండేది. నా తమ్ముడి చేత నమస్కారాలందుకునే ఈ అందెలు నేను భుజాల మీద మోయ తగినవే అంటూ వాటిని తన భుజాల మీద ఉంచుకొని సతత ధారగా కన్నీరు కారుస్తూ దుఃఖిస్తున్నాడు. ఎంతో సేపటిగ్గాని తేరుకోలేదు. సుగ్రీవు డెదురుగా వచ్చి ఏదో అనబోతుండగా రాముడు—

"ఈ ఒక్కమేలు చాలయ్యా, నువ్వు నా సీతను నాకు వెదికి పెట్టినట్లే! నీవూ నీ బృందం కలసి జేసిన ఈ పని గురించి బ్రహ్మలోకం దాకా చెప్పు కుంటారయ్యా! నా ప్రాణేశ్వరిని విడిచి నేను, ఈ ప్రాణాలతో నిలిచేట్టు లేను. నువ్వూ, నా తమ్ముడు జానకిని వెదికి ఆ రాక్షసుణ్ణి హత మార్చండి. నాయీ దుస్థితిని జానకితో చెప్పండి. సీత స్త్రీజగత్తుకే భూషణ ప్రాయమైంది. మరి ఆమె భూషణాలను కనుగొన్నభాగ్యం కంటె వేరొక భాగ్యం వేరొకటి ఉంటుందా ? నా సీత నగలను చూసినవాడే స్నేహితుడు. వాటినిగుర్తుపట్టిన వాడే తమ్ముడు" అని అంటుండగా సౌమిత్రి, ఆంజనేయు లిద్దరూ ఒకరి నొకరు చూచుకున్నారు. అంతలో హనుమ ఏం కనుసన్న చేశాడో ఏమో ఒక కొమ్మ మీద కోతి రాముని ముందుకు వచ్చి, నగల మూటతీసి కేయూరాలను కంఠానికి, అందెలను మెడలోను, కంకణాలను పాదాలకు తొడిగికుండలాలను ఏమిచెయ్యాలో తెలియక నోటితో కొఱకబోతూంటే శ్రీరాముడు ఫక్కుననవ్వి 'ఇదేమిటయ్యా!' అనంగానే అందరూ నవ్వుల్లో తేలారు. (హనుమ యొక్క సమయస్ఫూర్తి, సద్యః స్ఫురణ ఇలా వుంటాయి. ఇలాంటి సన్నివేశం జరగక పోతే రాముడింకా అలాగే దుఃఖిస్తూనే ఉండేవాడు. అందరికీ ఏం చెయ్యాలో తోచేదిగాదు).

## సుగ్రీవుని ఓదార్పు

"రామచంద్రా నీ వంటివాడే ఇలా మోహావేశం పొందితే ఇంక ధీ రహితులమైన మాబోటివాళ్లు ఎంకావాలి? మీ సృష్టికీ మా సృష్టికీ (అంటే నర, వానర సృష్టిలో) భేదం ఉంటుందంటే చెప్పలేను గాని. భార్యా వియోగం మాకుమాత్రం తక్కువ ఉంటుందా? ఎవరికైనా ఈ బాధ తప్పదు కాని పరా కాష్ఠకు చెందిన శత్రువుల పాప కార్యాలకు స్వస్తి చెప్పగల లోకోత్తరుల

వంటివారే దుష్ట శిక్షణకు పూనుకోకపోతే ఈ లోకం ఏమౌతుంది? భార్యను పోగొట్టుకుని కూడా బ్రతికున్నందుకు నీ సఖ్య సుఖానికి నోచుకున్నాను. దీని వల్ల మళ్లీ నా భార్యను, రాజ్యాన్ని గూడా పొందగలననే ధైర్యం, ఏదో సాధించగలననే నమ్మకం కలిగింది- వియోగ దుఃఖానికి ఈ శరీరాన్నే వదలి ఉంటే ఇంక మనం చెయ్యగలిగిందేమిటి? కాబట్టి నేనువహించిన ధైర్యాన్ని నీవు గూడా వహించు. గొంతులో ప్రాణం ఉన్నంత వరకు సీతను వెదకి నీకు అప్పచెబుతాను. ఒకవేళ నేను అలా నీకు సీతను అప్పచెప్పలేక పోతే నన్ను నా పేరుతో పిలవకు, సరేనా! నీ విరహ స్థితిని నేనూ, సౌమిత్రీ చూడలేకుండా ఉన్నాము. నీ వికాసమే మా వికాసం. ఎందుకంటే మేము నీవెనుక తోకలాంటి వాళ్లం. నువ్వెలా అయితే మేమూ అలా అయిపోతాం. మా తండ్రీ! నీకు పుణ్యం వుంటుంది. తంటాలు పడి తెచ్చిపెట్టిన ధైర్యాన్ని పోనీయకు. ఆ ధైర్యంతో గట్టిగా నిలబడు. నీ పచ్చని నీడ చూసుకొని భార్యాబిడ్డలతో సుఖపడదామని నిన్ను జేరాను, నీతో మైత్రి వహించాను. నువ్వు కూడా నీ అంతకు నువ్వు నాతో మైత్రికై వచ్చావు. మరి ఇద్దరూ ఇలా ఇక ఒకరి కొకరు అండగా, ఆసరాగా నిలబడవద్దా! ఒకరిపై ఒకరు బాధ్యతలు స్వీకరించవద్దా?" అన్నాడు సుగ్రీవుడు. అప్పుడు శ్రీరాముడు లక్ష్మణుడు తెచ్చిన నీళ్లతో ముఖం కడుక్కొని చిఱునవ్వుతో-

"మీరు అంతగా భయపడాల్సిన కారణం ఏమీ లేదు. కాంతా దూరుడ నౌతానని కలలోకూడా అనుకోలేదు. అంతలోనే ఇలా జరిగి పోయింది ఆ కాంతా విరహాగ్నికి ఇంతగా కృంగిపోయాను. ఫరవాలేదు. మీ మాటలతో కొంత తేరుకున్నాను. నీతోటి చెలిమి నిర్మలమైంది. నిన్ను చూస్తున్నా నీ మాటలు వింటున్నా మిత్రుడిగా కంటే తమ్ముడిగా అనిపిస్తు న్నావు. లక్ష్మణుడు, నువ్వూ నాకు మరో రెండు చేతుల్లావుండి నాకు చతుర్భుజత్వాన్ని ఆపాదిస్తున్నట్లుంది. భూజాత సీతను వెదికించి అప్ప

చెబుతానన్నావు. ఆ నీ మాట నాకు పెద్ద ప్రమాణంగా తోస్తోంది. నామీద నాకు ఎప్పుడూ అధికారం లేదు. గతంలో ఆ అధికారం జానకిదైతే ప్రస్తుతం మీది. విరహాగ్నిలో జ్వలిస్తున్న నాకు సీతను అపహరించిన రాక్షసుడెవరో చూపించండి చాలు వాడి శరీరాన్ని బాణాలతో తూట్లుతూట్లు చేస్తాను. నరికి ముక్కలు చేస్తాను, వాడెవడో కాస్త చెప్పు చాలు" అన్నాడు(రాముడు)

## సుగ్రీవుని కృతజ్ఞత

రాముని మాటలకు సుగ్రీవుడు దీనవదనంతో –"స్వామీ! నాకు వాడెవడో తెలిస్తే అంతకన్నా కావల్సిందేముంది. నీ సీతను కొనిపోయి ఎక్కడ దాచాడో తెలిసికొని వెదకడం కోసం మా వానర సైన్యాన్ని పంపి అన్నీ వివరంగా తెలిసికొని నీ సీతను నీకు అప్పచెప్పకపోతే నా పేరు సుగ్రీవుడు కాదు. ఏదో నాక్కావలసిన పనులన్నీ నీ చేత చేయించుకో వచ్చనే ఉద్దేశంతో నీతో సఖ్యం చేయలేదు. నీతోటి సఖ్యమెలాంటిదో, ఎంతటిదో తెలియని వాణ్ణికాదు. నాకు తెలుసు- నీ తోటి సఖ్యం-అటు దేవతలు కూడా పొందలేనిదని. ఏదో నా పూర్వజన్మ సుకృతం వల్ల అది నాకు లభించిందనే అనుకుంటున్నాను. రామచంద్రా! నామీద నీకు నమ్మకముంటే నాతో స్నేహాన్ని కొనసాగించు. నావి వట్టిమాటలనిపిస్తే సీతాన్వేషణం నీవూ, నీ తమ్ముడే చూసుకోండి. నా వైరం తీర్చడానికి కాదుగా మీరీ అరణ్య ప్రాంతాలకు వచ్చింది" అన్నాడు.

సుగ్రీవుడలా అనంగానే రాముడు చిరునవ్వుతో –"చాల్లేవయ్యా! మొత్తానికి మంచి స్నేహితుడివే ననిపించావు. నాకు కష్టం కలిగించిన వాడు నీకు తెలీదు. నీకు కష్టం కలిగించిన వాడు నాకు తెలీదు. అయినా నీ కష్టం తీరుస్తానని నేను, నా కష్టం తీరుస్తానని నీవు వాగ్దానాలు చేసుకున్నాం. మరి

ఇలాంటి మన ప్రతిజ్ఞలకర్థమేమిటి? నీకు ముందు మంచి జరిగేటట్లు చూడకుండా నా సంగతి చూడమని అడుగుతానా?" అన్నాడు.

## వాలి ప్రసక్తి

రాముడలా అనంగానే సుగ్రీవుడు "అసలు ఆ రావణుడనే పేరే నేను వినలేదు. అతని శౌర్యమెలాంటిదో, కులగోత్రాలేమిటో నాకు బొత్తిగా తెలీదు. మా అన్న అయిన వాలికి తెలిసి ఉండవచ్చు. ఆ రాక్షసుడు జానకిని ఎక్కడ ఉంచాడో గూడా తెలియ వచ్చు. అయితే వర్థి పరాక్రమం మీదే నమ్మకం ఉండి, భోగలాలసుడైన వాలిని నువ్వెళ్లి అడిగితే విని ఆలకించే ఓర్పు, ఔదార్యగుణం మా వాలికి ఉండవు రామచంద్రా!" అనంగానే శ్రీరాముడు–

"అపునుగానీ, సుగ్రీవా! నువ్వూ, ఆ హనుమ, వాలిని గూర్చి ఇట్లా చెబుతారు, అసలింతకూ ఆ వాలి ఎలాంటి వాడో, అతని వ్యవహారమేమిటో నాకు కొంచెమయినా చెప్పలేదు. నీ భూమిని, భార్యను రెంటినీ హరించాడు గదా ! అలాంటప్పుడు ఆ వాలి ఎంత పరాక్రమ వంతుడైతే మటుకు నా పని కోసం అలాంటివాడితో స్నేహం చేస్తానా? నీవలా అన్నావుగదా అని నీతోటి నా స్నేహం మారుతుందనుకున్నావా? అతనికి నాతో కావలసిన పని ఏ మాత్రం లేదు. మరి అలాంటప్పుడు తగుదునమ్మా అని నేను అతని దగ్గరకు వెళ్తే ఎంత చులకన అవుతానో నాకు తెలీదూ? అలా చెయ్యడం ఇద్దరికీ మంచిది కాదు. నెయ్యాన్ని, కయ్యాన్ని కర్మే నిర్ణయిస్తుంది. దైవసంకల్పం చాలా విజ్ఞతను కలిగి ఉంటుంది. శిక్షార్హుడైన వాలితో నాకు నెయ్యాన్ని కూర్చేటంత గుడ్డిగా ఉంటుందనుకోను. సాధారణంగా నాకు హితమైనదే స్ఫురిస్తుంది. ఆ స్ఫురించినది శుభ పరిణామానికి దారితీసే ఫలితాన్నే ఇస్తుంది". అన్నాడు. అప్పుడు మళ్లీ సుగ్రీవుడు-

"నీ మనస్సు హృదయం ఎంత మృదువో అంతదృఢమని గూడా నాకు తెలుసు. కాని అవతల వాలి లోహదేహుడు, శైలవక్షుడు. నడచి వస్తూంటే ఒక పర్వతం కదలి వస్తోందా అన్నట్లుంటాడు. మొట్టమొదట నిన్ను చూసి నప్పుడు నీవు చాలా స్నిగ్ధ సుకుమారునిలాగానే కనిపించావు. సహజంగా కపిని! గదా మనస్సులో భీతిని పోగొట్టుకోలేకుండా ఉన్నాను. సరే! మరి నీకూ, హనుమకు అగ్నిహోత్రం వేళయింది, మళ్లీ రేపు మాట్లాడుకుందాం" అన్నాడు. రాముడు మందహాస వదనంతో సుగ్రీవుని వంక ఒక్కసారి చూసి లేచాడు. (అతిబలిష్ఠుడైన తన అన్నగారయిన వాలిని సుకుమారంగా కనబడే రాముడు చంపగలడా అని సుగ్రీవునికి అనుమానం కలుగబట్టే ఇలా అన్నాడు. రాముడది గ్రహించే ఒక్కసారి సుగ్రీవుణ్ణి చిరునవ్వుతో చూశాడు. సమయం కోసం ఎదురు చూస్తున్నాడు.)

## దుందుభి వృత్తాంతం

ప్రాతఃకాల సమయంలో రామలక్ష్మణులు సుగ్రీవాదులతో కలసి విహరిస్తూ త్రోవలో ఒక పెద్ద అస్తిపంజరాన్ని చూశారు. చూడ్డానికది తెల్లటి దూలాలు గుట్టగా పోసినట్లుంది. వసారహితమై, కేవలం ఎముకల గూడు లాగా వున్న ఆ కళేబరం–తరులతా గుల్మాలతో, కుసుమపరాగ సౌరభంతో ముగ్ధ మనోహరంగా ఉండే ఋష్యమూక గిరి కన్యకాలక్ష్మి శరీరం మీద ఒక పులిపిరి కాయలాగా ఉండి చూచేవారికి వెగటు పుట్టిస్తోంది. "అంతటి బ్రహ్మనిష్ఠుడు, అంతటి భావుకుడైన ఆ ముని ఇంత అసహ్యంగా ఇక్కడ పడిఉన్న ఈ అస్థిపంజరాన్ని ఎలా సహించాడో? ఈ ప్రాంత ధరిత్రీ శోభ కిది ఉండకూడినిదే అయినా దీన్ని ఆ ముని నాకోసమే ఇక్కడ ఉంచినట్లని పిస్తోంది." అంటూ రాముడు తన కాలి బొటన వ్రేలితో ఆ కళేబరాన్ని ఎత్తి

విసిరాడు. అది ఎగిరి ఆకాశ మార్గంలో హిమవత్పర్వతం లాగా పోయి ఎక్కడో పడింది. వెంటనే సుగ్రీవుని మంత్రులు దాన్ని వెదకడానికి వెళ్లి తిరిగివచ్చి పది ఆమడల దూరంలో పడిందనిచెప్పారు. అప్పుడు సుగ్రీవుడు-

"ఇది ఇక్కడ పడివుండడం ఆ ముని రాజు ఇష్టపడలేదు. ఆ కారణం వల్లనే నేనిక్కడ ఉండటానికి, వాలి ఇక్కడకు రాకుండా ఉండటానికి అవకాశం కలిగింది. వీడు ఒక రాక్షసుడు. వీడి పేరు దుందుభి. అరిస్తే దుందుభి స్వనంలాగా ఉంటుందని ఆ పేరు వచ్చింది. వేయి ఏనుగుల బలం కలవాడు. భయంకర రూపుడు, దుష్టస్వభావుడు, తన బల మద గర్వానికి తోడు తపస్సు చేసి బ్రహ్మచేత వరాలు గూడాపొందాడు. దాంతో మిన్ను మన్ను భేదం కనబడకుండా కొమ్ముల్తో కుమ్ముతూ, గిట్టలతో దున్నుతూ, కళ్లతో నిప్పులు కురిపిస్తూ, నానా బీభత్సాన్ని సృష్టిస్తూ కొంచెం గట్టివాడు కనబడితే, ఆటలు పట్టిస్తూ వుండేవాడు.

ఒకసారి గంభీరాచలుడైన సముద్రుడు ఈ దుందుభి నేత్ర గహ్వర వినిర్గత వహ్ని జ్వాలల్ని చూసి ఆశ్చర్యంతో ఉప్పబడ్డాడు. వీడు ఆ సముద్రుడితో కాలు దువ్వుతున్నట్లు వికటాట్టహాసం చేస్తూ--

"ఏం సముద్రుడా చూడొస్తే ఈ భూతలాన్నంతా ఆవరించినట్లున్నావు. నన్ను చూడంగానే అలా బెదిరిపోతున్నావేం? నా ధాటి ముందు నిలబడి బ్రతకాలంటే ఇంకెవరయినా గట్టివాణ్ణి సాయం తెచ్చుకో! అన్నట్లు నీకో అల్లుడున్నాడుగా! ఆ అల్లుడైన విష్ణువుని తెచ్చుకో! అవును గాని అంత చేతకానివాడివి అలా ఆకాశం అంతఎత్తు ఎగరకపోతే ఏం!" అన్నాడు. సముద్రుడు ఆ మాటలకు మిన్నకుండి పైకిలేచే కెరటాన్ని తనలోనే ఇముడ్చుకున్నాడు. అప్పుడు మళ్లీ దుందుభి-

"నీవేదో చాలా గొప్ప వాడివని, ప్రళయంలో నీ విజృంభణకు ఎల్లాంటి వైనా సరే ఆగకుండా నీలో కలిసి పోవలసిందేనని ఏవేవో ప్రజలు వింతలు వింతలుగా చెప్పుకొని ఇదంతా నీ ప్రయోజకత్వంగా చెప్పుకుంటారు. మరి నువ్వు చూడొస్తే ఎదుట నిలబడ్డ నన్ను చూసి ముడుచుకు పోతున్నావు'. అన్నాడు. అప్పుడు సముద్రుడు–

"ఓ రాక్షసరాజా ! నిన్నేమన్నానని ఇలా వచ్చావయ్యా ! ఇంత లోతున్న నాకే నీ పటిమ గూర్చి పూర్తిగా తెలీదంటే నమ్ముతావా ? 'ఆ బ్రహ్మ ఇంతటివాణ్ణి సృష్టించి ఈ శౌర్యాన్ని ప్రకటింప చేయగల తగినవాణ్ణి గూడ సృష్టించి ఉండలేదే' అని అనుకోడం పొరపాటే అవుతుంది. అయినా అంతా వెదకి కాని ఆ మాట అనుకోకూడదు. ఎక్కడో అక్కడ ఉండి ఉంటాడు. వెదక్కుండా అలా అనకూడదు. అందరూ చెప్పుకుంటే వినడమే గాని నేను ఇక్కడ నుండి కదలివెళ్లి తెలిసికొన్నది కాదు గాని– ఆ హిమవత్పర్వత రాజు చాల బలశాలి అంటారు. ఎన్నోరకాల ఓషధులు, మూలికల చేత మహా బల సంపన్నుడుగా చెప్పుకుంటారు. దట్టమైన మంచుచేత పటిష్ఠమైన మల్లవీరుడు. సరిగా నీకు తగినవాడు. మరి ఇంక ఆలస్యం దేనికి వెళ్లు. దారి తెలుసు గదా?'' అన్నాడు. "ఆఁ! ఉత్తరం వైపేగదా!'' అంటూ దుందుభి వెళ్లిపోయాడు.

గగన చుంబిత శృంగాలతో, గంగాఝురీ నిస్వనాలతో, రజితవర్ణ ప్రకాశంతో కఠిన వక్ష ప్రదేశంతో, మంచుగడ్డల కండల తిరిగిన పటిష్ఠ దేహంతో విరాజిల్లే హిమ శైలేశుని కెదురుగా నిలబడ్డాడు దుందుభి. గిరీశుడు చూసి-

"ఏమిటల్లా నిలబడ్డావ్! ఎవరు నువ్వు?" అన్నాడు. దుందుభి ఒక్కసారి వికటాట్టహాసం చేశాడు. నాసాపుటాల్లోంచి అగ్నిజ్వాలలు విసురుగా వచ్చి చుట్టూ వ్యాపించాయి అప్పుడు దుందుభి హిమనగంతో-

"నే నే తెలీదా ! దుందుభిని. రాక్షస రాజును. యుద్ధంలో నా కెదురు నిలబడలేక ఆ జలేశుడే ఈ హిమేశుని సంగతి చెప్పాడు. మరి ఆలస్యం దేనికిక కలబడదామా ?" అనంగానే హిమవంతుడు –

"ఓ దానవ రాజా ! ఆ సముద్రుడి కెవరు చెప్పారో నాకు తెలీదు గానీ. నేను ఎప్పుడూ యుద్ధం చెయ్యలేదు. చెయ్యను గూడా ! నాదంతా యోగ ధర్మ మార్గమే ! పొద్దున్న లేచిందగ్గఱ్నుంచి ఋషులు, మునులు. యోగులు, తపస్సులు, అతిథులూను. ఇదంతా చెప్తే నీకు గోలగా ఉంటుంది" అనంగానే – దుందుభి పకపకా నవ్వి -

"కొండంత దేహం. అందులో చూస్తే నలుసంత మనస్సు. బావుంది - సరేకాని. నాతో యుద్ధం చెయ్యనక్కర్లేదు గాని, నీ వెఱుగున్నంతలో నన్ను ఎదిరించి నిలబడగల వాడెవరన్నా ఉంటే చెప్పు" అన్నాడు. అప్పుడు హిమవంతుడు -

"నీ కెదురు నిలబడగల వాడెవరైనా అంటావా ? ఒకే ఒకడు ఉన్నాడనుకుంటాను. కాని అతడు నీతో పోరుకు ఇష్టపడతాడో లేదో మరి. ఏదేమైనప్పటికి నువ్వొక పనిచెయ్యి. అతడున్న చోటుకు వెళ్లు. కయ్యానికై కవ్విస్తూ ఇష్టం వచ్చినట్లు మాట్లాడు. పగలూ రాత్రి భేదం లేకుండా ఎప్పుడూ నిషాలో రోషకషాయ నేత్రునిలా ఉంటాడు. నే చెప్పాల్సింది చెప్పాను. నువ్వు చెయ్యాల్సింది చెయ్యి. ఆ పైన నీ అదృష్టం. వెళ్లు అన్నాడు.

హిమవంతుడలా అనంగానే దుందుభి, "అతడంతటి వాడా ! మరి పేరు చెప్పావు గాదు" అన్నాడు. అందుకు హిమవంతుడు "అవటానికి వానరుడే ! పేరు వాలి. కిష్కింధాధిపతి" అన్నాడు. ఆ మాటలు విన్న దుందుభి దక్షిణ దిశవైపు తిరిగాడు. అప్పుడు హిమవంతుడు -"నిన్నొక్కటి

కోరతాను. నీ కొమ్ముల్ని పట్టుకొని నిన్నతడు నింగిలోకి విసిరివేస్తుంటే ఆ సమయంలో నిన్ను తన దగ్గఱకు పంపించింది నేనని చెప్పకు. వాడా కోపంలో నిన్ను నా మీదకు విసిరినా విసరచ్చు.'' అన్నాడు. ఆ మాటలు విన్న దుందుభి కోపంతో అదేపట్టున కిష్కింధకు వెళ్లాడు.

## దుందుభి కిష్కింధా ప్రవేశం

కిష్కింధాపుర ద్వారాన్ని దుందుభి ఒక్కసారి తన కొమ్ములతో కొట్టాడు. అప్పుడు పెద్దపెట్టున మహాధ్వని పుట్టింది. సరిగ్గా అదే సమయంలో అక్కడ అంతఃపురంలో వాలి పెదవుల వద్దకు తార మధుపాత్ర అందిస్తోంది. అధాత్తుగా పుట్టిన ధ్వనికి చెయ్యి కదిలి బంగారు మధుపాత్ర తార చేతిలోంచి జారింది. మధువు ఒలికి వాలి పాదాల మీద పడింది. త్రాచుపాము కాటుకు విషం పైకి ఎక్కినట్లు కోపం, తాపం నెత్తికెక్కి రూపం మారింది. అంత లోనే ఫెడేల్‌మని చప్పుడు మళ్లీ వినిపించింది. కూర్చున్న వాలి ఒక్కసారి లేచాడు. పళ్లు పటపట కొరికాడు. కళ్లు తీక్షణమైనాయి. వాలి చేతిని తార పట్టుకొని మెల్లగా ఆపింది. ఇద్దరూ ముందుకు వస్తూ మళ్లీ రావాన్ని విన్నారు తార చేతిలోంచి వాలి తనచేతిని విదిలించుకొని ఒక్క దూకుతో గుహ ద్వారమైన పెద్ద బండరాయిని తొలగించి - "ఎవడ్రా'' అన్నాడు. అప్పుడు మేమంతా ద్వారం వద్దకు చేరాం. ఎదురుగా ఎద్దుని, భయంకర వికృతాకృతి లో దుందుభి-

''వచ్చావా! రా! నీవేదో మహాబలశాలివనీ, భూమ్యాకాశాలు పట్టవనీ ఆ సముద్రుడూ, హిమవంతుడు నీ గురించేదో గొప్పగా చెప్పార్లే ! అదేదో తేలుద్దామని ఈ భూమ్మీద నేనుండగా నా లాంటి ఇంకోడు ఉండటానికి వీల్లేకుండా చేద్దామని వచ్చాను. ముందు ఆ సముద్రుడు దగ్గఱకే వెళ్లాను.

కెరటాలతో కాళ్లను తాకి పాదాక్రాంతుడయాడు. తను సమ ఉజ్జీ కాదని, ఇందుకు తగ్గవాడు హిమవంతుడనీ చెప్తే అక్కడకెళ్లాను. ఆ హిమవంతుడు మరీ చీమూ, నెత్తురు లేని వాడిలా కన్పడ్డాడు. మనిషిలో ఉషారే లేదు. శుద్ధ మొద్దావతారంలా కనబడ్డాడు. వీడితోనా యుద్ధం. వీణ్ణి కొట్టినా 'మూడునెలల సాముచేసి మూలనున్న ముసలమ్మను కొట్టినట్లుంటుంది' అని అనుకుంటూంటే ఆ హిమవంతుడే నీ పేరు చెప్పాడు'' అంటూ సగం నమిలిన ఎండు గడ్డినీ అంగిలి నుండి దంతాల మధ్యకు క్రుమ్ముకొనే పశువులాగా నవ్వి-

''భలే వీరుడివే! ఆ మంచుగుట్ట నీ గురించి ఏదేదో చెప్తే ఏదో అనుకొని బెదిరాను. ఈ మాత్రం దానికేనా తన గురించి నీ దగ్గఱ చెప్పవద్దని భయపడి పోయాడు. అసలు నిన్ను నా మహా భుజసంపదకు సాటిగా చెప్పడమే నాకు చిత్రమనిపిస్తోంది ! నువ్వు చూడొస్తే త్రాగి వచ్చినట్లున్నావు. ఇప్పుడు కాదన్నా ఆ తర్వాత నువ్వు చెప్పినట్లు ఇద్దరం రంగంలోకి దిగుదాం. పూర్వం సముద్ర మథనం జరిగినప్పుడు సుర పుట్టింది. దాన్ని త్రాగడం ఇష్టపడలేదు. ధీమంతులయిన తొలి వేల్పులు, కాని మలివేల్పులు తెలివితక్కువతనంతో అదేం పట్టించు కోకుండా త్రాగటం మొదలు పెట్టారు. త్రాగేవారంటే నాకు వైరం మరింత పెరుగుతుంది. త్రాగేవాడికి మతిమతిలో ఉండదు. మతిలో కోతులాడుతాయి. మరికోతే త్రాగితే, త్రాగేవాడికి తేలు కుట్టినట్లు ఉంటుంది. బుద్ధిపని చేయదు. తల్లెవరో తెలీదు. తమ్ముడెవరో తెలీదు. తోడబుట్టిన వాళ్లే గుర్తురారు సుర త్రాగిన దేవతలేం చేశారు ? దైత్యుల్ని దూరం చేసుకోలేదూ ? అన్నాడు. (ఎవరిలా మాట్లాడింది ఆ మాట్లాడిన వాడెలాంటివాడు అన్నదాంతో పనిలేదు. ఆ చెప్పింది సత్యమే ! అది నిజం కాకపోతే వాలి తన తమ్ముణ్ణి వెడలకొట్టి, తమ్ముని భార్యను గూడా తనవద్ద ఉంచుకోలేదూ !) కాని దుందుభి మాటలకు వాలికి తననేదో ఎత్తిపొడుస్తున్నాడని కోపమొచ్చి-

"ఒరేయ్ ఆత్మనిగ్రహము కోల్పోకుండా ఉన్నంతవరకు 'త్రాగాడా త్రాగలేదా ?' అన్నదాంతో సంబంధం లేదు. కేవలం ఇంద్రియ నిగ్రహం ప్రధానం ఎవడికయినా! త్రాగని నీబోటి రాక్షసుల కంటే త్రాగేవారే నయం. భూమి మీద ధర్మ నిర్ణయానికి తగ్గ తెలివేది మీకు? సిగ్గులేక దున్నపోతు లాగా ఇలా నువ్వు రావడమే తెలుపుతోంది. పైగా త్రాగటం తప్పంటావా? కొంచెం ఆలోచించు. నీది ఎంతచచ్చు తెలివో నీకే తెలుస్తుంది. లేకపోతే ఘోరాంబు రాశి ఎక్కడ?నువ్వెక్కడ? హిమశైలేంద్రుడెక్కడ? నువ్వెక్కడ? సరిపోల్చు కోడానికయినా ఒక అర్హత ఉండాలి. సూర్యుడి ముందు మిణుగురు పురుగు లాగా వాళ్ళముందర నువ్వా ? వట్టి వెఱ్ఱివప్ప క్రింద కట్టారు నిన్ను" అంటూ తార దగ్గఱకు వెళ్ళబోతుంటే వాలి – మీదకు దుందుభి గిట్టలతో మన్ను చిమ్మి కవ్విస్తూ-

"అరే! కావల్సింది మాటలు కాదు చేతలు, దమ్ముంటే రా! ఇక్కడ నీ సంగతి ముందు తేల్చి జలేశ, హిమేశల సంగతి చూస్తాను. వెఱ్ఱిపప్పలెవరో తేలుస్తాను" అన్నాడు. అందుకు వాలి - "అసలు నువ్విక్కడ నుండి బ్రతికి వెళ్ళినప్పటి మాటగదా జలేశ, హిమశైలేశలను నువ్వుచూడగలిగేది" అన్నాడు. అందుకు ఆ దుందుభి "నిజమే నిజమే! అంతటి మొనగాళ్ళే అంగనా సన్నిధి లో నీ బోటిగాళ్ళు, మీరే మాట్లాడాలి ఆ అంగనలే మెచ్చాలి. నేనిలా అంటూంటే నీకేమన్నా పౌరుషమనేది ఉంటే ముందుకురా తెలుస్తుంది" అన్నాడు. "సరే తేల్చుకుందాం రా!" అని వాలి ముందుకురికాడు. దుందుభి ముందుకొచ్చాడు.

# దుందుభి వధ

దుందుభి ఝుంఝూ మారుతం లాగా వస్తూ ఒక్కసారి తన కొమ్ముతో వాలిని పొడిచాడు. అంతవాడిగా కొమ్ము తనకు పొడుచుకున్నా వాలి ఒక్క అడుగ్గూడా వెనక్కి వేయకుండా అలాగే నిలబడ్డాడు. దుందుభి మళ్లీ ఒక్కసారి వెనక్కు వెళ్లి కారు మేఘం క్రమ్ముకుంటున్నట్లు వాలి చుట్టూ ఆక్రమించాడు. వాలి హిమవత్పర్వతంలా చెక్కుచెదరకుండా అలానే నిల్చున్నాడు. ఒక్కసారి పిడికిలి బిగించి ఒకే ఒక గ్రుద్దు దుందుభి డొక్కలో గ్రుద్దాడు. మళ్లీ అదే పిడికిలితో మెడ క్రింద నుండి గడ్డం మీద గ్రుద్దాడు. రెండు గుద్దులు ఒక దాని తరువాత ఒకటి వెంట వెంటనే తగలడంతో దుందుభి తట్టుకోలేక పోయాడు. వాలి ఒక్కసారి ఉరుము ఉరిమినట్లు అరిచాడు. దుందుభి మళ్లీ పుంజుకొని రక్తసిక్త దేహంతో, క్రోధంతో, ఉక్రోషంతో ఫెడేల్ మని వాలిని కొట్టాడు. వాలి దాన్నేమీ లక్ష్యపెట్టలేదు. తన రెండు చేతులతో దుందుభి రెండు కొమ్ములూ పట్టుకుని గిర్రున త్రిప్పాడు. ఇంత యుద్ధంలోనూ దుందుభి అలసిపోతున్నాడు గాని వాలి శ్రమపడినట్లు కన్పించటం లేదు. దుందుభి కొమ్ముల పోట్లు లోహదేహుడైన వాలిని ఏమీ చేయలేక పోతున్నాయి. కాని వాలి పిడి గ్రుద్దులు దుందుభి దేహాన్ని తూట్లు చేస్తూ చిచ్చుబుడ్డిలా రక్తాన్ని చిమ్మిస్తున్నాయి. చివరకు అదను చూసి వాలి తన తోకతో దుందుభి వెనుకగా రెండు కాళ్లను కలిపి చుట్టి బిగించి ఒక్కసారి ముందుకు లాగి క్రింద పడేశాడు. అంత దుందుభి వెల్లకిలా పడ్డాడు. వాలి తన మోకాళ్లతో దుందుభి ప్రక్కటెముకల్ని ఫెడీ ఫెడీమని తన్నుతూ అతి క్రూరంగా కసిదీర్చుకున్నాడు. అంతటి దుందుభీ గ్రుడ్లప్పగించి మూరెడు నాలుకను బయటకు జార్చాడు. పుట్టెడు నెత్తురు నోట్లోంచి బయటకు క్రక్కి చచ్చాడు. వాలి తోక పట్టువదిలించి, దుందుభి కళేబరానికి ఇవతలకు వచ్చి నిలబడి పకపకా నవ్వి రెండు చేతులతో ఆ కళేబరాన్ని పైకెత్తి ఆమడ

దూరం విసిరాడు. (శ్రీరాముడు దాన్ని పది ఆమడల దూరం కాలి బొటన వ్రేలితో నెట్టాడు.)

వాలి విసిరిన విసురుకు ఆ కళేబరం సరాసరి వెళ్లి వెళ్లి మతంగముని ఆశ్రమ ప్రాంతంలో పడింది. ఆ విసురులో రివ్వున సాగిన గాలి వేగానికి దుందుభి నోటివెంటనుండి వచ్చే రక్త బిందువులు త్రోవంతా పడుతూ పుష్ప, లతా ఫలాదులతో సువాసనలు వెదజల్లబడే ఆశ్రమం గవులు కంపు కొట్టింది. అపవిత్రమైన ఆ వాసన తగలంగానే ముని భ్రుకుటి చిట్లించాడు. "ఇలా జరగడానికి కారకుడైన వాలి ఈ ఆశ్రమానికి ఆమడ దూరంలో ఎక్కడైనా కాలుపెడ్తే చనిపోతాడు. ఆ వాలి తాలూకు మంత్రులు ఈ ప్రాంతాన్ని రేపటి లోగా విడిచిపెట్టకపోతే ఇక్కడ పాషాణాలై పోతారు" అని శపించి, వెంటనే స్నానం చేసి, హోమంచేసి, అపవిత్రతను పోగొట్టుకొని పూర్వ నిర్మలత్వాన్ని పొందాడు. అప్పుడు వాలి మునిని సందర్శించడానికి వచ్చి—

"స్వామీ నా మూలంగా ఎప్పుడన్నా మునులకు అపకారం జరిగిందా? మీ తపోబలం కంటే నా భుజబలం అధికం అంటే నేను అజ్ఞానిని కాదా?" అన్నాడు. అప్పుడు ముని ఛీదరించుకొని - 'ఏమన్నానో అన్నాను. పో ఇక్కడ నుండి ముందు, నా ఆశ్రమ ప్రాంతం చుట్టూ ఉన్న అడవిలో తిరుగుతూ తందనాలాడు; ఆశ్రమ ప్రాంతంలో అడుగుపెట్టావో నీ ప్రాణాలు నీవి కావు. వెళ్లు' అన్నాడు. వాలి చేసేదిలేక వెళ్లి పోయాడు"- అన్నాడు సుగ్రీవుడు.

కథ విన్న శ్రీరాముడు- "కోపమొస్తే అవతలి వాణ్ణి శపించెయ్యటం- తీరా అవతలివాడు కాళ్లా వేళ్లా పడితే బోళాశంకరుడిలా జాలిపడిపోయి ఆ శాపాన్ని ఉపసంహరించు కోవడమో చేస్తారు మునులు. అల్లాంటిది వాలి యందు ఏముందో ఈ ముని ఏమీ మెత్తపడలేదు ఎందుకనో" అన్నాడు. అప్పుడు సుగ్రీవుడు--

# సప్తతాళ వృత్తాంతం

ఆ ముని ఎందుకు మెత్త పడలేదో, ఇలా జరగటానికి ముందు ముందు తనకేదైనా ముప్పు వాటిల్లక తప్పదేమో అనిగూడా ఆలోచించాడు వాలి. ఎవరు ఏమనుకున్నా ఏమీ లక్ష్యపెట్టడు. తన మీద, తన పరాక్రమం మీద అంత వెఱ్ఱి నమ్మకం వాలికి. మా కిష్కింధలో ప్రతిఏడూ ఉత్సవాలు జరుగుతాయి. ఆ ఉత్సవాల్లో పరాక్రమ ప్రదర్శన లుంటాయి. అప్పుడు వాలి ఏం చేస్తాడో తెలుసునా? అలా దూరంగా కనబడుతున్నాయే ఆ ఏడు తాటి చెట్లని తన విల్లుతో ఏడు బాణాలు వేసి, ఒక్కచెట్టుకు ఒక్క ఆకన్నా లేకుండా చేస్తాడు. వాలి బలం గాని, ప్రయోగించిన వేగం గాని అలా తూచినట్లుగా ఉంటుంది అన్యుల కసాధ్యమనిపిస్తుంది. ఆ పరాక్రమ ప్రదర్శనోత్సవం నానా భీభత్సంగా ఉంటుంది. భూమి గుండె పగిలినట్లు బీటిస్తుంది" అన్నాడు. సుగ్రీవుడెందుకిలా చెబుతున్నాడో అర్థం చేసుకున్నాడో ఏమోశ్రీరాముడు సుగ్రీవుడి మాటలు వింటూనే చిన్నగా నవ్వి--

"సుగ్రీవా! జీవి సంస్కారం చిత్రంగా ఉంటుందనుకో! ప్రతి ఒక్క రికి ప్రాణభీతి ఒక్కోరకంగా ఉంటుంది. ఈ ప్రాణభీతిని బట్టే తనుచేసే పని తీరు, మాట్లాడే విధానం ఉంటుందనుకో! మునులున్నారే వాళ్లు చిత్రంగా ఆ ప్రాణభీతికి మూలకారణాన్నిగూడా పసిగట్టగలరనుకో! అంటూ మళ్లీ నవ్వి "ఈ రాముడు బాణాలు వాడటంలో కాస్త పిసినారి" అంటూ ఒకే ఒక బాణాన్ని ఎక్కుపెట్టి సప్త తాళాల మీదుగా వేశాడు. అది చిత్ర విచిత్ర గమనాలతో చంక్రమణాలు చేసుకుంటూ 'వచ్చింది బాణమా ఖడ్గమా' అనిపిం చేట్లు ఏ ఒక్క చెట్టుకు ఒక్క ఆకైనా మిగల్చకుండా చెయ్యడమే కాకుండా చివరకు ఆ ఏడు చెట్లను నేలకు కూల్చి, పిడుగులా భూమిని పెకలించుకుని దూసుకుంటూ దూరిపోయింది.

సుగ్రీవుడు అదిరిపోయాడు. ఒక్కసారి వెనకా ముందూ ఆలోచించ కుండా- "రామచంద్రుడు పాదాలు పెట్టిన భూమి వద్ద శిరస్సానించి అలానే వుండిపోయాడు. అప్పుడు స్వామి నవ్వుతూ తన రెండు బాహువులతో సుగ్రీవుని లేపి హాస్య, గంభీర ముగ్ధత్వాలు మేళవించే ఒక విచిత్రమైన నవ్వు నవ్వుతూ—

"మరింక ఎందుకయ్యా నీకుభయం. ఇందువల్లే గదా వాలి ఈ ఋష్య మూక ప్రాంతానికి రాడు. అందుకనే నీకిక్కడ తలదాచుకోడానికి అనువైంది. అంతే గదా! అవును గాని ఆ వాలికి నువ్వేం కీడు తలపెట్టావని తమ్ముడని గూడా లేకుండా నిన్నతడిలా వెంబడించడం?" అన్నాడు. అప్పుడు సుగ్రీవుడు రాముని ఔదార్యం- జాలిగా, అనుగ్రహంగా మారుతూందనే ఆశతో-

"నేను అతనికంటూ ఒక కీడు తలపెడితే గదా అతడేమన్నా నన్ను అనడానికి, నిలదీయడానికి? వికృత మతుడు. మనం ఏం చెయ్యకపోయినా ఏదో చేశామని తనే ఊహించుకుంటాడు బతిమాలాను, బామాలాను, నుతి చేశాను, నతి చేశాను ఏం చేస్తే మటుకు ఏం. అతని మతికి నా ప్రార్థన ఎక్కితేనా? నన్ను మన్నిస్తేనా? మీరైతే దేన్నీ లెక్క చెయ్యరు. మీకు సర్వమూ లీలగా ఉంటుంది. మాకు ప్రతీదీ సమస్యే ! ప్రాణ సంకటమే ! సర్వవిదులైన మీకు ఒకరిపై పగ, ఒకరిపై పగ ఉండదు. మీలాంటి వారి బుద్ధి సరియైన నిర్ణయమే చేస్తుంది జరిగినదంతా చెప్తాను. అంతా విన్న తరువాత నా తప్పేమైనా వుంటే నన్ను విడిచి వాలినే గ్రహించు.

## మాయావి కథ

ఒకరోజు అర్ధరాత్రి కిష్కింధాపుర ద్వారం దగ్గఱ నుండి పెద్ద సింహనాదం వినబడి ప్రశాంతంగా వున్న వాతావరణాన్ని భంగం చేసింది. నిద్ర

పోతున్న మాకందరికీ ఒక్కసారి మెలకువ వచ్చింది. 'ఇంత అర్ధరాత్రి ఏం జరిగింది? ఏమై ఉంటుంది? ఎవరీ నాదం చేసింది? అంటూ అందరం కంగారు పడుతూ వెళ్లాం. వచ్చినవాడు పూర్వం వాలి చంపిన దుందుభికి బంధువని. వాడిపేరు మాయావి అని తెలిసింది. 'వీడికి ఇంత అర్ధరాత్రి తప్ప ఇంకే సమయం దొరకలేదా' అనిపించింది. ప్రళయకాల రుద్రుడిలా ఉన్నాడు వాణ్ణి చూడంగానే అందరి గుండెలు బ్రద్దలయాయి – కాని వాలి మాత్రం మరొకటి ఆలోచించకుండా వాణ్ణి పట్టుకోవడానికి వెంట బడ్డాడు అన్న అలా ఒక్కడూ రాక్షసుడి వెంట పడిపోవడం మనసొప్పక నేనూ అన్న వెనకగా వెంట వెళ్లాను. ముగ్గులు పోసినట్లు, కర్పూరం చల్లినట్లు, పిండి ఆరబోసినట్లు ఉన్న ఆనాటి వెన్నెల వెలుగుల్లో ఆ రాక్షసుడు అలా తిప్పిస్తోంటే- "మా కిష్కింధ మీద రాక్షస కులం అంతా ఒక్కసారి కక్షకట్టి సర్వనాశనం చెయ్యదలిచారేమో" అనిపించింది. ఆ మాయావి అలా వెళ్లి వెళ్లి ఒక ఘోరారణ్య ప్రాంతంలోకి జొరబడ్డాడు. రాళ్లు, రప్పలు, గుట్టలు. మెట్టలు దాటుకుంటూ చిట్టచివరకు ఒక పెద్ద బిలంలోకి ప్రవేశించాడు. తెల్లవారవస్తోంది. తూర్పు దిక్కు స్త్రీ నుదుట కుంకుమ బొట్టులా వున్న సూర్యుని రాకతో మాయావి దూకిన బిలంలో మెల్లమెల్లగా అంధకారం విడిపోతోంది. అంతలోనే లోపల్నుంచి ఆ మాయావి పెట్టిన వికటాట్టహాసాలు వినబడ్డాయి. వాలి అవి విన్నాడు విని రోషంతో–

'తమ్ముడూ ! నువ్వు ఇక్కడే వుండు. నేను లోపలకు వెళ్లి వాణ్ణి చంపి వస్తాను', అన్నాడు అన్న. "అన్నా ! మనంతకు మనం బిలం లోపలకు వెళ్లడం దేనికి చెప్పు? లోపల ఆ రాక్షస మూక అందరూ కలియ బడవచ్చు. అనవసరంగా వెళ్లద్దు. మన మీదకు వచ్చినపుడు వాడి పని పట్టచ్చు గదా" అని వారించాను. నా సలహా, అభ్యర్థన వాలి వినలేదు సరిగదా; "నువ్వు అల్లా వెళ్లద్దని నన్ను వారించవద్దు. అల్లా వారిస్తే నా

మీద ఒట్టే ! అని ఒట్టు పెట్టించుకొని మరీ ఆ పాతాళంలోకి జొఱబడ్డాడు. ఆ బిల ద్వారం వద్ద కదలకుండా నన్నుండమని చెప్పడంతో నేనక్కడే నిరీక్షిస్తూ సుమారు ఒక సంవత్సరం అక్కడే వుండిపోయాను. సంవత్సరం గడచినా అన్న రాలేదు. ' పోనీ నేను గూడా లోపలకు వెళ్దామా ' అని పించింది. కాని, నాదో దారి తనదో దారి అయి బయటకు వచ్చి చూస్తే నేను కనబడకపోతే తను ఉండమన్న చోట ఉండలేదని నా మీద కోప మొస్తుందేమోనని అలానే కూర్చుండి పోయాను. ఇంతలో ఒక రోజున బిల ముఖంలోంచి నెత్తురుటేరులు ప్రవహించాయి. లోపల్నుండి రాక్షస రావాలు విన్పడ్డాయి. నాకేం చెయ్యాలో పాలు పోలేదు. ఏం జరిగి ఉంటుందో ఊహించలేక పోయాను. వాలి ఇంతవరకు ఎవరితోను ఇంత సేపు యుద్ధం చెయ్యలేదు. కలబడిన మరుక్షణంలోనే అవతలివాడు చిత్తు చిత్తు అయి పోవాల్సిందే ! అలాంటిది ఇవాళ ఇన్ని రోజులు యుద్ధం చేసాడంటే అవతలివైపు నుండి ప్రతిఘటన చాలా తీవ్రంగా ఉండి ఉంటుంది. పైగా రాక్షస రావాలు, దాన్తో ఒక అనుమానం వేసింది. బహుశః వాళ్లందరూ చేరి వాలిని చంపివుంటారని, అప్పటితో ఊరుకోకుండా ఆవిజయోత్సాహంలో మొత్తం అందరూ కిష్కింధపై పడతారేమో ననే శంకతో ఒక పెద్ద బండ రాయిని పట్టు బలవంతాన నెట్టుకుంటూ వెళ్లి బిలద్వారానికి అడ్డంగా పెట్టాను. లోపల నుండి తోసినా రాని విధంగా ఉండేందుకు మరికొన్ని పెద్దరాళ్లు అడ్డం పెట్టి, మనోవేదనతో ఊరికి చేరాను. తర్పణాలు విడిచాను. ఏమీ తోచక బాధ పడుతూంటే మంత్రులందరూ కలసి రాజ్యం అరాచకమై పోకూడదంటూ నన్ను రాజుగా ఉండాలని పట్టుపట్టారు. కపిరాజ్యాన్ని మంత్రుల సలహాలతో ధర్మ బద్ధంగా ఏలుతున్నాను

# వాలి పునః ప్రవేశం

ఒకనాడు నేనూ, మంత్రులు కొలువు తీర్చి ఉండగా ద్వారం వద్ద వికటాట్టహాసం చేస్తూ వాలి మహా భీకరంగా కన్పించాడు పెడబొబ్బ ఒకటి పెట్టాడు. జబ్బలు చరిచాడు. తోక ఒకసారి ఝాడిస్తూ నేలకు కొట్టాడు. అన్నని చూడంగానే నా ప్రాణాలు లేచివచ్చాయి. దుఃఖం అంతా పోయింది. పోగొట్టుకున్న విలువైన వస్తువు మళ్లీ దొరికినట్లనిపించింది. కాని వాలి అలా పెడబొబ్బ పెట్టి, జబ్బలు చరిచి, తోక త్రిప్పుతూంటే పై ప్రాణాలు పైనే పోయాయి. సింహాసనం దిగి వాలి దగ్గఱకు వెళ్లి పాదాభివందనం చేసి "ప్రభూ ! నిజంగా మా అందరి అదృష్టం. ఈ రాజ్యభారాన్ని వహించి ఈ కీశ నాయకులకు క్లేశాన్ని వదిలించు, రాజ్యలక్ష్మిని భోగ్యంగా అనుభ వించు. రాజాంతఃపురం అంతా దుఃఖాంధకారంతో క్రుగ్గుతోంది. నీ దివ్య ప్రభాయుక్తమైన దర్శన మిచ్చి అంతఃపురానికి సూర్యోదయ ప్రాప్తి చేకూర్చు. ప్రభూ ! నీ రాకతో నా హృదయానికి చంద్రోదయమైంది. మనస్సుకు గురూదయం అయింది. సర్వ కపి వీరులకు ధైర్యోదయం అయింది. ఇప్పుడు నేను ఏదైనా చెప్పినా అవివేకిగాను, దోషిగానే నేను నీ కనిపించ వచ్చు. నిజానికి నేను ఏ దోషం తలపెట్టినవాణ్ణి గాదు. నీ మీదగల నా ప్రేమ నీకు తెలియనిది కాదు. అది ఎప్పటికీ చెదరనిదే ! నువ్వోకా స్త ఆలోచించు. రాక్షసుడి వెంట నీవు వెంటబడుతున్నపుడు నీకేమౌతుందోనని నేను కూడా నీ నీడలా నిన్ననుసరించాను...." ఇలా అంటూండగానే నన్ను ముందుకు పడద్రోసి నా మంత్రుల్ని అదరగొట్టి నిండు సభా మధ్యంలో –

"అన్నదమ్ములు ఒక తండ్రి బిడ్డలైనప్పటి కంటే ఒక తల్లి బిడ్డలై నప్పుడు ఆ తండ్రి మర్యాద, కుల గౌరవం ఎక్కువగా ఉంటుందని మన తండ్రిని, కుటుంబాన్ని తలచుకొన్నప్పుడల్లా నా హృదయం

ద్రవిస్తుంది. తల్లి ప్రేమ పంచుకొని అలా పెరిగాం. మనం ఊహించలేని ఆపదలు ఏమైనా రావచ్చునేమో" అనేగదా నాతోపాటు బిల ప్రవేశం చెయ్యవద్దని చెప్పి నేను బిలంలోకి పోయి నిన్ను ద్వారం వద్ద నిరీక్షించమని చెప్పింది మరి అలాంటప్పుడు అన్న వచ్చేంత వరకు తమ్ముడయిన నీవు నిరీక్షించవద్దూ? నేను ఆ మాయావి చేతిలో చచ్చిపోయి ఉంటాననుకోడానికి నా సంగతి, నా బాహుబల పరాక్రమం సంగతి నీవు తెలియని వాడవా? ఇంతకుముందే దుందుభిని చంపి కళేబరాన్ని అమడ దూరం విసిరిన సంగతి తెలియనిదా? సప్త తాళవృక్షాలను బాణాలతో త్రుంపిన సంగతి తెలియనిదా? దశకంఠుణ్ణే చంకల్లో పెట్టి ఇరకాటంలో పెట్టిన వాణ్ణని తెలియదా? పైగా అన్నగారికి శ్రద్ధతో అపరకర్మలు గూడా చేశాననడం ఇంకా విచిత్రం. ఆ ఫలం అటు ప్రేతము తిన్నది కాదు-ఇటు ఈ ప్రాణి తిన్నది కాకుండా వినూత్నమైన విధానంలో చేశావు. నిన్ను వెట్టిబాగులవాడనుకోవాలా ? పుట్టుకు ఏదో క్రొత్త బుద్ధి పుట్టిందనుకోవాలా? ఇంటి దగ్గర ఎవరన్నా పోయారంటే- బంధువులు చూసిగూడా ఎవరూ వెంటనే నమ్మరు. కాళ్ళు, చేతులు చలువలు క్రమ్మామేమో అని కాళ్ళు, చేతులు తడిమి చూస్తారు. ఊపిరి ఆడుతుందేమో అని ముక్కు దగ్గర వేలుపెట్టి చూస్తారు. తెల్లగ్రుడ్డుగాని, నిలువుగ్రుడ్లుగాని పడ్డాయేమోనని కళ్ళవంక చూస్తారు చివరకు మరణ విషయం నిర్ధారణ జరిగి శ్మశానానికి తీసుకు వెళ్తూ గూడా మళ్ళీ ప్రాణం ఏమన్నా వచ్చి బ్రతుకుతాడేమోనన్న ఆశాపూరితమైన అనుమానంతో రెండు మూడు చోట్ల క్రిందకు దింపి గూడా మరీ తీసుకుని వెళ్తారు లోకంలో. కాని బిలంలో నెత్తురు పడిందన్న ఒక్క విషయంతోనే ఈ వాలి మరణాన్ని తమ్ముడివైన నీవు నిర్ణయించేశావు. పసివాడివి నువ్వు అనవసరంగా బిలంలోకి వస్తే ఆ రాక్షసి మూక ఏం చేస్తారో నిన్ను అని బిలం దగ్గర నే వచ్చేవరకు ఉండమని నీ అన్నగారిగా నేను అన్నాను. నువ్వేమో నాపట్ల అలా చేశావు. నేను బ్రతికి ఉండగానే నా తార దీన స్థితిని

చూడాల్సిన దౌర్భాగ్యం నాకు కలుగ జేసావు. తార తెలివిగలది. నీ రుమ అందమైనది. ఆ అందకత్తె రాణి కావాలి నువ్వుకాకుండా వేరొకడు రాజైతే ఆ అందకత్తె రాణి ఎలా అవుతుంది మరి?" అన్నాడు.

వాలి మాటలు వింటున్న నాకు నోటమాట రాలేదు. ఏం మాట్లాడితే ఏమి తప్పు వచ్చి పడుతుందోనని తల వంచుకుని మాట్లాడకుండా అలాగే నిలుచుండి పోయాను. వాలి మాటలు ఇంకా వినబడుతూ ఉన్నాయి. "ఇది వానరేంద్రుని ఆజ్ఞ! ఈ వాలి తమ్ముడైన సుగ్రీవుణ్ణి మీరందరూ ఎరుగున్నారుకదా? రెండేండ్ల క్రితం ఇక్కడకు ఒక మహిషాకృతిలో ఉన్న రాక్షసుడి కొడుకు మన మీదకు వచ్చాడు. అప్పుడు ఆ రాక్షసుణ్ణి చంపుదామని వెళ్తుంటే ఈ గొప్ప వీరుడు ఈ అన్నగారిమీద ప్రేమ ఒలకబోస్తూ అనుసరించాడు అవతల రాక్షసుడు తప్పించుకొని ఒక బిలంలో ప్రవేశిస్తే వాడి అంతు తేలుద్దామని బిలంలోకి నేను ప్రవేశిద్దామనుకుంటుంటే ఇదిగో ఈ తమ్ముడే నా బాహుబల విక్రమం తెలిసి గూడా మనకు ఏదో మహాపద సంభవిస్తుందని నన్ను మాన్పించడానికి ప్రయత్నం చేసాడు. అయినా లెక్కచెయ్యకుండా "నువ్వు ఇక్కడే అప్రమత్తంగా ఉండి రక్షిస్తూ ఉండు" అని చెప్పి నేను బిలంలోకి రాక్షసుణి వెంబడిస్తూ పోయాను. లోపలికి వెళ్ళిన నేను తిరిగి రావడం ఆలస్యమైతే ఈ లోపలే దా రం దగ్గర ఉన్న వీడికి వెధవ ఊహలు వచ్చాయి. అంతే వెంటనే నేను ఆ రాక్షసుడి చేతిలో చచ్చి ఉంటానని లెక్కవేసుకుని బలంతో త్రోసినా తొలగని ఒక పెద్ద బండరాయితో బిలద్వారాన్ని పూర్తిగా మూసిపెట్టి, కిష్కింధకు చక్కావచ్చి, తగుదునమ్మా అని రాజులాగా సింహాసనంపై కూర్చున్నాడు. బిల ద్వారం వద్ద నిరీక్షించమంటే అలా చెయ్యకుండా రాజాజ్ఞను ఉల్లఘించడం, ఇంకా, రాజైన నాకే ద్రోహం తలపెట్టడం. రెండు తప్పిదాలు చేశాడు. రాజాజ్ఞను ఉల్లంఘించి నందుకు గాను వాడికి కారాగృహ వాసము విధిస్తున్నాను.

బ్రతికి వున్నా నాకు అపరకర్మలు గూడా చేసిన ఈ రాజ ద్రోహికి శిరచ్ఛేదం శిక్ష విధిస్తున్నాను, అన్నాడు. వెంటనే రాజ వస్త్రాభరణాలలో వున్న నన్ను రాజ భటులు వచ్చి నిగ్రహింప బోతూవుంటే తక్కిన నా మంత్రులు ఏమీ చెయ్యలేక తలలు వంచుకుని నిలబడ్డారు. అప్పుడు ఈ హనుమంతుడు రోషకషాయత నేత్రుడై, భయంకర మూర్తియై సభా మధ్యలో నిలబడ్డాడు. కపి వీరులందరూ అతని వంకే విహ్వాలులై చూస్తూ ఉండి పోయారు. అప్పుడు మళ్లీ వాలి –

"వీడు నా తమ్ముడవటం మూలంగా క్షమిస్తున్నాను. అంతటి తీవ్ర మైన శిక్షలు వెయ్యడానికి హృదయం ఒప్పుకోవటం లేదు. అందుకని వాణ్ణి ఏక వస్త్రుణ్ణి చేసి దేశ బహిష్కరణ చేస్తున్నాను. వీడి భార్య రమ రాణిగా నా దగ్గరే ఉంటుంది" అని వెంటనే సింహాసనం దిగి వెళ్లిపోయాడు. రాజ భటులు నన్ను కిష్కింధ పొలిమేరలకు పంపారు. నల్గురెదుటా అలా అన్నాడే గాని నాకు నిలువ నీడ లేకుండా చేసాడు. రాజ భటులు నన్ను వెంబడిస్తూనే ఉన్నారు. ఎక్కడా నిలవడానికి గూడా ఆస్కారం ఈయకుండా నా ప్రాణాలతో చెలగాటం ఆడుతూనే వుండేట్టు చేసాడు. నిద్ర లేదు. అన్నం లేదు. ఒక్కొక్కప్పుడు సగం తిని పారిపోవాల్సి వచ్చేది. చిట్ట చివరకు ఈ మతాంగాశ్రమం గుర్తుకు వచ్చి ఇక్కడికి చేరాను. నా మంత్రులు నన్ను వెతుక్కుంటూ వచ్చి నా దగ్గఱ చేరారు. కొంత భయం లేకుండా నిద్రాహారాలు మాత్రం దక్కించుకొంటున్నాను. అయినా ఈ ఆశ్రమ పొలిమేరల్లో అదనుకోసం వాలి భటులు నిరీక్షిస్తూనే ఉన్నారు. నీ సఖుణ్ణి అయ్యాను. ఇక నువ్వే నాకు రక్ష – దైవం. పాల ముంచినా నీట ముంచినా నీదే భారం" అని వాపోయాడు. అందుకు శ్రీరాముడు –

# రాముని ధర్మ నిర్ణయం

ఒక పని చెయ్యడంలో వాలికీ, నీకూ ఒక భేద ముందనిపిస్తోంది. ప్రతి చిన్న విషయం ఎంతో ఆలోచించి చేస్తాడు వాలి. నువ్వు అంతా దైవం మీద భారం వేసి ధైర్యాన్ని తెచ్చుకుని చేస్తావు. వాలి పురుష ప్రయత్నం మీద ఎక్కువ నమ్మకం గలవాడు. నువ్వు దైవానుగ్రహం మీద నమ్మకం గలవాడివి. అతడికి రాచరికము, పదవి, అధికారముల మీద దృష్టి ఎక్కువ. నీకు స్నేహము, బంధు భావము ఎక్కువ. ఇలాంటి నువ్వు ఏదో రకంగా ప్రయత్నించి కార్యాన్ని సానుకూలం చేసుకుందామనుకున్నా అతడు ఏదీ కుదరనీయకుండా చేయడమే కాక చివరకు నువ్వు నలుగురిలో కలిసి తిరగడానికి గూడా వీలు లేకుండా చేసాడు. మరి అల్లాంటి వానిని వధించడం తప్ప నా కింకో మార్గం కనబడటం లేదు. నాతో కావాలని అతడు యుద్ధం తెచ్చుకొని ఎదిరించడు. సరియైన హేతువును చూపించి గాని అతణ్ణి చంపకూడదు" అన్నాడు. అప్పుడు సుగ్రీవుడు –

"అవడానికి ఇద్దరం సమానమైన బలం కలవాళ్లమే ! కాని ఒకనాడు ఇద్దరం కుస్తీ పట్టినపుడు మొదలెట్టిన కొంత కాలానికి నాకు అలసట, ఆొప్పు వచ్చాయి. వాలి బడలిపోలేదు, అలసిపోలేదు, చెమటగూడా పట్టలేదు. అప్పుడే కుస్తీకి దిగాడా అన్నట్లున్నాడు. నేను మాత్రం డీలా పడిపోయాను. అదే నా లోటు. దాని మూలాన్నే వాలికి నేనంటే తేలిక భావం. ఆనాటి నుంచి నాతో యుద్ధం చెయ్యడమే చిన్నతనంగా భావించేవాడు, ఇప్పుడు మళ్లీ ఇద్దరం కలియబడడం. నీ అనుగ్రహం వలన నేను గెల్చి వాలి ఓడి పోవడం కనక జరిగితే- వాలి మదం అణగారి పోతుంది. లేకపోతే ఏమిటి చెప్పు రామచంద్రా! బొత్తిగా తమ్మునిపై గూడా అపేక్ష లేనివాడిని ఏమను కోవాలి?" అన్నాడు. అప్పుడు రామచంద్రుడు–

మీరు పూర్తిగా మానవులు కాదు. సగం నరులు, సగం మృగాలు అందువల్ల శిక్ష విధించాలంటే మీ పట్ల ధర్మం గూడా రెండు విధాలుగా పాటించాల్సి వుంటుంది. ఈ సర్వధాత్రీ తలానికి మా ఇక్ష్వాకు వంశస్థులు చక్రవర్తులు. ఎక్కడైనా ధర్మానికి గ్లాని ఏర్పడితే తిరిగి ధర్మ స్యస్థాపన బాధ్యత వారికున్నది. కాబట్టి ఒక పని చేద్దాం. వాలిని నువ్వు నీతో యుద్ధానికి పిలు. వాలి నన్ను చూడనప్పుడు వాలిపై నేను బాణంవేసి క్రూర జంతువును వధించేటట్లు వధిస్తాను. జంతువు లాగా మరణిస్తాడో, మానవుడిలా విలపిస్తాడో చూద్దాం. కొందరు తమ మరణానికి తామే తమ చేజేతాలా పూర్వరంగాన్ని ఏర్పరచుకుంటారు. వారి వారి కామ క్రోధాదులే వారిని అలా నడిపిస్తాయి. అల్లాంటి దౌర్భాగ్యుల్ని ఎవరూ కాపాడలేరు గూడా! కామబుద్ధికి తోడు దురభిమానం గూడాఉంటే ఇంక చెప్పాల్సినపనిలేదు. వాలి ప్రస్తుతం చెయ్యగలిగేవి రెండే ! దురభిమానంతో మరణాన్ని కోరి తెచ్చుకోవడమో ! లేదా సన్యసించి ఈ ధరణీతలాన్నే వదలడమో ! అంతే ! నిన్ను వానర రాజ్యానికి యువరాజుని చేసి తన భాతృ వాత్సల్యాన్ని ప్రకటించుకునే మంచితనం లేకపోయింది. ఇప్పుడైనా ఈ రాజ్యాన్ని నీ కిచ్చేసి మునిలాగా వెళ్లిపోతాడో, లేక నన్ను ఎదిరించటానికే వస్తాడో చూడాలి. ఒక వేళ రెండోదే జరిగితే కబంధుడు, విరాధుడు ఎలాఅయ్యారో వాలి గూడా అంతే అవుతాడు. తోబుట్టువును పెట్టిన ఇక్కట్లకు ఆ మాత్రం ప్రతిఫలాన్ని పొందవద్దా ?" అన్నాడు. అప్పుడు సుగ్రీవుడు–

ఈ విషయం వాలితో చెప్పడానికి ఎవ్వరికీ ధైర్యం లేదు. ఒక్క అంగదుడేమన్నా సాహసించాలి. ఆ అంగదుడు గూడా తల్లితో ముందు చెప్తే అటుపైన ఆమె వాలి రాజుతో చెప్పాల్సిందే తప్ప మరో మార్గం లేదు" అన్నాడు. అప్పుడు రాముడు–

"అతని చావు నిశ్చయమైన తర్వాత నీకతను రాజు అయ్యాడు" అనం

గానే సుగ్రీవుని ముఖంలో నవ్వు విరిసింది. తనలో తనే- "రాముని శౌర్య పరాక్రమాల మీద తనకు అనుమానం కలుగుతోందని గ్రహించేశాడో ఏమో ఆ అనుమానాన్ని పోగొట్టడానికి కాలి వ్రేలితో దుందుభి కళేబరాన్ని పది ఆమడల' దూరానికి నెట్టాడు. ఒకే ఒక బాణంతో సప్త తాళ వృక్షాలను ఛేదించాడు. నిజంగా సర్వ జీవుల హృదయాంతర్గత విషయాలను గూడా గ్రహించగలిగిన ఇంగితజ్ఞుడే రాముడు. అనుగ్రహమే కలగాలిగాని ఈ పని చెయ్యగలడు, ఈ పని చెయ్యలేడని ఎంచలేము గదా !" అనుకున్నాడు.

## అంగదుణ్ణి బెదిరించడం

అడవుల్లో దూరంగా పోతున్న అంగదుణ్ణి చూసి నీలుడు పిలిచాడు. ఇష్టం లేకుండానే ఆగి "ఎందుకు పిలిచావు ?" అన్నాడు అంగదుడు. అందుకు నీలుడు–

'శివ ధనుర్భంగం చేసి తన సూర్యవంశానికే వన్నె తెచ్చిన దాశరథి తన తమ్మునితో ఈ వనాల్లో తిరుగుతున్నాడని తెలిసింది. నువ్వేమన్నా చూశావా!' అన్నాడు. అందుకు అంగదుడు' సరేలే' అని వెళ్ళిపోబోతూంటే మళ్ళీ నీలుడు–

"ఇదిగో ఏదో పట్టించుకోనట్టు 'సరేలే' అనడం కాదు. ఆయన ఎక్కుపెట్టిన బాణం భార్గవ రాముడికి భూమ్మీద నిలువ నీడ లేకుండా చేసింది !" అంటూ మరికొంత దూరం ఇద్దరూ కలిసి నడిచింతర్వాత అంగదుణ్ణి నిలిపి –

"కోదండ ధారియై స్కందమూర్తిని గుర్తుతెచ్చే, తేజః పుంజంతో ఈ అడవుల్లో తిరుగుతున్నాడు. ఆయన పేరు రాముడు. మహితమూర్తి. వివేక

వంతుల్ని సంరక్షిస్తాడు. అవివేకుల్ని సంహరిస్తాడు. మనల్ని సగం మనుష్యులుగాను, సగం జంతువులుగాను చూస్తాడట ! చెట్టుచాటు నుండి మనల్ని చంపుతాడన్నా ఆశ్చర్యపోనక్కర్లేదు. ఈ వనానికి వానరాలకు వాలి రాజు అవచ్చు, కాని ఆ వేటగాడైన రాముని వైపు మీ పినతండ్రి ఉన్నాడు. మనం కొంచెం వళ్లు దగ్గర పెట్టుకొని వివేకంతో మసలుకోవాలేమో ఆలోచించు" అన్నాడు. నీలాడలా అనంగానే అంగదుడు ముందు కోపము తరువాత కొంచెం భయంపొడసూపే ముఖాన్ని అడ్డంగా త్రిప్పుకొని చక్కా పోయాడు. కాని కొంత దూరం నడిచేప్పటికే తారుడు కనబడి –

"నీకో మాట చెబుదామనే ఇక్కడ నీ కోసం నిలుచున్నాను. ఏంలేదు అనంత శౌర్య పరాక్రమాలు కలిగిన రాముడనే వాడు మీ పినతండ్రితో అగ్నిసాక్షిగా చేతులు కలిపి స్నేహం చేసాడు. మీ పినతండ్రి బుఱ్ఱలో ఏం ఆలోచనలున్నాయో, మీ తండ్రికేమైనా చెడ్డ రోజులు వస్తున్నాయోమో ఆలోచించుకో ! దుందుభి శవాన్ని వాలి రెండు చేతులతో ఎత్తి ఆమడ దూరం విసిరిన మాట ఎంత నిజమో, అదే కళేబరాన్ని రాముడు తన కాలి గోటితో పది ఆమడల దూరానికి విసిరాడన్నది గూడా అంతే నిజం ! అంతే కాదు. ఒక్కొక్క బాణముతో ఒక్కొక్క త్రాటిచెట్టు చొప్పున ఏడు బాణాలతో వాలి ఏడు చెట్లను పడగొట్టిన మాట ఎంత వాస్తవమో, ఆ ఏడు చెట్లను రాముడు ఒకే బాణంతో ఆకులు, కొమ్మలు గూడా లేకుండా చేసి పడగొట్టడం అంతే వాస్తవం. సగం మనుష్యులు సగం జంతువులమైన మనల్ని ఆ రామచంద్రుడు అల్లాగే చూస్తాడు. మనల్ని చాటునుండి వేటాడడం తప్పు అనడానికి మనం పూర్తిగా మనుష్యులమేమీ కాదు. సగం మనుష్యులం, సగం జంతువులం గూడా అయాము తమ్ముడి మీద పగ కొద్దీ సుగ్రీవుని కండగా నిలిచిన రాముణ్ణి ఎదిరిస్తాడో, లేదా వానరుడిలా ప్రాణాల్నే కోల్పోతాడో కాలమే నిర్ణయించాలి. ఏది ఏమైనా సుగ్రీవుడు వాలిని యుద్ధాని

కాహ్వానించక పూర్వమే ఇవాళ రేపట్లోనే నిర్ణయించుకుంటే మంచిది. రాజు మీద అభిమానం కలవాడిని కాబట్టి ఈ విషయం ముందే నీకు చెప్పాను. నువ్వుకూడా ఇంకేమీ ఆలస్యం చేయకుండా వెంటనే ఈ విషయం నీ తండ్రికి చెప్పు" అన్నాడు. తారుని మాటలు విన్న అంగదుడు ఆలోచిస్తూ వెళ్ళిపోయాడు.

తన హృదయం శ్రీరామచంద్ర పాదారవిందాలతో నిండిన ఆంజనేయుడు నిరంతర హృదంతర ధ్యానంలో నిమగ్నుడయాడు. లక్ష్మణుడు మాత్రం "తానైతే భరతుడంతటివాణ్ణి అనుమానించాడుగాని అన్నగార్కి అనుమానమే రాలేదు. లోకంలో అందరూ రామునిలాంటి అన్నలే ఉంటారా'' అనుకుంటూ రాముణ్ణి అనుసరించాడు.

'సప్త తాళ వృక్షాలను ఛేదిస్తున్నపుడు రామబాణం విసురు చూశాను, మళ్ళీ చూసే సమయం ఆసన్నమౌతోంది అనుకుంటూ నడుస్తూన్న నీలుడికి ఒక్కసారి ఎందుకో నవ్వు వచ్చింది. 'ఇంతకీ మనషిలో సగం మృగాన్ని కలిగిన వారిపట్ల ధర్మ నిర్ణయం సంగతి అంగదుడు చెప్పాలిగదా' అనుకున్నాడు. తారుడు గూడా జరగబోయే సన్నివేశాన్ని తోటి వారితో కలిసి కళ్ళారా చూడాలనుకుంటూ వెళ్ళిపోయాడు.

సుగ్రీవుని వెంట రామలక్ష్మణులు కిష్కింధాపుర ద్వారం దగ్గఱకు వచ్చారు. రాముని వంక చూసిన సుగ్రీవుడు ప్రచోదితుడై కోట సింహ ద్వారం ముందు నిలబడి అతి భయంకరంగా గుండెలు బ్రద్దలయ్యే ధ్వనితో ఉరుము ఉరిమినట్లు పెద్దగా సింహనాదం చేశాడు. ఆ ధ్వనికి –

# వాలి సుగ్రీవుల యుద్ధం

ఆకాశంలో గుంపులుగా ఎగురుతున్న పక్షులన్నీ ఒక్కసారి బెదిరిపోయాయి. గంతులు వేస్తూ అరుస్తూ కిచ కిచ మంటూ కళ్లు మాటిమాటికీ మూస్తూ తెరుస్తూ వుండే కిష్కింధాపుర అగ్రహారీకు లందరూ వృక్షశాఖల పైకి ఎక్కి కళ్లార్పకుండా చూస్తున్నారు. వాలికి సుగ్రీవుని పెడబొబ్బ వినపడీ వినపడగానే ప్రళయకాలంలో సముద్రునిలా కెరటాలవంటి అంగలేస్తూ వచ్చి సుగ్రీవుణ్ణి చూసి "దుష్టుడా! నా ఆజ్ఞమీరి బుద్ధి లేకుండా నాకే ఎదురు నిలబడ గల ననుకున్నావా?" అంటూనే సుగ్రీవునితో కలియబడ్డాడు. తోకలు పెంచి నేలకు కొట్టారు. అరుచుకున్నారు. గోళ్లతో రక్కుకున్నారు. కండలు తెగి రక్తం చిమ్మింది. సహజంగానే ఎఱ్ఱగావున్న ముఖాలు రక్తసిక్తమై తంగేడు పూవుల్లా అయ్యాయి. వీరిద్దరి వదనాలు పగిలిన దానిమ్మపండ్లలా వున్నాయి. ఒకరినొకరు త్రోసుకుంటున్నారు. ఒకళ్ల పైకి ఒకళ్లు దూకుతున్నారు. ఎగురుతున్నారు. పెడబొబ్బలు పెడుతున్నారు. చూడ్డానికి రెండు కొండలులాగా, రెండు పెను మేఘాల్లాగా, రెండు అడవి పందుల్లా, రెండు సింహాలలాగా, రెండు గొఱ్ఱెపొటేళ్లలాగా కొట్టుకుంటున్నారు. రెండు నదుల్లాగా, రెండు సాగ రాల్లాగా కుస్తీతో కలసిపోతున్నారు. యుద్ధంలో ఇద్దరు వ్యక్తులు ఒకటై పోతున్నారు. వడ్లు దంపినట్లుగా ముష్టిఘాతాలు వినబడుతున్నాయి. యుద్ధ భూమి అంతా గొడ్లు తొక్కినట్లయిపోతోంది. గ్రుడ్లు బయటకు వచ్చేట్లుగా గ్రుద్దుకుంటున్నారు. ఇద్దరికీ వళ్లు తెలీటం లేదు. వాలి ముందు చాలాసేపు నిలబడగలిగినా ముందుగా సుగ్రీవుడు అలసిపోయాడు. ఇంతసేపూ 'రామ బాణం వస్తుంది, వస్తుంది' అనే ఆశతో వళ్లు దాచుకోకుండా యుద్ధం చేశాడు అలసిపోయినా ఏ క్షణమైనా రావచ్చు రామబాణం అని డీలాపడి గూడా మూలుగుతూ యుద్ధం చేస్తున్నాడు.

వాలి పేట్రేగిపోయాడు. ఒక అదుపు లేకుండా వాలి సుగ్రీవుణ్ణి ఫెడీ ఫెడీ గ్రుద్దుతూ, వాలంతో కొడుతూ, గోళ్లతో రక్కుతున్నాడు సుగ్రీవుడి కొన ఊపిరి కూడాపోయేటట్టుంది అవతల రామచంద్రుడు యుద్ధం చూస్తూ బాణం వేద్దామనుకుంటున్నాడు. కాని, ఎవరు వాలో, ఎవరు సుగ్రీవుడో నిర్ణ యించుకోలేక పోయాడు. అన్నగార్ని తమ్ముడు గాను. తమ్ముణ్ణి అన్నగారి గానూ పొరబడుతున్నాడు ఇద్దరి కనుముక్కు తీరు అలావుంది. ఋక్షరజ సుణ్ణి తనలో మూర్తీభవింప జేసుకున్న ఆ వాలి సుగ్రీవుల తల్లిని మనస్సు లోనే అభినందించుకున్నాడు. అవతల సుగ్రీవునికి వాలి విజృంభణకు ఆగలేక ప్రాణాలమీద మమకారం పెరిగింది. వెనక్కితిరగబోయాడు. వాలి నవ్వుతూ కవ్విస్తూ ముందుకొస్తున్నట్లు అదిలిస్తున్నాడు. వాలికి చెలలాటగా, సుగ్రీవుడికి ప్రాణ సంకటంగా వుంది. ఇంక లాభం లేదని సుగ్రీవుడు వెనక్కు తిరిగి పరుగెత్తి యుద్ధంలోంచి మెల్లగా జారుకున్నాడు. వాలి ఈసడింపుగా, వెకి లిగా ఒక నవ్వు నవ్వి సుగ్రీవుణ్ణి ప్రాణాలతో వదిలాడు.

ఋష్యమూక పర్వతం మీద సుగ్రీవుడు మిగిలిన వారిని కలిశాడు. రామచంద్రుని చూచి- "ఏమయ్యా రామచంద్రా! నీ బాణం యొక్క పటిమ, వేగం నాకు తెలియనివి కాదు గదా! నువ్వు నన్ను రక్షించవనుకోవడానికి వీల్లేకుండా అగ్నిసాక్షిగా సఖ్యం చేసావు గదా ! ఈ క్షణం వస్తుంది, ఈ క్షణం వస్తుంది అనుకుంటూ లెక్కలు కట్టుకుంటూ డొక్కలో తగిలే గుద్దుల్ని లక్ష్యపెట్టకుండా కొన ఊపిరితో నేను యుద్ధం చేస్తుంటే, మా అన్నగారే చివరకు నా మీద జాలితో నన్ను చంపకుండా ప్రాణాలతో వదిలాడే - నిజంగా మా అన్నయ్య కామాత్రం జాలి కలగకుండా పోతే నల్లిని బొటన వ్రేలితో నేలమీద రాచినట్లు నన్ను అణగద్రొక్కితే నాకు దిక్కేమిటి ఇంక" అన్నాడు. అపుడు రాముడు-

"అనవసరంగా నన్ను అపార్థం చేసుకోకు. మీ ఇద్దరూ విచిత్రమైన

చంక్రమణాలలో అనుక్షణం అటూ ఇటూ తిరుగుతూ, తారుమారగుతూ, క్రింద మీద పడుతూ పోరాడుతుంటే ఎప్పటికపుడు బాణం వేద్దామను కుంటూనే ఉన్నాను. కాని మీ ఇద్దర్లో ఎవరు వాలో, ఎవరు నువ్వో నిర్ధారణ చేసుకోలేక పోయాను, మెఱుపుల్లా మారిపోతున్నారు. ఎలా నిర్ణయించుకోను, నిశ్చయించుకోను! మీ ఇద్దరూ కవలలు గూడా కాకపోయినా మీ తల్లి తన దివ్యాంతరంగంలో పతియైన ఋక్ష రజసుని మూర్తిని ఎంతగా ముద్రించు కున్నదో మిమ్మల్నిద్దర్ని చూస్తే తెలుస్తుంది. ఆవిడ పాతివ్రత్యానికి చేతులెత్తి నమస్కరిస్తున్నాను. మీ తండ్రి పరమ పవిత్ర శుద్ధి; మీ తల్లి నిర్మల చిత్త శుద్ధి పెనవేసుకొని మీ ఇరువురికి ఈ దేహాల నిచ్చాయి. ఆ రెంటికీ తేడాను గుర్తుపట్టగలగడం నా వశం కాలేదు" అన్నాడు. శ్రీరాముని మాటలకు సుగ్రీవుడు లో లోపలే సంతోష పడ్డాడు. తల్లిదండ్రుల పవిత్రతను రాఘవుడు అలా కొనియాడడం సుగ్రీవునికి ఎంతో నచ్చింది. వాలి దెబ్బల వల్ల దేహానికి బాధ కలిగినా రాముని మాటలతో ఆత్మకు ఆనందం కలిగింది. అప్పుడు శ్రీరాముడు లక్ష్మణుణ్ణి చూసి—

"తమ్ముడూ లక్ష్మణా ! ఈ అడవి అంతా కళ్లు విచ్చుకున్నట్లు విరగ బూసినట్లున్న గజపుష్పాలతో మాలకట్టి ఈ సుగ్రీవుని మెడలో వెయ్యి" అన్నాడు. లక్ష్మణుడు వెంటనే వెళ్లి ఆ పూలను కోసి. మాలగా కట్టి సుగ్రీవుని మెడలో వేశాడు. సుగ్రీవుడికామాల బాగా నచ్చింది. దాన్ని చూసుకుని మురిసి పోయాడు. మరునాడు రావలసిన కపిధాత్రీ పతిత్వ లక్షణం సుగ్రీవునికి ఇవాళే వచ్చినట్లు అనిపిస్తోంది.

రామలక్ష్మణసుగ్రీవాదులు వనంలోంచి నడుస్తున్నారు. వనం శోభాయమానంగా ఉంది. ఇంతకు పూర్వం వాలిని వధించడానికి వెళ్లిన త్రోవేనా ఇది అన్నట్లుంది. అమరాంగనల అందెలరవాలు, కమనీయమైన

కంఠస్వరాలు, మలయ మారుత మధుర స్పర్శలు, శకుంత సంతాన పిక కూజితాలు, తరులతా పుష్పాదుల ఆనందడోలికలు, సెలయేళ్ల సవ్వడులతో మానోహరంగా ఉన్న వన వైభవాన్ని తిలకిస్తూ నడుస్తున్నారు. ఆనందం పట్టలేక రాముడు -

"ఓ సుగ్రీవా ! ఈ వనాన్ని చూచిన జీవనం సరితార్ధం. మనస్సు ద్రవీభవిస్తోంది. మళ్లీ ఈ దారిన వస్తామో రామో ఇక్కడి విశేషమేమిటో చెప్పు" అన్నాడు. అప్పుడు సుగ్రీవుడు –

"స్వామీ ! ఈ వనంలో ఎప్పుడూ సప్త ఋషుల, మతంగ ముని వర్యుల మాహిమ వలన నిత్య వసంతమే ! నిజానికి ఇప్పుడు గ్రీష్మఋతువే ! అయినప్పటికి ఈ పంపా సరస్సు నుండి కిష్కింధాంతము వరకు మాత్రము వసంత ఋతువే ! ఇక్కడ ఎందరెందరో మునిసత్తములు కొన్ని వందల సంవత్సరాలు తపస్సుచేసి స్వర్గపదవిని పొందారు. వాళ్లు ఈ వనాన్ని వదలి వెళ్లిపోయినా వాళ్లు తపస్సు చేసిన ఈ వన ప్రదేశం మాత్రం ఈ విధంగా విచిత్ర భోగ మహితమై, మనోహరమై ఒప్పుతోంది. ఈ మతంగ ముని ఆశ్రమానికి చేతులెత్తి నమస్కరించినవారి ఎల్ల కోర్కెలు తీరుతాయి. నిండు భక్తితో మనం గూడా నమస్కరిద్దామా" అన్నాడు. అప్పుడు రాముడు "మరి మొన్న ఈ మార్గం వెంబడే వెళ్లామా ? అనంగానే సుగ్రీవుడు "అవును" అన్నాడు అప్పుడు రాముడు – "ఆత్రుతతో పోతూ ఈ సంగతిని గమనించలేదు. ఇపుడు గమనించడం జరిగింది. అందుకే నీవు ఇప్పుడు కపిక్షోణీపతివి'' అన్నాడు. అలా అంటూ రాముడు మతంగ మున్యాశ్రమ ప్రాంతానికి తలవంచి నమస్కరించాడు. అప్పుడు ముని యజ్ఞవేదికలోంచి సన్నని ధూమరేఖ పైకి ఎగసింది. రాజీవ నేత్రాలలో శాంతాద్భుత రసాలు నిండగా రాముడు ఆ ధూమరేఖను విలోకించాడు.

# రెండోసారి యుద్ధ ప్రయత్నం

కనుచూపుమేరలోనే పర్వత గుహ ద్వారంతో విరాజిల్లే కిష్కింధా పురాన్ని చూసి, రామలక్ష్మణులు నడుముకు ఉత్తరీయాలు బిగించారు. కోదండహస్తులై యుద్ధ సన్నద్ధులయారు. సుగ్రీవుడు పెద్దపెట్టున సింహనాదం చేశాడు.

తమ తమ పనులలో ఉన్న కపులు సూర్యపుత్రుడైన సుగ్రీవుని సింహ గర్జనకు ఒక్కసారి ఉలిక్కిపడి—పైకి, వెనక్కు చెవులు నిక్కించి చూశారు. కొందరు వెంటనే ఇంద్రసుతుడైన వాలితో ఈ సంగతి చెప్పడానికి వెళ్లారు. సూర్యకులస్థుల్ని చూచిన కొందరు మెల్లగా అక్కడ నుండి జారుకున్నారు. అప్పుడు సుగ్రీవుడు –

ఓ రామచంద్రా ! రఘువంశార్ణవ పూర్ణచంద్రా ! ఇంద్రసుత సంరక్షితము, వానర సేనా పరిరక్షితము, నిఖిలాసుర దుర్జయము అయిన కిష్కింధాపురం వచ్చాము ఇక్కడకు నన్ను నువ్వే తెచ్చావు. నీవే నాకిక రక్ష" అన్నాడు. (తన శక్తి సామర్థ్యాల మీదనే ఉండకూడనంత విశ్వాసంతో విఱ్ఱవీగి, కయ్యానికి కాలు త్రవ్వేవాడు మూర్ఖుడు. తనని తన శక్తి సామర్థ్యాలను తనని నడిపించేవాని పద పద్మాల ముందుంచాడు సుగ్రీవుడు.) పూర్తిగా శరణాగతువై కూడా సుగ్రీవుడు మళ్లీ –

"ఓ రామచంద్రా ! ఈ సారిగూడా నన్ను గుర్తుపట్టకపోతే నీ సుగ్రీవునికి నీ చేత్తోనే నీళ్ల వదులుకోవలసి వస్తుంది సుమా ! కంఠమందున్న ఈ గజపుష్పిని జాగ్రత్తగా కాపాడుకుంటాను. వాలి ఈ మాలను త్రుంచితే నేను వాలిలా కనబడతానేమో తప్ప ఈ మాల మెడలో ఉన్నంత వరకు

"ఎవరు ఎవరో నీ కనుమానం రానక్కర్లేదు. ఇకపై నా అదృష్టం. నేను నా భావి జీవితం మీద ఆశ పెట్టుకోవచ్చునో అక్కర్లేదో నా చేతిలో నీ చెయ్యి వేసి ఆ వాలి వచ్చేలోపల చెప్తేగాని నేను ఇక్కడ నుండి కదలను. నువ్వు ఏమీ చెప్పకపోతే ముని చెప్పిన శాపం వాలికి, ఋష్యమూక పర్వతం నాకు ఉండనే ఉన్నాయి" అన్నాడు. అప్పుడు రాముడు చిరుదరహాసంతో —

"నమ్మకమనేది ఎంత స్వచ్ఛమైనదైనా వక్రమైన సన్నివేశం వలన అది వంచింపబడుతుంది గదా! మొన్న వాలిని చంపకపోవడం గూడా ఒక విధంగా మంచిదే! ఈసారి తారచేత వాలి వారింపబడవచ్చు. లేదా కాస్త తనకు తానే సునిశితంగా ఆలోచించుకొని పోరు మానవచ్చు. పగను మరచి సోదర భావంతో తమ్ముడివైన నిన్ను యువరాజుగా చేసినా చేయ్యవచ్చు. మనకు పగ ప్రధానం కాదుకదా! నిన్ను యువరాజును చేసి తాను వానర రాజ్యం ఏలితే మటుకు మనకు నష్టం ఎమిటి? అల్లా కాకుండా నీమీద పగ బట్టి వానరసేనతో నీకెదురు తిరిగితే ఆ సేన లక్ష్మణుడి చేతిలోనూ, వాలినా చేతిలోనూ హతులౌతారు. నీకు రాజ్యం వస్తుంది. మోహగ్రస్తులయిన వారు చేసేపనిలో పూర్వాపరాలు సరిగ్గా ఆలోచించి చెయ్యరు. ఆ వాలిని చూస్తే నాకు అలా అనిపిస్తోంది. సరే! కానీ అల్లాంటి విపత్కర పరిస్థితి వస్తే నా కోదండంతో వాలిని వధిస్తాను. ఇందులో నీకేమాత్రం సందేహం అక్కర్లేదు. నువ్వేమన్నా ఎంతచెడ్డా అన్నగారు గదా అని ఒకవేళ మెత్తబడి వాలిని రక్షించమని నన్ను అడిగితే తప్ప ఇంకోలాగా జరుగదు. జరిగితే ఇదుగో ఈ శరం గుచ్చిన నేల ఇకనీదే అని శపథం చేస్తున్నాను" అన్నాడు. రాముడలా అనంగానే సుగ్రీవుడు మళ్లీ వేరే ఆలోచన లేకుండా పర్వతాలు బ్రద్దలయ్యేట్లు సింహనాదం చేసి కిష్కింధాపుర ద్వారం దగ్గర కెళ్లి వాలిని రణానికి ఆహ్వానించాడు. శ్రీరామాదులు దూరంగా వృక్షాల వెనుక నిరీక్షిస్తున్నారు.

# తార ఉపదేశం

వాలి సుగ్రీవుని రావం విని విసుగుతో మండిపడ్డాడు ఈ సిగ్గుమాలిన వాణ్ణి వధించి పడేస్తేగాని ఈ విసుగు తెగదనుకుంటూ. నడుముకు గుడ్డబిగించి పోరుకు సన్నద్ధుడయాడు. క్రుద్ధుడయిన వాలిని తార చూసింది. భయపడుతూనే–

"నిన్నగాక మొన్న నడుం విరిగినవాడు తగుదునమ్మా అని సిగ్గులేక ఇవాళ మళ్లీ వచ్చి నిలబడ గలగడం నవ్వుగా వున్నా- ఏదో అనుమానాన్ని కలిగిస్తోంది'' అన్నది. తార అలా అనంగానే వాలి-

''ముగ్ధలకు యుద్ధం సంగతి తెలీదు. క్రుద్ధులకు ఓడినకొద్దీ పగ, పట్టుదల పెరుగుతుంది'' అనంగానే తార "ఇదివరకు ఎప్పుడూ ఇంత నిర్భయంగా సుగ్రీవుడు నీకు ఎదురు నిలబడలేదు. నీ గురించి నీ బాహుబల పరాక్రమం గురించి తెలియనివాడు గూడాకాదు. నీ ముందు తానేమాత్రం తగడని గూడా తెలుసు. అయినా ఇవాళ ఇలా ఎదురు నిలబడి తానే ముందు కవ్విస్తున్నాడు. మొన్నలేదు ఇంత తెగింపు, చేవ. నిన్న ఇవాళలో అవి ఎక్కణ్ణుంచి వస్తాయిలే' అనే అనుమానం రావచ్చు. ఈ తెగింపు. చేవ, వెనక అండ-మొన్న వచ్చినపుడే ఉన్నాయి. అంగదునితో 'నీలుడు, నలుడు, తారుడు అన్నమాటలు నీకు తెలియనివి కాదుగదా !

ఆ శ్రీరాముని పేరు వింటుంటేనే హృదయాంతరంలో విచిత్రమైన ఆకర్షణ దీప్తిస్తుంది. భార్గవునికి భూమిపై నిలువ నీడ లేకుండా చేసిన అతని శౌర్యము, శివభక్తి, పెద్దలయెడ వినయ గుణ సంపత్తి, స్వభావాలను ఊహించడానికి గూడా మనస్సు చాలటం లేదు. అతనితోడి మైత్రి ఎంత అదృష్టం చేసుకుంటే వస్తుంది? ఆ అదృష్టం సుగ్రీవునికి దక్కింది. అందుకే

నేమో కేరింతలు కొడుతున్నట్లు ఇవాళ నిన్ను కవ్విస్తున్నాడు. అటువైపు రాముని శౌర్యం తోడు ఉండడం మాట అటుంచు. ఆ రాముడు ఇక్ష్వాకుల బిడ్డ. ఆ ఇక్ష్వాకులేశలు - ఆ సముద్రక్షితీశలు, రసాతల సర్వాదిశాభిరక్షులు, సూర్య తేజస్సులు. అందుచేతనే లోకబాంధవులు, ధర్మసింధువులు. ఈ రాముడు ఆ సూర్య కులానికే సూర్యుడు. స్మృతులు శ్రుతుల్ని అనుస రించునట్లు ఈ ధర్మ ప్రభువు పితృ వాక్యానుసారి. అటువంటివారు సత్య ధర్మ సంస్థాపనలో దేన్నీ లెక్కచెయ్యరు. ఎక్కడైనా ధర్మం పాతుకు పోయి అధర్మం గూడుకట్టుకుంటే పెళ్లగించి ధర్మాన్ని ఉద్ధరిస్తారు. అందుకు సమస్త ధరణీతల రాజ్యాన్ని వదిలివేయవలసి వచ్చినా వెను దీయరు. ఆ రాముడు ముందుగా నీ దగ్గఱకే వచ్చి ఎందుకు సఖ్యం చేసుకోలేదు ? ఆ సుగ్రీవునికే ఆ సఖ్యం ఎలా లభించింది ? ఆ సుగ్రీవుడు నీకన్నా శూరుడు, బలవంతుడు అని ఎవరనగలరు ? ఇవన్నీ ఆలోచిస్తూంటే నా కనిపిస్తుంది – 'కర్మ ఇలా రాసిపెట్టి ఉంటుందని ముందే ఎవరూ చెప్ప లేరు గదా !' అని.

"కొంచెం ఓర్పు వహించి ఆ సుగ్రీవుడు చెప్పింది పూర్తిగా విషయం జరిగితే నీకూ వానిమీద అభిమానం కలిగేదే ! కాని, అలా చెయ్యకుండా ముందే అతను దోషి అనే అభిప్రాయాన్ని మనస్సులో ఏర్పరచుకొన్నావు. అంతే ! ఇంక అసలైన నిజం ఏం తెలుస్తుంది ? ఒక విధంగా ఆలోచిస్తే ఆ సుగ్రీవునికి మంత్రబలం, తక్కువ అంచనా వేయడానికి వీలులేని బాహు బలం ఉన్నాయి. మహా మతిమంతుడైన హనుమంతుడున్నాడు. వీటన్నిటికీ పైన ఆ రామునితో మైత్రి - అన్నీ అలా కలిసి వచ్చాయి. అవతల బలాన్ని తేలిగ్గా కొట్టిపారెయ్యడానికి వీలులేదు. సోదర వాత్సల్యాన్ని దృష్టిలో పెట్టు కొని నీ తమ్ముడికి యువరాజ పదవి ఇచ్చి హాయిగా వెనుక చూపు అవసరం లేకుండా ఈ కిష్కింధను పరిపాలించుకో. ఆ రాముని రాకను ఎరగనట్లు

గానే ఉండు. నీ సంగతి అతని కక్కర్లేదు. అతని సంగతి నీ కక్కర్లేదు. సీత విషయమై ఈ అడవుల్లో తిరుగుతూ తనేం చేసుకుంటాడో చేసుకోనీ."

"నువ్వు పర్వత సమానమైన దేహబలం కలవాడివే! మరొక పర్వతాన్ని నీపై విసిరినా కదలవు. చెక్కు చెదరవు ఆ విషయం కాదనను. కాని సప్త తాళ దళభేదనం చేసిన ఆ రాముని బాణం నీ గుండెవైపు వస్తుందంటే ఇప్పుడే నాకు గుండె గుభేల్ మంటుంది. నువ్వు ఏ యుద్ధానికి వెళ్తున్నావన్నా నేను భయపడను. వంద సుగ్రీవులు నీ పైకి వచ్చినా నేను త్రొట్రుపాటు పడను. కాని, శ్రీరాముడక్కడే ఉండి చెట్టు చాటుగా బాణం వేయడమే జరిగితే - నిన్ను దక్కించుకో గలననే నమ్మకం ఎందుకో కలగడం లేదు. ఏ దైవం వచ్చి సాయపడాలని కోరుకుంటానో ఆ దైవమే ఎదురుగా కోదండోగ్రుడై ఉంటే ముందు నిలబడ్డం నీకు సాధ్యమౌతుందా?". నేను నిశ్చయంగా చెప్పగలను అవతల పిల్చేది సుగ్రీవుడే! అది యుద్ధానికై కవ్వింపే! అతని వెనుక అండగా ఉన్నది ఆ రాముడే! కాబట్టి చిట్టచివరకు చెయ్యవలసినవి రెండే కనబడుతున్నాయి. సుగ్రీవుణ్ణి యువరాజును చేసి క్షత్రత్వానికి మంగళం పాడడమో, లేదా వీరమార్గంలో శౌర్యంతో నిలబడి ఆ రాముణ్ణి ఎదుర్కొనడమో. కాని, ఈ రెండో దాంట్లో ఒక చిక్కు ఉంది. నీకూ రామునికీ ప్రత్యక్ష వైరం లేదు. అందుకని ఎదురుగా నిలబడి నీతో పోరడు. నువ్వూ అంతే గదా! మరి అలాంటప్పుడు ఏ చెట్టుచాటు నుండో నిన్ను వధించడానికి ప్రయత్నిస్తాడు. అదే మీ ఇద్దరి పోరుకు కారణమౌతుంది అయినా ఒకసారి నే చెప్పిన విషయం సుగ్రీవునితో అని చూడు. విషయం తెలిసిన రాముడేమంటాడో" చూద్దాం అన్నది. తార మాటలు విన్న వాలి తేలిగ్గా నవ్వుతూ —

"విషయాన్ని ఇంతగా విశ్లేషించి చెప్పగల సూక్ష్మబుద్ధి ఇంకెవ్వరికీ

ఉండక పోవచ్చు కాని, ఇందులో అతిసూక్ష్మమైన విషయం ఇంకోటిఉంది విను –

## వాలి నిర్ణయం

'నేను ఆ రాముణ్ణి ఎదిరిస్తానో, ఎదిరించలేనో ఆవిషయం కాదు ముందు, నేను మల్లయుద్ధం చేసేవాణ్ణి. రాముడు ధనుర్యుద్ధం చేసేవాడు. ఈ రెంటికీ పొత్తులేదు. పోనీ, నేనూ ధనుస్సు పట్టుకుంటే అతనెక్కడ నేనెక్కడ? పోనీ నాకోసం రాముడు మల్లయుద్ధం చేస్తాడనుకోనా?. ఎవ్వరూ తమస్వభావ సిద్ధమైన పద్ధతిని మార్చుకోవడానికి ప్రయత్నించరు. అతడు అఖిలాస్త్రవేది. అతడే కనక కోదండం ఎక్కుపెడితే ఇంద్ర బ్రహ్మాదులు గూడా ఆగలేరు. అతనికెదురు నేను కోదండం పట్టుకుని వెళ్లడమనేది లేదు. అతడు మల్లవీరునిగా నా మీదకు రాడు. ఇది కయ్యానికి సరిపడే పద్ధతే కాదు. నాకు అస్త్రం వల్ల చావుండదనే వరం లేదు. అతని శరవేగానికి అడ్డూ, అదుపూ లేదు. దుందుభి, మాయావి మొదలయిన రాక్షసుల విషయం వేరు. వారు మల్లవీరులు. అయినా ఎంతసేపు వారితో యుద్ధం చేసినా నాకు శక్తి తగ్గలేదు, తగ్గదు కూడా! ఇది నాకు గొప్ప విషయమే కావచ్చు. కాని రామునికూడా యుద్ధం ఎంతసేపు చేసినా శక్తి తగ్గేగుణం లేదు. మరి నాకింక రామునికంటె అధిక్యత ఉందని ఎలా చెప్పగలను ? సప్తతాళ దళ విదళనంలో గాని, దుందుభిని విసిరిన విషయంలో గాని నాకంటే అతనిదే పైచేయి. కాని నాకు మల్లయుద్ధం క్రీడలాంటిది. నిత్యమూ దానియందు అభ్యాసం ఉన్నవాణ్ణి, పైకెగిరి దూకగలను. చేతులతో పట్టుకోవడమే కాదు. తోకతో గూడా పట్టి బిగించగలను. గోళ్లతో చీల్చి చెండాడ గలను. ఒకవేళ ఇద్దరి మధ్య మల్లయుద్ధమే జరిగితే నాకు ఇవ్వన్నీ అధిక్యతలే గదా! సమమైన యుద్ధం జరిగితే

ఓడిపోవడమో గెలవడమో జరుగవచ్చు. ఏది జరిగినా నాకు దుఃఖం లేదు. అమరేంద్రుని కొడుకునయిన నేను చివరకు బాణం తగిలి మృగంలాగా చావడం కష్టమనిపిస్తోంది."

"ఇంతకీ ఈ అకాల సమరాన్ని తెచ్చిపెట్టిన ఆ సుగ్రీవుణ్ణి చంపాలి ముందు. లేకపోతే నేను ఒకప్రక్క గుహలో ఉంటే గుహద్వారానికి బండ రాళ్లను అడ్డంపెట్టి నేను పోయానని, గుండెలు బాదుకుని ఏడ్చాడట! అదంతా నామీద ప్రేమే అనుకోవాలిగావును మృగాలకు, మనుష్యులకు భేదమల్లా బుద్ధిబలమే గదా! అలాంటి బుద్ధి బలం మనలో ఉన్నా, మనపట్ల మృగ ధర్మాన్ని వర్తింప చేయటం రామునికి మేలు చేకూరుస్తుందా! 'నిన్నొకడు పోరుకురమ్మన్నాడనుకో! అప్పుడు నువ్వు నీ వెనుక ఉన్నవాణ్ణి ముందుకు రమ్మను' అంటే అప్పుడు వాడు 'ముందునాతో గెలిచి బ్రతుకు చూద్దాం' అనడూ! అలాగే ఇప్పుడు గూడా నా గొంతులో ప్రాణమున్నంత వరకు ఈ సుగ్రీవుని చేత అంతమాట అనిపించుకుంటానా? అది నాకు తల తీసేసినట్లే! రాముని విషయమంటావా అది ముందే చెప్పాను గదా!"

"ఇకపోతే సుగ్రీవుణ్ణి తమ్ముడూ! మనలో మనకు విరోధం దేనికి? రా అని పిలిచి యువరాజును చేస్తానంటే ఇంత దూరం వచ్చిన తరువాత అతడే మంటాడో తెలుసా–"ఓహెూహెూ! ఎన్నాళ్లకెన్నాళ్లకి మా అన్నగార్కి నాపై సోదరప్రేమ ఒక్కసారిగా పుట్టుకొచ్చింది? ఈ ప్రేమను నేను తట్టుకోలేను" అంటూ వ్యంగ్యంగా పల్కడూ! అని ఊరుకున్నా ఫర్వాలేదు. "సరేలే ఆపు నీ నక్కవినయాలు. నన్ను యువరాజును చేస్తావా? ముందు నువ్వో నేనో తేల్చుకుందాం అటుపైన యువరాజునా, రాజునా అనే విషయం' అంటాడు– లేని ధైర్యం, అప్పుతెచ్చుకున్న శౌర్యంతో. వాడిసంగతి నీకూ తెలుసు, నాకూ తెలుసు. ఎందుకొచ్చిన సాధుప్రసంగాలు. మా మధ్యన ఈ జన్మకింతే. ఇంక

మనస్సులో బాధపడి ప్రయోజన మేమిటి? కాబట్టి నేను యుద్ధానికి వెళ్లడమే ఇంక మిగిలింది. అయితే పోయేముందు నాకు ఒక్కటే ఆశ. తనకు తానుగా ఆ రాముడు ఎటువంటి అన్యాయం అధర్మం చేయడని నాకు గట్టి నమ్మకం. మరి వాళ్ల స్నేహం ఏం చేయిస్తుందో ఊహించలేననుకో. ఎందుకొచ్చిన ఆలోచనలు. నేను వెళ్లడానికే నిశ్చయించు కున్నాను" అన్నాడు. వాలి మాటలకు తారకుప్పలాగా కూలిపోయింది. వాలి తారను పైకెత్తి కౌగలించు కొని ఓదార్చి—

"నేను నా శౌర్యానికి తగ్గట్టు యుద్ధానికి వెళ్లి, నా వీరత్వాన్ని ప్రకటించుకొని, ఈ జన్మ చరితార్థం చేసుకోడానికి వెళ్తున్న సమయంలో నువ్వు చింతిస్తున్నావా? కన్నీటిబొట్టు ఒక్కటి గూడా రాకూడదు. నా మీద ఒట్టే! ఇలా చేయడం నీ వీరపత్నీ వైభవానికే అయోగ్యమైన పని" అన్నాడు. వాలి అలా అనంగానే తార వాలికి మంత్రపూతంగా మంగళహారతి పట్టి, వీర గంధం పూసి, నుదుట వీరతిలకం దిద్ది, ప్రదక్షిణ చేసి, నమస్కరించి, బిల ద్వారం దాకా తోడువెళ్లి, అటుపైన దుఃఖంతో వెనుదిరిగి అంతఃపురానికి వెళ్లిపోయింది.

## వాలి వధ

"సుగ్రీవుడు అంతగట్టిగా అరిచినా వాలి ఎంతసేపటికీ రావడం లేదే మిటా?" అని రామలక్ష్మణులు ఎదురు చూస్తున్న సమయంలో వాలి వచ్చాడు. నడుముకున్న ఉత్తరీయం బిగించాడు. నిశ్చలంగా, గంభీరంగా అడుగులు ముందుకు వేస్తూ సుగ్రీవుని చూచి ఒక్కసారి వాని మీదకు ఉరికి—

"నిన్ను యమలోకానికి పంపడానికి ఈ ఒక్క ముష్టిఘాతం చాలురా దురాచారా! నా సోదరుడి వైవుండి గూడా నా గుండెలోనే మంట పెట్టావు

గదరా దురాత్మా! అంటున్న వాలి కళ్లలోనే కనబడింది వాలి కోపం అంతా. వాలి ముష్టిఘాతానికి సుగ్రీవుని ప్రాణం యమపురం పొలిమేరలకు వెళ్లి ఉంటుందేమో అని రాముని హృదయం తల్లడిల్లి పోయింది. సుగ్రీవుడు గిల గిల లాడి పోయాడు. అయినా ఎలాగో తమాయించుకొని, మీద మీదకు వస్తున్న వాలిని ఎలాగో తప్పించుకొని, బలం అంతా కూడకట్టుకొని, ఒక పెద్ద వృక్షాన్ని పెకలించి వాలిపై మోదాడు. వాలి తూలిపోతూ ఎలాగో అలా నిలద్రొక్కు కున్నాడు. ఇద్దరూ విజృంభించారు. ఆకాశంలోకి ఎగిరెగిరి కొట్టు కుంటున్నారు. గోళ్లతో చీరుకొంటున్నారు. తోకలతో ఒకళ్లనొకళ్లు బంధించు కుంటున్నారు. విడిపోతున్నారు. పిడిగ్రుద్దులు గ్రుద్దుకుంటున్నారు. ఫెళఫెళ మని ఉరుముల్లా గర్జిస్తున్నారు. బొమ్మల మీద ఫెడీఫెడీ మని గ్రుద్దుకుం టున్నారు. బాహువులు చరుస్తున్నారు. తోకలు పెంచి నేలకు కొడుతున్నారు. క్రింద లేచిన దుమ్ము ఆకాశానికి అంటుతోంది రెండు పొట్టేళ్ల లాగా, రెండు పర్వతాల్లాగా కొట్టుకుంటున్నారు. తొడలు 'విరిగాయా'? అన్నట్లుంది. 'తలలు ఊడాయా'? అన్నట్లుంది. దేహాల నిండా రక్తం కారుతోంది. వాలి ముఖంలో క్రౌర్యం, వీర్యం, శౌర్యం సడల లేదు. సుగ్రీవుని ముఖంలో ఆశ చావలేదు. బింకం పోలేదు.

శ్రీరాముడు దూరంగా ఉండే- సుగ్రీవుణ్ణి చూశాడు. వాలి ముష్టిఘాతా ల్ని తప్పించుకోలేక పోతున్న సుగ్రీవుని అవస్థకు జాలి కలిగింది. అంతే! మరుక్షణంలో భూమ్యాకాశాలు బ్రద్దలయినట్లు కర్ణకఠోరమైన ఒక మహారావం వినబడింది. దానికి ఋభులోకాలు తల్లడిల్లాయి. కర్ణకుహరాలు బ్రద్దలై దిగ్గ జాలు మొగ్గతిలబడ్డాయి. అది రాఘవుని ప్రౌఢమౌర్వీధ్వని. బాణం మీదకు వస్తున్న సంగతే వాలికి తెలీదు. రానే వచ్చింది. తిన్నగా వక్షంలోకి చొచ్చు కొని పోయింది. గుండెల్లో పిడుగు దూసుకున్నట్లుంది. పెద్ద పిడుగు వల్ల హేమాద్రి వ్రయ్యలై గైరికాది ధాతువులు విచ్చుకున్నట్లుంది వాలిని

చూస్తుంటే ఐరావత దంతం ఊడి నేలమీద పడినట్లున్నాడు. వర్షాకాల సాంధ్య సమయంలో ఇంద్రధనుస్సు చేత దీపించే అరుణ వర్ణ పయోధరం లాగా ఇంద్రుడిచ్చిన ముక్తామణిహారం వాలి వక్షంమీద దీపిస్తోంది. ఒకప్పుడు వాలి పాదధూళిని ఆ నేల తలదాల్చింది. ఇప్పుడా నేల మట్టినే వాలి తలదాల్చ వలసి వచ్చింది. తలేకాదు. వళ్లంతా అదే ! అంతటి దుస్థితిలో ఉన్నా-వాలి కళ్ళలో రాచఠీవి పోలేదు. ముఖంలో దైన్యం లేదు. దేహకాంతి చెడలేదు. చూడ్డానికి వాలి- దేవలోక కల్పవృక్షశాఖ ఒకటి దారుణఝంఝూ మారుతానికి అదిరి ఈ భూమ్మీద పడ్డట్టున్నాడు. పరమేశ్వర నిర్మాల్యం లోని సంతాల వృక్ష రమ్య పుష్పాలను ఈ ధరణీతలం పైకి త్రోసినట్లు వాలి పడిఉన్నాడు.

## వాలి ధర్మ సందేహాలు

నేల మీద పడివున్న వాలి దగ్గరకు లక్ష్మణ సమేతుడై శ్రీరాముడు వచ్చాడు. శ్రీరాముని కళ్లల్లోకి కళ్లు పెట్టి పైకి, క్రిందకు ఒక్కసారి చూసి, ఒక్కసారి ముఖం త్రిప్పేసుకుని, నిట్టూర్పు విడిచి -

"ఆహా ఎల్లాంటి సౌమ్యమూర్తి ! ఏమి దేహచ్ఛాయ ! ఎంత అందం ! ఏమి తేజస్సు ! కమల నయనాలు కమనీయంగా, రమణీయంగా ఉన్న నీ రూపం అపురూపం. అచింత్యమైన దివ్యత్వంతో దీపించే నువ్వేమిటి ? ఇల్లాంటి అసహ్యామైన కార్య మేమిటి రామా ? నేను నీ గురించి విన్నదేమిటి ? నీచమైన ఈ పనేమిటి ? అనార్యులు చేసే నింద్యమైన ఈ పని ఎంత మలినమైనదో ఆలోచించావా ? నా కున్న అభిప్రాయాన్ని ఒక్కసారి వమ్ము చేసావు. ధర్మమూర్తులే ఇలాంటి అయోగ్యమైన అధర్మ కృత్యం చేస్తే ఇంక సృష్టిలో ధర్మ దేవతకు దిక్కేది ? అంతకీ తార

నన్ను పోరుకు పోవద్దని చెప్పనే చెప్పింది. కాని, ఆమె మాటలు వినకుండా నీవు ధర్మ ప్రభువి అని, సుందర శీల వంతుడవనే ధైర్యంతో వచ్చాను. పరమోత్తముడివైన నీవు నేడిలా చేసావు. వానర రాజ్యం మీద లోభంతో సుగ్రీవుడే నీ చేత ఈ పాపకార్యం చేయించాడు. అనవసరంగా ఎంత పని చేసావయ్యా ! ఆ దుర్మార్గుడు లోభంతో ఆచంద్రతారార్కం నీ స్వచ్ఛమైన చరిత్రలో మచ్చ తెచ్చిపెట్టే పని చేయించాడు గాదా ! ఇదిగో వీడికి రాజ్యం ఇచ్చి నన్ను పొదల్లోకో, గుట్టల్లోకో, అడవుల్లోకో పొమ్మంటే—వాడికి రాజ్యం ఇచ్చి నేను పోయేవాణ్ణి గదా ! వాడే నీకు అయినవాడు, నేను కానివాణ్ణి అనేది లేదుగదా ! నీకు కావల్సిన పనల్లా సీతను వెదకి పెట్టడం అంతేగా ! నీకు తెలుసో, తెలీదో నా రెండు పార్శ్వాలకు బాహువులకు మధ్య ఆ రావణుని ఇరవై చేతులు నొక్కిపెట్టి, ఒక సముద్రం నుండి ఇంకో సముద్రానికి ఎగిరి వెళ్తూ, సప్తసాగరాల్లో మునిగి స్నాన సంధ్యాదులు పూర్తిచేసి, బిగించిన బాహువుల్ని వదులు చేసి వాణ్ణి నేలమీదకు పడవేసాను. ఆ పని కేవలం నాకు క్రీడా కార్యమేనని గుర్తుంచుకో !"

(వాలి ప్రతిరోజూ సప్త సముద్రాల్లో స్నానం చేసి, ఆయా సముద్ర జలాలు సూర్యునికి అర్ఘ్యమిచ్చి, సంధ్యా వందనం చేస్తాడు. ఇది వాలికి దైనందిన కార్యక్రమం. ఒక రోజు రావణుడు పై నుండి వెళ్తూ, క్రింద అర్ఘ్యమిస్తున్న వాలిని చూసి, క్రిందకు దిగి ఒక విధమైన నిర్లక్ష్య మదంతో ఇటు పది చేతులు, అటు పది చేతులతో వాలికి చక్కలి గింతలు పెట్టబోయాడు. ధ్యానంలో నిమగ్నుడైన వాలి అప్రయత్నంగానే తన బాహువులతో ఆ చేతుల్ని తన శరీరానికి అలాగే నొక్కిపట్టి ఎగురుతూ, సప్త సముద్రాల్లో మునిగి సంధ్యావందనాలు పూర్తిచేసిన తరువాత వదులు చేస్తే అంతసేపూ ఊపిరాడక గిల గిల మంటూన్న రావణుడు బ్రతుకు

జీవుడా అని ధామ్మని ఒక్కసారి క్రింద పడ్డాడు. వాలి ముందు రావణుడంత. ఈ విషయాన్ని వాలి రామునికి చెప్తున్నాడు.)

"అనవసరంగా గోటితో పోయేదానికి గొడ్డలి నుపయోగించ బూనడం అవివేకమే! ఈ విషయంలో నీకు చెప్పగలవారు లేకపోయినా— నువ్వు చేసిన పని వివేక రహితమైనదీ, నీచమైనదీ అంటాను. సుస్నిగ్ధ కోమల శ్యామల దేహుడవైన నిన్ను చూస్తుంటే కోపం రావడంలేదు గానీ, నువ్వుచేసిన ఈ మలినమైన పనికి నిన్ను ఏం చేసినా చెయ్యవచ్చు. నువ్వు నాతో ఎదురునిల్చి యుద్ధం చెయ్యవు గాని చెయ్యడం జరిగితే నీ మృదువైన దేహాన్ని మెదిపి మేడిపండు చేసేవాణ్ణి. ఔరా! ఆ ఇక్ష్వాకువు, ఆ రాఘవుడు, ఆ దిలీపుడు, ఆ దశరథుడు వారి ప్రతిష్ఠ ఏమిటి ? వీరుడ వనిపించినా యీ చెట్టుచాటు వెలి పని యేమిటి? మా మాంసం తింటారా నరపతులైన మీరు? పంచ నఖుల మైన మేము అందుకు మీకు పనికిరాముగదా! లక్ష్యంలో కొద్దిగా అయినా లోటు లేకుండా, విలిప్త కాలమయినా సందివ్వకుండా, ధనుస్సుతో దుష్ట సంహారం చేసే నీ బాణానికి నేడు నేను ఎర కావడం ఆశ్చర్యంగా వుంది. బాణం ఎప్పుడు వదిలావు ? అది ఎప్పుడు వచ్చింది ? అబ్బా ! తిన్నగా వక్షంలోకి చొచ్చుకు పోయింది గదయ్యా ! ఆనాటి నీ సప్త తాళ విదళనానికి గూడా నేను ఆశ్చర్యపడను. సరిగ్గా విష్ణువు గదను విసిరినట్లుంది నీ బాణం విసురు. నాతో బాహు యుద్ధం నువ్వు చెయ్యలేవు. చేసివుంటే నేను పడ్డ ఆశ్చర్యాన్ని గుండెబ్రద్దలై నువ్వు పొందేవాడివి."

"సరే! ఇంతటిది నాకు జరగాలని నా నొసట మీద, ఇంతటి అపకీర్తి పాలవాలని నీ నొసటి మీద ఆ బ్రహ్మ ముందే వ్రాసివుంటాడు. కాని నేనొక్కటి చెప్తాను. నేనిలా సుహృద్భావంతో చెప్తున్నానన్న మాటే గానీ, నాకు హృదయంలో కల్గిన ఏహ్య భావాన్ని విప్పి చెప్పటానికి ఎందుకనో నోరు

రావటం లేదు. త్రాగటానికి పనికిరాని నెయ్యి, తలంటుకోటానికి పనికిరాని నూనె లాగా నీ మోహనాకారం నీ యీ కుటిలమైనపని ముందు బృహస్పతికి చంద్ర దీప్తిలా దుష్కీర్తినే చాటుతోంది. ఏమి అనుభవించినా ఈ ప్రాణం వున్నంత వరకేగా! అటుపైనగూడా ఈరాజ్యం సర ం తనదే అనుకుంటాడా నీ సఖుడైన సుగ్రీవుడు? ఎవరెవరెలాంటి కృత్యాలు చేసారో, చేయించారో, ఏదిపాపమో? ఏది పుణ్యమో? ఆపరలోకాంలో తేలకుండా ఉంటాయంటావా? చిన్నతనం నుండి నాకంటే చేవతక్కువ వాడే! నిన్న కాక మొన్న ప్రాణభీతితో పలాయనం చిత్తగించినవాడు వెంటనే ఇవాళ ఇలా మళ్లీ వచ్చాడంటే ఇందుకువెనక నీ అండ చూసుకునే వచ్చాడు కాని, అందుకు స్వశక్తి కారణ మనుకుంటావా ! అన్నీ తెలిసే ఇక్కడకు ఇలా వచ్చాను. ఇప్పుడూ, ఇక ముందుకూడా అన్నిదేశాల వారికి, అన్ని కాలాల వారికీ, ఎల్లలోకాల వారికీ ఏ తీరున వాలి వధింపబడిందీ తెలిసేలాగానే చస్తున్నాను గూడా ! ఇలా జరగడం వల్ల నాకు నష్టం లేదని మాత్రం గుర్తించండి మీ సఖులిద్దరూ!" అన్నాడు.

వాలి పలికిన చివరి మాటలకు సుగ్రీవుని ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు. నిరత్తరుడై, తప్పు చేసిన వాడిలా వాలిని అలానే చూస్తూ ఉండిపోయాడు.

## రాముని సమాధానాలు

రెండు ఝాములు దాటింది. లక్ష్మణుడు అలానే కదలకుండా నిలబడ్డాడు. అంతవరకు దూరంగా ఉన్న హనుమదాదులు వాలి పడివున్న చోటుకు వచ్చి వాలిని చూసారు, హాలాహల భక్షణం చేసే సమయంలో ఉండే నీలలోహితునిలా కన్పడ్డాడు. యుద్ధ ప్రారంభంలో సుగ్రీవుడు వాలి పైకి విసిరిన వృక్షం అక్కడ పడి ఉంటే శ్రీరాముడు దాని మీద కూర్చుని-

"నాయనా వాలీ! అనవసరంగా కోపగించకయ్యా! ధర్మం అతిసూక్ష్మ బుద్ధిగ్గాని అందదు. మోహం క్రమ్మిన వారికి అసలందదు. ముందు నీ చిత్తానికి పట్టిన మోహాన్ని తుడుచుకో! అంజన దృష్టిని వీడి నిరంజన దృష్టితో చూడు. అటుపైన జరిగిన వాటిలోను, జరగబోయే వాటిలోనూ ఉండే ధర్మస్వరూపం కళ్లగడుతుంది. అన్ని దేశాల వారికీ. అన్ని కులాల వారికీ తెలిసేట్లుగా చచ్చానన్నావు గదా ! బాగా చెప్పావు. ముందు ముందు గూడా నీలాంటి గాఢ మోహ సంభావితాత్ములు– ఎలా వధింప బడతారో తెలిసేట్లుగా చావడం గూడా మంచిదేగా ! తాము ఎంత చేశారో అంతకు తగ్గట్టుగా తాము అనుభవిస్తారని తెలిసినంతలో కొంతవర కయినా తెలియడం మంచిది. ఎవరి కర్మకు వారే కర్తలు, వారే భోక్తలుగానీ ఒకరు చేసిన కర్మకు ఇంకొకడు ఫలాన్ని నిర్ణయించడు. చేసిన కర్మే ఫలాన్ని గూడా నిర్ణయిస్తుంది. పామురులకయినా, పండితులకయినా ఇదే కర్మ సూత్రం చెల్లుతుంది. వదులుగా నున్న నూతిరాతి మీద కూర్చుని ఆవేశ కావేశాలతో, మదమెక్కి మాట్లాడుతుంటే తాను పడిపోతానేమో ననే మాట కొంచెమయినా గుర్తుండదు. ఇలాంటి వారికి వాళ్ల తర్కం వాళ్ల ఆవేశం వారివే కాని ఎదుటి వారు ఏం చెబుతారో గూడా వినదామనే వివేకం ఉండదు. ఆపదలు వచ్చినప్పుడు అందరూ అహంకారం లేని వారే! సాధువులే! కాని మహాంధీభూత చేతస్కులయినపుడు వాళ్లకంటె అడవి మృగాలు నయమనిపిస్తాయి."

"మీ పట్ల మానవధర్మం అవలంబిద్దామంటే మీరు మానవులు గాదు. అట్లా అని పూర్తిగా మృగాలు కూడా కాదు. సగం మనుష్యులు, సగంమృగాలు. మీ కిష్కింధాపుర వాసుల సంప్రదాయాలు, కట్టుబాట్లు గూడా మాకు చిత్రంగా అనిపించవచ్చు. మీరు వెనుక దేవతాంశలున్నవారు– జన్మచేత మానవత్వ మర్యాదా లక్షణాలున్నవారు. అయినా, దేహధర్మం చేత మరికొన్ని శ్రీ విశేష ధర్మాలు మీకు లేవు. అటువంటప్పుడు మీపట్ల కేవలం ప్రాణిధర్మమే

వర్తిస్తుంది. జంతుధర్మాం కలవారియందు సాధులక్షణం ఉత్తమోత్తమ మైనది. ఆ సాధుత్వం నీ వద్ద మొన్నటిదాకా భాసించలేదు. ఏకోదరుడైన సుగ్రీవుని ఎంత ఇబ్బంది పెట్టావో? అతిబలశాలి వవడం, కోపం వస్తే ముందూ వెనుకలు ఆలోచించ గలిగే ఓర్పు లేకపోవడము; ఇంకొకరు చెప్తే వినే గుణం లేకపోవడము; నీవు ఏం చేస్తే అది ధర్మం. ఏది చెప్తే అది సత్యం అనుకొనే దుర్మదాంధత్వంతో ఆత్మ నిగ్రహాన్ని కోల్పోవడం–ఇవన్నీ దుర్లక్షణాలే! నీ కంటే బలశాలి కాకపోవచ్చును.– కాని, నీకున్న ఆ మిగిలిన దుర్లక్షణాలు సుగ్రీవుని వద్దలేవు. సల్లక్షణాలు గలవాడు, మైత్రికిప్రాణమిచ్చే వాడు అయిన సుగ్రీవునితో కాకుండా బలశాలివి గదా. రావణ వధ విషయం తేలిగ్గా పరిష్కార మవుతుంది గదా అని నీతో మైత్రి చేస్తే అది రాజకీయపు ఎత్తు అవుతుంది గాని హృదయ ధర్మం. ఆర్య సంప్రదాయం, ధర్మమార్గం అనిపించుకోదు. అయినా మా ఇన వంశీయులు అంతటి అధర్మ మార్గం అనుసరించే అనార్యులు కాదని గుర్తుపెట్టుకో!"

"రాజ్యం కాని రాజ్యానికి నువ్వు రాజువి. ఇంద్ర పరిపాలిత వృక్ష ఫలాలు ఏరటం తప్ప మరొక విషయమేముంది మీకు ? మీకంటే అధికమైన బలం గల జంతువుల వల్ల భీతి ఉండనే ఉంది. మరి ఇక్కడున్న మృగాలన్నిటికీ నువ్వు రాజువని గట్టిగా చెప్పుకోడానికి గూడా వీల్లేదు అక్కడక్కడ చెట్లకొమ్మల మీద తిరగడం, అందింది నోట కరచుకు పోవడం ఇది మీ ప్రవృత్తి.ఇది ఉంఛవృత్తిలో ఆరోవంతు మరి అలాంటప్పుడు నువ్వు ఏ విధంగా నీ రాజ్యంలోని వారికి రాజుగా రక్షణ, పోషణ కల్పిస్తావు ? అందువల్ల మీ పట్ల పురుషార్థాలన్వయించ బూనటం గూడా అర్థంలేని పనే అవుతుంది. చేతికందింది కొట్టుకుని అవి తినడంలో ఏదో కట్టు. పురుషార్థమంటే తెలియకపోయినా కలిసికట్టుతనానికి అడ్డం చెప్పుకో బూనడం, పెద్దజంతు

వుల వల్ల భయభీతి, జంతులక్షణాలూ ఉండనే ఉన్నాయి. ఇన్నింటి మధ్యా రాజ్యం, రాజు అన్న పేర్లు విచిత్ర మనిపించవూ!"

"వేదహిత నాగరికతకు మూలమైన మనువు ఇహపరాలను రెంటినీ సమన్వయ పరుస్తూ ధర్మశాస్త్రాన్ని రూపొందించాడు. ఆ శాస్త్రంలో చెప్పిన పారలౌకిక విషయాలు మీ కర్థం అవడం కష్టం. అన్నదమ్ముల అనుబంధం, కుటుంబ వ్యవస్థ, కలిసి ఉండడం. దాంపత్యధర్మం మొదలయిన పవిత్రమైన విషయాలు సగం మనుష్యులయినందుకు, మీకూ కొంతవరకు వర్తిస్తాయి. మరి అలాంటప్పుడు ఏకోదరుడయిన సుగ్రీవుని యందు నీవు కనబరచినదేమిటి? ఆ రాజ్యాన్ని తమ్ముడు దొంగిలించాడని దురాశా మదవృత్తితో తమ్ముని పట్ల అనుచితంగా ప్రవర్తిస్తావా? భూమికోసం, రాజ్యంకోసం-తండ్రి, సోద రులను చంపడం మ్లేచ్ఛ జన ప్రవృత్తిని తెల్పుతుంది. మంత్రి జనుల ఇష్ట ప్రకారం సోదరుల్లో చిన్నవాడు గూడా రాజ్యాన్ని పొందడం ఆర్యజన ప్రవృత్తి, పోనీ అల్లా కాకుండా తమ్ముడే రాజ్యం కావాలని అన్నగారిని అడి గితే, చిన్నవాడడిగాడు గదా అని వాత్సల్య భావంతో అన్నగారే ఇచ్చినా తప్పులేదు, నిజానికి ఒక్క విషయం చెప్పనా ? ఆ సుగ్రీవునికి మంత్రశక్తి, సదాలోచన. సన్మార్గానుసరణ మొదలయిన ఆర్యగుణాలు ఈ ధరిత్రిని ఏల డానికి యోగ్యమైనవి. నీ బాహు విక్రమం, ధైర్య సాహసాలు, చొచ్చుకుపో గలగడం మొదలయినవి సేనా నాయకత్వ లక్షణాలు. మరి అటువంటప్పుడు తమ్ముడు రాజుగా ఉండి నువ్వు సైన్యాధ్యక్షుడిగా ఆ రాజ్యాన్ని పరిరక్షిస్తూ ఉంటే మీ అన్నదమ్ముల అనుబంధాన్ని గురించి అందరూ చెప్పుకునేవారు. ఆ రాజ్యం గూడా ఏ లోటూ లేకుండా చక్కగా పరిపాలింపబడేది."

"ధర్మ రహితమైన అర్థ కామాలు - సారథి లేని రెండు ఎద్దుల్లాంటివి. పల్ల మొస్తే ఎడ్లకు మెడ పట్టీలు బిగిసి బండి తలక్రిందులై పడిపోతుంది.

కర్మ మార్గాన్ననుసరించని దుర్మతులు ఇల్లాంటి ధర్మరహిత అర్థ కామాలకు బానిసలై, బలై పోతారు సంతతి కోసం స్త్రీ ఉపయోగమవాలి. ఇది మనుధర్మం. కేవలం కామానికే, ఇంద్రియ పరితృప్తి కొరకే అయితే అది అధమమైన జంతు లక్షణమే అవుతుంది. నీ కామం అధర్మ మార్గాన్ని పోయింది. దీన్తో ఇంద్రాంశ గూడా మృగ్యమయిపోయి శిక్షార్హమైంది. దోషం జీవునివల్ల జరిగినా శిక్ష దేహానికే ! తమ్ముని భార్య కూతురు లాంటిది. అల్లాంటిదాన్ని కామ మోహితుడై కోరడం ధర్మ విరుద్ధం. ఆ పాపానికి మరణమే శిక్ష! అవిమృష్ట సంగమం చేసే జంతువులకే ఇది చెల్లుతుంది. సోదరుని భార్య చనిపోతే అతని భార్యను దేవర న్యాయంచేత పొందడం మాకు తప్పు లేదు. కాని నువ్వు నీ తమ్ముడైన సుగ్రీవుడు బ్రతికి ఉండగానే రుమను పొందడం ఎంత దుష్కార్యమో ఆలోచించు. రుమ అందంగా ఉండడమే నీ కోరికకు కారణం. అందంగా ఉంటే తమ్ముని భార్య అని అయినా ఆలోచించని నీవు ముందు ముందు ఇంకెవరైనా రుమ కంటే అంద మైన వాళ్లుంటే మరీ ఒంటి కాలిమీద లేవవూ ? అంటే నీ వల్ల నీ రాజ్యంలో స్త్రీ జాతికే అన్యాయం జరుతూందంటే నిన్నేం చెయ్యాలి ? ప్రస్తుతం ఈ ధాత్రీ పాలనా భారం భరతునిది నేను ఆ భరతుని రాజ ప్రతినిధిని. మా భరతుని పాలనలో అధర్మం, అన్యాయం జరగడానికి వీలులేదు. నేను నా భార్యను ఎత్తుకుపోయి - అధర్మాన్ని తలపెట్టిన రావణుణ్ణి ఏం చేద్దా మనుకుంటున్నానో తమ్ముని భార్యను పొందిన నీ పట్ల గూడా అదే ధర్మం వర్తింపజేసి చంపుదా మనుకున్నాను. ఈ విధంగా నిన్ను నేను చంపడానికి అర్హుణ్ణిగా నిశ్చయించుకున్నాను."

'చెట్టు చాటుగా నిలబడి చంపడ మెందుకు ?' అని నువ్వు అడగవచ్చు. తమ్ముని మీద అటు రాజకీయ దోషం చూపించి - ఇటు అతని భార్యను అనుభవించిన నీ నేరానికి సరిపోయేట్లుగానే నీకు శిక్ష ఉండాలి. అందుకే

అటు సుగ్రీవునితో యుద్ధం అని నిన్ను రప్పించి. ఇటు చెట్టు చాటు నుండి నిన్ను నేను గురి చేసాను. దండింప తగిన వానితో రాజు ఎదురుగా నిలబడి యుద్ధం చెయ్యాలనే ధర్మం లేదు. అటువంటి ధర్మమే కనక ఉన్నట్లైతే నువ్వు సుగ్రీవుడు శిక్షార్హుడని తేల్చినపుడు అతనితో యుద్ధం చెయ్యకుండానే బయటకు పంపావు గదా ! కాబట్టి శిక్షార్హుడవైన నీతో గూడా నేను ఎదురుబడి యుద్ధం చెయ్యవలసిన పనిలేదు. అవునుగాని ఒక్కటి చెప్పు. నువ్వు ఇక్కడకు రాక పూర్వం నీ మనస్సులో ఉన్నదీ, ఇప్పుడు ఉన్నదీ ఒక్కటే అభిప్రాయమా ? నిజం చెప్పు. ఎందుకంటే నువ్వు పర్వత నిశ్చలుడివని సుగ్రీవుడన్నాడులే ! అందుకని అడుగుతున్నాను. ఒక ఇనప ములికి బాణం తగిలితేనే ఇల్లా అయిపోయావు నువ్వు అది గుర్తుంచుకో. ఏది ఏమైనా నిన్ను క్షమిస్తున్నాను. నీ కంఠాన్ని త్రుంచను. నీ దేహాన్ని ఎక్కడకో విసరను. దేహాన్ని ఖండ ఖండాలుగా నరకను. చివరకు మెదిపి మేడిపండు లాగానూ చెయ్యను. ఆ భరతరాజు పరిపాలనకు అధర్మ దోషం అంటకుండా ఉండేంత వరకే నీ దోషానికి తగ్గ శిక్ష విధించాను. నువ్వు గూడా తెలివి తక్కువ వాడివేం కాదు. కాబట్టి ఈ విషయం తెలుసుకొని స్వర్గసీమల్లో విహరించు" అన్నాడు అప్పుడు రాముని సమాధానాలకు సంతృప్తి చెంది వాలి –

రమణీయ నేత్రా ! ఘనలీల గాత్రా ! రఘువంశ క్షీరాబ్ధి రమణీయ చంద్రా ! పోరుకు పోవద్దని తార ముందే వాదించిందయ్యా ! కాని నేనే కావాలని వచ్చాను. నీ ఇనప బాణంవల్ల నా కోరిక పండింది. నాకింక దిగుల్లేదు. సుఖంగానే పోగలను" అన్నాడు (వాలి).

# శ్రీరాముని ధర్మవచనాలు

వాలి అన్న మాటలు విన్న రాముడు వాలిని చూస్తూ – "నాయనా వాలీ ! కాస్త ఆగవయ్యా ! నా బాణం అమృతపు పూత కల్గినది. నువ్వు అమరేంద్రాతిథ్యం స్వీకరించడానికి వెళ్లేముందు నీకున్న కోర్కెలు నాతో చెప్పు. అయినా నువ్వు చెప్తేగాని తెలియ వనుకోకు. మమతాను బంధాలకు ఆలవాలమైన ఈ లోకంలో అందరికీ ఉండేవే ! నీ కొడుకు అంగదుణ్ణి గూర్చి నువ్వు బెంగ పడక్కర్లేదు. పసివాడిని ఒంటరివాణ్ణి చేసి వెళ్లి పోతున్నాను అని గుండె రగిలి పుట్టెడు దుఃఖంతో పోవక్కర్లేదు. నీకున్నంత ప్రేమ అంగదుడి మీద సుగ్రీవునికుంది. ఎక్కడికి పోతుంది రక్తస్పర్శ? అన్న అంటే పడకపోయినా అన్న కొడుకు అంటే పడి చావడం వుంది లోకంలో. అంగదునికి విండు ప్రేమతోనే సుగ్రీవుడు యువరాజు పదం ఇస్తాడు. సుగ్రీవుడు తనకై తాను ఈ పని చేస్తాడా ? అని నీకు అనుమానం రావలసిన పనిలేదు. ఇది నా అభిమతం అని తెలిసిన తరువాత గూడా చెయ్యకుండా ఉండడు గదా !"

"ఇకపోతే తార. ఆమెను గూర్చి నువ్వసలు దుఃఖ పడక్కర్లేదు. సుగ్రీవుడెప్పుడూ ఆమె మీద కోపం వహించడు. ఆమె సలహా, సహాయ, సహకారాలు అతనికి చాలా అవసరం గూడా ! అంగదుడు గూడా తారను జాగ్రత్తగానే చూస్తాడు. నీకు తెలుసు తారయందు ఎంత గౌరవభావంతో ఉంటాడో ? ఇక ముందు గూడా అంటే నీ తరువాత నీ తమ్ముడు పరిపాలించిన రాజ్యాన్ని తాను పరిపాలించాలనే అభిలాషే ఉంటే ఆ అంగదుడు తారను చాలా గౌరవంగా చూస్తాడు. తారను గూర్చి నేను విన్నదాన్నిబట్టి చెప్తా విను. మీ రాజ్య పరిపాలనలో వివేకవంతంగా ఏమన్నా జరిగితే ఆ వెనక తార తెలివి ఉందని రూఢిగా చెప్పవచ్చు. కాబట్టి అల్లాంటి తారతో

పొత్తును ఎవ్వరూ చేజేతులా దూరం చేసుకోరు. కాబట్టి నువ్వామె విషయమై ఇంక మరచిపో ! రుమ నీకొకందుకైతే, తార సుగ్రీవునికి ఒకందుకు. (రుమ చాలా అందమైంది అందుకే వాలి తమ్ముణ్ణి వెడలిగొట్టి ఆమెను అనుభవించాడు. తార చాలా తెలివి గలది. అందుకే సలహాల నిమిత్తమై సుగ్రీవుడు ఆమెను వదులుకోడు.) నువ్వు నీ దేహాన్ని విడిచిన తర్వాత ఆమె ఏమౌతుందో నన్న బాధ్యత నీది కాదు. మనుష్యులకు కేవలం బుద్ధి యందే కపిత్వం ఉంటుంది. కాని మీ వానర జాతికి మనశ్శరీరాల రెంటి యందు ఉంటుంది. ఒక ప్రక్క ప్రాణం పోతూ దేహాన్ని విడిచే సమయంలో గూడా ఈ ప్రేమలు, బాంధుత్వాలు శాశ్వతాలు అనుకుంటారు" అన్నాడు.

శ్రీరాముని ఉదాత్తమైన ధర్మ వేదాంత వచనాలకు అమృతోపచారం జరిగినట్లై వాలి – "రామచంద్రా ! నీ మాటలకు నా పూర్వ జన్మ పుణ్యం పండింది గదయ్యా ! చంపడంలోనూ. చావులోనూ ఇంతటి కరుణా మాధుర్యాల్ని చవిచూపించడం నీకే తగును అసలు నీచే వధింప బడడం గూడా ఎంతో పుణ్యం చేసుకుంటేనే గాని రాదనిపిస్తోంది. నాకు ఆ అదృష్టాన్ని కలుగ జేశావు. రామభద్రా ! దయాగుణ సముద్రా ! నా మరణం గూడా నాకు దుఃఖాన్ని కలిగించడంలేదు" అన్నాడు. ఎంతో సంతృప్తిగా అన్న వాలి మాటలు విన్న శ్రీరాముడు –

"జీవుల ప్రవృత్తి ఎంత చిత్రమైనది ? బయటకు ఎంతో గర్వం, మూర్ఖత్వంతో బెదిరిస్తున్నట్లు కనబడినా లోపల ఇంతటి ముగ్ధత్వం, స్నిగ్ధత్వం దీపిస్తూ ఉంటాయి గదా! ఇంత చక్కటి ఆత్మ గుణాల్ని వెలిదీయ గలగడం నిజంగా ఆ మృత్యువు యొక్క లీల అనే చెప్పాలి. ఆ మృత్యువే కనక లేకుంటే ఇటువంటి వారికి ఇంక పట్టపగ్గాలుంటాయా ? పగలు,

ప్రతీకారాలు, పంతాలు, పట్టింపులు పోయి ఒక్కొక్కడు విజ్ఞవీగి, పొంగి పొర్లే మహోగ్ర వార్నిధిలాగా ఎగిరెగిరి పడుతూ అహంకార, దురంతాల్ని మదోద్వేగ ప్రళయాలని సృష్టించరూ ? ఈ చరమ దశలో ప్రతి జీవికి తొలగవలసినవి తొలగి, వెలగ వలసిన దైవాంశ ప్రదీపించడాన్నే చావు తెలివి అంటారేమో మనవాళ్లు" అనుకున్నాడు.

వాలి చేతులు జోడించి – "రామా ! నా మోహాన్ని పోగొట్టావు. ఇంక నా మీద కృపగలిగి అనుజ్ఞ ఇప్పించు" అనంగానే చూచి హృదయపు లోతుల్లోంచి వచ్చిన వాత్సల్య భావంతో, ప్రేమార్ద్రి భావంతో రామచంద్రుడు వాలి ముఖంలోకి చూసి నవ్వాడు. ఇందీవరం వికసించి నట్టుంది ఆ నవ్వు.

## తార ప్రతిభా ప్రవృత్తి

వాలి నేలకు వ్రాలిన వార్త విన్న కిష్కింధా పురవాసులు గగ్గోలుపడి పోయారు. కోట కవాటాలను బిగించి వేశారు. కోటలోకి ఎవ్వరూ ప్రవేశించ డానికి వీలు లేకుండా కట్టుదిట్టం చేశారు, అవసరమైతే రహస్య బిలాలగుండా పర్వత ప్రాంతాలకు అరణ్య ప్రాంతాలకు పలాయనమయే ఏర్పాట్లలో ఉన్నారు. 'వజ్రశరీరుడయిన కిష్కింధాధిపతికే దిక్కులేకపోతే ఇంక మిగతా వారు ప్రాణాలపై తీపి పెంచుకోవడం అనవసరం, కిష్కింధలో ఉండే రోజులు పోయినట్లే' అనుకుంటున్నారు.

దుర్భరమైన ఈ దుఃఖవార్తను విన్న తార భర్తను చూడాలనీ బయలు దేరింది. వానరులంతా వారించారు. "మగవాళ్లమైన మేమే నిలువుగ్రుడ్లు పెట్టి నివ్వెరపడి చూస్తూ ఏం చెయ్యడానికి పాలుపోకుండా ఉన్నాము. అవక్ర

విక్రమ పరాక్రమ సంపన్నుడయిన వాలిరాజే నేలకు వాలి పోయాడంటే, మరి నువ్వు అక్కడకు వెళ్లబూనడం సాహసమే రాణీ! ఈ వానర సైన్యాన్ని నడిపించగల ధీశక్తి నీకున్నదని, ఇంక నీవే మాకు రక్ష అని నీ మీద ప్రాణాలు పెట్టుకొని మేము ఉన్నాం. నువ్వుగూడా అటువెళ్లినట్లయితే మా ఆశలు అడియాసలవుతాయి. మా బ్రతుకులు బుగ్గి అవుతాయి. ఎందుకొచ్చింది గాని, ఈ దేశాన్ని విడిచి పెట్టిపోదాం. దూరంగా ఉన్న అరణ్యప్రాంతాల్లో తలదాచుకుందాం. నీ బుద్ధిబలంతో, నీ కుమారుని భుజబలంతో మమ్మల్ని రక్షిద్దురుగాని–మీకు దాసులమై ఉంటాం తల్లీ మా మాటవిని అటువెళ్లవద్దు నీకివే వెయ్యి నమస్కారాలు'' అని వానరులంతా తారను వెళ్లవద్దని వారించారు.

వానరులందరూ వారిస్తున్నా వాళ్లను తొలగి ముందుకు పోతోంది తార చంద్రుడస్తమించిన సమయంలో ఉండే రాత్రిసతి లాగా దీనముఖియై తార ఉంది. ప్రియభర్తృవియోగాన్ని తట్టుకోలేక మృతశరీర స్పర్శకై ఒళ్లు తెలీకుండా పడుతూ, లేస్తూ నడిచి వస్తోంది. రెండుచేతులూ పైకెత్తి దీనాతి దీనంగా రామసుగ్రీవాదులందరినీ దాటి వాలిపడిఉన్న చోటుకు వెళ్లి. అతని మీద పడి ఏడ్చిఏడ్చి–

"రాముడు యమునిలా అవతల కాచుకుని ఉన్నాడు. పోవద్దయ్యా అంటే వినకుండా ఏవో ధర్మం గురించి చెబుతూ ఇక్కడకు వచ్చి ఇలా నీ ప్రాణాలకు, నా హృదయానికి నిప్పంటించావు గదయ్యా! నెత్తిన నోరుపెట్టు కొని అటువైపు పోవద్దని నేను చెప్పే మాటలు లెక్కపెట్టకుండా కాలప్రచో దితుడవై ఇలాంటి సాహసం చేశావు. ఇకపైన నేను, నీ కొడుకు ఏమై పోయే ట్లు ? ఉన్న కళ్లు గూడా మూసుకొని కూపంలోకి దిగబడి పోయినట్లుంది. ఇంక వానరులంతా చెట్టుకొకళ్లు, పుట్టకొకళ్లుగా అయి, కిష్కింధ పాడుపడి పోవలసిందే గదా ! నీవు రుమకు భర్తృ వియోగాన్ని కలిగించిందుకు నీ

కాంతనైన నాకు శాశ్వతంగానే నిన్ను దూరం చేశాడు ఆ భగవంతుడు. మనకు కలగబోయే సుఖాన్ని, దుఃఖాన్ని మనమే వ్రాసిపెట్టుకుని ఉంటాం. దీనికి భగవంతుని కూడా అనవలసిన పనిలేదు. నిన్నటిదాకా భూతలపతి భార్య – ఇప్పుడు దాసి, నిన్న పల్లకీ – ఇవాళ జోలె – ఏ నిమిషానికి ఏం విపరీతం జరుగుతుందో చెప్పలేం గదా ! నీ భార్యనైనపుడు మహా వీర పత్ని నయాననుకున్నాను. ఇంతలోనే ఇంతటి ఘోరాన్ని విధి నా నొసట వ్రాశాడు. నీ ముఖం చూస్తుంటే పోయావన్నా నమ్మలేకుండా ఉన్నాను. ఆ ముఖంలో తేజస్సు ఏ మాత్రం పోలేదు. ఒక్కసారి నాతో మాట్లాడు. నన్ను గూడా నీతో తీసుకొని వెళ్లు. నిన్ను వెళ్ల వద్దన గలిగానే గాని నీతో రాలేక పోయాను. నన్ను ఇప్పుడు విడిచి వెళ్లావనుకుంటే ఏం లాభం ? తప్పంతా నాదే" అంటూ దుఃఖిస్తూ తార అక్కడున్న అంగదునివైపు రెండు చేతులూ చాచి కౌగలించుకొని –

"చూశావా నాయనా ! శత్రు భయంకరుడైన నీ తండ్రి యమపాశ వశంకరుడై మనిద్దరి నోటా దుమ్ముకొట్టి పోతున్నాడు గదా ! రాచరికపు పెంపకంలో పెరిగిన నీకు ఇక ముందెలా సాగుతుందో ననేరా నాకు మిగిలిన బెంగ ! మీ తాత తండ్రుల రాజ్యాన్ని తాను ఏలి, తన తరువాత సుతుడైన నిన్ను యువరాజుగానైనా చూసుకోక ముందే ఇలా అయిపోయాడు నీ తండ్రి. రాజ్య వివాదాన్ని పెంచడం కోసం యముడు ఇలా దయ్యంలా వచ్చి, మనకిలాంటి ఆపదను కలుగజేసాడు గదరా ! పాలితులైన ప్రజలు పాపపు పనులు చేస్తే భూ పాలకుడు శిక్షిస్తాడు. భూపాలకుడే పాపపు పనులు చేస్తే దైవం శిక్షిస్తాడు. మరి ఆ దైవమే అలాంటి పాపపు పనులు చేస్తే ఎవరూ నోరెత్తడానికే వీలులేదు అనలేము. ఎవరినైనా శిక్షించడానికి కర్మ ఉంది. ఈ కర్మ జన్మఫలాలు ఎవరికైనా తప్పవులే" అంటూ అతి తెలివిగా, నర్మగర్భంగా పలికింది తార.

# హనుమంతుని స్పందన

తార మాటలు విన్న రామ సుగ్రీవులు నిరుత్తరాశ్చర్య వదనులై ఉండగా హనుమంతుడు తారతో – "దుఃఖోద్వేగంలో వివేక పాండిత్యాలు గూడా కొట్టుకుపోతాయేమో ననిపిస్తోంది నిన్ను చూస్తుంటే. దృశ్యమానమైన ఈ జగత్తంతా బుద్బుదప్రాయమని నేను నీకు తెలియజెప్పే టంతటి వాడిని కాను. శోకింపదగని విషయాల్లో శోకించడం వివేకవంతుల లక్షణం కాదు. ఎందుకనో విజ్ఞులైనవారు గూడా ఇల్లాంటి సమయాల్లో కోప శోకాలతో పామరులైపోతారు. ఎన్నిసార్లు ఈ మృత్యువు గురించి విన్నా, చూచినా గూడా క్రొత్తగా ఎవరన్నా పోయినపుడు విధిని తిట్టుకోవడమే జరుగుతుంది. ఆ కాసేపూ మాయా మోహాలు మనస్సుకు క్రమ్ముతాయి. ఏది మిధ్యయో - ఏది సత్యమో; ఏది శాశ్వతమో - ఏది అశాశ్వతమో ఈ సృష్టి ప్రళయాల వెనుక నడిచే ధర్మమేమిటో తెలియదు. సముద్రంలో ఎన్నెన్ని నీటి బిందువులున్నాయి సూర్యరశ్మిచేత నిత్యమూ ఎన్నెన్ని నీటి బిందువులు సముద్రం నుండి వేరై దూరమై పోతున్నాయి. మళ్లీ మేఘాల ద్వారా ఎన్నెన్ని వర్షబిందువులు ఆ సముద్రంలో జేరుతున్నాయి. సముద్రం అప్పుడూ క్రుంగిపోదు. ఇప్పుడూ పొంగిపోదు. ఇదీ సృష్టి ప్రళయాల వెనుక రహస్యం. తిరుగులేని వీరునిలా ఈ కిష్కింధను ఏలాడు. మహా భోగాలనుభవించాడు ధీమంతురాలైన నిన్ను భార్యగా పొందాడు. తనకు తగిన పుత్రుణ్ణి పొందాడు తాను పొందాల్సిన వన్నీ పొందాడు. అంత్యదశలో గూడా ఠీవిగానే పోయాడు. అల్లాంటి వాలి కోసం ఇలా శోకించడం తగదు. ఆయన రాచఠీవికే తగని పని. ధీమంతు లెప్పుడూ ఇక ముందు చేయవలసిన పనిని గూర్చే ఆలోచిస్తారు. పసివాడైన అంగదునికి అండగా వుండి అతనికిచ్చే రాజ్యపాలనా శిక్షణలో

ఈ దుఃఖాన్ని మరచిపో ! మతిని స్థిరపరచుకో. వాలికైనా, సుగ్రీవునికైనా వెనుక నీ ధీశక్తి లేకపోతే ఈ కిష్కింధా పరిపాలనే సవ్యంగా సాగదు. భౌతిక దేహంతో సౌఖ్యాలను అనుభవిద్దామని దుఃఖ బహుళమైన జన్మలలో ఇరుక్కుపోతాడు జీవి. ఇది సరిగ్గా పిపాసోపశమనార్థం క్షార సముద్రంలో ఈదడం లాంటిదే" అన్నాడు.

## తార ప్రతిస్పందన

తార హనుమంతుని మాటలు విని కాస్సేపు ఊరుకున్నట్లే వుండి హనుమంతుని వంక చూస్తూ దుఃఖంలోనే నవ్వి – "అవునయ్యా, హనుమా ! నువ్వు చెప్పినట్లు నేను ఇంక చింతా సాగరాన్ని ఈదుకుంటూ పోవలసినదే! పుత్రుడైన అంగదుడున్నాడు సరే ! ఒక వంద మంది అంగదులున్నా నా ఇప్పటి దుఃఖాన్ని పోగొట్ట లేరు. ఒక్క యదార్థ వాక్యానికున్న బలం వెయ్యి నీతి వాక్యాలకు ఉంటుందా ? మిన్ను నుండి వాన కురవాలి, వసుధ పండాలి. పండడానికి పనికిరాని వసుధ, వసుధ లేని వాన – దేనికి పనికి వస్తాయి ? అవి రెండూ ఉన్నప్పుడేగదా సృష్టిలో ఆనంద వృష్టి. ఆకాశోన్నతుడైన వాలి మహీశయానుడై దీనస్థితిలో పడి ఉన్నాడు. నేను నా నాథునికి దూర మవలేను' అంటూ తన చేతులను వాలిపై ఉంచి తొడలపై పడి ఉండిపోయింది. అంత్య దశలో ఉన్న వాలి – చేతి సంజ్ఞతో సుగ్రీవుని పిలిచి –

## వాలి చరమ సందేశం

"నీలాగావే నేను రామునికి సహాయం చేసి ఆదుకొని అటుపైన నాకున్న అహంకార గర్వంతో ఏదో వక్రపుపలుకులు వ్యంగ్యంగా అనడమూ

జరిగేది. అందుకు రామునికి కోపం వచ్చి నన్ను అప్పుడే చంపడమూ జరిగేది. ఈ విధంగా నేను రామునికి సహాయం చేసినా చెయ్యకపోయినా రాముని చేతిలో చనిపోవడం భాయం అని వ్రాసి ఉంది. దీన్నెవరు తప్పించగలరు ? ఇంత అహంకారం గలిగిన నా కంటే రాజ్య పాలనా విషయంలో చిన్నవాడివైనా సహన సంస్కారం, వినయ సౌందర్యం గలిగిన నువ్వే నయమేమోనని నా కప్పుడప్పుడు అనిపించేది. కాని నా అహంకారం, మూర్ఖత్వమే నిన్ను నాలుగు చెరువుల నీళ్లు త్రాగించింది. నేను నీ పట్ల అంత చేసినా కాలం నీకే అనుకూలమైంది చూశావా ! సద్గుణాల కింకా ఫలితం ఉందని నిరూపించింది కాలం".

"తల్లి వరం కోరడం – ఈ వనసీమలకు స్వామి రావడం ఇదంతా భగవద్విలాసం, నా అదృష్టం. ఇహం సంగతి వదిలెయ్యి. పరం ఇంతగా ఫలిస్తుందనుకోలేదు. స్వామి చేతిలో, స్వామి సన్నిధిలో ముక్తిని పొందే అదృష్టం ఎంతమందికి దక్కుతుంది ? ఈ సూర్య కుల చంద్రుని నీ హృదయ మందిరంలో సేవించుకో ! పసివాడైన అంగదుని పట్ల న్యాయంగా ప్రవర్తించు. ఈ తార దుఃఖపు వ్రణము క్రమ క్రమంగా అదే మాను పట్టుతుంది. నీవు కనక గుణ రహితుడు కాకపోతే రాజ్యాంగంలో నీకు అన్ని విధాలా ఆమె సహకరిస్తుంది. రాజ్యం రాంగానే కళ్లు నెత్తి కెక్కుతాయి. ఆ రాజ్య రమాగమన పరవశత్వంలో మనస్సుకు మైకంపట్టి మరపు సంభవిస్తుంది. జాగ్రత్త ! ఆ మరపును మాత్రం రానీకు. సౌమిత్రి పేరుకు తగిన సౌమ్యుడే అవచ్చు కాని, తేడా వస్తే కాల సర్పమే నని గుర్తుంచుకో ! నేను నీ పట్ల మూర్ఖంగానే ప్రవర్తించాను. నువ్వు మాత్రం ఈ కపి యోధుల పట్ల అలా ప్రవర్తించకు, ఆగ్రహించకు" అని తన మెడలోని బంగారు దండ తీసి సుగ్రీవునికి అందిచ్చాడు. సుగ్రీవుడు బెరుకు బెరుకుగానే దాన్నందు కున్నాడు. వాలి అంగదుణ్ణి జేరపిలిచి –

"ఈ సుగ్రీవునికీ నాకూ మధ్య హెరపొచ్చాలు లేనపుడు నువ్వు అతణ్ణి 'పిన నాన్న' 'పిన నాన్న' అంటూ చనువుగా పూసుకు తిరిగేవాడివి. సుగ్రీవుడు గూడా 'మా అబ్బాయి' 'మా అబ్బాయి' అంటూ నిన్నెత్తుకుని ముద్దాడేవాడు. ఇక ముందు గూడా ఇద్దరూ అలానే ఉండండి. ఈ కాంచనమాల నాకు అమరలోకాధిపతియైన మహేంద్రు డిచ్చాడు. ఈ మాలను మెడలో దాల్చిన వాడే కపి ప్రభువు. సర్వ వానరాధిపులు భక్తితో అతడినే నేతగా అనుమతిస్తారు. నా కంటె కొంచెం తక్కువై తే అవచ్చు గాని ఈ సుగ్రీవుడు అసమాన ప్రౌఢ బాహు బలుడు. కోదండ రాముణ్ణే సఖునిగా కలిగినవాడు, ఈ ధాత్రికి తగిన పాలకుడు. నువ్వు నీ పిన తండ్రిగా ప్రేమించి, పాలకునిగా గౌరవించు".

"ఈ గోలాంగూల రాజ్యము. రాజ్యాంగము – నిరంతరాయంగా, నిరాక్షేపణీయంగా సాగాలంటే ధీమంతురాలైన నీ తల్లి మనః ప్రవృత్తి ననుసరించి నడుచుకోవాలి గాని తిరస్కార దృష్టితో దూరం చేసుకోకూడదు. మీ ఇద్దరూ పెద్ద పని పెట్టుకొన్నారు. కపి యోధులు నీకు ఎదురు చెప్పరులే ! సుగ్రీవుడు కూడా అష్టకోలు మనిషి కాడని నాకు తెలుసు. ఇద్దరూ ద్వేషభావం మరచి తండ్రీ బిడ్డల్లా ఉండండి" అని అంటూండగా ఆయాసం వచ్చింది. నోట మాట రాలేదు. ఏదో చెప్పబోయి చెప్పలేక కళ్లనీళ్లతో అంగదుని చెయ్యితీసి సుగ్రీవుని చేతిలో ఉంచాడు. సుగ్రీవునికి భళ్లున దుఃఖం వచ్చి కళ్లనీళ్లు వరదలైనాయి. వాలి కాళ్ల మీద పడి ఏడ్చి ఏడ్చి లేచి అంగదుణ్ణి కౌగలించుకొని ఏడుస్తున్నాడు. ఆ సన్నివేశం చూస్తూన్న రాముణ్ణి చూస్తూంటే-'అన్నదమ్ముల వ్యవహారంలో అనవసరంగా జోక్యం గలుగజేసుకున్నానేమో' అని ఆలోచిస్తున్నట్లున్నాడు. లక్ష్మణుడు గూడా స్వామిని ఒక్కసారి చూసాడు. సామి చిరునవ్వు నవ్వినట్లనిపించింది. జీవుల విచిత్ర ప్రవృత్తికి దేవునికి కలిగే భావ మిలాగే ఉంటుందేమో !"

# వాలి అంత్యదశ

మెల్ల మెల్లగా వానరు లందరూ అక్కడకు చేరారు. వాలి ఒక్కసారి నోరు తెరిచాడు. నాభివద్ద శ్వాస తాలూకు సంచలనం ఆగిపోవడంతో తార ఒక్కసారి నేలపై కూలి పోయింది. పశ్చిమ దిక్కున సూర్యు డస్తమించాడు. చలువల కాంతితో చంద్రుడు ఆకాశంలో పైకెక్కాడు.

వానరయోధు లందరూ వాలికి ప్రణమిల్లి కళ్లనీళ్లతో వరుసలుగా నిల్చుండి పోయారు. కాగడాలు వెలిగించారు. వెన్నెల నీడలు, కాగడాల వెలుగుల వెనుక నీడలు, వృక్షాల నీడలు – కాలకింకరులు భూమిపైకి వచ్చారేమో ననే భ్రాంతిని కలుగ జేస్తున్నాయి. వాలి శరీరంలోంచి బాణాన్ని తీశారు. పూర్వం భూమిని నొక్కిపట్టిన హిరణ్యాక్షుని కోరనే ఈ అమ్ములాగా మలచలేదు గదా అన్నట్లుంది ఆ బాణం. అమ్ము పెకలింప బడిన వాలి పెనుబొమ్ము – రెక్క తెగిన పర్వతంలాగా ఉంది. నెత్తురు ఉవ్వెత్తున చిమ్మి కాలువలై ప్రవహించింది. దృశ్యం హృదయ విదారకంగా ఉంది. రామలక్ష్మణు లిద్దరూ దూరంగా వెళ్లి విశ్రాంతి తీసుకుంటున్నారు. వాలి పడి ఉన్న ప్రాంతం వద్దకు వానరు లందరూ గుంపులు గుంపులుగా జేరి –

"అయ్యో కిష్కింధ చీకట్లో మునిగి పోయింది. చక్కని శోభ ముక్కలైంది మా గుండెలు శూన్యమై పోయాయి. పదునైదు సంవత్సరాలు కిష్కింధను అందలం ఎక్కించాడు మా వాలి. గంధర్వ ధూర్తుల్ని, మదాంధ రాక్షసుల్ని మట్టి కరిపించిన మా వాలి మాకు దూర మయాడు. సప్తతాళ విదళనోత్సవాలు, రాక్షస సంహారాలు, వీరోత్సవాలకు నోచుకునే

భాగ్యం ఇంక లేదు శౌర్య కాంతులు విరజిమ్మే మా కిష్కింధాపుర ప్రధాన దీపాన్నే పుటుక్కున ఆర్పేశాడు నిర్దయుడైన ధాత. మా తల రాతనే మార్చేశాడు విధాత" అంటూ విలపిస్తున్నారు. పొద్దుపోతున్న కొలది ఒక్కొక్కడే నిద్రా దేవత వడిలోకి జేరారు. అంగదుడు గూడా కునుకుతున్నాడు. అప్పుడు తారా సుగ్రీవు లిద్దరూ తెల్లవార్లూ అలాగే ఉన్నారు. తార తనని నాలుగు మాటలూ అంటుందనుకున్నాడు సుగ్రీవుడు. కాని తార ఏమీ మాట్లాడ లేదు. సుగ్రీవుడే తెగించి ఏదో మాట ప్రారం భిద్దామను కున్నాడు గాని వదినెతో పలుకడానికే భయపడుతున్నాడు. తార తనలో తానే సముద్రాలను త్రవ్వుకుంటోంది. ఆ సముద్రపు ఆటుపోట్లు మనస్సును మధన పెడుతున్నాయి. అంతలోనే తూర్పున ఉషోదయ మైంది. కపి వీరుల కను రెప్పలు విచ్చుకున్నాయి. అప్పుడు తార తూర్పు దిక్కును చూస్తూ —

# తార వ్యధ

"ఈ లోకంలో ఎంతమంది లేరు? అయినా ఈ సూర్యుడు-తెల్లవారిందో లేదో తన కులం వాణ్ణి (శ్రీరాముడు) తన కొడుకును (సుగ్రీవుడు) తన శిష్యుణ్ణి (హనుమంతుడు) తన కరాలతో ప్రేమగా స్పృశించి నా ముఖాన పొద్దుపొడిచాడు." ఇలా అనుకుంటున్న తారకు - పెరిగిన సూర్యుని వెలుగులో మగనిస్థితి మరింత స్పష్టంగా కనబడింది. వాలివైపే చూసిన తార తనలో తనే ఇలా అనుకుంటోంది —

"భర్తకు అసలేది ఇష్టమో ఇప్పుడు తెలిసింది. మొదట నేనే ఇష్ట మనుకున్నాను. ఆ తర్వాత నేను కాదు రాజ్యలక్ష్మి అని తెలిసింది. కాని ఇప్పుడు అదీ కాదని కళ్లు మూసుకుని స్థిమితంగా పడుకుంటే అమితమైన

సుఖాన్నిచ్చే నేల అని తెలిసింది. దక్షిణాపథంలోనే ఒక మహావీరపత్నిగా గౌరవింపబడిన తార యొక్క సకల సౌభాగ్యం ఈ రోజు మృగ్యమై ఒక సామాన్య స్త్రీ కంటె అధమమైన స్థితికి దిగజారి సుమంగళీత్వానికే దూరమైంది. ఈ దేహం మీద భ్రాంతి ఉండబట్టేగదా నేను ఇంకా బ్రతికే ఉన్నాను. ఆహా! ఈ ఐహిక లోకపు మాట దాటరానిదిగదా! మనకు ఒకప్రక్క బ్రతుకుమీద ఇష్టముండి ప్రాణాలు వాటంతట అవి పోవాలంటే పోతాయా? ప్రళయకాళ రుద్రుడు లాంటి రాముని దగ్గఱకు వెళ్లవద్దయ్యా అని ఎంత బ్రతిమాలినా, బామాలినా విన్నావు కావు. చివరకు నన్నిలా ఒంటరిగా మిగిల్చావు. వర్ష ఋతువు పోయినా సారంలేని పొగ గుంపు మబ్బులు మిగిలి ఉన్నట్లు నీవు పోయినా నేను ఇలా మిగిలి ఉన్నాను. లోపల నుండి వచ్చే మృత్యు తాపాన్ని తట్టుకోలేను. నీ మార్గానబడి నిన్ను చేరుకుంటాను. ఇంక నేను ఆగలేను'' అంటూ గుడ్లు తేలేస్తుంటే అంగదుడు 'అమ్మా' అని అరచి కౌగలించుకున్నాడు. ఒక్కసారి సుడిగుండంలో పడి, పైకితేలి, తెప్పరిల్లినట్లు తార కొడుకు మెడమీద వ్రాలి ఏడ్చి, మళ్లీ తనను తాను సంబాళించుకొని, చీర చెంగుతో కళ్లు అద్దుకుని, కుమిలిపోతున్న కొడుకుని దగ్గరకు తీసికొని 'తండ్రీ నేను పోలేదయ్యా బ్రతికే ఉన్నాను', అని ఓదారిస్తే అంగదుడు గూడా చివరకు తేరుకున్నాడు. అప్పుడు తార–

"ఎప్పుడన్నా అడవుల్లోకి వెళ్లి తిరిగి రావడం ఆలస్యమైతే 'పిల్లవాడేడీ? ఎక్కడికెళ్లాడు?' అని ఆదుర్దాపడేవాడివి. కపిశ్రేణీపతి వౌతాడని ఎప్పుడూ ఈ పిల్లవాణ్ణి వెయ్యికళ్లతో ఆప్యాయంగా చూచుకొనే వాడివి. అటువంటి నీ పిల్లవాడు నీ ఎదుటే నిర్భాగ్యుడుగా ఉన్నాడు. కాస్త దయ చూపించు వానర నాయకా! నువ్వు నీ రాజకార్యాల్లోనే మునిగి పోయావు. పిల్లవాని సంగతి ఎప్పుడూ ఆలోచించ లేదు. బాహుబల పరాక్రమవంతుడైనా తండ్రిచాటు బిడ్డగానే ఇన్నిరోజుల నుండి ఉండిపోయాడు. ఇంతకు తప్పించి నీ అను

గ్రహాన్ని ఏ విధంగానూ పొందలేకపోయాడు గదయ్యా! ఇల్లాంటివాణ్ణి గుండెలకు కట్టుకుని అడవుల వెంట తిరగనా? శౌర్యము, బలము ఉండి గూడా తగిన సాహసం చెయ్యకపోబట్టే గదా ఇలా వచ్చింది. ఎవరిని చూస్తుంటే సర్వలోకేశ్వరత్వాన్ని పొందుతున్నట్లు సంతోషపడే వాడివో ఆ అంగదునికి చివరకు పట్టిన గతి చూడవయ్యా! నీతోనే వచ్చేద్దామన్నా ఈ పసివాని బాధ్యత నా మీద వదిలి పోయావు గదా! బిడ్డను తల్లిదండ్రులిద్దరికీ దూరమయేట్లు చేయలేక ఇలా ఉండిపోతున్నందుకు మన్నించాలి.'' అంటూ వాలిమీద వ్రాలిపోయింది - జల జలా కన్నీళ్లు కారాయి. ఆ దుఃఖం క్రమంగా తగ్గుతుందిలే అనుకుంటే అంతకంతకు పెరిగిపోయింది. ఆ దుఃఖాన్ని ఎవ్వరూ వచ్చి ఆపలేకపోయారు.

## సుగ్రీవుని వ్యథ

దీన ముఖంతో సుగ్రీవుడు వెతుక్కుంటూ అడవిలోకి వెళ్లి శ్రీరాముణ్ణి కలిసి—

''నీ ప్రతిజ్ఞ నీవు చెల్లించావు. ఇంక నా ప్రతిజ్ఞ నేను చెల్లించ గలిగినంత సామర్థ్యం నాకు ఉన్నదా అన్న అనుమానం కలుగుతోంది, నీవు దండ్యుడైనవాణ్ణి దండించావు. కాని నేను చేసిన పని అదికాదు గదా! సర్వ కపిలోకాధినాథుడు, అగ్రజుడు అయిన ఒక మహానుభావుణ్ణి చంపించాను. అవతల మా వదినగారి దుఃఖం చూస్తే నా తప్పు ఒకటికి పది, పదికి వేయి, వేయికి కోటిరెట్లయి కనిపిస్తోంది. నాకు బుద్ధిలేదు. నేను చేసిన ఈ పనికి మా కులవృద్ధులు ఊరుకుంటారా? ఎందుకొచ్చింది. అయిందేదో అయిపోయింది. నాకు ఈ రాజ్యం వద్దూ పాడూ వద్దు. లోగడ ఉన్న ఋష్యమూకం మీదే

కాలం గడుపుకుంటాను. నాకు హితులయిన వారు శౌర్యసామర్థ్యాలు కల వారు అయిన వానరులున్నారు. వారిచేత దిక్కుదిక్కులా వెదకించి ధరణీ జాత జాడను నీ కెరింగిస్తాను."

"కడుపులో దుఃఖం కళ పెళ లాడుతుంటే తార, అంగదులిద్దరు పతిని పితను చివరి క్షణాల్లో చూడ్డానికి వచ్చారు కాని – నాతో పోరుకు దిగడానికి రాలేదు. అన్నతో పాటుగా అల్లాంటి కొడుకును, పట్టపు రాణిని, బంధువుల్ని పట్టి చంపించి రాజ్యం మీద దురాశతో మరింత పాపానికి ఒడిగట్ట మంటావా? ఆ అన్నా వదినలు అంగదుణ్ణి అటుంచి నన్నే రాజుగా తెలిపారు. నాకూ వాళ్లకూ ఉన్న వ్యత్యాసం ఎంత స్పష్టమో తెలిసిందా? నేను ఉద్వేగ పూరితుణ్ణి, వృథా కుపితాంతరాత్ముణ్ణి. పర్వత ప్రమాణంలో ఉన్న నా ఈ దుర్మతిత్వాన్ని లోకం గర్హించకుండా ఉంటుందా? ఇంట్లో చీమలెక్కువగా ఉన్నాయని వాటిని వదిలించు కోవడానికి కొంప చూరుకు నిప్పంటించు కున్నట్లుంది – నేను చేసిన పని. లేకపోతే అన్నగార్ని చంపట మేమిటి? స్వామీ! రామా! నా యీ పాపం ప్రతిజన్మ లోనూ నన్ను వెంబడించి నా సర్వ పుణ్యఫలాలకు అడ్డుకట్టగా నిల్వదా ? నిస్వార్థంగా, సర్వ వానర రంజ కంగా పరిపాలించిన అన్నను, తండ్రిలాంటి వాణ్ణి స్వార్థబుద్ధితో చంపించిన వాణ్ణి నేను. ఇటువంటి నాకు పాప పుణ్యాలంటని స్వభావ మహేశ్వరుడవైన నీ ముఖాన్ని చూచుకుంటే నేను పొందాల్సిన ఓదార్పును పొంది, రావల్సిన ఓర్పు వస్తోంది. నీ నవ్వుల వెన్నెలలోనే నాకిక శాంతి, ప్రశాంతి" అన్నాడు.

శ్రీరామచంద్రుడు సుగ్రీవుని మాటలు విని, లక్ష్మణ సమేతుడై, సుగ్రీవుడు వెంటరాగా వాలి వధ జరిగిన చోటుకు చేరాడు. అక్కడ వాలి చుట్టాలైన పెద్దలు తారను జబ్బలు పట్టుకొని లేపారు. తార శ్రీరాముణ్ణి

చూచి గుర్తించింది. కోప దుఃఖ గౌరవ నిరాదరణ భావాలు ఆమె కను కొసల్లో కనుపిస్తున్నాయి. అవే చూపుల్తో శ్రీరాముని ఉద్దేశించి –

## తార వ్యధాపూరిత వ్యంగ్యోక్తులు

"మాకు దుఃఖాలు, మీకు మందహాసాలు. మాకు ప్రాణాభిమానహాని, మీకు కేళీవిలాసాలు. ఎవరి సంగతి ఎవరిక్కావాలి? నీవు వేదార్థ పరినిష్ఠిత బుద్ధివి. నీల మేఘ శ్యాముడవు. సమస్త ధాత్రీ రక్షణా దక్షుడవు. అన్ని విషయాల్లోనూ మేము అల్పులం. మరి మీరు వేదధర్మమూర్తులైన అనల్పులు. అల్పులైనవాళ్ల ఏదైనా పనిని సగం చేసి మిగిలిన పనిని సగంలోనే విడిచేస్తారు. అనల్పులైన మీరు గూడా అలాగే చేయకూడదు గదా ! నీవు సమస్త ధర్మాలు తెలిసిన నేర్పరివి. సమస్త శిక్షలు గూడా తెలిసిన నేర్పరివి. పని పూర్తయితేగాని ఎక్కుపెట్టిన బాణాన్ని దించి వృధాకానీయని తత్పరివి. పని పూర్తికాకుండానే మధ్యలో ఆపివేయడం తగదనే ఓర్పరివి ఈ భూమి మీద భార్య భర్తకు అర్ధాంగి. అంటే భర్త దేహంలో సగం భార్యే ! ఈ విషయం నీకు తెలిసిన వేదాల్లో చెప్పబడిందో లేదో నీకే తెలియాలి. రాముడు ఏ పనినైనా సంపూర్ణంగా చేస్తాడనే కీర్తి విశ్వమంతా. నిండి వెలుగొందుతుంది. నేనే స్వర్గానికి వెళ్లి స్వయంగా నీ కీర్తి చాటుతాను, ఒక్క పని చెయ్యి" అంటూ వాలిపై రాముడు వేసిన బాణాన్ని తెచ్చి రామునికి చూపించి –

"ఇన్నాళ్లదాకా యముడు ఇంత అందంగా ఉంటాడని నాకు తెలియదు. విల్లు అక్కర్లేదు. అల్లెత్రాడూ అక్కర్లేదు. బాణాన్ని ఎక్కుపెట్టే పనేలేదు. ధనుర్భంగం చెయ్యక్కలేదు. నువ్వు ఊరికే పూచిక ముల్లును పుచ్చుకున్నట్లు

ఈ బాణాన్ని పుచ్చుకో చాలు. అంతే! ఇంక నువ్వేమీ కష్టపడక్కరలేదు. ఆ బాణం ముల్లుకు నా ఆంతకు నేనే వచ్చి గ్రుచ్చుకొని ఛస్తాను. దీని వల్ల నీ శౌర్యం కుంటుపడుతుందనుకోకు. నీవు వికుంఠ శౌర్యం గలవాడివి గదా! నీకు ఆ అపకీర్తి రానిస్తానా? నాకా ఈ తనువుతో పనిలేదు, దాని మీద చింత కూడా లేదు" అని అంతటి దీనస్థితిలో కూడా నర్మగర్భంగా రామునిపై కోప, దుఃఖ గౌరవ, నిరాదరణలు కలిగిన కంఠంతో పలికింది. ఆ మాటలకు శ్రీరాముడు వెంటనే తార చేతిలోని బాణాన్ని తీసికొని—

## శ్రీరాముని ధర్మవేదాంత వచనాలు

"కాస్త కోపాన్ని విడిచిపెట్టవమ్మా! శోకమోహాలే నీవిలా అనడానికి కారణం" మోహంవల్ల దుఃఖం, దుఃఖం వల్ల కోపం, ఆ కోపంలో వ్యంగ్యం. ఇలా చూస్తే అసలు మోహమే మొదటి కారణం అనిపిస్తుంది. దాన్ని వదులు, అన్నీ తేట తెల్లమౌతాయి. ఈ భూమ్మీదకు ఎవ్వరూ ఎవ్వరినీ తెచ్చింది లేదుగదా! ఎవరన్నా తెస్తే పోగొట్టుకుంటున్నపుడు ఏడవవచ్చు. చచ్చినపుడు దుఃఖిస్తే మరి అట్లా చావడానికి కారణమైన జన్మమెత్తుతున్నపుడు కూడా ఏడవాలి గదా! చావాల్సిన కాలం రాకపోతే కాకైనా చావదు. కాలం కాకుండానే చావాలని కోరుకుని మృత్యు ముఖంలోనికి తగుదునమ్మా అని ప్రవేశించినా ఆ మృత్యుదేవత బయటకు కక్కేస్తుంది తప్పితే తనలో ఇముడ్చుకోడానికీ ప్రయత్నించదని తెలుసుకో! అదీ దాని లక్షణం. చచ్చిన భర్త వెంట స్వర్గానికి వెళ్తానంటావు గదా - ఆ చచ్చిన భర్త స్వర్గానికే వెళ్లాడని నిశ్చయమేమైనా వుందా? పోనీ నువ్వు ఎక్కడకు వెళ్లాలనేది ఏమన్నా నిశ్చయింపబడివుందా? ఎవరి కర్మను బట్టి వారి మార్గం వుంటుందిగాని ఈ తనువులు విడిచిన తరువాత ఎవరికి ఎవరు

చెప్పు ? ఆ కాస్త శ్వాస ఆగిపోతే దేహం కుళ్లిపోయి దుష్టమై దహన సంస్కారం పొందాల్సిన దౌతోందే తప్ప ఇతరత్రా యోగ్య మవదు గదా! జీవుల కామోల్బణ ప్రవృత్తి స్త్రీవైన నీకూ ఉండవచ్చు. అది దేహం ఉన్నంతవరకే పరిమితం. కామవివశత్వం ఉన్నంత వరకూ ఏది సత్కార్యమో ఏది అసత్కార్యమో అనే విచక్షణ, వివేకం తెలియవు. బ్రహ్మలోక పర్యంతమైన ఈ విశ్వం ఒక నియమానికి కట్టుబడి వుంది, అలా కట్టుబడనిది, నియమ రహితమైనదైతే అది నరకమే ! ఆ నరక మార్గంలో దుఃఖమే ప్రథమ ఫలం" అన్నాడు.

## కర్తవ్యాన్ని గుర్తించిన లక్ష్మణుడు

శ్రీరాముని సూటివాక్కులను విన్న తార అలానే నిలుచుండిపోయింది. ఆమె కోపం దుఃఖం అన్నీ ఆమెలోంచి ఎలా అభివ్యక్తమయాయో అలాగే ఆమెలోకి అభిక్లుప్తమై లీనమైపోయాయి. శ్రీరాముని కమనీయ, గంభీర కంఠ స్వరాలలో లీనమై మౌనంగా నిలుచుండిపోయింది. అప్పుడు లక్ష్మణుడు తారుణ్ణి పిలిచాడు. ఊళ్లోకి వెళ్ళి దహన సంస్కారానికి కావలసిన ఏర్పాట్లకై తీసుకురావలసినవన్నీ తీసుకురమ్మన్నాడు వాళ్ల ఆచార ప్రకారం చేయవలసిన ప్రయత్నాలు సిద్ధం చేసి పట్టుకురావసిందిగా చెప్పి వూళ్ళోకి పంపాడు. సుగ్రీవ అంగదులను చూచి లక్ష్మణుడు----

"వయసు మీరిన పెద్దవాడు, వయసు మీరని చిన్నవాడు ఇద్దరూ ఒకే రకంగా వుంటే ఎలా ? జరగాల్సిన కార్యం జరగాలి గదా, ఇలా కూర్చుండిపోతే ఎలా ? అవతల బోలెడంత పని వుంది. ఇలా ఏడుస్తూ కూర్చుంటే వెళ్ళిన తారుడు వచ్చేస్తాడు. ఎండెక్కినకొద్దీ మండివడే ఆది

త్యుడు మరింత బాధ పెట్టాడు. ఎంత పెద్దగా బాధపడి ఏడ్చినామటుకు పోయిన అన్నగారు గాని, తండ్రి గాని తిరిగి లేచి వస్తారా ?" లక్ష్మణుడలా అనగానే తార, అంగదుడు, సుగ్రీవుడు లక్ష్మణుని వంక బెరుకు బెరుగ్గా చూపులు చూస్తూ దుఃఖాన్ని దిగమింగుకున్నారు. తారుడు సర్వ సంబారాల తోటి వచ్చాడు. వాలి కళేబరాన్ని వాహకులు శిబికపైకి ఎక్కించారు. అప్పుడు తట్టుకోలేక తార–

## ఆత్మీయుల ఆవేదన

"ఓ మహారాజా ! నీకు ఒకనాటి భార్యను. నీకు నా ఋణం తీరి స్వర్గానికి వెళ్ళిపోతున్నావు. కాకుత్స్థుని బాణాగ్నికి దగ్ధమైన మహావీరా! అతిలోక శౌర్యానికిదే నా తుది అంజలి" అంది. వాలి దేహనికి అంగదుడు అగ్ని ముట్టించాడు. అప్పుడు మళ్లీ తార–

"నా సౌభాగ్యం నీ చితిలోనే మంటగల్సి పోయింది. నా నాధుడు నాకు దూరమయ్యాడు, నన్ను గూడా కాల్చండి." అంటూ ముందుకు వెళ్తుంటే అందరూ ఆమెను వెనక్కు లాగి ఓదార్చారు. అంగదుడు కర్మశేషాన్ని పూర్తి చేశాడు. నివాసానికి వెళ్ళి చతికిలబడి చేతులు ముఖంమీద పెట్టుకొని విలపిస్తూ–

"ఆయనంటే నా భయానికి అంతులేదు. ఆయనకు నాయందున్న ప్రేమకు అవధిలేదు. ఆయన ప్రాభవాంభో మహారాశి. అల్లాంటివాడు నా తండ్రి అనుకుంటే చాలు, నలుసునైన నాకు ఏమీ లేకుండానే గౌరవ ప్రతిష్ఠలు కలుగుతాయి. నాకు దూరమైపోయాడు నా తండ్రి" అంటూ

విలపిస్తున్నాడు అంగదుని ఆ మాటలకు సుగ్రీవుడు ఏదైనా చెప్పి ఓదార్చ ప్రయత్నిద్దా మనుకున్నాడు. కాని, ఓదార్చ లేకపోయాడు. తనను తానేతట్టుకో లేక కొడుకు ప్రక్క కూర్చుండి హృదయం పగిలేలాగా –

"ఆయన పోయాడని దుఃఖిస్తూంటే నల్గురూ నవ్వుతారు. 'ఇంత మలిన కృత్యం చేయించి, చంపి ఏడుస్తున్నాడు గూడాను' అని ఏవగింపుతో చీదరించుకుంటారు. ఈ పాపం నేను వెయ్యి జన్మలెత్తినా తీరుతుందా ?" అంటూ దుఃఖిస్తున్నాడు.

ఇలా మానసోద్వేగాలకు ఎవరికివారు బయటపడి తమ తమ స్వభావా లకు తామే తాత్పర్యం చెప్పుకున్నారు. వియత్పథంలో -

రఘుకుల క్షీరాబ్ధిచంద్రా! రాజీవరమణీయ నేత్రా! ఆనంద విహారా! తార చెప్పిందయ్యా పోవద్దని, కాని నేనే వచ్చాను, నా కోర్కె పండిం దయ్యా! నీ బాణానుగ్రహంతో నాకు ముక్తిని లభింపజేశావు అంటూ తృప్తిగా వాలి విశ్వంలోకి లీనమైనాడు.

అన్న వాలిని చంపించి తాను ఘోరమైన పాపకార్యాన్ని చేశానని మహాశోకంతో, మనస్సు వికలమై సుగ్రీవుడు కిష్కింధా రాజ్యపాలన విషయంపట్ల విముఖంగా వున్నాడు. పురానికి దూరంగా అడవుల్లోనే వున్నాడు. సుగ్రీవుడు రాజ్యపాలనకు చాలా సమర్థుడే! సర్వ వానర రంజకంగా తానూ పరిపాలించగలడు, కాని, మనోవ్యధతో ఆ విషయం పట్టించుకోవడం లేదు. వానర మంత్రుల కేమి చెయ్యాలో తోచలేదు' శ్రీరామునికి సంగతి చెప్పి - "ఏ సమయంలో ఏమి చెయ్యాలో. ఎవరికి ఎలా చెప్పాలో - అన్నీ తెలిసిన సర్వజ్ఞులు మీరు - చెప్పగలవారు చెప్పితేనే పని జరుగుతుంది. మీరు కనక ముందుండి పురప్రవేశం చేస్తే సుగ్రీవుడు

మిమ్మల్ని అనుసరించి వస్తాడు. కాస్త దయ చూపించండి." అన్నారు. అప్పుడు శ్రీరాముడు సుగ్రీవునితో -

## శ్రీరాముని ఓదార్పు

"మిత్రుడా! కపిలోక రాజ్యశాసకా! అంగదుడు పాపం ఇంకా వయసు మీరనివాడు, అనుభవజ్ఞుడు కాడు. మరి ఈ వానర రాజ్యలక్ష్మిని తీవ్రమైన వియోగ బాధకు గురిచేయకుండా సర్వ జగదామోదంగా సుఖ పెట్టవయ్యా! నిజమే నీలో బంధుత్వానికి శత్రుత్వానికి ఘర్షణ జరిగింది. ఇంతదాకా శత్రుత్వ భావమే అధికమించింది. ఇప్పుడు బంధుత్వం అధిగ మిస్తోంది. ఇలాంటి పరిణామాలు భూపాలకులకు తప్పవు మరి! రాజ్యాన్ని స్వీకరించి, యౌవరాజ్యాన్ని గుణవంతుడైన అంగదునికిచ్చి, రాజ్యాన్ని పరి పాలించు. జ్ఞానమార్గంలో ఎవరి త్రోవ వారిది. ఒకరికొకరితో సంబంధం వుండదు. కాని, ఈ లోకయాత్రా విధానంలో ఒకళ్లతో ఒకరికి సంబంధం తప్పదు. అయినప్పటికీ తామరాకుమీద నీటిబొట్టులాగా అంటీ అంటకుండా తన కర్తవ్యాన్ని తను చేసుకుంటూ పోయేవాడే వివేకవంతుడు, గుణవంతుడు అనిపించుకుంటాడు. వాడే ఆత్మయందు చెడనివాడు. ఈ ఆత్మ ధర్మ పథాన్ని ఏమాత్రం విడనాడినా వాడు విషాద దుఃఖ వికలాత్ముడౌతాడు. అల్లాంటి వాడు ధర్మజీవితాన్ని గడపలేక ఇహానికీ, పరానికీ కాక రెంటికీ చెడ్డ రేవడౌతాడు. అయినా నేను చేసినదానికి నీకు పాపఫలం ఎందుకు వస్తుంది? పుణ్యమైనా, పాపమైనా చేసిన కర్తకు చెందుతాయి, బాణంతో ఎవరినైనా చంపితే బాణం వేసినివాడు చంపినట్లుగాని, బాణం కాదుగదా! నువ్వు కేవలం బాణంలాంటి వాడివేగాని - బాణం వదిలినవాడివి గాదు" అని నిక్క చ్చిగా చెప్పగానే అక్కడున్న వానర ముఖ్యులందరూ సంతోషంతో,

కేరింతలతో ఎగిరి గంతులు వేస్తుండగా సుగ్రీవుడు కిష్కింధా పుర ప్రవేశం చేశాడు. ఆ సమయంలో—

## పట్టాభిషేక సంరంభం

భేరీ, పటహ, మృదంగ నాదాలు మిన్నుముట్టాయి. ద్వారాలు తోరణాలతో, పుష్పమాలలతో అలంకరింపబడ్డాయి. వానరులందరూ ఆనందోత్సాహంతో కోలాహలంగా వున్నారు. సర్వ కిష్కింధలో ఆనందం వెల్లివిరిపింది. రాత్రికి ముడుచుకున్న పద్మంలోంచి ప్రొద్దు పొడిచిన వేళలో తుమ్మెద బయటపడి ఆనంద ఝుంకారాన్ని ఆలపించి, అడవి నంతా ఆనంద పరచి నట్లయింది. కృష్ణ పక్షాంతంలో శుక్ల పక్షం మొదలైనట్లుంది ఒక శిశిర ఋతువు అంతంలో వసంతఋతువు మొదలైనట్లుంది. గుడి కట్టిన చంద్రునిలాగా విషాదంలో వికాసం, జాబిల్లిలోని మచ్చలాగా వికాసంలో విషాదం – అంతలోనే తీసిపోయి, అంతలోనే ఉధృతమయే కొండ సెలయేరులాగా కిష్కింధాపురం యావత్తు శోకాంధకారం నుండి ఆనందపు వెన్నెలలతో – కారుమబ్బుల శ్రావణ మాసం పోయి వెండి వెన్నెలల కార్తీకం వచ్చినట్లుంది. ఊరు ఊరంతా వియత్పథంలో ముత్యాల తోరణాలు, ధరిత్రీతలంపైన ముగ్గులు మెరుపు తీగల శోభతో – ఒక దానితో ఒకటి పోటీ పడుతూ వింత శోయగాన్నందిస్తూన్నాయి. కపీంద్రుని రాకతో కపియోధు లందరూ ఒక్కసారి లేచారు. వారి హార, కేయూర, మణిబంధ, మాణిక్యా భరణాలు ఒక్కసారి మృదుల. మధుర నిస్వనాలతో తళుక్కుమని, వసంతాగమన తరులతా వృక్ష, శాఖలవలె ప్రమోద భరితులయారు.

సుగ్రీవుడు వస్తున్నాడు అనంగానే అంతఃపుర దేవేరికలు గౌరవాభిముఖ ప్రణామ గమనాలు చేసారు. ఎదురుగా తెచ్చిన అనుభవయోగ్యమైన సుగంధ

ద్రవ్యాదులను స్పృశించారు ఆనందం వెల్లివిరిసిన విశాల నేత్రాలతో, నిర్మల భూషణ సూన రమ్యమైన తనూ వికాసంతో, నిరుపమాన సౌందర్య రాశియైన రుమను తార తనచేతులతో పట్టుకుని, స్వస్తి వాచకాలతో సుగ్రీవుని సన్నిధికి పంపింది. బుగ్గలపై సిగ్గు మొగ్గలు లేత గులాబీల సోయగంతో రుమ చిత్ర విచిత్రంగా నయన వదనాలను ఓరగా త్రిప్పుతూ భర్తకు ప్రణామం చేసింది. అక్కడనుండి బయటకు వచ్చిన కిష్కింధేశ్వరుణ్ణి కపియోధులంతా చుట్టు ముట్టి, గౌరవ భక్తి మర్యాదలతో పట్టాభిషేక మండపానికి తీసుకు వెళ్లారు. అక్కడ – 'కపిలోక పరమేష్ఠి ! కదన భీకర ముష్టి! జయ ఋక్ష రజసస్సుతా! జయ వానరాభినుతా! జయరామ ప్రియ సఖా! జయ కీశనాయకా ! అంటూ మాగధులు జయ జయ ధ్వానాలు చేశారు.

మంత్రులందరూ సుగ్రీవుణ్ణి పీఠంపైన సుఖాసీనుణ్ణి గావించారు. శ్వేత ఛత్రం పట్టారు· బంగారు పిడుల చామరాలతో వీచారు, సర్వరత్న, బీజ, ఔషధ, ఫల ప్రసూనాలు, తెల్లని జరీ వస్త్రాలు. చందన, మకరందాలు, దధిక్షీరాలు. శార్దూల సూకర చర్మ పాదుకలు, నానావిధ పరిమళాలు, నానా విధ పానీయాలు, నానావిధ వస్త్రాభరణాలు సమర్పించారు. పదహారేళ్ల వయసు కత్తెలు పదహారు మంది వచ్చారు యథావిధిగా క్రతుకాండ నడిపిన బ్రాహ్మణులను రత్న, వస్త్ర, భోజన, తాంబూలాది కవలలతో సంతోష పరిచారు. హెూమాగ్ని గుండంతో హనుమ, జాంబవంత, ద్వివిద, మైంద, తారు, నల నీలాది కపిశ్రేష్ఠులు మంత్ర పూతమైన హవిస్సును సమర్పించారు· అందరూ ఆనందాతిశయంతో తోక లెగరేశారు. పైకి ఎగిరారు, దుకారు. పళ్లు ఇకిలిస్తూ వెక్కిరించుకున్నారు. ఒకళ్ల జబ్బల్ని ఒకళ్లు పట్టుకుని లాక్కున్నారు, గోళ్లతో గోక్కుంటూ, తలక్రిందులుగా వ్రేలాడారు. పళ్లని, కాయల్ని సగం కొరికి సగం తిని పారేశారు. మధ్య మధ్యలో జయ జయ

ధ్వావాలు చేశారు. రాజ్యలక్ష్మీ సౌభాగ్యాన్ని కొనియాడారు. విహరించి పట్టాభిషేక మహోత్సవంలో ఇష్టానుసారంగా వానరులంతా ప్రవర్తించి ప్రమోదభరితు లయారు.

పట్టాభిషేక మహోత్సవం పరిసమాప్తి అయింది. సుగ్రీవుడు తన మంత్రుల వంక, అంగదుని వంక ఒక్కసారి చూసాడు. హృదయంలో ప్రతిష్ఠించుకున్న శ్రీరాముణ్ణి చూచి—

## సుగ్రీవుని అభిలాష

"ఈ కిష్కింధా రాజ్యానికి నేను ఇలా రాజు నవడానికి కేవలం మీ దయే కారణం. నిజానికి నాకైతే ఇప్పుడు ఈ ధరణీ పతిత్వం మీద మునుపు ఉన్నంత ఆశ లేదు. అయితే ధరణీజాత జాడను తెలుసుకునేందుకు ఇటు నేనూ, అటు అంగదుడు సమైక్య భావంతో వెదికి నీకు అన్ని విధాలా తోడ్పడగలిగితే మా రాజు, యువరాజు పదవులు, జీవితాలు ధన్యమైనట్లే ! నా గుండెల్లో బరువు తొలగినట్లే ! ఈ నా పట్టాభిషేక మహోత్సవంలోనే అంగదుని యౌవరాజ్య పట్టాభిషేక ఉత్సవాన్ని గూడా నీ చేతిమీదుగా జరిపిస్తే నాకు ఆనందంగా వుంటుంది" అన్నాడు. సుగ్రీవుని మాటలకు మంత్రులందరూ సంతోషించారు. వెంటనే అన్ని ఏర్పాట్లతో అంగదునికి యౌవరాజ్య పట్టాభిషేకం జరిగింది. కిష్కింధాపురవాసు లందరూ సుగ్రీవుని మంచితనాన్ని వేనోళ్ల కొనియాడారు. ఉత్సవాలన్నీ పూర్తయిన తరువాత ఒక ప్రాతః సంధ్యాసమయంలో రాజ లాంఛనాలు విడనాడి సుగ్రీవుడు, ఆంజనేయుడు ఇద్దరూ శ్రీరామచంద్రుణ్ణి దర్శించడానికి వచ్చారు. శ్రీరాముడు అందరినీ కూర్చోవలసిందని సంజ్ఞ చేశాడు. అందరూ కూర్చున్నారు. అప్పుడు శ్రీరాముడు –

# శ్రీరాముని ఉపదేశం

"రాజలాంఛనాలు తీసివెయ్యాల్సిన అవసరం ఏమొచ్చిందయ్యా ఇప్పుడు ? పెండ్లికొడుకులాగా సర్వభోగయుతుడై కన్నబిడ్డ నిన్ను చూసి నప్పుడు నాకు ఎంత ఆనందం కలిగిందో తెలుసా ? నువ్వెప్పుడూ అలాగే ఉండాలి. నువ్వూ, నీ భార్యా ఇకపై ఏ మాత్రం లోటు లేకుండా సుఖా లనుభవించండి. నీ రాజ్యలక్ష్మి ఆచంద్రతారార్కం వర్ధిల్లుతుంది. తార గూడా నిన్ను చేరి నిన్ను సంతోష పెడుతుందిలే ! ఈ ముగ్గురితో ముడి పడిన నీ జీవితం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్ధిల్లుతుందిలే ! నీవు భోగాల ననుభవించడానికి యోగ్యమైనదే గాని ధరణీజాత జాడను వెదకించే ప్రయత్నానికి కాలం యోగ్యం కాదు. పైగా వచ్చేది వర్షఋతువు, నదులు తీవ్రమైన వేగాలతో ఒడ్డులనే కోసివేస్తూ మహా ఉధృతంగా వుంటాయి. దాటడానికి ఏ మాత్రం వీలుండదు. భూమంతా వర్షపు నీటి మూలాన్న బురద బురదగా నడవడానికి వీలులేకుండా వుంటుంది. ఆ పైన వచ్చే శరదృతు కాలంలో అన్వేషణకు అన్ని విధాలా యోగ్యంగా వుంటుంది. ప్రతి కూల మైన కాలం అని గూడా ఆలోచించకుండా కేవలం స్వార్థ చిత్తంతో ప్రత్యుపకారం కోరి మన మైత్రినే భంగపరిచే అనుచిత కార్యం చేస్తే అది ఎంత ధర్మబద్ధమో నాకు తెలీదా సుగ్రీవా?" అన్నాడు. శ్రీరాముని మాటలు విన్న సుగ్రీవుడు చిరుదరహాసంతో–

"రామచంద్రా ! మన మైత్రి అంత అల్పవిషయానికే చెదిరిపోయేది కాదు ప్రభూ ! నీపై నాకున్నది మైత్రీ సంబంధం కాదు నీ దాసుణ్ణి. నీ మాట కాదనే ప్రసక్తేరాదు. అటు ఆకాంశలో మబ్బులు చెల్లా చెదరుగా పోవడం, ఇటు మహీతలంపై సమస్త వానర సేన సీతాన్వేషణకై నలు దిక్కులా నడచిపోవడం ఒకేసారి జరుగుతాయి. మీరు కిష్కింధలోకి

రానంటున్నారు. సరే ! కనీసం ఈ నాల్గు నెలలు ఋష్యమూకం మీద నా నెలవులో వుండరాదా ! అనంగానే శ్రీరాముడు తల అడ్డంగా త్రిప్పి "అలా కాదు మేము ప్రస్రవణంలో వుంటాం. ఈ నాలుగు నెలలు" అని చెప్పి వచ్చిన వారందనీ పంపించేసి రామ లక్ష్మణు లిద్దరూ ప్రస్రవణగిరి క్రింది గుహలు అన్నీ పరీక్షించి, వాసయోగ్యంగా ఉన్న ఒక గృహను చూచి రాముడు –

## శ్రీరాముని హృదయం

"ఈ గుహను చూశావా లక్ష్మణా ! వాస్తు ప్రకారం అన్నిరకాలుగా అనుకూలంగా మనం వుండటంకోసమే ఏర్పాటు చేసినట్లుంది కదూ ! దగ్గఱ లోనే కుశలు కావలసినన్ని వున్నాయి. నువ్వు నీ ఇష్టం వచ్చినన్ని కోసి దట్టంగా అల్లి శయ్యల్ని ఏర్పాటు గూడా చెయ్యవచ్చు. అటువైపు ప్రక్కనే సెలయేరు చూశావా ! నీటికి గూడా ఇబ్బంది లేదు మరీ అంత వేడి లేకుండా, మరీ భరించలేనంత చల్లదనం లేకుండా సమశీతోష్ణంగా వున్న ఈ దక్షిణదేశ ప్రస్రవణగిరి ప్రాంతం ఎంత హాయిగా వుందో ! మనం ఇక్కడే నాల్గు నెలలు గడిపేద్దాం. మనం ఈ ప్రాంతానికొచ్చిన తొలిరోజుల్లో ప్రతి వృక్షం మీద వానరాలుండేవి, గుర్తుందా? ఇప్పుడు మాడు చూద్దా మంటే మచ్చుకు ఒక్కటి లేదు. ఎందుకో తెలుసా? వాలి వధ జరిగిన తరువాత ఇంక అవి ఈ ప్రదేశంలో వుంటాయా ? ఎవరైనా పెడితే వుంటారు గాని కొడితే వుంటారా ? లోక రీతే అంత, ప్రతీరోజూ ప్రభాత సమయంలో వానరుల నృత్య విన్యాస నిస్వనాలు, మృదంగ తరంగ నిక్వాణాలు ఇక్కడకు వినబడుతూనే వుంటాయి కాబోలు. అయితే కిష్కిందలో ప్రభువు వచ్చిన క్రొత్తమోజు ఇంకా అయిపోలేదన్న మాట!

నా సీత నాకు దక్కుతుందనీ, నేను రాక్షసేశ్వరుడైన రావణుణ్ని చంపుతాననీ నమ్మకం కలుగుతోంది. దీనిని సూచిస్తూ నా కుడిభుజం గూడా స్పందిస్తోంది లక్ష్మణా ! నా మీద ప్రేమతో నువ్వూ, సీతా నాతో ఈ అరణ్యాలకు వచ్చారు. నిజంగా మీకు రావాల్సిన పనిగూడా లేదుగదా ! అయినా వచ్చారు, వచ్చిన ఇద్దరిలో ఒకరు అపహరింబడ్డారు. సీత అపహరింపబడినా నేను బ్రతికే వున్నాను. అదే నువ్వు అపహరింపబడితే నా బ్రతుకెలా వుండేదో ? ఆ సీత నన్ను నీలా ఆదుకోగలిగేదా చెప్పు ? ఎవరో ఒకరు అపహరింపబడడం తప్పనపుడు నీ బదులు సీత అపహరింపడటమే మంచిది. ధైర్యంగా నీ సహాయ, ధైర్య వచనాలతో సీతను తిరిగి దక్కించుకో గలగడానికన్నా ఆస్కారం వుంది. ఏది చేసినా భగవంతుడు మన మంచికే చేస్తాడనుకోవాలి. ఎక్కడి కక్కడ కృతజ్ఞత తెలుపుకోకపోతే కష్ట సుఖాల అలలతో సాగే ఈ జీవన సాగరంలో ప్రయాణ స్నానం చెయ్యలేం లక్ష్మణా".

"ఈ రాళ్లను చూశావా ? గ్రీష్మాదిత్య పటుప్రతాపాగ్నికి గురియై ఉష్ణాన్ని వెడలగ్రక్కుతున్నాయి. తాపాన్ని పెంచుతున్నాయి. నా మూలంగా ముందుగా తాటకి చచ్చింది, నావల్లే మంథర మనస్సు ఉసూరుమంది, నావల్లనే రావణుని చెల్లెలు శూర్పణఖకి అవమానం జరిగింది. ఇలా నా వల్ల స్త్రీల కన్యాయం జరుగుతుంటే ఆ ఉసురు నాకు తగలకుండా వుంటుందా ? మా తాత (అజ మహారాజు) సతీ (ఇందుమతి) వియోగంతో మరణించాడు. నా తండ్రి పుత్ర వియోగంతో పోయాడు. కాని, తండ్రిపోయి భార్యా దూరుడనైన నేను మా తాత తండ్రుల్లాగా మరణించలేదు, మమతా ఇంధాలు లేని బండరాయిలా బ్రతుకుతూనే వున్నాను" అని మనస్సులో బాధ పడుతున్నాడు శ్రీరాముడు.

# లక్ష్మణుని స్వాంతన వచనాలు

"ఇదిగో చూడు, ఈ చిలకడ దుంపలు కుమ్ములో పెట్టి పెచ్చుతీసి తెచ్చాను. ఇవిగో చెరుగ్గడ ముక్కలు చూడు, చెక్కుతీసి తెచ్చాను. తామ రాకు దొన్నెల్లో నిర్మలమైన సెలయేటి నీటిని నీ కోసమే పట్టుకు వచ్చాను. ఓ ధర్మప్రభూ! నిర్మల మూర్తీ! ఇవాళ్టికి ఈ కాస్త భోజనం ఆరగించు" అంటూ లక్ష్మణుడు బ్రతిమాలుతూ రాముని చేత తినిపించాడు. ఇంత కష్ట కాలంలో గూడా నీవు సుగ్రీవునికి సరదాలు తీర్చుకోడానికి గడువు ఇచ్చావు - నీ ప్రేమకు అవధుల్లేవు గదా! అన్నగారితో విరోధమున్నపుడు ఆ సుగ్రీవుని కోపానికీ అంతూ పంతూ వుండేది కాదు. వాలి వధానంతరం ఆ కోపం అంతా పోయి హృదయమంతా దుఃఖంతో నిండిపోయింది. ఆ అన్నగారి కొడుకుపైన ఎంత మమకారం పుట్టుకొచ్చిందీ! చూస్తుంటే చిత్రమని పిస్తోంది. ఈ కపి రాజ్యానికి ప్రభువైన తరుణంలో ప్రత్యుపకారం సంగతి మరచిపోయినా మరచి పోవచ్చునేమో అనిపిస్తోంది కదూ! అలా జరగదనే అనుకుందాం. ఒక వేళ అతనివలన అలా జరిగినా మనం చింతించ వలసిన పని లేదు. శూరుడు, వానరయూధ ముఖ్యుడు అయిన ఆ హనుమంతుడు లేడూ! మన సంగతిని పట్టించుకోడానికి.! అతను ఒక్కడు చాలు అనే నమ్మకాన్ని కలుగచేశాడు. నీవంటే ఎంత భక్తి! ఎంత వినయం!!"

"నువ్వు నడుస్తుంటే ఆ నడకలోని అందాల్ని మా వదినగారు చూసి నట్లు చూసే వాడు. నువ్వు మాట్లాడుతుంటే ఆ మాటల్ని భరతుడు ఆలకించి నట్లు ఆలకించే వాడు. నువ్వు అతణ్ణి చూసినపుడు మునులు ఏ విధంగా నీ కనుకాంతుల్లో మునుకలాడే వారో అలా మునుక లాడేవాడు. నువ్వు నవ్వు తున్నపుడు నీ నవ్వు వెలుగుల్లో సుమంత్రుడు సంబర పడినట్లు సంబరపడి అంబరచుంబితుడయే వాడు. బ్రహ్మ తేజస్సు రూపుకట్టుకొన్న బ్రాహ్మ

మూర్తి. భక్తి పాండిత్యాలు పెనవేసుకొని పుట్టిన పావన మూర్తి, శక్తియుక్తి సామర్థ్యాలు ముప్పేటల్లా అల్లుకొనిన ఆ ఆంజనేయుడు ఒక్కడు చాలు వదిన గారిని వెదకడానికి. అతనికంటే అర్హుడైనవాడు ఈ భూ మండలంలోనే వుండడని నా అభిప్రాయం. ఎవరున్నా లేక పోయినా నీకోసం అటు ఆంజనేయుడు ఇటు నేను వున్నాం. నువ్వు పదికోట్ల రాక్షసులకు సమాధానం చెప్పగల శౌర్యం గల వాడివి. మరి మనం ముగ్గురం వుండగా ఏ పనిని సాధించలేము చెప్పు ? ఆ పవన సుతుడు మహీజాతను వెదికి నీకు మలయ మారుత స్పర్శను కలుగజేస్తాడు హాయిగా కాసేపు నిద్రపో ఈ రాత్రి".

"నేను భోజనం, నిద్ర లేకపోయినా వుండగలను. నీ సేవకోసం అలా అలవాటు చేసుకున్నాను. కాబట్టి నా సంగతి వదిలెయ్యి. నువ్వు నిద్రపో! ఆ కాసేపైనా భూ సుతా వియోగ దుఃఖంనుండి దూరమౌతావు. మనవల్ల అంత ఉపకారం పొంది సంతోషపడ్డ ఆ సూర్యపుత్రుడు కృతఘ్నుడౌతా డనుకోను. తప్పకుండా మన యీ కష్టకాలంలో ప్రత్యుపకారంగా ఆదుకుం టాడు. సమస్త కపిసైన్యం నలుదిక్కులకు వెళ్తుంది. సీతాన్వేషణ జరుగు తుంది. దుష్ట శత్రువులను సంహరించి, సీతను పొంది నీ రాజ్యాన్ని నువ్వు పొందుతావు. ఒక వేళ మన మనుష్య ప్రయత్నంవల్ల సీత కనబడక పోవ డమే జరిగితే లోకాలన్నిటినీ తగుల బెట్టగల నీ కోపాగ్నికి అమర రుద్రాదు లెవరైనా తాళగలరా ? ఆ ముగురమ్మలు ఆ నగుబాటుకు తట్టుకో గలరా?"

ఈ విధంగా లక్ష్మణుడు అంటూ నడుస్తూ మధ్యమధ్యలో రాముణ్ణి ఓదారుస్తూ ధైర్యం చెప్పగా కాలం గడుపుతూ ఉండే వారు.

# వర్షఋతు ప్రభావం

గ్రీష్మం ముదిరి ఆదిత్యుని కరాగ్ని జ్వాలల సెగ పెరిగింది. ఆ గ్రీష్మ తాపానికి ప్రస్రవణ పర్వతం మీది వృక్షాలు వడిలిపోయాయి. జానకీ వియోగాగ్నికి తట్టుకోలేక రాముడు ఒడలిపోయాడు. మదపు టేనుగుల జాడ లేదు. జంతువు లన్నిటినీ హడలెత్తించే మృగరాజు గుట్లచాటున గుట్టుగా పడుకుండి పోయింది.

ఆకాశంలో మబ్బు ఒకచోట పడితే మరోచోట మెరుస్తూ, ఇంకోచోట ఉరుము తోంది సమన్వయం లేని సంసారం లాగా ఎవరిదోవ వారిదిలా వుంది ఆకాశమంతా! ఏకగా ఎగిరిన దూది పింజెలలాగ దక్షిణ వియత్పథం అంతా తెల్లటి మబ్బు తునకలతో ఆవరించుకుని వుంది. వర్షాయోష తన కేశపాశంలో మెఱుపు పువ్వుల్ని అపురూపంగా భూమికి చూపిస్తోంది. వాటి అందాల్ని చూసి మెచ్చుకున్నట్లుగా తెల్లటి కుక్కగొడుగుల్తో భూసతి నవ్వింది! అంత వరకు ఎడమొగం పెడమొగంగా వున్న మిన్ను మన్నులమధ్య సన్న సన్నగా వర్షధారానురాగ సంబంధాలు మెరుగుపడ్డం ప్రారంభించాయి. 'మంచి రోజులు వచ్చేటప్పటికి మిడిసిపాటు పెరుగుతుందా' అన్నట్లు నెమ్మది? తనంతో ప్రసన్నరూపంతో వుండే సెలయేళ్లు, నిర్మలమైన దుస్తులతో వినయ విధేయతలు ఉట్టిపడే సాధుత్వంతో ఉండే సెలయేళ్లు – ఒక్కసారిగా రంకెలు వేసుకుంటూ అడ్డమొచ్చిన దేన్నీ లెక్క చెయ్యకుండా వళ్లూపై తెలియని గడుసుతనంతో, ఉగ్రకషాయరూపంలో ఉరకలు వేస్తున్నాయి. ఒక మబ్బుతునక శిఖరాగ్రం దగ్గర కన్నులు కన్నుల్లో పెట్టినట్లు, ఇంకొకటి పాదాలవద్ద ప్రార్థిస్తు న్నట్లు, మరియొకటి-కటి ప్రదేశాన్ని కౌగలించు కున్నట్లు ఉండటం చూస్తుంటే ఏడాది కొకసారి మబ్బు కన్నెలను కలిసే దక్షిణ నాయకుని లాగా ప్రస్రవణ గిరి రాజు పరమ శృంగార మూర్తిలా వున్నాడు. నేలమీద పడి సగం

పగిలిన నేరేడు పండ్లను లక్ష్మణుడు ఏరి అన్నగార్కి ఇచ్చాడు. రాముడు వాటిని ప్రేమారగా తిని నవ్వాడు. తాంబూల సేవనం చేసినట్లుంది శ్రీరాముని ఆ నవ్వు ముఖం.

జోరున వాన కురుస్తోంటే పక్షులన్నీ ఎక్కడివక్కడ తమతమ గూళ్లకి చేరాయి. గూడు లేదో ఏంపాడో కొమ్మ కొమ్మకూ తిరుగుతూ అరుస్తూ పోతోంది ఒక ఏకాకి కాకి. తుష్టిగా తేనె త్రాగిన తుమ్మెదల మోదానికి పట్ట పగ్గాల్లేవు. గాలిలో కడిమి పూలవాసన కమ్మదనానికి కాననమంతా కామ పరవశమైనదా అన్నట్లుంది. నిండు గ్రీష్మంలో చల్లగాను, నిరంతర వర్ష ధారలున్నా వెచ్చగాను ఉండి ఎప్పుడూ రామునికి సుఖాన్ని చేకూర్చడానికే సహాయ పడింది రాముడు ఉన్న ఒక పర్వత గుహ. మేఘాల ఉరుముల మ్రోత భూమిమీద, లక్ష్మణుని ధనుష్టంకారం వియత్పథంలోనూ అర్ధరాత్రి సమయంలో గూడా వినబడు తుండేవి.

మేఘంలో మెఱుపును చూపి సీతనుకొని. చెట్ల ఆకులు జార్చే వర్షపు నీటిబొట్లు సీత కన్నీరనుకుని. నేలమీదకు వ్రాలబోయే తెల్లకొంగల వరుసను సీత ముత్యాలహారమనీ భ్రమ పడుతున్నాడు వర్షాకాలంలో రాముడు. కొండ గుహ ముఖం వద్ద వర్షపు మోత వింటూ వుంటే వర్షపు ధారల యజ్ఞోప వీతాన్ని వడుకుతూ ఉదాత్తాను దాత్తా స్వరితాలతో వేదాధ్యయనం ఎవరన్నా చేస్తున్నారా అనిపిస్తోంది.

"కైకేయి చేసిన ఉపకార పుణ్యమా అని రక్కసులు తొక్కిడి మధ్య ఎకసక్కెమయ్యే బ్రాహ్మణులు ఈ దక్షిణాపథంలో యథావిధిగా తమ యజ్ఞయాగాది కర్మలు నిరంతరాయంగా చేసుకుంటున్నారు. ఇక్కడ సూర్య పుత్రుడు ఇష్ట కాంతా సంతుష్టుడైనాడు. మనవల్ల సాయం పొందిన ఆ సుగ్రీవుడు కనీసం రావణుడు ఉండే స్థలాన్నైనా వెదికి తెలియజెప్పే సాయ

మైనా చెయ్యడంటావా ! ఆ సుగ్రీవుడు వచ్చి నాకు ప్రణమిల్లిన సందర్భంలో వాని ముఖం చూసినపుడే అనిపించింది. ఈ వర్షఋతువు ఉన్నన్నాళ్లూ అతన్ని వదిలివెయ్యడం మంచిదని, అందుకే వెంటనే అతన్ని ప్రత్యుప కారం కోరలేదు" అన్నాడు రాముడు.

## శరదృతు శోభ

ఉరుములు, మెఱుపులు లేక ఆకాశం నిర్మలంగా వుంది. హడావుడి తగ్గింది. వర్షపు రోజుల్లో వలపు తెలిపే అవకాశానికి దూరమై, విరహంతో వున్న రవి చంద్రులు మళ్లీ కమలాలతోను, కలువలతోను దోబూచులాడే ప్రథమ ప్రణయ పాఠాలను మొదలు పెట్టారు, నదీజలాల రజోతీవ్రత తగ్గి రామణీయకం పెరిగింది. తార, రుమలు సుగ్రీవునితో సామీప్య, సాయుజ్య సుఖాలనుభవిస్తున్నారు. వాలి బాహుబల దర్పం మీద ఎలాంటి మమకారమో సుగ్రీవుని బుద్ధిబలం మీద గూడా తారకు అలాంటి అంగీకారమే ! హెచ్చు తగ్గులు లేని ఇలాంటి సమతాభావం అందరికీ వుండకపోవచ్చు. ఇది గూడా ఒక ప్రత్యేక జీవ భావ లక్షణమే ! వాలి దూరమైనా, అతని తమ్మునితో దేవర న్యాయబద్ధమైన పొందు, అంగదుని యువరాజు పదవి, సుగ్రీవుని నీతి పాలన అన్నీ తారకు అంగీకారబద్ధమైన ఆనందాన్నే కలుగజేశాయి. ఇరువురు బామల మధ్యన ఇనసుతుడు ఎనిలేని అనురాగ స్రవంతిలో తలమునక లౌతున్నాడు పచ్చకర్పూర సువాసనల మత్తు నవ్వుల మధ్య, చందనాల పూతల అందమైన మేనుల మధ్య, సవతుల సకుంకుమ వదనాలే ప్రతి దిన సంధ్యలుగా సుగ్రీవునికి సులభంగా కాలం గడిచిపోతోంది. మహీపాలన భారం గూడా మంత్రులపై పెట్టి అహర్నిశలు అతివల అనురాగ తంత్ర బద్ధుడై అమరలోక సుఖాలను అవనీతలంపైనే అనుభవిస్తున్నాడు.

# హనుమంతుని జోక్యం

అర్ధరాత్రి వేళల్లో గూడా లక్ష్మణుని ధనుష్టంకారాలను సుగ్రీవుడేమో గాని కిష్కింధాపుర వాసులందరూ వింటూనే వున్నారు, సుగ్రీవుడు వినిపించుకునే స్థితిలోలేడు. మంత్రులకు, మిగిలినవారికి రామ కార్యం సంగతి గుర్తుకు వచ్చినా సుగ్రీవుని నుండి ఆజ్ఞ లేక ఆగిపోయారు. రాజ దర్శనానికే అవకాశం లేకపోతే వాళ్లు మాత్రం ఏం చేయగలరు ! ఇంక ఆలస్యం చేసి లాభంలేదని సూర్యశిష్యుడైన ఆంజనేయుడు ప్రతీహారుల ఆవరోధాన్ని కూడా లెక్కపెట్టకుండా తానే స్వయంగా అంతఃపురంలోనికి అడుగు పెట్టాడు.

సుగ్రీవునికి ఇరుప్రక్కలా తార, రుమలు లతల్లాగా అల్లుకుపోయి వున్నారు. తాగిన మత్తు కళ్లతో తూగు టుయ్యాలలో ఊగుతూ, నర్తకీమణుల నృత్య గీతాలకు శిరస్సాడిస్తూ పూర్తిగా స్మరలోకంలో వుండి, ఇహలోకం మరచిన స్థితిలో సుగ్రీవుడు వున్నాడు. అల్లాంటి స్థితిలో ఎదురుగా స్మరహారు నిలా కనబడుతున్న హనుమంతుని తార చూసి వెంటనే చేతులతో ఏదో సైగ చేసింది. వెనువెంటనే గాయకీ నర్తకులు అక్కడనుండి కనుమరుగై పోయారు. రుమ గూడా తన అంతఃపురానికి వెళ్లిపోయింది, అప్పుడు ఆంజనేయుడు—

"రోజులు, పక్షాలు, మాసాలు గడచిపోయాయి. వర్షాకాలం గూడా పూర్తిగా గడచిపోయింది. శరత్తు జరుగుతోంది. దూరమైన సతి దగ్గరైం. అసాధ్య మనుకున్న జయం సాధింప బడింది. రాజ్యం లభించింది. తత్ఫ లితంగా సుఖసంతోష కీర్తులకు అవధి లేదు. ఇవన్నీ ఏ ఒక్క కారణంవల్ల వచ్చాయో దాన్ని మరచిపోకుండా వుంటే ఇవన్నీ మరిన్ని రెట్లు అధికమౌ

తాయి. ఇద్దరు స్నేహితులు కలిశారు. ఇద్దరికీ కావలసిన పనులు సహకార భావంతో చేసుకుందా మనుకున్నారు. ఒకడు తనవంతు పని తాను చేసెయ్యటం పూర్తయి రెండవవాడు తను చెయ్యవలసిన దానిపట్ల ప్రమత్తభావంతో ప్రవర్తిస్తే అతడు ఎలాంటి వాడైనా ఎవరైనా కృతఘ్నుడి క్రిందే జమకట్టబడతాడు."

"కలిసి వచ్చే కాలానికి వివేకవంతులు నిద్రకూడా పోకుండా మెలకువగా వుంటారు. అయినా ఇప్పటికీ మించిపోయింది లేదు, వాగుల వేగం తగ్గింది. ఆకాశం నిర్మలంగా వుంది. దహరాకాశంలోని ఆశయాలు తీర్చుకునే వారికి సమయం ఆసన్నమైందా అన్నట్లు జలాశయాల్లో ఆకాశం ప్రతిబింబించి ప్రేరేపిస్తోంది. దిగంతాలకు వ్యాపించే ధనుష్టంకారాలు గల బాహుబల ధార్యులతో నీకు మైత్రి ఏర్పడింది. వారి పుణ్యమా అని నీవు భద్రంగా వున్నావు. నీరధిని గూడా నీరు లేకుండా ఇంకింప చేయగల ఆయన చాలా ఇంగితజ్ఞుడు. వర్షాకాలమంతా నీ సుఖ సంతోషాలకు వదిలేశాడంటేనే ఆయనకు నీ తోడి స్నేహం, నీపై జాలి ఎలాంటిదో తెలుస్తోంది. భూమిని అదిశేషుని లాగా మిత్ర కార్యభారాన్ని తన భుజస్కంధాల మీద వేసుకున్నవాడు పరమయోగి, విద్వాంసుడు అవుతాడు ఊర్వీతలమంతా గాలించి భూజాత జాడ కనుక్కొని రాగల వానర వీరులు, చారులు నీ కనుసన్నకోసం వేచి ఉన్నారు. నీదే ఆలస్యం. రామచంద్రుడు అరణ్యవాసియై నీకు శరణ్యుడవడం ఎంత భాగ్యమో ఆలోచించు. నీవు చేయవలసిన ఆ పుణ్యకార్యం కూడా చక్కబెట్టావా శివుని శరీర ధవళచ్ఛాయలాగా నీ కీర్తి దిగంతాలకు అంటుతుంది. ఆ పనితో నువ్వు సరాసరి భువి నుండి దివికి నిచ్చెన వేసినట్లే" అన్నాడు.

## సుగ్రీవుని ప్రతిస్పందన

సుగ్రీవుడు ఆంజనేయుని మాటలన్నీ శ్రద్ధగా విన్నాడు. తార భుజంపై వున్న తన చేతిని తీసి "ఎప్పుడూ ఇలా రానివాడవు నా క్షేమం కోరి ఇలా వచ్చావు. మెలకువగా వుండవలసిన కాలం దాటిపోకుండానే నా దగ్గఱకు వచ్చి గుర్తు చేయవలసినది. శ్రీరామచంద్రునితో స్నేహం నీవల్లనే గదా అయింది. నావల్ల జరగవలసిన ఆ మిగిలిన పనికూడ నీ వల్లనే అవాలి. ఆ అన్నదమ్ముల ధనుర్విద్యా కౌశలం నే నెఱగనా ? కాకపోతే - మధుపానం, తారాసంగమం, శత్రు హననం, రాజ్యపాలనాధికారం-ఇలా అన్నీ ఒక్కసారి కలిసి రావడంతో కర్తవ్య నిర్వహణ కాస్త కనుమరుగైంది కాని" అని నీలుణ్ణి పిలిపించి "మన కపివీరులు ఎక్కడెక్కడ ఎంతమంది వున్నదీ నాల్గు దిక్కులకు వెళ్లి అన్ని వివరాలు తెలుసుకుని వారం రోజుల్లో వాళ్లందర్నీ ఇక్కడకు చేరవలసిందని చెప్పాలి. అల్లా రాని వారి కంఠం కత్తి కెరవు తుందని గూడా చెప్పవలసిందిగా" ఆజ్ఞాపించాడు. హనుమంతుణ్ణి చూసి–

"మహామంత్రీ ! నీవు, అంగదుడు ఇక్కడ చేయవలసిన ఏర్పాట్లు చూడండి. సైన్యాధిపతులకు విషయం వివరించండి. అన్ని దిక్కుల నుండి మన వాళ్లంతా రాంగానే జానకీ అన్వేషణకై భేరీ మ్రోగిన వెంటనే సర్వ సైన్యం కదిలే ఏర్పాట్లలో ఉండండి." అని చెప్పి అంతఃపురం లోపలకు వెళ్లిపోయాడు.

## శ్రీరాముని మనోవేదన

మబ్బులు విడిన ఆకాశాన్ని శ్రీరాముడు గుహలోనుండి బయటకు వచ్చి చూశాడు. చిమ్మచీకట్లోంచి వెలుగుల లోకంలోకి వచ్చినట్లైంది.

పచ్చకర్పూరపు పొడిని నలుదిక్కులా చల్లినట్లు వెన్నెలలు విరజిమ్ము తున్నాయి. ఆకాశంలో అక్కడక్కడ వున్న తెల్లని మేఘాలు వర్షానికి తడిసిన వస్త్రాలను ఎండలో ఆరేసి నట్లున్నాయి. వర్షాణువు లెంత స్థూలమో వర్షాకాలం బాధలు అంత స్థూలంగా అనిపించాయి శ్రీరామునికి, ఇప్పుడు శరత్కాలపు వెన్నెలలు ఎంత మృదువైనవో ఆ కాలం బాధలు గూడా అంత మృదులంగాను, సూక్ష్మమైనవిగాను అనిపిస్తున్నాయి. ఎవరికైనా ఓర్పుకు కొంత పరిమితి వుంటుంది అది దాటితే ప్రతీక్షించడం కష్టమే ! శ్రీరాముడు సరిగ్గా అల్లాంటి పరిస్థితిలోనే వుండి—

"మనం వున్నామో లేమో తెలిసికోడం కూడా సుగ్రీవునికి పట్టలేదంటే ఇంక తను చెయ్యాల్సిన తన పని గుర్తుందనుకోగలమా ! తన సంగతి. తన సుఖమే గాని తన బాధ్యత గుర్తుకు రావటంలేదు. ఈ సుగ్రీవుని వ్యవహారం చూస్తూంటే 'క్రొత్త బిచ్చగాన్కి ప్రొద్దు తెలియని తంతులా' వుంది. శరత్తు వస్తున్నా సుగ్రీవుడి జాడలేదు. పగతీర్చి, పడతిని. పరిపాల నను చేకూర్చి పెట్టి ఏదో ఆశిస్తే చివరకు ఇలా జరగడం - 'అయ్యవారిని చేయబోతే కోతి అయినట్లుగానే వుంది' అగ్నిసాక్షిగా చేసిన స్నేహాన్ని చివరకు కోరి అర్పుకోవడం నిజంగా నిప్పులతో చెలలాటం, కొంపమీదికి తెచ్చుకోడం కాదూ ! ఏదో వెలగబెడతాడని అనుకోడం నా వెఱ్ఱితనం అమాయకత్వం అవవు గదా !" అనుకున్నాడు.

లేత వెన్నెలలు శ్రీరాముని శరీరానికి పూచిక ముల్లులుగా వున్నాయి. లేయెండ కిరణాలు ఎఱ్ఱచీమలు ప్రాకుతున్నట్లున్నాయి. దేనిని చూసినా తనను వెక్కిరిస్తున్నట్లుంది. సీతా వియోగాన్ని భరించలేక పోతున్నాడు. రాయంచల్ని చూస్తే సీత నడిచివస్తున్నట్లే అనిపించింది. "ప్రాణాధికా ! నవమల్లికా !" అంటూ ముందుకు వెళ్లి నిరాశ చెందుతున్నాడు. "ఎక్కడికి

వెళ్లావు నన్ను విడిచి ?" అంటూ విరహ పడుతున్నాడు. పువ్వుల్ని చూస్తే సీత నవ్వులు, తుమ్మెదల్ని చూస్తే సీత కళ్లు, పద్మాలను చూస్తే సీత వదనం ఇలా ప్రకృతి సౌందర్య మంతటిలోను సీతే కనబడుతుంది. ఇంతలో ఒక కొక్కెర చిన్న చేపపిల్లను ముక్కున కరచుకొని రాముణ్ణి చూసి వెక్కిరిస్తూ ఆకాశపథంలోకి దక్షిణ దిశగా వెళ్లిపోయింది. తనక్కడ వుండి గూడా ఏమీ చెయ్యలేక పోయాడు. దక్షిణ దిశగా అలా చూస్తూనే వున్నాడు. సీతకు తండ్రిపై గల ప్రేమ, గౌరవాలు అగస్త్యునిపై వున్నాయి. ఆ అగస్త్యుడే తనకూ అక్షయ తూణీరాలను, ధనుస్సును ఇచ్చాడు. ఆ అగస్త్యుడు దక్షిణ దిక్కున వియత్పథంలో దిక్చక్రానికి పైగా దర్శన మిచ్చాడు. ఇంక ఇంత వరకు పడ్డ వర్ష జల కలుషితానికి చికిత్స జరిగినట్లే ! ఆ ముని దర్శనంతో రామునికి గూడా తన వియోగ దుఃఖ కశ్మలానికి విరుగుడు లభించి నట్లైంది.

## లక్ష్మణుని ఓదార్పు

'కిష్కింధ నుండి ఎవరైనా వస్తున్నారా'-అని లక్ష్మణుడు మాటి మాటికీ ఎదురు చూస్తున్నాడు. అన్నగారి విరహోద్వేగోపశమన ప్రయత్నంలో–

"అన్నా ! నీ దుఃఖం నేను చూడలేక పోతున్నాను. భూమిని త్రవ్విన కొద్దీ మట్టి వస్తుంది. అలాగే యీ మనస్సులోని దుఃఖం త్రవ్వుకున్న కొద్దీ పెల్లుబుకుతుంది. చంద్రుడు, వెన్నెలల సంబంధం లాంటిది మీ ఇద్దరిదీ. ఈ ఎడబాటు సహింపరానిదే! అయినా నీవు వసిష్ఠునికి శిష్యుడివి. సమస్త తపస్విజన ధ్యేయానివి. యోగవిద్యావధిగా నీ దేహం పరికల్పింపబడింది. అల్లాంటి నీకు ఈ వివశత్వం ఏమిటి ? నిజానికి ఈ సృష్టిలో 'పార్వతీ పరమేశ్వరులు', 'సీతారాములు' అన్న వాటిని మించిన ద్వంద్వ సమాసాలు

లేవు. ఇది నా నిశ్చితమైన అభిప్రాయం. ఎక్కువ మాట్లాడితే, ప్రభూ, నన్ను మన్నించు" అంటూ మళ్ళీ—

"ఇదిగో ఇటు చూడు. పదునాలుగేండ్ల వనవాసదీక్ష కొన్ని నెలల్లో పరిసమాప్తం కాబోతోంది. ఈ కొన్ని నెలల అవధిలోనే రావణవధ సీతా సమేత అయోధ్యాగమనం జరిగి తీరుతాయి. ఇంకోలా జరగడానికి వీలు లేదు. సహజంగా కోతి గదా! కొత్తపొత్తులో వళ్లు మత్తెక్కడం వల్లగానీ. పాపం సహజంగా ఉత్తముడే! కావలసిన సహాయ సంపత్తి అతనికి అన్ని విధాలా కలిగేటట్లు కరుణించు నీకు గుర్తుందో లేదో వాలి గురించి అన్ని విషయాలూ చెప్పి అచ్చు తనలా వుంటాడనే విషయం చెప్పడం మరిచాడు. అందుకే కదా ఇద్దరికీ జరిగిన యుద్ధంలో ముందుగా అనవసరంగా చావు దెబ్బలు తిన్నాడు. మంచివాడే – కాని, పాపం కాస్త మరుపు జాస్తి నీకు తెలీందేముంది ?" అన్నాడు.

లక్ష్మణుడలా అనంగానే రాముని ముఖంలో చిరునవ్వు చిగురించింది, అంతలోనే నవ్వు ముఖం గంభీరమై -

"పింఛాలు విప్పి నాట్యం చేసే నెమళ్లు మచ్చల పులుల్లాగా కనిపిస్తూ లోకువగా చూస్తున్నాయి. కామక్రీడలో హద్దూ పద్దూ లేకుండా విహరిస్తు న్నాయి. అప్పుడే స్నానం చేసి శుద్ధమైన వస్త్రాలు ధరించి, సంజెవన్నె బొట్టు పెట్టుకున్నట్లు పారిజాతాలను వికసింపచేసినట్లున్న ఇటు భూమి – చంద్రుడు, తెల్లని మేఘాలు, నక్షత్రాలు, వెన్నెలతో అటు - ఆకాశం రెండూ సత్వగుణంతో చల్లగా తెల్లగా దీపిస్తున్నాయి. ఇంతవరకు ఆ సుగ్రీవుని జాడే లేదు. ఏమనుకోవాలి ? నేను అనుకొన్నదే నిజం. లేక పోతే ఏమిటి ? ఎన్ని రాచకార్యాలున్నా ఈ పాటికైనా రావద్దూ ! వర్షాకాలమంతా ఎదురు చూచీ చూచీ నా ఓర్పంతా నశించింది. ఇంక ఒక్కొక్క నిమిషం ఒక్కొక్క

యుగంలా గడుస్తోంది. కృతజ్ఞతా భావం వున్నవాడైతే వాస్తవానికి నాకంటే ఇతడే ఎక్కువ-తొందర పడాలి. అదేం కనబడడం లేదు. మరి ఇతడేదో సర్వగుణ సంశోభితుడని నమ్మించారు."

"సరే ! అయిందేదో అయిపోయింది. ఇప్పటికైనా అసలు వస్తాడో రాడో ! వచ్చినా పని చేసి పెడతాడో లేదో తేల్చుకోవాలి. నువ్వు వెంటనే వెళ్లి అసలు విషయం తేల్చుకునిరా. నన్ను బలే ఇరుకున పెట్టాడే! చూస్తూ చూస్తూ ఉండంగానే నాలుగు నెలలు వృధాగా గడచి పోయాయి. వెళ్లి ఆ కపినాధునికి విషయం గుర్తు చేసి కాస్త పట్టించుకోమను. మరి అతనికి కావలసిన రాజ్యాన్నీ, రమణినీ కూర్చి పెట్టాను గదా ! అయినా పట్టించుకోకుండా ఉపేక్ష వహిస్తే ఈ లోకం వాళ్లే గాదు, పై లోకం వాళ్లు కూడా మెచ్చుకోరు. రామునికే కోపం వస్తే ఈ భూలోకంలో ముందుకు వచ్చి అదుకునే వాళ్లే వుండరని చెప్పు. రాజ్యానికి ఆ అన్నగారు కాకుండా తాను ఎందుకు రాజయ్యాడో తెలుసుకుంటే, తను కాకుండా అన్నగారి కొడుకు కూడా అలానే ఇకముందు రాజు అవచ్చన్న దండనీతి ఉంటుందనే విషయం తెలిసి మసలుకోవడం మంచిదని గుర్తు చెయ్యి. సఖ్యానికి సాక్షియైన అగ్ని దేవుణ్ణి చూచి క్షమిస్తున్నానని చెప్పు. వాలిని చంపిన బాణం తిరిగి అమ్ముల పొదిని చేరిన మార్గం అవరోధాలు లేకుండా అలాగే వీలుగానే వుందని చెప్పు. అవతలివాడు సాధువైతే మనం వెయ్యిరెట్లు సాధువులం. అసాధువైతే వెయ్యిరెట్లు అసాధువులం" అని అన్నాడు రాముడు. లక్ష్మణుడు తానెన్నడూ ఎఱుగనంతటి కోపం అన్నగారి ముఖంలో చూచి–

"కపీశ్వరుడు గ్రామ్య సుఖంలో మునిగి వున్నాడు. నేను వెళ్లి వాని పని చూస్తాను" అని ధనుస్సు పట్టి అల్లెత్రాడు మ్రోగించి తోక త్రొక్కిన పాములాగా నిలబడ్డాడు. ఆ లక్ష్మణుణ్ణి చూచి, అల్లెత్రాడు మ్రోత విని చుట్టూ

వున్న వనదేవతలు భీతాకృతులైనారు. సర్వభూతాలు భయంతో వణికి పోయాయి.

రాముడు ఒక్కసారి తమాయించుకున్నాడు. తనకొచ్చిన కోపం తనకు తెలుసు. భూజాత సీతా మనోహరుడు కాబట్టి భూ ప్రపంచం భయాందోళనలను చూడలేక తన కోపాన్ని అదుపులో పెట్టుకుని లక్ష్మణునితో—

"నాయనా లక్ష్మణా ! వెళ్లి అతణ్ణి చంపే ప్రయత్నంలో వున్నట్లున్నావు. అంత కోపం వద్దయ్యా ! తొందరపడకు. మన స్నేహ ధర్మాన్ని మరచి తొందరపడకు. అందరూ భరతుడూ, లక్ష్మణుడి లాంటివాళ్ళే వుంటారా ? సతీ లోభాన్ని తట్టుకోగల వాళ్లెవరు ? అందులోనూ ఒకసారి దూరమై మళ్లీ కలవటం జరిగితే ఇంక మరి చెప్పాల్సిందేముంది ? అసలు సామంతోనే పని సాధ్యమౌతుంది. ధర్మాన్ని బుద్ధి పూర్వకంగా విడనాడడం వేరు, ప్రమత్తతతో విస్మరించడం వేరు గదా ! ఆ హనుమంతునికి సుగ్రీవునిపై మోహం వుంటే, నీకు ఆ హనుమంతుని మీద వుంది. ఈ అడవిలో ఇంతవరకూ విచ్చలవిడిగా తిరిగిన వానరమే లేదు. కాని ఇప్పుడే చిలిపి చేష్టలతో అన్నీ స్వైరవిహారం చేస్తున్నాయి. మరి పాత కోతులు భీతిపోయి ఇలా చేస్తున్నాయో లేదా క్రొత్త కోతులు వచ్చి చేరాయో తెలీటం లేదు. ఎందుకీ ఎగ్గిన గుబ్బిసలు ? ఎందుకైనా మంచిది- ఒక్కసారి కిష్కింధకు పోయి అసలు విషయమేమిటో తెలుసుకురా" అన్నాడు.

## లక్ష్మణుని కోపావేశం

లక్ష్మణుడు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ బుసలు కొట్టుకుంటూ నడుస్తున్నాడు. సింహ భల్లూకాదులే భయభ్రాంతులతో కంపించాయి.

దూరంగా వున్న వనీ భుజంగాలు తోకలపై నిలబడి లక్ష్మణుడు దగ్గరవు తున్న కొద్దీ తత్తరపాటు పడుతున్నాయి. లక్ష్మణుడలాగే గంభీరంగా వెళ్లి కిష్కింధాపుర ముఖద్వారం ముందు అల్లుకొన్న వృక్ష శాఖలను చేతులతో తొలగించగానే ఇరుప్రక్కల కాపలావున్న మహావానర యోధులు-అల్లె త్రాడు మ్రోగిస్తూ, అజ్యం పడ్డ అగ్నిహోత్రునిలా ప్రజ్వలిస్తూ జటా శేఖరుడై వున్న సౌమిత్రిని చూచి హడలిపోయి ఒక్క ఉదుటున క్రిందకు దూకి పారిపోయి వార్తాహరునితో—

"వాలి ప్రాణాలు తీసినవాని తమ్ముడొకడు విషసర్పంలా బుసలు కొడుతూ వస్తున్నాడు. పిల్లలు, పెద్దవాళ్లు, స్త్రీలు అందరూ గుహ లోపలకు వెళ్లిపోయి దాక్కొండి" అన్నారు.

ఆ మాట వినంగానే గుంపులు గుంపులుగా చేరి అందరూ చెవులు కొరుక్కున్నారు. అటూ ఇటూ తత్తరపాటుతో చూస్తూ—

"అంతటి వాలినే అవలీలగా చంపిన ఆ బలశాలి దృఢత్వంలో కొండ లాగాను, పరాక్రమంలో సముద్రంలాగానూ వుండి వుటాడు. అటువంటి వాని తోడబుట్టిన వాడేట వచ్చేది. చూడాల్సిందే!" అంటూవున్న వాళ్లల్లో బలమైనవాళ్లు కొందరు లక్ష్మణుని చూడవచ్చారు

ఆపాదమస్తకం లక్ష్మణుణ్ణి చూశారు. మూర్తీభవించిన శౌర్య పరా క్రమాలతోవున్న లక్ష్మణునిలోని ఆగ్రహంచూశారు. ఆ ఆగ్రహంలో ఆవేశం బుసలు కొట్టడం చూశారు. ఇన్నాళ్లకు ఒక మొనగాణ్ణి చూసినట్లుగా అనిపించిందో ఏమో వాళ్లకి– " యుద్ధం చేస్తే ఇలాంటి వాళ్లతో చెయ్యాలి. చేసి గెలుస్తామన్న ఆశతోగాదు, ఇలాంటి వానితో కలిసి యుద్ధం చేశామన్న పేరు కోసమైనా చెయ్యాలి" అనుకొన్నారు. చేతుల్లోకి కొండల్ని తీసు

కున్నారు ఆ బలాఢ్యులు. గుహల్లాంటి మూతులతోటీ, కొండల్లాంటి కండలు తిరిగిన శరీరాల్లో వున్న ఆ వానర యోధుల్ని చూచి లక్ష్మణుడు ఆకర్ణాంతం వింటినారిని లాగి ఒక్కసారి ఠంకారం చేయగానే పుట్టిన మహానిస్వానానికి దిక్కులు పిక్కటిల్లేలాగా మారుమ్రోగాయి. కర్ణభేరులు బ్రద్దలయ్యేలా విన్పించిన ఆ ధనుష్టంకారానికి దద్దరిల్లిన వానర యోధులు చేతుల్లోంచి కొండల్ని క్రింద పడేసి ఆశ్చరవదనాలతో పారిపోయారు. అలా పారిపోయిన వాళ్లెవరూ సామాన్యులు గారు. వాళ్లల్లో ఒక్కొక్కడు వంద ఏనుగులు, కొందరైతే వెయ్యి ఏనుగుల బలం కలవాళ్లకూడా వున్నారు.

నానా బీభత్సంగా వున్న తన పరివార ప్రాంగణాన్ని చూచి అంగదుడు కోటలో నుండి బయటకు వచ్చి, తలవంచి నమస్కరిస్తూ లక్ష్మణుని దగ్గరకు వెళ్లాడు. లక్ష్మణుడు అంగదుణ్ణి చూచి—

"వత్సా ! అంగదా! జగన్నాధుడైన శ్రీరాముని తమ్ముడు లక్ష్మణుడు వచ్చి ద్వారం దగ్గర వేచి వున్నాడని నీ తండ్రితో చెప్పమన్నాడు. దానికి "తండ్రితోనా" అని అంటున్న అంగదుని కళ్లల్లో కన్నీళ్లు గిఱ్ఱున తిరిగాయి. లక్ష్మణునికి మనస్సులో వాలి వధ విషయం విభ్రాంతిని కలిగించింది.

అంగదుడు వెళ్లి తండ్రి పాదాలకు సాష్టాంగంగా ప్రణామం చేశాడు. తల్లికి నమస్కరించాడు. రుమకు ప్రణామం చేసి ప్రక్కగా నిలుచున్నాడు. కన్న కొడుకుని చూడంగానే కడుపు నిండి పోయింది తారకు. అప్పుడు అంగదుడు-

"ద్వారం దగ్గర లక్ష్మణుడు చేసిన ధనుష్టంకారానికి వూరు వూరల్లా భయాందోళనలతో దద్దరిల్లుతోంది. నిప్పులు కన్నుతున్న లక్ష్మణుడు నాతో-

"సీతాపతి పంపగా దూతగా వచ్చి వాకిట దగ్గఱ నిల్చున్న సంగతి మీ తండ్రితో చెప్పు' అన్నాడు. ఇంకా ధనుష్టంకారం చేస్తూనే వున్నాడు ఎడతెగకుండా. అంతటి ప్రళయకాల పర్జన్యగర్జనలా వున్న ఆ రావం సుగ్రీవునికి వినిపించలేదా! అక్కడ సౌమిత్రి చూట్టూవున్న కోతిమూక చేసిన కిలకిలా రావాలతో కలిసి, ఆ ధనుష్టంకార ధ్వని ఆకాశం అంతటా వ్యాపించి, అంతఃపురం లోకి గుమ్మికొని వచ్చింది. ఆ మహాధ్వానానికి సుగ్రీవునికి కొద్దిగా మెలకువ వచ్చి కళ్లలోకి తెలివి వచ్చింది. చెదిరిన హారాలు సవరించుకున్నాడు. సమయం చూచి ప్రక్కనే వున్న అంతరంగిక మంత్రులిద్దరూ అంగదుడు చెప్పిన మాటలు వినిపిస్తున్నారు.

"నీ ఎదురుగుండా నిలబడి వున్నాడు నీ పుత్రుడైన అంగదుడు. ఏదో చెప్పాలని వచ్చినట్లున్నాడు. యువరాజు గదా! రాజ్య సంబంధమైన విషయం ఏదో తొందరగా నిర్ణయించవలసి వచ్చి వుండవచ్చు. అన్నగారు వాలిని వధించిన కోదండరాముని తమ్ముడు ఉగ్రుడై, ధనుష్టంకారం చేస్తూ ద్వారం ముందు నిలబడి వున్నాడని అంటున్నాడు అంటే రాజ్యానికే ఏదో ఉపద్రవం ముంచుకొస్తుందేమోననే భయం కనబడుతోంది" అన్నారు.

సుషేణుడు సుగ్రీవుని ఉద్దేశించి ఇలా అన్నాడు –

"చేసిన మేలు గుర్తుపెట్టుకోకపోవడం పాలు త్రాగి రొమ్ము గ్రుద్దడమే అవుతుంది. అవతలి వారితో మన పని అయిపోయింది కదా – అని నిరాదరణతో పట్టించుకోక పోవడానికే కారణం మందెక్కువవడం వల్లనే అయితే, ఆ కారణం మట్టుకు చెప్పుకోవడానికి ఏమంత సమంజసంగా ఉంటుంది ?"

నలుడు కల్పించుకొని ఇలా అన్నాడు :

"నీ చేతనే ఆ రోజున పంపించిబడ్డాము. ఆ రోజున రామచంద్రునితో నీకు వచ్చిన ఇబ్బంది చెప్పిన తరువాత ఇద్దరి మధ్య సఖ్యానికి ఏర్పాటు జరిగింది. అనుకున్న ప్రకారము ఆ మహానుభావుడు తన వంతు పని తను పూర్తి చేశాడు. మరి ఇప్పుడు నీకు నీ వంతు చెయ్యాల్సిన పనే మిగిలి వుంది. ఇలా నీకు చెప్పవలసిన అవసరం మాకు కల్పించడం తగదు." !

నీలుడు గూడా కల్పించుకొని ఇలా అన్నాడు :

"నీవు మాకు రాజవాలని నేను, నలుడు, తారుడు, హనుమంతుడు ఎంతో ఆశించి అప్పట్లో ఆ మహానుభావునితో సఖ్యం కుదర్చడానికి తలపెట్టాము. ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు అయిన ఆ రామచంద్రుడు బ్రహ్మాండం క్రిందకు దిగజారిపోయినా తాను తన మాట మీద నిలబడి నీకు చెయ్యాల్సిన సాయం చేసాడు. ఒకవేళ బ్రహ్మాండం ఎదురు తిరిగి పైపైకి ఎగసినా తన వింటిమీద ధైర్యంతో ఎదురు నిలబడతాడు."

హనుమంతుడు కల్పించుకొని–

## హనుమంతుని సలహా

"తండ్రి రాజ్యాన్ని విడిచి వెళ్లిపొమ్మంటే వెళ్లిపోయినవారు ఒకరు అన్నగారు అడవికి వెళ్లిపోవాల్సి వస్తే తన కలాంటి అవసరం ఏమీ లేక పోయినా అన్న వెంటపడి అడవికి వచ్చినవారు ఒకరు. అసలు ఇలాంటి సోదరుడు, సత్యభాషులు ప్రపంచంలో వుంటారా ? బాహుబల సంపన్నులై వుండి ధర్మానికి కట్టుబడిన వాళ్లు నిన్నాశ్రయించి, నీ పని చేసిపెట్టి, నీ మాట మీద గౌరవంతో, నమ్మకంతో, అనుకున్న ప్రకారం వేచివుండవలసినంత కాలం ఓపిగ్గా వేచి వున్నారు. ఇంక మిగిలిన కార్యభారమంతా మనదే

నీ వంతు నీ మాట చెల్లించుకోవలసిన అవసరమొచ్చింది. మరి అవతల ద్వారం దగ్గఱ దిక్కులు పిక్కటిల్లేలాగా ధనుష్టంకారం చేస్తూ లక్ష్మణుడు మనకోసమే ఎదురు చూస్తూ నిలబడి వున్నాడు. నీ అనుజ్ఞలేదని నేను గూడా ఇంతవరకు అక్కడకుపోయి కనబడలేదు. ఆ ధనుష్టంకారం చేసే తీరునుబట్టి విషయాన్ని అటో ఇటో తేల్చుకోడానికే వచ్చినట్లనిపిస్తోంది. అవతల ఉగ్రుడై వేచివున్న లక్ష్మణునికి వున్న కోపం లక్ష్మణునిది కాదు. ఆ కోపతాపాలన్నీ రామునివి. తనకు కలిగిన కోపమైతే ఎవరైనా తానే దిగమ్రింగుకోగలడు. కాని, ఆకోపం ఇంకొకరిదైతే దాన్ని ఉపశమింపజేసుకునే అధికారం తనకు ఉండదు. సూర్యుని కిరణాలు సూటిగా బడినప్పుడు కంటి అద్దంమీద పడి పరావర్తిత మైనపుడు అవి కళ్లకు ఎక్కువగా గుచ్చుకుంటాయి. అదీగాక కిరణాలు ఒక సారి పడ్డ తర్వాత వెనక్కి మరలించుకోడం అద్దానికి కుదరదు గూడా ! అలాగే తన కోపం కంటే ఇతరులకోపం తన ద్వారా వ్యక్తమైనపుడే మరల్చుకోలేనిదిగాను, ఎక్కువ వాడిగానూ కూడా వుంటుంది అందుకే ఆ లక్ష్మణుని కోపానికి మన వాళ్లెవ్వరూ తాళలేకపోతున్నారు. ఆ లక్ష్మణుడు ద్వారం దగ్గఱ వేచి వున్నాడని నీ ప్రియసుతుడు అంగదుడు చెప్తున్నాడు. వెంటనే వెళ్లి తలవంచి, ప్రణామం చేసి, ఆ సౌమిత్రిని ప్రసన్నుని చేసి, నీవు ఇచ్చిన మాట నిలుపుకో ! రామునికిచ్చిన మాట చెల్లించడం నీకే ఫలప్రదం." అన్నాడు అప్పుడు సుగ్రీవుడు అంగదుని వంక చూశాడు. అప్పుడు అంగదుడు—

"పర్వదిన పాదోధిలాగా ధనుష్టంకార మహాధ్వనితో ఘోషిస్తున్న లక్ష్మణుని చూసి ఊరు ఊరెల్లా భయాందోళనలతో తల్లడిల్లి పోతోంది. కపి వీరులంతా కంపించిపోతున్నారు. నన్ను చూసి లక్ష్మణుడు 'నేను వచ్చి ఇక్కడ వేచి వున్నానని మీ తండ్రితో చెప్పమని నన్ను పంపాడు' అన్నాడు.

అంగదుని మాటలు విని సుగ్రీవుడు తన ఆసనం మీద నుండి దిగి హనుమంతుని దగ్గఱకు పోయి చేతులు పట్టుకొని—

## సుగ్రీవుని మనస్తత్త్వం

"అవతలి వాళ్లకు అంత కోపం రావడానికి నావల్ల దోషం ఏమైనా జరిగివుండాలి గదా! అలాంటిదేమీ లేకుండా ఎందుకొచ్చిందో తెలీదు. కోపం వచ్చేసిందంటే ఏమనుకోవాలి ? ఏం చెప్పుకోవాలి ? 'దున్నపోతు ఈనిందంటే దూడను కట్టెయ్యండి' అన్నట్లుంది ఈ తీరు చూస్తోంటే! ఒక్క మాట నేనన్నది లేదు. ఒక చెడ్డ వూహ నాకు కలిగింది లేదు. రాముని మీద భక్తి – తమ్ములైన భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల కెంతో నాకూ అంతకు తక్కువేమీ లేదు. ఆ తమ్ముళ్ల మీద కూడా అంతటి గౌరవమూ వుంది. మరి నా మీద వారికంత కోపం ఎందుకో అర్థం కావడం లేదు. నా మీద నా ప్రభువైన రామచంద్రునితో నేనంటే గిట్టని వాళ్లెవరైనా ఏమైనా చెప్పారేమో! లేఃపోతే ఏమిటిది, రాఘవునికి నామీద కోపం రావడమేమిటి ? స్నేహం అంటే ఆ మాత్రం నమ్మకం ఉండద్దా ? నా మీద ఇంతకోపం వుండడానికి నే నేమన్నా ఆ సీతమ్మను ఏ రాళ్లల్లోనో, రప్పల మధ్యనో, గుహల్లోనో దాచి వుంచానా, ఏ మన్నానా ? ఆమె ఆభరణాల మూట కూడా నాదగ్గఱ దాచుకోలేదే! ఇదిగో అని ఆయన చేతుల్లోనే పెట్టాను గదా! వాస్తవం చెప్పాలంటే ముందుగా ఆయన వచ్చి నన్ను ఆశ్రయించాడు గాని. నేను పోయి ఆయనను ఆశ్రయించ లేదు. అయితే ఆయన జగత్తులో అధికుడుగా గుర్తింపబడ వచ్చు. అది వేరే సంగతి. అంతమాత్రంచేత ధర్మాధర్మాలు లేవూ ? రాముడు అవనీ, లక్ష్మణుడు అవనీ నే నేమన్నా ఆడిన మాట వెనక్కి తీసుకుంటే భయపడాలి, సిగ్గుపడాలి గాని లేకపోతే

వాళ్ళంటే నా కెందుకు భయం కలగాలి? భయపడాలి ? ఆత్మశుద్ధి లేకపోతే, మనస్సు చంచలమైతే – అగ్ని సాక్షిగా ఏర్పరచుకున్న సఖ్యమైనా నిలవక పోవచ్చు. ముందు వాళ్ల పని పూర్తిచేసి అటుపైనే మాట్లాడి నా ఆత్మశుద్ధిని తెలియపరుస్తాను" అన్నాడు. తప్పుపట్టలేని సుగ్రీవుని మాటలను వాక్చాతుర్యంగల హనుమంతుడు విని–

## హనుమంతుని మంత్ర కుశలత్వం

"నీవన్న మాట మరచిపోకుండా ముందు నిలబెట్టుకొని అటుపైనే ముఖం చూపిస్తాననడమే నీ హృదయనైర్మల్యాన్ని తెలియచేస్తోంది. సేవా దక్షత్వం, సజ్జనత్వం, దాక్షిణ్యత్వం బంగారంలాంటి నీ ధర్మబుద్ధికి తార్కాణాలు. నిన్ను వేలెత్తి చూపడానికి అవకాశమేదీ ? కాకపోతే వర్షాలు, మేఘాలు సృష్టించే వాతావరణం, భార్యాదూరుడైన వానికి శాపంలాగా పని చేసి తాపాన్ని కలుగజేస్తుందనే విషయం గుర్తుంచుకోవాలి. ముందుకూ వెనక్కూ రెపరెపలాడుతూ అంచులవద్ద చేరిన తెల్లటి నురుగుతో నదులు తెల్లటి అంచు-చీరలను కట్టినట్లు ఒక ప్రక్క, రెల్లు పూలగుబుర్లు తలలాడిస్తూ ఒక ప్రక్క-నూతన వధూవరులలాగా పోటీపడుతున్నట్లున్న దృశ్యం భార్యా దూరునికి తాపాన్ని పెంచదూ ? ఆ తాపం తీరకపోతే కోపాన్ని పెంచదా ? అంతదూరం రానీకుండా నువ్వు కాస్త దయతో వెంటనే సహకరించినా బాగుండేది మరి రాముడు పడే తొందరకు అర్థం లేదనగలమా? జడివానల వడి పూర్తిగా తగ్గిపోయింది. నల్లమబ్బులు తెల్లబడ్డాయి. భూమి, ఆకాశం గూడా నిర్మలంగా వున్నాయి. ఆకుల కన్నీటిబొట్లు ఆగిపోయి ఆనందంగా రెపరెపలాడుతూ వున్నాయి. మొత్తంమీద ప్రకృతి అంతా పరమప్రశాంతంగా వుంది. ఇంత చక్కటి అవకాశాన్ని ప్రకృతి కలుగజేసినా నువ్వు సేనతో సాగి నీవు చెయ్యవలసిన పనికి ఉద్యుక్తుడవు కాకపోతే రామునికి కోపం

రాదూ ? సీత బ్రతికే వున్నదని తెలిసింది. ఇంక వెతకడం ప్రయత్నమే మిగిలింది. బ్రతికి భద్రంగానే వున్నది కాబట్టి వాతావరణం అనుకూలమ య్యేదాకా అగవచ్చు అనుకుని నాలుగు నెలలు స్వామి నిరీక్షించాడు. శరద్రాత్రి వెన్నెలలకు కలువలు ముఖమంతా కళ్లు చేసుకుని పలకరిస్తుంటే - సీత కన్నుల అందాలే గుర్తుకు వచ్చి తనను తొందరపెట్టాయి అప్పటికి అనవసరంగా ఆలస్యమైపోయిందని నీపై కోపం వచ్చిందంటే మనం తప్పు అనగలమా ? అలా కోపం వచ్చిందేమని నువ్వు అనుకోనే రాదు. పైగా అలాటి కోపం ఆదుకునే మిత్రుడి మీద కాకపోతే ఇంక ఎవరిమీద కోపం వస్తే ఏం లాభం చెప్పు ?"

"మనమీద కోపం రావడంలో ఎంతైనా న్యాయమే ! అయినా అంత కోపం వచ్చినా అంతకోపంతోను తానే సూటిగా మన దగ్గఱకు రాలేదు. మంచివాడు కాబట్టి తాను రాకుండా తమ్ముణ్ణి పంపాడు. ముందు అందుకు సంతోషించాలి మనం. ఇప్పుడు కనక నీవు నువ్వు చెయ్యాల్సిన పనిచెయ్యడం ప్రారంభించి కృతజ్ఞతను వెల్లడించు కున్నావా, ఆ స్వామి కోపం ఇట్టే మాయమైపోతుంది. 'దీర్ఘ కోపం ఉండదు ఉత్తములకు' ఆ విషయం గుర్తు పెట్టుకో ! మీ ఇద్దరి మధ్య వున్నది చాలా ఉత్తమ మైన స్నేహం. కాబట్టి ఇకనైనా మేలుకో ! ఇంకో సంగతి చెబుతా విను. అవతలివాడు తాను కొంచెం హెచ్చుగా వున్నట్లుంటే మనం కొంచెం తగ్గాలి. అంతేగాని మనమూ బిర్ర బిగిసి పైకెగర కూడదు. ఇదికూడా మంచి స్నేహలక్షణమే ! అవతల ద్వారం దగ్గర అగ్ని హోత్రంలాగా వున్న సౌమిత్రిని కాస్త మంచి మాటలతో మర్యాదా పూర్వకంగా ప్రవర్తించి, ప్రసన్నుని చేసుకో ?" అన్నాడు.

# లక్ష్మణుని ప్రవేశం

లక్ష్మణుడు సరాసరి కిష్కింధాపురం ప్రవేశించాడు. ద్వారం దగ్గఱ వున్న మహావానర యోధులు అంజలి ఘటించి లక్ష్మణుని ఉగ్రరూపం చూచి భయభ్రాంతులతో దూరంగా నిలబడ్డారు. లక్ష్మణుడు కిష్కింధాపుర కోటను తిలకిస్తూ చిట్టచివరకు అంతఃపురం ప్రవేశం చేశాడు. అక్కడ—

వస్తూపోతూ వుండే నారీజన నూపురరావాలు, కటిస్థల మేఖలా కింకిణీ సంరావాలు, కాంతల కలస్వనాలు, విపంచికా నిక్వాణాలు వీనులకు విందు చేకూరుస్తూండగా, వన్నెల విసనికఱ్ఱల మైపూతల గుబాళింపులు నానావిధ కుసుమ సుగంధాలతో తట్టుకోలేక ముక్కులు ఉక్కిరి బిక్కిరి అవుతుండగా, నెన్నడుముల డోలలూగు పూజడలతో వన్నెచిన్నెల కన్నెల వయారపు నడకలతో వాతారణం అంతా మన్మథ మయంగా వుంది. తానక్కడ ఉన్నట్లు ఎవ్వరూ గమనించలేదు. లక్ష్మణునికి కోపం వచ్చింది. ధనుస్సును తీసికొని నారిని మ్రోగించాడు. సమస్త నారీజనం స్తంభించిపోయారు. నృత్య భంగిమలలో నిలిచిపోయారు. ఒక్కసారి అంతఃపురం అంతా మౌనం సామ్రాజ్యమేలింది. సౌమిత్రికి కోపం వచ్చిందన్న సంగతి అవతల సుగ్రీవుడు గ్రహించాడు. "అంగదు డేదో చెప్పాడనుకున్నాను కానీ పరిస్థితి ఇప్పటికి పూర్తిగా అర్థమైంది. ఈ సఖ్యమే ఇలా అయితే ఇంక ప్రపంచంలో ఏ మైత్రి నిలుస్తుంది ?" అనుకున్నాడు. వెంటనే ఆసనం మీద నుండి లేచి, తారను చూసి—

"ఉదార, ఉదాత్త లక్షణాలుగల నీవు పోవాల్సిందే ! ఇంక పోయి ఆ రాముని తమ్ముని కోపం తగ్గేట్టు తెలివిగా వ్యవహరించాలి. ఇందుకు నువ్వే తగిన దానివి. మంచివాళ్లెవరూ ఆడవాళ్ల మీద కోపం వహించరు. నిష్ఠూరంగా పలకనూ లేరు. కారణం లేకపోయినా కోపం కలిగింది. ఈ

సమయంలో శాంతిని చేకూర్చి పెట్టగల దానివి నువ్వే ! కాబట్టి ముందు నువ్వెళ్ళి, కించిద్దోష మేదైనా వున్నా నచ్చచెప్పి. సఖ్యాన్ని నిల్పు" అని తారను ఒప్పించాడు. కైపు కళ్ల కాంతులతో, మెడలోని హారాలు తళుక్కుమంటూ వక్షస్థలంపై నుండి క్రిందికి జీరాడుతుండగా, నడుముచుట్టూ వున్న బంగారు వడ్డాణపు గజ్జల సవ్వడులతో, మంజీరభూషిత పాదాల వయ్యారపు నడకలతో బయల్దేరింది తార.

## తార వాక్చాతుర్యం

తారను చూడంగానే లక్ష్మణుని కోపం దూరమైంది. ఆ సమయంలో తార వస్తుందని లక్ష్మణుడు అనుకోలేదు. నిజానికి ప్రస్తుత విషయానికి సంబంధించినంతవరకూ ఎవరన్నా ఆడవాళ్లని, అందులోను భార్యలను పంపిస్తారా ? తప్పు చేసినవాడు లౌక్యంగా చేసే పని ఇది. తీరా తార రాంగానే ఎంత కోపములో వున్నా లక్ష్మణుడు బలవంతాన కోపం దిగమింగుకోవలసి వచ్చింది. పరాయి స్త్రీ యెదుట ఎలా ప్రవర్తించాలో తెలిసిన వాళ్లెవరూ అనవసరంగా కస్సు బుస్సు లాడరు. అందులోనూ లక్ష్మణుని సంగతి వేరే చెప్పాలా ? అప్సరసలాగా అందాలు చిందిస్తున్న తార ఎదురు పడంగానే లక్ష్మణుడు ముఖం వాల్చేశాడు. భర్తకైతేనే ఎదురుగా అలా నిలబడతారు కులస్త్రీలు. ఒకవేళ పరాయి మగవాడు అనుకోకుండా ఎదురుపడినా, మాట్లాడ వలసి వచ్చినా ఒక అన్నగారిని చూచినట్లో, తండ్రిని చూచినట్లో చూస్తారు. తార చాలా తెలివిగా లక్ష్మణుని ఉద్దేశించి—

"మీ మాట ఎవరు కాదన్నా రేమిటి ? వాగ్దానం భంగమైందని గూడా ఎవరూ అనలేదే ? మరి అలాంటప్పుడు సరాసరి అంతఃపురంలోకి వచ్చి, వింటినారిని మ్రోగించాల్సినంత అవసరం ఏ మొచ్చిందో ! అవడానికి స్నేహితునివి, సామర్థ్యం గలవాడివి, మహాత్ముడివి, అలాంటి నీవు ఇలా అంతఃపురానికి వచ్చి వారి లాగావంటే ఏమనుకోవాలి ? సఖ్యంతో ఎలా చేసినా చెల్లుతుందనుకోవాలేమో ఇక" అన్నది అందుకు లక్ష్మణుడు—

## లక్ష్మణుని ప్రతిస్పందన

"నేను చేసింది తప్పుగా, నిష్ఠూరాలు పలుకుతావు గాని చాతుర్మాస్య దీక్షా కాలం గూడా పూర్తయిపోయింది. అయినా పానమత్తుడై ప్రభు కార్యం పట్టించుకున్నాడా ? శరత్తు వచ్చినా మత్తు వదలి అప్రమత్తుడవలేదంటే ఏమనుకోవాలి ? మాటలాడగల దానివి నాతో ఏదో చెప్పావ్ సరే ! మరి మా అన్నతో ఆ నిద్రా అలసు డేమి చెప్పాడు తల్లీ ! అసలు తను చెయ్యాల్సిన పని జ్ఞాపకం వున్నట్టు లేదని నా కనిపిస్తోంది. అతను నిద్రా అలసుడైతే అవతల రాముడు నిద్రాదూరుడై, అప్రమత్తుడై వున్న సంగతి గుర్తుండాలి. రాజైనవాడు వూరికే మాట్లాడడు. అంతా చేతల్లోనే చూపిస్తాడు. అట్లాంటి కించిత్ప్రయత్నమైనా చేశాడా అని నా అనుమానం ఆశ్రితుడైన వానికి కోపం గూడానా ? భూమీశుడంటే ఎలా వుండాలి ? పూర్వాపరాలు ఆలోచించి కార్యజ్ఞత, విజ్ఞత, సమయపాలన, నియమపాలన, సామరస్య స్వభావం వుండాలి. మనస్సు బాగుంటే ధర్మార్థాలు రెండూ ప్రాప్తిస్తాయి. కాని, ఆ మనస్సును భ్రష్టు పట్టించేది పానం. పానం చేత చెడిన మతి స్వర్థానర్థాలకూ దారితీస్తుంది. తన పని తనే పాడుచేసుకుంటే "అది వాడి కర్మ" అని వదలివెయ్యవచ్చు. తనను ఆశ్రయించినవారిని, తాను ఆశ్రయించిన వారి పనులను గూడా పాడుచెయ్యడం లాంటి పాపానికి

మించినది ఏదన్నా వుంటుందా ? ఉంటే మరి దానికి నీ తెలివి ఏం చెబుతుందో ? నీ పని నేను చేసిపెడతా అని ముందు తన పని చేయించుకుని లాభం పొంది, అటుపైన ఇచ్చిన మాట మరచపోవడం పాపానికి పరాకాష్ఠ అవుతుంద౦ని చెప్పడమే నా చివరి మాట. మరి దానికి నువ్వేమంటావో ?" అన్నాడు.

"ఎదురుగుండా ఆడది వుందని మాటలు కొంత శాంతంగా వున్నాయి తప్ప అయ్యగారిలో కోపం తగ్గిన చిహ్నాలేవీ కన్పడటం లేదు" అనే భావం అదోరకంగా త్రిప్పిన తార కళ్లల్లోను, సవరిస్తూ కదిపిన క్రింద పెదవిలోను కనబడింది. అయినా తార సహజ ధోరణిలో ఎడమకాలి పసిడి అందెల సన్నని సవ్వడి వినపడేటట్టు హేలగా పాదాంగుష్ఠాన్ని నేలపై త్రిప్పి, మందస్మిత సుందర వదనారవిందంతో అలవోకగా చూసి ధైర్యంగా—

# తార స్థాయి లౌక్యం

"మీ మధ్య వున్న మైత్రికి చిన్న పొరపాటును ఓర్చుకోలేరా ? మీ అంతకు మీరు గృహలక్ష్మిని, రాజ్యలక్ష్మిని దక్కించపజేసి, తీరా ఆ రెంటినీ అనుభవింప సమయం వచ్చేసరికి చిరుదోషాన్ని చూపి అడ్డు నిలవడమే గదా, మీ ప్రస్తుత వాక్య ధోరణి. నిన్ను ఇక్కడ వాళ్లెవరూ ఎఱుగరు. నిన్ను రాళ్లతోనూ, చెట్లతోనూ కొడదామనుకున్న వాళ్లెవరూ నిన్ను ఎఱుగరు. ఎఱుగున్న వాళ్లైతే అలా ఎందుకు చేస్తారు ? వాళ్లంతా క్రొత్తవాళ్లు. అయితే ఆ క్రొత్తవాళ్లు ఇక్కడికి ఎలా వచ్చారు ? ఏం పనిమీద వచ్చారంటావ్ ? ఆ మాత్రం ప్రయత్నం లేకుండానే వున్నామంటావా ? ఆలోచించు కాస్త. అయినవాళ్లే క్షమించకపోతే ఇంక

పరాయివాళ్లు క్షమిస్తారా ? బలహీనుల పైన బలవంతులకు కోపం రావచ్చా ? పైగా ఇద్దరి మధ్య ప్రేమతో ఒప్పందం గూడా ఉంది గదా! దుర్బలుల పై అలరిన ప్రేమ, ముద్దు, జాలి నవ్వు లనే పుట్టిస్తుంది. ఇంకా విసుగొస్తే వెక్కిరించి చక్కాపోతుంది. గాని విల్లు మీదకు దృష్టి పోనిస్తుందకోను. జగదేక కోదండధారులైన మీరు మా కిష్కింధావాసులకు అండగా వున్నారని, ఈ నేలకే వెన్నుగా వున్నారని తెలియజెప్పి — ఆ రావణుని కోపాన్ని, అసూయను పెంచడానికి, త్రుంచడానికి విల్లు చేతబూని మా యింటికి వచ్చావు గదయ్యా ! రా ! ఇంత దూరం వచ్చి ఊరికే పోకూడదు. రాజును చూచి పోదువు గాని రా!" అన్నది. తెలివిగా పలికిన తార మాటలకు లక్ష్మణుడు ఆశ్చర్యపడ్డాడు. సుగ్రీవుణ్ణి చూడవచ్చే సమయానికి ఈ మాత్రం కోపం గూడా వుంటుందో, వుండదో అన్నట్లుగా చేసింది తార వాక్చాతుర్యంతో. "తాను పూర్తిగా మెత్తబడిపోక పూర్వమే వెంటనే వెళ్లడం నయం" అని తార వెంట అంతఃపురం లోపలకు వెళ్లాడు లక్ష్మణుడు.

"రుమ మెడకు ఇరువైపులా భుజాలపై సుగ్రీవుని చేతులు కంకణాలతో మెరుస్తున్నాయి వక్షస్థలంపై మెడనుండి వ్రేలాడుతున్న మణిమయ హార ఆభరణ కాంతులతో సుగ్రీవుడు దేదీప్యమానంగా వెలిగి పోతున్నాడు. కిష్కింధాంతఃపురం స్వర్గం లాగా, రుమ శచీదేవిలాగా, సుగ్రీవుడు సాక్షాత్తు ఇంద్రుడిలాగా దీపిస్తున్నారు. వెనకవున్న గోడలమీద–గీతా వాద్యాలు వాయించడం ఆపేసి విచిత్రంగా విలోకిస్తున్న భంగిమలతో, తన్వంగులు వర్ణచిత్రాలవలే సందీపిస్తున్నారు." అంతఃపురంలోనికి లక్ష్మణుని రాకతో అంతఃపుర వాతావరణం ఒక్కసారి మారిపోయింది. శివుని కంటికి కాముడు కాలి బూడిదై పోయాడన్న వార్త వచ్చినప్పుడు ఇంద్రుని అంతఃపురం ఎలా అయిందో సుగ్రీవుని అంతఃపురం అలా అయింది.

రుమ మెడమీద నుండి సుగ్రీవుడు తన చేతులు సడలించుకొని, ఆసనం దిగి, లక్ష్మణుని దగ్గరకొచ్చి అంజలి ఘటించి నోట మాట లేకుండా మౌనంగా నిల్చుండి పోయాడు. నాగుపాము పడగ విప్పే ప్రయత్నంలాగా లక్ష్మణుని ముక్కుపుటాలు ప్రక్కలకు, పైకి విచ్చుకుంటున్నాయి. విశాలమైన ఎర్రని, ఎత్తైన వక్షస్థలం మధ్యలో కదులుతున్న రక్త నాళాలు కనబడుతున్నాయి. ఎడమ చెయ్యి నడుంపైన నిలువుగా నిటారుగా వున్న శరయుక్త ధనుస్సును పట్టిన దక్షిణ హస్తంతో, దక్షిణ పాదాన్ని నేలపై నిబ్బరంగా నొక్కి పట్టి నిలబడిన లక్ష్మణుడు—

## లక్ష్మణుని పునరావేశం

"ఎదురుగా కనుల ఎదుట కనబడ్డప్పుడు ముఖం నిండా భక్తి పులుము కొని, చేతులు జోడించి, సర్వ సపర్యలతో మిత్రత్వాన్ని మూర్తీభవింప చెయ్యటం— కనుమరుగైనప్పుడు అడవుల్లో వున్నారో, ఊడారో నిల కనీసం కనుక్కోవాలని గూడా గుర్తురాక పోవడం– దీన్ని 'అసమర్థ ప్రభుత్వ వైఖరి' అని అనడం గాక మరేమనాలి ? వికసించిన బుద్ధిగల భూమీశుడు ధర్మార్థ కామాలను సమపాళ్లల్లో అనుభూతికి తెచ్చుకొని, ఇహ పరలోకాలకు కావలసిన వాటిని సమంగా అనుభవిస్తూ, సాధు భోగ సమన్వయాన్ని సాధి స్తాడు. వికటించిన బుద్ధి గలవాడైతే పుచ్చిపోయిన వృక్షం లాగా కృశించి నశిస్తాడు. సత్యసంధుడు, జితేంద్రియుడు అయిన ధరణీనాధునికి భూతలం స్వర్గమే ఔతుంది. తాను దేవేంద్రుడంతటి వాడౌతాడు. కాని, భూభారాన్ని మంత్రుల మీద పడేసి నిరంతరము కల్లు త్రాగుతూ, కాంతలతో కామ సుఖా లనుభవిస్తూ అంతఃపుర అతివల మధ్య సరస సల్లాప భోగాల్లో మునిగిన వాడు ఏమౌతాడో ఇంక చెప్పేదేముంది? తాను చెడి దేశాన్ని చెడగొట్టిన

వాడౌతాడు. తన మాట మీద నిలబడితే నాకలోకంలో వుంటాడు, నిలబడనీ వాడు నాగలోకం అట్టడుగున వుంటాడు. మొదట మిత్రుని వల్ల ఉపకారం పొంది ఆపైన దురాలోచనాపరుడై ప్రత్యుపకారం సంగతి మరిచిపోయే దుష్టుడు వధ్యుడే అని బ్రాహ్మణాలు చెబుతున్నాయి. అల్లాంటి వాడు దుర్మదుడు, కృతఘ్నుడు, కుటిలుడు, మత్తుడు, దుశ్చిత్తుడు.

"ఏదో గుఱ్ఱము, ఆవుల విషయంలో అబద్ధ మాడినవాడు వందమంది నో, వేయి మందినో చంపినవాడౌతాడు. కాని సాక్షాత్తూ తోటి మానవుని విషయంలో అబద్ధమాడితే అతడు తనని, తనవాళ్లని చంపినవాడే అవుతాడు. అవతల ప్రభువుకు నీమీద మమకారం ఇంకా పోలేదు. నీమీద మిగిలిన ఆ కాస్త మోహాన్ని పూర్తిగా పోయేట్టు చేసుకోక! ప్రభువుకు నీమీద ఆ మాత్రం గూడా మోహం లేదని తెలిస్తే నేను ఇన్ని మాటలు మాట్లాడను. నేరుగా వచ్చి నిన్ను వధించి వుండేవాణ్ణి. నీ మంత్రుల్లో ఒకడు చాలా బుద్ధిశాలి. నీపట్ల చాలా అభిమానం గలవాడు. ఆ మంత్రిని చూచి నేను నా ధోరణిని ఈ మాత్రం తగ్గించుకుని ఆగాను. మరి ఇప్పటికైనా అన్న మాట మీద నిలుస్తావో, సెగలు గ్రక్కే అగ్ని జ్వాలల మధ్యలో సర్వ కిష్కింధను బూడిదపాలుగా చూస్తావో, ఎక్కుపెట్టిన బాణం నీ సమాధానం కోసం నిరీక్షిస్తోంది. ఏ సంగతీ చెప్పు" అన్నాడు. మొదట తార వచనాలకు శాంతపడినట్లు వున్నా అణిగివున్న అగ్నికి ఆజ్యం తగలంగానే ప్రజ్వలించి నట్లు లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి చూడంగానే చండప్రచండుడయాడు. రుమతో సహా దాదాపు అంతఃపుర అతివలందరూ చెదిరిపోయారు. మంత్రు లందరూ ముఖాలు దించేసుకున్నారు. సుగ్రీవుడు చిత్తరువులా నిశ్చలుడై నిలుచుండి పోవడం చూచి తార—

# తార విజ్ఞత

"కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్లు అంత ఘోరంగా మట్లాడడమే! అంత పెళుసుగా మాట్లాడితే ఇటు ప్రక్క ధర్మం ధర్మం కాకుండా పోతుందా కొద్దిగా ప్రమత్తుడన్నది తప్ప సుగ్రీవునిలో మరే దోషమూ లేదు నువ్వను కున్నట్లు సుగ్రీవుడు అజ్ఞానుడు కాదు. మూర్ఖుడు కాదు. కృతఘ్నుడంత కంటే కాదు. లజ్జాహీనుడూ కాదు. ఉదాసీన వైఖరి గలవాడు కాదు· అమిత్రుడు గాదు. తేజస్సంపన్నుడే! సాధుశీలుడే! శూరుడే! మీ వంశ కర్త సూర్యుని సుతుడేనయ్యా ఇనకుల తిలకా! (అనవసరంగా నీ వంశకర్త ను కించపరచుకోక! అలా దూషిస్తే అవన్నీ నీకూ వర్తించే ప్రమాదం వుంది సుమా! కాస్త వళ్లు దగ్గర పెట్టుకుని మాట్లాడు అనే హెచ్చరిక కూడా తార మాటల్లో వుంది)· నీ మాటలు సూటిగా ఈటెలలాగా వున్నాయి. ఆ మాటలు అవతల వ్యక్తి మనస్సుని ఎంత కష్టపెడతాయో కాస్త ఆలోచించు. న్యాయంగా పోయేవాని మనస్సునలా కష్టపెట్టడం తగదయ్యా. కామదాసు డవడంలో ఈ సృష్టిలో సుగ్రీవుడే మొదలంటావా? ముందెంత మంది ఈ కామభావ పరతంత్రులు కాలేదు? మేనక స్పర్శ గాధిసుతుణ్ణి (విశ్వామిత్రుని) ముక్కు మూసుకునేట్టుగా చెయ్యడానికి బదులు పది సంవత్సరాలు కళ్ల మూతలు బడేట్టుచేసింది. ఆ కాలంతో పోలిస్తే ఈ నాలుగు నెలల కాలం ఎంత? ఆయనతో పోలిస్తే ఈ సుగ్రీవు డెంతవాడు? దేనికి ఇంత గోడు చెప్పు?"

"అవవలసిన పని అయేట్టుగా చూసుకోవాలి తప్ప వివేకవంతు లెప్పుడూ అనవసరమైన అతిసూక్ష్మ విషయాలను పట్టించుకోకూడదు చింతాకంత దోషాన్ని చూపి సుగ్రీవుడంతటి సమర్థుడైన రాజుని చేజేతులారా చంపుకుంటే- జరగపోయే యావత్ప్రయత్నాన్ని మళ్లీ ఓనమాల దగ్గఱ నుండీ ప్రారంభించ

వలసి వస్తుంది. కలిసిరాక పోతే జీవితాంతం చింతించవలసి వస్తుంది. ఆ క్రూరదైత్య సేనను అణచి రావణుణ్ణి సాధ్య పడేలా చెయ్యడానికి తగిన మంత్రాంగం, వానరసేనతో మంచితనం సుగ్రీవునికి వున్నంతగా ఇంకొకరికి లేదు. ఈ సంగతి నాకు బాగా తెలుసు. కాబట్టి సుగ్రీవుణ్ణి దూరం చేసుకుని సుఖంగా సాధించే రామకార్యాన్ని తొందరపడి కష్టతరం చేసుకోకు. కావలసిన కార్యం సుగ్రీవునికి ఆ మాత్రం గుర్తుండదను కోకు. ఏ విషయానికా విషయమే ! కనుసన్నలతోనే ఆదేశాలిచ్చే నైపుణ్యం గలవాడు. "సుగ్రీవాజ్ఞ" అంటే ఎలాంటిదో ముందు వానరుల ద్వారా నీకే తెలుస్తుంది. ఎక్కడెక్కడ వున్న వానరయోధుల్ని ఒక్కచోట కలపడానికి దిక్కు దిక్కులకు సైన్యాధిపతుల్ని ఎప్పుడో పంపాడు. ఇవాళో రేపో వాళ్లందరూ వస్తారు. కొందరప్పుడే వచ్చేశారు గూడా ! కొండశిఖరాలమీద కదిలేవారు, నీవు ఎవరో తెలియక నీ మీద రాళ్లు రువ్వ ప్రయత్నించిన వారు ఎవరనుకున్నావ్ ? ఆ క్రొత్తగా వచ్చిన వాళ్లే ! కాబట్టి నాయనా ! అనవసరంగా ఈ ప్రయత్నాన్ని వమ్ము చేయబోకు. మీ మధ్య ఎంతటి స్నేహమున్నా, కోపం వచ్చినా ఇక్కడ వున్నది కిష్కింధాధిపతి. పైగా అంతఃపురంలో వున్నాడు. ఆ అంతఃపుర కాంతల సమక్షంలో ధరాకాంతుణ్ణి అంతలేసి మాటలు మాట్లాడతారా ! ఒక అప్రతిమాన బహుబల సంపన్నుడు, జగత్ప్రసిద్ధ కోదండధారి అనే మాటలేనా ఇవి ? ఆ ప్రభువైన రాఘవుని జగద్విమోహనం అప్రతిమానమైనది. నువ్వు అతణ్ణి అనుసరించి పుట్టినవాడవు. నీ మాటలు మీ వంశానికి వన్నె తెచ్చేలాగా, వెన్నెలలు కురిపించేలాగా వుండాలి. ఏది ! ఒక్కసారి అలాంటి నవ్వు నవ్వు హృదయం ఆనందంతో నిండి మీ ప్రియ మిత్రుడు ఆలింగనం చేసుకుంటాడు" అన్నది, లక్ష్మణుడు తార మాటలకు ఉబ్బితబ్బిబై పోయాడు ముఖంలో ప్రసన్నరేఖ పొడసూపింది. సుగ్రీవుడు లక్ష్మణుణ్ణి

చూసి నవ్వాడు. లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి చూచి నవ్వాడు. ఇద్దరూ ఒక్కళ్లనొకళ్లు ఆలింగనం చేసుకున్నారు. అటుపైన సుగ్రీవుడు—

## సుగ్రీవ నిర్ణయం

"ఓ లక్ష్మణా! నా సామర్థ్యంమీద నాకు దర్పమేమీ లేదు. మీరంటే ప్రభుభావన వుంది తప్ప. నా భావనా దర్పణంలో రామచంద్రుడే ప్రతిబింబిస్తాడు. నే నని వేరుగా లేకుండా, నా బ్రతుతంతా రామార్పణమైంది. నా తనువెల్లా మీది. నా రాజ్యం, కీర్తి, సుఖము, దుఃఖము, ఒక్కటేమిటి అన్నీ శ్రీ రఘురామ పదార్పితమే! చేతికి కొద్దిగా చెల్లి లేస్తే ఇంక ఆ చేతిని కోసేస్తారా? నా వల్ల ఏదో స్వల్ప దోషంవుంటే ఆ మాత్రం క్షమించలేరా? వారం రోజులు గడువుపెట్టాను. రేపటితో ఆ గడువు పూర్తవుతుంది. కొండలు, కోనలు, సముద్రాలు అన్నీ వెదకి జానకి జాడ తెలుసుకురావాలి. జానకి జాడ తెలియకుండా ఇక్కడకు వస్తే బ్రతకడు" అంటూ మెడలోని బంగరు హారాన్ని త్రెంచిపారేసి—

"భూసుత కనిపించేవరకు నేను భూపతిని కాదు, రాముని దాసుణ్ణే! ఆ శూరుడు రాముడు సీతమ్మను తీసుకువచ్చాను అనేంతవరకు అన్నిభోగాలు విసర్జిస్తున్నాను. భార్యా దూరుల దుఃఖం నీకంటె నాకే ఎక్కువ తెలుసు."

"ఈ వానరులందరూ సామాన్యులు కారు. సర్వదేవతల అంశలతో పుట్టినవారు. సముద్రాలను పుక్కిలించ గలిగినవారు. భూమిని వ్రక్కలు చేయగలవారు, కుల పర్వతాలను కుళ్లదీసి పెళ్లగించి యివ్వగల సమర్థులు. ఈ సైన్యముతో రావణుని అంతుచూడ్డం ఖాయం. భూగర్భంలో దాచినా,

పుట్టలో చెయ్యిపెట్టి పాముల్ని బలవంతాన లాగినట్లు తెచ్చి సీతమ్మను రాఘవుని ముందుంచుతాను" అన్నాడు. సుగ్రీవుడలా అంటున్నపుడు కళ్లు చెమర్చాయి. సౌమిత్రి సుగ్రీవుని మరల కౌగలించుకొని—

"సమర్థుడికీ, అసమర్థుడికీ భేదం ఇలా వుంటుంది. నువ్వు శౌర్యాన్ని చూపావు. నేను వ్యర్థకోపాన్ని ప్రకటించాను గుహుడైనా, భరతుడైనా, నువ్వైనా సహృదయ గురుమూర్తులు. రామకథకే రంగులు దిద్దిన చిత్రకళా గురువులు. నీ హృదయం తెలుసుకోకుండా అన్న నా మాటలను మన్నించి నన్ను క్షమించు. అన్నా, నీవూ ఇద్దరూ సాధు శిరోమణులు, ఉగ్రశౌర్య వారాన్నిధులు, వ్యవహార యోగ్యులు, మీ మిత్రత్వం పవిత్రం" అన్నాడు.

వృత్రాసుర వధకు సంబంధించిన ఇంద్రుని విజయాలను తెలిపే చక్కని వర్ణ చిత్రాలు రెండు వైపులా వుండి, పైన బంగారు చిరుగజ్జెలు మ్రోగుతూండగా ఛత్రము, రాజదండము, చామరాలు వెంటరాగా అతి మనోజ్ఞముగా వున్న ఒక పల్లకి వచ్చింది. లక్ష్మణుడు చూచి ఆనందపడి ఎక్కాడు. అటుపైన సుగ్రీవుడు ఎక్కాడు. సుగ్రీవుని మనస్సంతా రాముని మీదే వుంది. పల్లకీని మోసే వాళ్లు లోపల వున్న సుగ్రీవ లక్ష్మణులకు ఏ మాత్రం వళ్లు తూగకుండా వుండేటట్లు భుజాలు మార్చుకుంటూ అలుపు తెలియనీయకుండా వుండే లయబద్ధమైన అరుపులతో అడుగులు వేస్తూ కదిలారు.

పల్లకీ మోసే వాళ్ల నినాదాలు విని శ్రీరామచంద్రుడు గుహ ముందుకు వచ్చి నిలబడ్డాడు. వచ్చిన వాళ్లందరూ రాముణ్ణి చూడాలనే ఆసక్తితో, ఆత్రుతతో వున్నారు. అందరికీ రాముడు కనబడే విధంగా కొందరు క్రిందకు వ్రాలే వృక్షశాఖల మీద, కొందరు చెట్ల కొమ్మలపైన, పర్వత శిఖరాల మీద, గుట్టలమీద సర్దుకున్నారు.

"వింధ్య, హిమాచల మందర, మహేంద్రాది గిరీంద్ర నివాసు లందరూ దర్శనార్థమై ఎదురు చూస్తున్నారు. వాళ్లల్లో కుంజరదేహులు నీలమహోగ్ర పయోధరదేహులు, భీమ బలులు, విశతవేగులు, విస్తృత బాహులు, విశాలోన్నత ఘనవక్షులు ఎంతో మంది వున్నారు. ప్రభూ ! వీళ్లందరూ నీ అపార కృపా సముద్రంలో స్నాన పానాతురులే ! యీ సుగ్రీవుడూ నీ కృపారస సముద్ర స్నానపానాతురుడే ! ఈ సమస్త గోలాంగూల యూథోత్తము లందరూ నీ మాటకై నిరీక్షిస్తున్నారు" అని సుగ్రీవుడు వానర వాహినిని వర్ణించి చెప్పాడు.

అనంతమైన వానర సేనావాహినిని చూడంగానే రామునికి ముఖంలో ఆనంద హాసరేఖ తళుక్కుమంది అది సరిగా నీలాకాశంలో విద్యుల్లతలా భాసించింది. ఆనందాతిశయంతో రాముడు సుగ్రీవుణ్ణి గాఢంగా కౌగలించుకున్నాడు.

"ఈ కపివీరులందరూ సీతాన్వేషణా కార్యక్రమంలో నిమగ్నులౌతారన్న మాట ! ఎక్కడున్నదని వెతుకుతారు అనే ఆలోచనలో రాముడున్నట్లు సుగ్రీవుడు గ్రహించి వెంటనే—

"వీళ్లందరిలో కొందరు కొందరు కొన్నిటిలో ప్రత్యేక నైపుణ్యం కలవారున్నారు. వీళ్ల నదులలో ఈదగలిగే గజ ఈతగాళ్లు. సీతమ్మ తల్లిని నదుల్లో దాచి వుంచినా, దాచి వుంచిన ప్రదేశానికి నదులు అడ్డం వచ్చినా చిక్కులేదు. వీళ్ల ఆ చిక్కు విప్పగలరు. అట్లాగే వీళ్ల సముద్రాల మీద ప్రత్యేకత గలిగినవారు. వీళ్లు పర్వతాలు, పర్వత గుహల మీద ప్రత్యేకత వహించిన వాళ్లు, వీళ్లు ఎంత వడిగల ప్రవాహమైనా దానిమీద తేలి వెళ్లగలవారు. వీళ్లందరూ తరులు, ఝురులు, గిరులతో కలిసి నిరంతరం వేగంగా తిరిగే భూగోళ చలనం లాంటి చలనం గలవాళ్ళు, సూర్యు

తేజస్సుతో పోటీ పడగల తేజస్సుగల వాళ్లు. వీళ్లందరూ, నేల, నీళ్లు నిప్పు, గాలి, చోటుల్లో ఎక్కడకైనా వెళ్ళగల సమర్థులు. అల్లాంటి వీళ్లందరూ స్వామీ! నీ ఆజ్ఞకై, నీ నోటి మాటకై, నీ దయకై వేచి వున్నారు'' అన్నాడు.

సుగ్రీవుని మాటలు వినంగానే కపిసేనను తిలకిస్తూ ఒక్కసారి కనురెప్పలు వాల్చి రాముడు—

"వాయుదేవుడు గాలి వీస్తాడు. సూర్యుడు భూమండలాన్నే వండెయ్య గలడు. మేఘుడు భూగోళాన్నంతటినీ తడిపేస్తాడు. అలా అలా చేయ్యడం వారి వారి ప్రత్యేకతలు. మరి నీ బోటి సజ్జనులు మిత్ర సహాయ సేవా కార్యక్రమాల్లో నిమగ్నమై పోతారు. మీరందరూ ధర్మమార్గ వర్తులు." అంటూ "వీళ్లల్లో సేనాధిపతు లెవరెవరు?" అని అడగ బోతూండగా సుగ్రీవుడు — "అదే స్వామీ చెప్పబోతున్నాను'' అంటూ సేనా ప్రాంగణాన్ని సమీపించి—

"ఇతడు శతవలి, నూరువేల సేనకు అధిపతి, ఇంద్రసఖుడైన ఇతడు శౌర్యంలో సాక్షాత్తు నారాయణు డంతటివాడు. ఇతడు తార తండ్రి. తెలివిలో గూడ తారకు తండ్రే. కోటి వానరయోధులకు అధిపతి. ఇతడు రుమ తండ్రి. నేనంటే వల్లమాలిన ప్రేమ చూపేవాడు. నన్ను తన కన్న బిడ్డలా చూచుకుంటాడు. రణరంగ క్రీడారంగంలో వుండే ఇతను కోటిశత సేనకు అధిపతి. తమ్మిపూవులోని దుమ్ము రంగులో వున్న శరీర ఛాయ గలిగిన బాల సూర్యకాంతులు విరజిమ్మే ముఖంగల ధీమంతుడైన ఇతడు హనుమంతుని తండ్రి కేసరి. రాక్షస వీరులను హతమార్చే బహుసహస్ర సేనా సమన్వితుడు. అఖిల దేవతా ప్రసన్నమూర్తి, పరమ సాధ్వి అయిన అంజనాదేవి భర్త. పరమపూజ్యుడు. ఇతడు గవాక్షుడు. శతకోటి కపి

సేనా నాయకుడు, ప్రభు సేవాపరాయణుడు, పటుతర శక్తిమంతుడు. అంటూ ఋక్షుడు, పనసుడు, నీలుడు, మైందుడు, ద్వివిదుడు, జాంబవంతుడు, రుమణ్వంతుడు, గంధమాదనుడు, అంగదుడు, తారుడు, రంభుడు, దుర్ముఖుడు, నలుడు, శంభుడు, కుముదుడు, రాహుడు అంటూ చివరకు హనుమంతుని చెప్పి వారి వారి గుణగణాలను అవక్ర, విక్రమ, పరాక్రమ శక్తి శౌర్య మహిమలను వర్ణించి—

ఇంకా వీళ్లేకాకుండా శక్తి సంపన్నులు వేల కొలది వున్నారు. ఎక్కడ సీత వున్నా సరే వళ్లు దాచుకోకుండా శ్రమించి వెదకి సీత వునికి కనిపెట్టగల వాళ్లు. ఈ సమస్త సైన్యాన్ని నీ స్వాధీనంలో వుంచుతున్నాను. నువ్వు ఎప్పుడు ఏది చెయ్యమంటే అది చేస్తారు. వాళ్ళందరూ నీ వేగులే. నీవే ఈ యోధులందరికీ గురుమూర్తివి. అధినాథునివి. నాకు తెలిసిన విషయమైనా నీ ఆజ్ఞ వుంటేనే చేస్తారు" అన్నాడు.

## రాముని ప్రతిస్పందన

సుగ్రీవుని మాటలకు రాముని రెండు కళ్లూ పులకించి, కాంతులు విరజిమ్మాయి. ఒక్కసారి సుగ్రీవుని కౌగలించుకొని శ్రీరాముడు—

"నీతికి కట్టుబడి అన్న నీ మాటలు నీకే చెల్లు. నాకు నమ్మకం కలిగింది. ఇంక నేను, లక్ష్మణుడు నీవేది చెబితే అలా చేస్తాము. ఆలోచించి ముందు కర్తవ్యాన్ని నిర్ణయించు. ఆ సీత బ్రతికి వుందో లేదో, ఆ క్రూరరాక్షసుడు ఎక్కడ దాచాడో నువ్వు, నీ సైన్యమే తెలుసుకోవాలి. ఈ రామలక్ష్మణులతో కలిసిన నీవు ఈ సర్వసేనకు అధ్యక్షుడివి. నీ వెంటబడి

మేమందరం వస్తాము. ముందు జానకి జాడ తెలిస్తే అటుపైన చెయ్యాల్సిన పని నిర్ణయించుకుందాం." అన్నాడు.

ఒక వైపు వున్న రామలక్ష్మణులను, ఇంకొక వైపు వున్న హనుమంతుని చూచి సుగ్రీవుడు ఒక ఎత్తైన కొండ శిఖరం మీద కూర్చుని ఒక్కసారి సర్వ సేనా వాహినిని చూసి—

## సుగ్రీవాజ్ఞలు

కపి లోకానికి ప్రళయ పరీక్షా సమయం వచ్చింది. సీతాన్వేషణా కార్యంలో కృత కృత్యులమై గట్టెక్కకుండా రాముని ఋణం తీర్చుకోలేని వాళ్ళం కాకూడదు. ఈ కార్యాన్ని మీ సేనా నాయకులందరూ స్వకార్యం లాగాభావించి శ్రద్ధ వహించాలి. మా తండ్రి గారున్నపుడు మీరందరూ కలిసి పనులు చేస్తూ వచ్చారు. వాలి ఉన్నపుడు తాను తన బాహుబలశక్తి మీద తన పనులు తను చేసుకుంటూ వచ్చాడు. నేను పూర్తిగా మీ అందరి మీదా ఆధారపడిన వాడిని. మీ అందర్నీ నాలుగు దిక్కులకు పంపిస్తాను. సీత జాడ తెలిసిందా మన ప్రాణాలు మనకు దక్కుతాయి. జాడ తెలీకుండా వచ్చారా మీ అందర్నీ గుంటల్లో క్రుక్కి, ఎక్కి తొక్కుతా. కొండరాళ్లతో పిండి పిండి చేస్తాను. కపట రాక్షసులందరిలోకి మిన్న అయిన ఆ రావణుడు భూసుతను ఎక్కడ దాచి ఉంచాడో తెలుసుకోడం కష్టం. ఒక దిక్కు, ఒక ప్రదేశానికీ అన్వేషణ పరిమితం కాకూడదు. అన్ని దిక్కులందలి అన్ని ప్రదేశాలు ఈ మూడు లోకాల్లో ఎక్కడున్నా వెదకాల్సిందే! అంగుళ భాగమైనా నాకు తెలియని నేలలేదు. జాగ్రత్త! వళ్లు దగ్గర పెట్టుకుని వెదకండి" అని ప్రక్కనే వినతుడనే సేనా నాయకుణ్ణి పిలిచి—

## సుగ్రీవుని భరతఖండ జ్ఞానము : తూర్పు దిశ

"నీవు నీ సైన్యంతో తూర్పు దిక్కుకు తరలి వెళ్ళి భూజాత సీతను అన్వేషించు. సరయు, కౌశికి, యమున, సరస్వతి, శోణ మొదలైన నదులు, విదేహ దీప్త మాళవ, కాశీ, మగధ, కోసలమొదలైన దేశాలు తిరిగి వెదకండి. సముద్రాల్లో వున్న పర్వతాలను, జనపదాలను కలియ చుట్టండి. అక్కడ మందర పర్వత శిఖరం మీద కర్ణప్రావరణులు, ఉష్ట కర్ణకులు వుండే విశాల భూభాగం వుంటుంది. అదంతా వెదకండి. ఇంకా అక్కడ వుండే ద్వీపాల్లో హేమాంగు, వేపారు కర్ణచూడులు, మత్స్య భోజనులు వుంటారు. వాళ్ల వేషాల్లోకి మార్చి సీతమ్మనక్కడ దాచవచ్చు. అక్కడే ఉంటుంది, యవద్వీపం. అక్కడ మహా అనర్ఘ రత్నాల గనులు వేలకువేలు ఉండే ప్రదేశాలుంటాయి. అది దాటితే మహాద్రి శృంగాలుంటాయి. దాని దుర్గములను, అడవులను వెదకండి. అవి దాటి రక్త జల శోణ వుంటుంది. అక్కడకు వెళ్ళండి. అక్కడ సిద్ధచారణులు వేల సంఖ్యలో వుంటారు. రమ్యమైన వనాలు, మనోహరమైన తీర్థాలు వుంటాయి. రావణుడు సీతతో అక్కడ ఉండవచ్చు. అక్కడ ఇంకా చాలా దీవు లుంటాయి. అవన్నీ తల దూర్చడానికి గూడా వీల్లేకుండా లతాగుల్మములతో అల్లుకుపోయి వుంటాయి. అక్కడ వుండే చెట్లపైన ఇల్లు కట్టుకొని, అతి భయంకరులైన నిషాదు లుంటారు. దానవు లుంటారు. వాళ్ళందరూ బ్రహ్మ వరప్రసాదులు. మీ నీడ వాళ్ళ మీద పడ్డా మిమ్మల్ని ఆహారంగా నోట్లోకి లాగేసు కుంటారు అటుపైన లోహితమనే సముద్రం వుంటుంది, అది భయంకరంగా వుంటుంది. అక్కడ పెద్దరావంతో బుసలు కొడుతూ పెద్ద పెద్ద భుజంగా లుంటాయి. అక్కడే హరితాంశమూర్తి అయిన వైనతేయుడు వుంటాడు. ఆ వైనతేయుని కోసమే విశ్వకర్మ నానామణి విహారరమ్య గృహాన్ని ప్రత్యే

కంగా నిర్మించాడు. దూరంగా లేత అరటితోట లుంటాయి. అక్కడ అట్టహాసాలు చేస్తూ కబోది పక్షులలాగా కొండ శిఖరాలను పట్టుకొని తల క్రిందులుగా వ్రేలాడుతూ మందేహాది రాక్షసులు వుంటారు. వీళ్లంతా సూర్యునికి బద్ధవైరులు. అవరోధాలు కల్పిస్తూ దురంతాలు చెయ్యడమే వీళ్ల పని. ఈ తూర్పు ప్రాంత ఆకాశం నెత్తురు ముద్దలాగా అయే సమయాలలో భూసురు లందరూ సూర్యునికి అర్ఘ్యమిస్తారు. అప్పుడు ఈ మందేహాది రాక్షసుల పటుత్వం సడలి సూర్యునితోటి వైరం సమసి పోతుంది. అప్పుడు తెల్ల మబ్బులలాగా పాలకడలి పరవశిస్తుంది. దాని నడుమ వుండే ఋషభమనే కొండ కాంతికి తెల్లని నందివర్ధనాలు, గన్నేరు పూలు చక్కగా వికసిస్తాయి. చుట్టుపక్కల వుండే చిన్న చిన్న కొండలమీద నుండి వీచే మలయ మారుతం నాసికా పుటాలకు విందు చేకూరుస్తుంది.

## ఉత్తర దిశ

అట్నుంచి కదలి ఉత్తరంగా పోతే పద మూడు యోజనాలకు మించి కనబడే వేరొక పర్వతం తప్తకాంచన కాంతులు విరజిమ్ముతూ కనబడుతుంది అది ముల్లోక వాసులచేత నమస్కారాలు అందుకొనే మహిమ గలది. ఇం కొంచెం ముందుకు సాగిపోతే ఆ హిమగిరి శిఖారాన్ని అధిరోహించి వేయి పడగలతో పన్నగస్వామి దర్శనమౌతుంది. ఆయన కరుణ కలిగితే సీతమ్మ దొరికినట్లే! శత యోజనాల విస్తీర్ణం గల ఆ హిమవత్పర్వతం ఆకాశాన్ని స్పృశిస్తున్నట్లు ఉంటుంది. ఆ కొండకు ఇంకొకవైపు సౌమనస మనే శిఖరం వుంటుంది. 'ఇంక దీనిపైన ఆకాశం లేదేమో' అన్నంత ఎత్తుంటుంది. ఒక సారి బొజ్జ నిండా చతుర్దశ భువనాలు గల జగన్నాధుడు గుజ్జు రూపం ధరించి తన ఒక పాదాన్ని ఈ శిఖరం మీదే వుంచాడు. జంబూ ద్వీపం (భూమి

యొక్క ఉత్తరార్ధ గోళం ఉపరితల భాగాన్ని జంబూ ద్వీపం అంటారు. రామాయణ కాలంనాటికి దక్షిణార్థ గోళం-అంటే భూమధ్య రేఖకు దిగువ భాగం జలమయమే! ఉత్తరార్థ గోళం. క్రింద చుట్టూ ఈ జలం వుండేది. అందుకే ఉత్తరార్ధ గోళాన్ని ద్వీపం అన్నారు). ఒడ్డమ్మటే ఉత్తరదిశకు పోతే వరమాల, శంఖ, చక్ర కిరీటాంగద నిబిడ మూర్తి స్పష్టంగా కనిపిస్తాడు. అక్కడ ఇంక దేశ కాలాలు ఒకదానిలో ఒకటి లీనమై అంతమై పోయాయా అనిపిస్తుంది. దాన్ని సుదర్శన ద్వీప మంటారు. అఖిల ప్రాణులకు కళ్లు ఎలాగో ఈ మేరువుకు ఈ సుదర్శనమలా అన్నమాట! అక్కడ గూడా సీతను అ రావణుడు వుంచవచ్చు. వెళ్లి వెదకండి. దానికి పైన సూర్య చంద్రులే! మధ్యంతా అంధకారం నిండి వున్న చోటే. అంతవరకు వెళ్లి వెదకండి. ఒక నెల లోపల తిరిగి జానకి జాడ చెప్పాలి. ఇందుకు తేడా వస్తే ప్రాణా లుండవని గుర్తుంచుకోండి. మీలో ఒక్కొక్కరు చేతులతో ఈ భూమిని బూరెలను ఒత్తేలాగా ఒత్తగలరు. వెళ్లి కార్యం సానుకూలం చేసుకురండి. వచ్చిన తర్వాత మీకే తెలుస్తుంది. మీ కొచ్చే గౌరవ ప్రతి ఫలాలు ఎలాంటివో!" అని చెప్పి వాళ్ళను పంపించాడు.

## దక్షిణ దిశ

ఇంక దక్షిణ దిశకు అగ్ని పుత్రుడైన నీలా సంగోల్కా ముఖులను, వాయుసుతుడైన హనుమంతుని. బ్రహ్మ పుత్రుడైన జాంబవంతుని, అశ్వినీ దేవతల పుత్రులైన మైంద ద్వివిద కవలలను ఇతర దేవతాంశ సంభూతులను, సుహోత్రుని, శరారిని, శరగుల్మని, గజుని, గవయుని, సుషేణుని, ఋషభుని, విజయుని, గంధమాదనుని, సర్వసేనాపతిగా అంగదుని వెళ్ల

మన్నాడు. సన్నద్ధులై వున్న వాళ్లను, సేనాపతి అంగదుని చూచి—

"మీరంతా సడలని విక్రమంతో అమిత వేగంతో ఎక్కడికైనా, ఎంత దూరమైనా వెళ్ల గలిగినవాళ్లు. అతిలోక మహిమాన్విత సంపన్నులు, సమస్త దానవులను ఆక్రమించు కోగల విస్తార పరాక్రమాంబుధులు, సాధు శిరోమణులు, ఈ దక్షిణ దిశాగవేషణకు తగిన వారు. ఈ దక్షిణ దిశ గూర్చి మీకు చెప్పాల్సినవి చెప్తాను. ఎవరైతే జానకిని తెలుసుకుని వచ్చారో వారికి ప్లవంగ భూ దేశాధిపతిగా పట్టం గడతాను. నా ఆత్మతో సమానంగా చూసుకుంటాను.!"

"వలలో చిక్కుకున్న దుప్పిలాగా గిరితరు లతాగుల్మముల అల్లికల మధ్య వుంటుంది వింధ్యాద్రి. అది అతి భయంకరమైనది. అతిలోక భయంకర జంతు సంతానాలతో నిండి వుంటుంది. అగస్త్య సాన్నిధ్యంలో మాత్రమే తలవంచిన నగరాజు చూడ్డానికి–ఆ బ్రహ్మ ప్రత్యేకంగా నిర్మించిన సౌధరాజంలాగా వుండే ఈ ఖండాన్ని రెండు భాగాలుగా విభజిస్తున్నట్లు కనబడుతుంది. దక్షిణ దిశగా వింధ్య ద్వారానికి ముందుండే ముగ్గుల్లాగా కృష్ణా, గోదావరీ, కావేరీ నదులంటాయి. అటు తూర్పు దిశగా ఉత్కళంలో మహానది వడ్డాణంలా వుండి వరద లొచ్చినపుడు తన మధ్యలోకి ఉత్కళ తనువును ఇముడ్చు కొంటుంది ఈ జీవ నదుల్లో గూడా సీతను వెదకండి. ఇంకా దశార్ణ నగరాలు, అశ్వవంతి, అవంతి, మలయ, ఋషిక, విదర్భ మొదలైన జనపదాలు వెతకండి."

"తరులతా సాంద్రభూమి దండకారణ్యం, గండ శైలప్రచండం. అనేక ఉగ్ర జంతువులకు ఉనికి కిన్నెరసాని, శబరి మొదలైన శాఖా నదులతో గోదావరీ నది చూడ్డానికి సాలీడు గూడు లాగా వుంటుంది. నదీ సంధి

బంధాలలో వెదకండి. గుహల్లోంచి నిష్కుటాల్లోంచి కహ కహాధ్వని వినబడుతుంది. అది అడవుల్లోని సెలయేళ్ల సవ్వడి. ఆ సవ్వడి శ్రవణ పేయంగా వుంటుంది. ఆ సందడిలో పడి వెదకడం మరువకండి. ఆంధ్ర, పుండ్ర, కేరళ, పాండ్య, చోళ మహా జనపదాలు వెదకండి. ఆ రావణా సురునికి నిషాదులు భయపడి ఆ సీతను వాళ్ల గూడెములలో దాచవచ్చు. వెదకండి. ఆ ప్రాంతాలు దాటితే అయోముఖమనే పర్వతం వుంటుంది. అది సమస్త ధాతు నిచయ నిత్య సంధ్యా రమణీయము. అగరు, చందన కాలాహి పుష్పమాలా శోభితం. అక్కడ రాక్షసులకు నివాస యోగ్యము. కాబట్టి అదంతా గాలించండి."

"పరిశుద్ధమైన కావేరి కనిపిస్తుంది. అమితానందంతో అప్సరసలు ఆ నదిలో స్నానపునీతులౌతారు. ఆ కావేరీనది ఒడ్డునే త్రిలోక వాసులకు పూజ నీయుడైన పరమమౌని కుంభ సంభవుడుంటాడు. ఈ భూమ్మీద సగానికి పైగా ఆక్రమించిన కడలి అంతా ఆయన మూడు పుడిసిళ్లకు చాలదు. వళ్లు కొవ్వెక్కిన రక్కసులు ఆయన పంటి క్రిందకు చాలరు. వింధ్యాద్రి వంటి మహీధరాలు ఆయన అరికాళ్ల క్రింద అణిగిమణిగి వుంటాయి. ఆయన దర్శనం మీకు కార్యసిద్ధిని చేకూరుస్తుంది. తామ్రపర్ణి గూడా ఆ ప్రాంతం లోనే వుంటుంది. ఆ నీలిచీరల నదీమతల్లి మీ దాహం తీర్చగలదు. పాండ్యరాజ్య సీమలో అలసట తీర్చుకోండి".

"సరస్సు మధ్యలో సామజం చిక్కుకున్నట్లు ఆ పర్వతం మీదకు మహా సాగర మధ్యలో మహేంద్ర పర్వతం వుంటుంది. పర్వదినాల్లో శర్వపూజకు ఆ దేవేంద్రుడే తరలివస్తాడు. దేవతాస్త్రీలు క్రీడార్థమై విచ్చేస్తారు. అక్కడ అంబర చుంబితార్ణవంలో అప్సర్సలు ఆనందకేళిలో మునిగి తేల్తారు. ఆ మహేంద్ర పర్వతానికి శతయోజనాల దూరంలో లంకాపట్టణం వుంటుంది.

అది కుటిల రాక్షస కోటుల కూటమి. మానవప్రవేశానికి అగమ్యమైంది. అదే రావణ సామ్రాజ్యం. అక్కడ రాక్షసులు క్రూరులు. చేతికి చిక్కిన వారిని చిటికెన వ్రేళ్లతో చిదిపేస్తారు. పైగా కామరూపులు, ఉద్యానవనా లంతా గాలించండి. చెట్లకాయలు, పక్షు లన్నిటినీ స్వైరవిహారం చెయ్యండి. అందరికీ మీరాక తెలిసేట్టుగా అంతఃపురాలు గూడా సంచరించండి. ఇంతకు పూర్వం ఆ రావణునితో మనకు పని పడలేదు. కాని పాదుతోసహా పెళ్ళగించాల్సిన పని ఇప్పుడేర్పడింది. సీత జాడ తెలియగానే వచ్చి చెప్పండి. ఎవరు భూజాత సీతను కనుక్కొని వస్తారో వారు నా ఆనంద బాష్పాలతో అభిషేకం, శ్రీరాముని నయన తేజస్సులతో నీరాజనం పొందు తారు. ఆ లంకకు ఇంకా బాగా క్రిందకు పోతే అక్కడ పుష్పితకమనే మహోన్నత శృంగముంటుంది. దాన్ని దాటితే సూర్యవంతమనే పర్వతం, దాన్ని దాటితే వైద్యుతమనే శైలం వస్తుంది. అది పుష్పఫల సంభరితమైన చక్కని వృక్షసంపదతో నిండి వుంటుంది. ఈతపళ్ల గుంజు, రేగుపండ్లు తిని ఆనందించండి. ఇంకా బాగా క్రిందకుపోతే భోగవతీపురం చేరుకుం టారు. కళ్లు మిరుమిట్లు గొలిపే కాంతులు విరజిమ్ముతూ వుంటుంది. దుర్ధర్ష, విష్వగ్భట పరిరక్షిత, తరుణభుజంగాలతో వుంటుంది. అక్కడే పరమ విజ్ఞాని వాసుకి వుండేచోటు. నాకు తెలిసినంత వరకు రావణుడు ఆ సీతను అక్కడ దాచడు అయినా ఎందుకు ఆ చోటు మాత్రం వదలడం ? వెతకండి అక్కడ గూడా ! అటుపైన చిన్నచిన్న రాజ్యాలున్నాయి. ఇంకా క్రిందకు వెళ్తే ఈ భూమికి దక్షిణపు హద్దు వస్తుంది. దాని పైన ఇంక యమపురమే ! దాన్ని దాటి ప్రాణాలతో పోయిన వారెవరూ లేరు. కటిక చీకట్లు ఇళ్లు రోదనాలతో ప్రతి ధ్వనిస్తూ నిరంతర గాడాంధకారంలో క్రమ్ముతూ వుంటే -జీవుల యాతనావస్థలు చూడ లేము. అటు వెళ్లవలసిన పనిలేదు. మీ ప్రయాణానికి దక్షిణపు హద్దుగా చెప్పానంతే! ఇంక

బయలుదేరండి. పరమ పతివ్రతాశిరోమణి వైదేహిని చూసిరండి. పరమ తపస్విని చూచి వచ్చి, క్షేమ వార్త చెప్పండి. నా ఆశలన్నీ మీ మీదనే పెట్టుకొన్నాను.

నెల తిరక్కుండానే మీరు ఇక్కడ వుండాలి. నిజానికి శ్రీరాముడు అన్ని రోజులు ఎదురుచూస్తూ వుండటం నేను చూడలేను. మా యీ సౌమిత్రి అన్నగారి దుఃఖం పెరిగిన కొద్దీ క్రుంద్ధాంభోధియై చిందులు తొక్కుతాడు. మీరు వస్తారు, మంచి వార్త తెస్తారు -అని కళ్లల్లో వత్తులు వేసుకుని చూస్తూ వుంటాను. మీ కళ్లల్లో ఏమాత్రం విజయ రేఖ కనపడినా మావాళ్లు నా మాట దక్కించారు, నా గౌరవం నిలబెట్టారని చెట్టెక్కికూచుంటాను. వచ్చిన వారికి నచ్చిన రీతిలో మెచ్చికోలు కానుకలు ఇచ్చుకుంటాను. అలా విజయ వార్త అందించిన మీ జన్మ ధన్య మౌతుంది. యుగయుగాల్లోనూ మీ చరిత్ర చెప్పుకుంటారు" అంటూ వాళ్లని దక్షిణ దిశకు పంపించాడు.

## పశ్చిమ దిశ

ఇంక పశ్చిమ దిశవైపు వెళ్లే వీరులను చూస్తూ సుగ్రీవుడు వాళ్ల నాయకుడైన తార తండ్రి, భీమ విక్రమ సంపన్నుడు, బుద్ధి విక్రమ సంపన్నుడు, గరుత్మంతునితో సమానమైన తేజస్సు గలవాడు, మరీచి మహర్షి సుతుడు, అర్చిష్మంతుడును అయిన సుషేణునికి ప్రదక్షిణం చేసి, నమస్కరించి—

రెండు లక్షల సైన్యానికి అధిపతివి నీవు. నీ ఆధిపత్యంలో ఈ రెండు లక్షల పరాక్రమ సంపన్నులు పశ్చిమ దిశగా వెళ్లి వెతికితే నేను తల పెట్టిన కార్యం సఫలమౌతుందని నిన్ను రామ కార్యసిద్ధికై శరణు కోరుకుంటున్నాను సాధ్వీలోక మందారమైన ఆ సీతాదేవి ఆ వరుణదేవ దిశో

ధ్యానంలో ఏమన్నా ముద్దమందారాల మధ్యలో దాచ బడిందేమో చూడండి. ఓ సేనాపతులారా! శ్రీరామ కార్యాసక్తి గల మీరు మీసైన్యాధిపతి అయిన సుషేణునితో కలిసి పశ్చిమ దిక్కుగా గల సౌరాష్ట్ర, శూర, బాహ్లికాది ప్రదేశాలు తిరిగి వెదకి, బూజాత జాడ తెలుసు కొని. నెల లోపల ఇక్కడకురండి. పడమటి కనుమల నూటున మహీజాత ఒదిగి వున్న దేమో వెదకి రండి. అక్కడ ఏ కల్పముల తాలూకు వాళ్లో కొండ కొమ్ములులాగా నిలిచివుంటారు. వాళ్లని చూడండి. నవ్వ నురుగులు రివ్వుతూ, ఆ కొండలకు దవ్వనే కవ్విస్తూ తప్త సముద్రం కనిపిస్తుంది. అవన్నీ చూసి నెల తిరక్కుండానే ఇక్కడ వుండాలి. తేడా వస్తే వధ్యశిల మధ్యంలో వుండాల్సి వస్తుంది. నేను మీరాజు నవడం ఇష్టమయితే, నాప్రాణానికి ప్రాణం అడ్డుపెట్టి నన్ను ఉద్ధరించిన శ్రీరామునికి ఈమాత్రం ప్రత్యుప కారం చేసిపెట్టలేమా ? ఎప్పుడెప్పుడు ఏది చెయ్యాలో చెప్పగలిగి, మీ అందరినీ ఒక త్రాటిమీద నడిపింపగల మా మామగారైన సుషేణులు మీవెంట వుంటాడు. మిమ్మల్ని పశ్చిమాద్రి దాకా చూస్తూనే వుంటాను.” అంటూ వాళ్లందరినీ పంపించి వేశాడు.

## ఉత్తర దిశ

ఉత్తర దిక్కు వైపుకు వెళ్లవలసిన సర్వసేనకు అధిపతి అయిన శతవలిని చూచి—

మీరూ నేనూ గూడా వైవస్వతులమే! అన్ని విధాలా సములైన మీరు వాయువేగ మనోవేగాలతో వెళ్లండి. వేగము, సూక్ష్మబుద్ధి మీ సొత్తు. వెళ్లి రామచంద్రుని ఇల్లాలైన సీతను చూచి శుభవార్త తీసుకురండి. నిజానికి ఈ భూమి మీద కావలసినవన్నీ ఉత్తర దిక్కునే వున్నాయి. ఒక్క హిమ

వత్పర్వతం చాలు. దాని విశాలత్వం, ఔన్నత్యం ప్రపంచంలోనే ఎక్కడా చూడలేము. పైగా నిండా సంపదల పుట్ట. గుబురైన శివుని జటాజూటం లాగా దట్టమైన వృక్ష సంపదతో, దిట్టమైన గిరి శృంగాలతో, నిర్మల జలాశయలతో, స్వచ్ఛమైన మంచు కొండలతో దేవలోకానికి దృఢమైన నిచ్చెనలా విరాజిల్లుతూ వుంటుంది. అక్కడ వుండే లోధ్ర, పద్మ, కషండ, పున్నాగ, సల్లకీ దేవదారు వనరాజి మరుగున ధరణిసుతను ఆ దైత్యుడు దాచి వుంచవచ్చు. అక్కడే సోమాశ్రమం వుంది. దేవ, గంధర్వ, యక్షకాంతల పునుగు, జవ్వాజి పరిమళాలతో అక్కడ ప్రదేశమంతా సుగంధాలు వెదజల్లుతూ వుంటుంది. అక్కడే కైలాసం వుంది. నందీశ్వరుడు, అమ్మవారు, భృంగి, డుంఠి, కుంభోదర, నికుంభాది ప్రమథ గణాలు వున్నాయి. యోగేశ్వరులకుగాని కనపడని మహాదేవుడున్నాడు. ఆయనను పరమ హంసలు పటుతరమైన తపస్సుల్లో నిమగ్నమైనపుడు దర్శిస్తారు. మెఱపులవెలుగులతో, మణిమయ కాంతులతో, వెన్నెలల ఆహ్లాదాన్ని కలిగిస్తూ కన్నుల పండువులా కనబడే కుబేరసౌధం గూడా ఆ ప్రాంతంలోనే వుంటుంది. సీతా పతికి నేనెలా మిత్రుణ్ణో—పరమేశ్వరునికి ఆ కుబేరు డలాంటి మిత్రుడే! ఆ కుబేరుడు యక్షుల కధిపతి. సర్వభూత వంద్యుడు. పరమేశ్వర భక్తుడు. శైవాచార సంపన్నుడు. ఉత్తరదిశాధిపతి. రావణునికి ఆ కుబేరుడు జ్ఞాతి. వాళ్లిద్దరి మధ్య సయోధ్య లేదు. జ్ఞాతి శత్రుత్వం పరాకాష్ఠలో వుంటుంది. ఇక్కడ సీతను దాస్తే ఎవ్వరూ అనుమాన పడరనే ఉద్దేశ్యంతోనైనా ఆ రావణుడు దాయవచ్చు. ఎందుకైనా మంచిది అక్కడ గూడా వెతకండి. ఆ పైన క్రౌంచగిరి వుంటుంది. దీని అంచులు ఉత్తర దిగంతములు, అటుపైన కామశైలం వుంటుంది. క్రిందుగానే మానవ సరోవరం, మైనాక గిరి గూడా అక్కడే వుంటుంది. దానవ శిల్పి మయుని నివాసం గూడా అక్కడే! వైఖానసులు గూడా అక్కడే దర్శనమిస్తారు. వాళ్లు నిష్కల్మషులు. వాళ్లకి

శిరసా మనసా ప్రణామాలు ఆచరించండి. చూడవలసినవన్నీ చూసి, వెదక వలసిన చోట్లన్నీ వెదకి, మహనీయులందరినీ దర్శించి, నెలతిరక్కుండానే ఇక్కడకు తిరిగి వచ్చెయ్యండి" అని వాళ్లని ఉత్తర దిశకు పంపించి తనలో తనే ఆలోచనలో పడ్డాడు.

'ఆ రావణుడు ఇంకెక్కడా దాచకుండా సరాసరి తన లంకాపురంలోనే సీతను దాస్తే' అక్కడకు వెళ్లాలంటే శతయోజన విస్తీర్ణంలో వుండే సముద్రాన్ని దాటాలి. ఆ పని నాకు, హనుమకు తప్ప అన్యులకు సాధ్యం కాదు. జాంబవంతుడు దూకగలడు కాని మోకాలు నొప్పితో బాధపడుతున్నాడు. అయితే హనుమంతుడు ఒక్కడే మిగిలాడు' అనుకుంటూ హనుమంతుణ్ణి చూస్తూ—

"శ్రీరాముణ్ణి, నిన్నూ చూస్తున్నప్పుడు నాకు ఆ విష్ణువును గరుత్మంతుణ్ణి చూస్తున్నట్లుంటుంది. ఆ గరుత్మంతునికి రెండు బ్రహ్మాండమైన రెక్కలు, నీకు బలపరాక్రమ సమన్వితమైన బాహువులు, అంతే తేడా! ఇద్దరూ ఆకాశాన్ని భూమిని చుట్టి వేయగల సమర్థులు. దేవ, గంధర్వ, భుజంగ, రాక్షస, యక్షు లెవ్వరూ నీతో సముద్ర లంఘనం చెయ్యడంలో సాటిరారు. ఇంతవరకు వేయి గండాలనుండి కాపాడి నన్ను ఈ సుఖస్థితిలో ఉంచావు. నాకు, రాఘవులకు నేస్తాన్ని కూర్చింది గూడా నీవే! మరి ఆ భూజాత సీత జాడ తెలుసుకుని వచ్చి మా ఇద్దరి మధ్య నువ్వు కూర్చిన నేస్తాన్ని స్థిర పరచు" అన్నాడు. సుగ్రీవుని మాటలకు వినయంతో శిరస్సు వంచి నవ్వుతున్న హనుమంతుని చూస్తూ శ్రీరామచంద్రుడు—

# రాముని విశ్వాసం

"ఇంతవరకు సుగ్రీవునిలో చూచిన ప్రాభవానికి దర్పానికి గల కారణం హనుమంతుడన్న మాట! సాధుత్వం, బుద్ధి కుశలత్వం, స్వామిభక్తి పరాయణత్వం, బాహుబల సంపన్నత్వం కూడగట్టుకొని వున్న ఈ హనుమంతుడు అసామాన్యుడు. విధి గుడా సర్వ సృష్టి కార్యభారాన్ని ఇతని మీద పెట్టి నిద్రపోవచ్చు అనిపిస్తోంది. తప్పకుండా ఇతను సర్వ కార్యనిర్వహణాదక్షుడు" అని నిర్ణయించుకొని, హనుమంతుణ్ణి రహస్యంగా పిలిచి, తన పేరు వున్న ఉంగరాన్ని తీసి ఇచ్చి—

"నువ్వు ఎవరివో నాకైతే పూర్తిగా తెలియదు. అయినా ఎందుకో నాకు నిన్ను చూస్తుంటే అమిత ఆత్మీయునిలా కన్పిస్తున్నావు. నువ్వు ఈ ఉంగరం తీసికొని వెళ్లి సీతకు ఇచ్చి ఇక్కడకు వచ్చేంతవరకు వెయ్యి కళ్లతో ఎదురు చూస్తూ వుంటాను" అన్నాడు. శ్రీరాముడిచ్చిన ఉంగరాన్ని హనుమంతుడు గ్రహించి అత్యంత భక్తితో కళ్లకు అద్దుకుని, మూర్థమందు ఉంచి, ముఖం పైకి ఎత్తాడు. ఆ ఎత్తిన హనుమంతుని వదనంలో ఇంద్రుని వజ్రాయుధపు తళతళలు మెరిసాయి. యజమాని వేల్చిన ప్రాణమయ హవిస్సును ఆయా దేవతలకు చెందించడానికి మోసుకు వెళ్లే క్రత్వగ్ని హోత్రంలాగా, అమృత భాండాన్ని మోసుకు వెళ్లే గరుత్మంతుని లాగా హనుమంతుడు—దక్షిణ దిశకు వెళ్లవలసిన మిగిలిన వానర యూథ పతులను చేరి కలుసుకున్నాడు.

# వానర వీరుల విజృంభణ

అవతల ప్రస్రవణగిరి మీద లక్ష్మణునితో కలిసి రాముడు కూర్చుని వున్నాడు. నాల్గుదిక్కులకు వెళ్లవలసిన వానరు లందరూ ఒక్కసారి నేల మీద నుండి ఆకాశమార్గం పట్టారు. సముద్ర మధనం జరిగినప్పుడు-హాలా హలం పుట్టి వినువీధిని విస్తరించినట్లు ఆకాశంలో వానరు లందరూ కన్పడు తున్నారు. పైకి చూస్తే ముందు ఒక్క ముద్దలాగా కనపడి కొంచెంసేపటికి ఆ ముద్ద నాల్గుభాగాలై, నాలుగు దిక్కులుగా రూపం పొందిందాఅన్నట్లుంది. పైనుండి వానరులు చేసే పెళపెళారావాలు, బొబ్బలు, అరుపులు, కిచకిచలు చెవులు హోరెత్తిస్తున్నాయి. ఝంఝూమారుతంలాగా శతవలి ఉత్తరదిక్కుకు సాగిపోయాడు. వెలుగు రేఖలాగా వినతుడు తూర్పుదిశవైపు వెళ్లాడు. గిరిరాజు లాగా సుషేణుడు పశ్చిమ దిశకు తరలి వెళ్లాడు. మద మాతంగ సింహ నాగేంద్ర సన్నిభులైన హనుమదాదులు దక్షిణ దిశగా వెళ్లారు

దిగ్గజాల దంతాలు తెస్తాను చూడు అనీ, గోళ్ళతో పాతాళలోక గుహ లను గ్రుచ్చి పెల్లగిస్తాను అనీ, వ్రేళ్ళతో రాక్షసలోక వృక్షాలను పెల్లగిస్తాను అనీ, నేలంతా సముద్ర జలంతో ముంచెత్తిస్తాను అనీ- ఒకరి కంటే ఒకరు పేట్రేగిపోయి, అరుస్తూ, కుప్పిస్తూ, నవ్వుతూ రకరకాలు కోతి చేష్టలు చేస్తున్నారు.

శత యోజనాల సముద్రాన్ని ఇట్టే దాటేస్తా, దాటకపోతే నన్ను మారు పేరుతో పిలవండి అనీ, 'ఆ రావణుని పళ్లూడగొట్టి సీతను వెదకి నీ ముందుం చుతాను'. నాకేమిస్తావు అంటూ స్వాతిశయంతో ఆత్మ విశ్వాసాన్ని, అహం కారాన్ని. దర్పాన్ని ఒక్కొక్కమారు ఒలకబోస్తున్నారు. భూమికి దూరమైన మబ్బులలాగా పయనిస్తున్నారు.

ఆ రాత్రంతా అందరికీ ఆలోచనలే! "శ్రీరాముడు తన చేతి ఉంగ రాన్ని రహస్యంగా పిలిచి హనుమ కిచ్చాడు అంటే హనుమ ఈ పని సాధించి సీత జాడ తెలుసుకుని మరీ వస్తాడు!" వానర ధీమంతు లందరి బుఱ్ఱల్లోనూ ఇదే ఆలోచన.

తన దర్శనానికై వచ్చిన సుగ్రీవుని చూచి శ్రీరాముడు– "ఈ పాటికీ మనవాళ్లు నాల్గు దిక్కులకు వెళ్లి సీతాన్వేషణలో పూర్తిగా నిమగ్నమై వుంటారు. వెదకవలసిన అన్ని ప్రదేశాలు విడమరచి విపులంగా చెప్పి పంప గలిగిన నిన్ను చూస్తూంటే నాకు చిత్రమని పిస్తోంది. దిగంత భూఖండంలోని గిరి, నగర, కాంతార, సాగర, పర్వత, నదీ, నద, తటా కాదులన్నీ ఇంతక్షుణ్ణంగా నీకెలా తెలుసునో నాకు ఆశ్చర్యంగానూ, చిత్రం గానూ వుంది." అన్నాడు. అందుకు సుగ్రీవుడు—

## సుగ్రీవుని శ్రమకు తగిన ఫలితం

"ఈ నదీ నద, సాగర, గిరి, తటాక, కాంతార ప్రదేశాలన్నీ నేను వూహించినవి కాదు. వాస్తవంగా తిరిగినవే! వాలి నన్ను అకారణంగా దేశ బహిష్కరణ చేసి విలువ నీడలేకుండా చేసినపుడు ఇన్ని చోట్లు పర్యటిం చాము. కళ్లు మూసుకున్నా వాలి కనబడే వాడు. కళ్లు తెరచినా వాలి కన బడేవాడు. వెనక వున్నాడనే ఎప్పుడూ భయం. వెనకా, ముందూ చూసు కుంటుంటే ఇరుపార్శ్వాల్లోని వీధుల్లో వున్నాడేమోనని భయంతో ఎటు వెళ్లాలో తెలీకుండా ఈ ప్రదేశాలన్నీ తిరిగాను. ఇంకొకసారి మాయావి వెంటపడి మా అన్న వాలి వెళ్లినప్పుడు గూడా కొన్ని ప్రాంతాలు నేను వాలిని అనుసరించి వెళ్లాను. అనాడే గదా మా అన్న నా మొర వినకుండా మాయావి దూరిన గుహలోనికి తానూ వెళ్లాడు లోపలకు వెళ్లిన అన్నగారు

ఎన్ని రోజులకూ బయటకు రాకపోగా గుహ ద్వారం నుండి రక్తం ఏరులై ప్రవహించడంతో-మాయావి, అతని తాలూకు బంధువు లందరూకలిసి వాలిని హతమార్చి వుంటారని పుట్టెడు దుఃఖం గలిగి ఇంకా వాళ్లందరూ కిష్కంధ పైకి గూడా రాకుండా వుండేందుకు ఎందుకైనా మంచిదని బిల ద్వారాన్ని పెద్ద బండ రాతితో మూసి కిష్కింధ చేరాను. వాలి మరణ వార్త విన్న మంత్రులందరూ రాజ్యభారాన్ని నామీద ఉంచారు. వద్దని మొర పెట్టు కున్నా వినలేదు. చివరకు ఆ భారం వాళ్ళమాటమీద మొయ్యక తప్ప లేదు. వాళ్లే కనక నా మాట అనాడు విని వుంటే నేనిలా పుట్టలూ, గుట్టలు, గిరులు సాగరాలు నగరాలు తిరగాల్సి వచ్చేది కాదు.

ఒకనాడు ఉన్న ఫలాన వాలి ఊడిపడ్డాడు. వళ్లంకా కళ్లతో అన్నను చూసి అందరం ఆశ్చర్యము, ఆనందము పొంది సింహాసన మధిష్ఠించ మన్నాం. జరిగినదంతా విన్నవించుకున్నాం. మా విన్నపా లేవీ వాలి చెవి కెక్కలేదు. సరాసరి నన్ను జుట్టు పట్టుకొని క్రిందకు ఈడ్చి గడ్డి కరిపించాడు. దుమను దొంగిలించాడు. నన్ను నిలువ నీడ లేకుండా చేసి, నిత్యం నామీద నిఘా వేసి అడ్డమైన దోవలు పట్టించాడు. ప్రాణభీతితో తిరగని ప్రదేశం లేదు. గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకుని అన్నం లేక, దాహం తీర్చుకోలేక అన్ని అవస్థల్లోనూ వాలి రూపమే కనబడి, హడలి, ఒడలు తెలియక అలా పరుగులు తీస్తూనే తూర్పు దిశవైపుగా సముద్రం కనబడేంత వరకు వెళ్లాను. కాని ఆకాశందాకా తాకే వికటాట్ట హాసాలతో వాలి కనబడం గానే కాలికొద్దీ పరుగుదీసి తూర్పు కొండను చూశాను. ప్రొద్దునే ఎట్టని కాంతి పుంజాలు, వాలి, కలిసి ఒకే వేగంతో నన్ను వెన్నంటాయి ఇంక లాభం లేదని దక్షిణ దిక్కువైపు తిరిగాను. అక్కడ కనబడిన నాగ భుజంగ గిరీంద్రులకు మ్రొక్కాను, అగస్త్యుడు తపస్సు చేసిన దివ్య ప్రదేశాలను చూసాను. అంతట్లోనే అక్కడ వికటాట్టహాసంతో వాలి కనబడ్డాడు. వళ్లంతా

ముళ్లు గ్రుచ్చుకున్నట్లైంది. మళ్లీ కాలి కొద్దీ పరుగెత్తి మేరుసావర్ణి దాకా వెళ్లి పశ్చిమ దిశగా ప్రయాణించాను. అక్కడా నవ్వుతూ వాలి కనబడ్డాడు. కాళ్ళని ఉత్తర దిశగా పట్టించాను. హిమగిరికి వెళ్లాను. అక్కడా వాలి నవ్వుతూ నాకన్నా ముందే చేరి నుంచున్నాడు. క్రౌంచగిరి కెక్కాను. అక్కడా వాలి కనబడ్డాడు. సోమగిరి కెక్కాను. అక్కడా వాలి కనబడ్డాడు. ఇక ఎటు వెళ్లాలో తోచలేదు మృగాన్ని వేటాడినట్లు వాలి నన్ను వేటాడడం చూసి ఏం చెయ్యాలో పాలుపోలేదు. నా అదృష్టం బాగుండి చివరకు నా బుద్ధికి తట్టింది, 'మతంగ మహాముని శాపంవల్ల వాలి ఋష్యమూక ప్రాంతం లో అడుగుపెట్టడు. ఇదే మనకు శరణ్యం' అని

గుండె దిటవు చేసుకుని, కళ్ళ నీరు తుడుచుకుని, ఎపుడు ఏం జరుగుతుందో అనే బెంగతో రేయింబవళ్లు నిద్ర లేకుండా గడువుతూ, ఇప్పటికి నీ అభయంతో భయం తీరి మొట్టమొదటిసారిగా ఎన్నో రోజుల తరువాత తిరిగి జీవితంలో నిద్రాహారాది సుఖాలను చవి చూసాను. అలా తెలిసింది నాకు నాలుగు దిక్కుల ప్రదేశాల గురించి. ఇప్పటికీ నాకు అంగుళం మేర కూడా గుర్తే. "ఒక చెడ్డ ఒక మంచికి" అనే సామెత కూడా నిజమైంది నా విషయంలో. ఆనాటి వాలి వికారం, ఈనాడు నాకు ఉపకారం అయింది. అవును మరి వాలి ఆనాడు అలా వెంబడించి ముప్పతిప్పలు పెట్టబట్టే—ఆ ప్రదేశ సమాచారం కూలంకషంగా తెలిసి ఇప్పుడు ఉపయోగ పడింది. అది కూడా నీకు ప్రత్యుపకారం కోసం ఉపయోగపడటం నా అదృష్టం. లోతు ముందే తెలిస్తే చులకన భావంతో ఈదడం తేలిక కదా! తెలిసిన అన్ని ప్రదేశాలూ విపులంగా చెప్పాను. కాబట్టి మనవాళ్లకు వెతకడంలో అనుమానాలు రావు. ఇంకెందుకు నెల తిరగ కుండానే అందరూ ఇక్కడ ఉంటారు సమాచారం తెస్తారు. వాస్తవానికి ఇలా ఇన్ని సముద్రాలూ, పర్వతాలు, నదీ నదాలు చరించిన వాడు ఎవడూ వుండక

పోవచ్చు. ప్రాక్పశ్చిమాద్రులను, అక్కడ సూర్యోదయ సూర్యాస్తమయ కాలాల్లో ఎఱ్ఱగన్నేరులు కుప్పలు పోసినట్లుండి కన్నులకే కళ్యాణపు తిలకంగా వుండే ఆ దృశ్యాలను చూసి చరితార్థుడైన వాడు ఈ భూమి మీద మరొకడు వుండకపోవచ్చు కూడా!" అని సుగ్రీవుడు శ్రీరాముని దగ్గర శలవు తీసుకుని ఇంటి దారి పట్టాడు దారి మధ్యలో సుగ్రీవునికి అనుమాన మొచ్చింది. ఇంతకీ శ్రీరాముడు తనను మెచ్చుకొని నట్లేనా? కానీ. నేను శ్రమపడి పొంది నజ్ఞానానికి తగినంత మెప్పు కనబడినట్లు లేదు. దిక్కుల అంచుల దాకా వున్న నా ప్రాదేశిక జ్ఞానము ఆయన దృష్టిలో అంత చెప్పుకోదగినంత గొప్ప తనం కాదేమో!" అని అనుకున్నాడు.

## అందిన సమాచారం

అశ్వయుజ మాసం పూర్తి కావస్తూండంగా తూర్పు దిశవైపుగా వెళ్లిన కపిసేన తిరిగి వచ్చింది. ఈ వార్తను ప్రతీహారి ఒకడు సుగ్రీవునికి తెలియపరచాడు. ప్రస్రవణగిరి మీదనున్న శ్రీరామచంద్రుని సుగ్రీవుడు కలుసుకొనివున్న తరుణంలో తూర్పు దిశకు వెళ్ళిన సేనా నాయకుడైన వినతుడు—

"ఇక్కడ నుండి బయలుదేరిన క్షణం నుండి అమ్మ ఇల్లా వుంటుంది, ఇల్లా వుంటుంది అని నా ఆత్మలోనే ముద్రింపబడింది. ఏ క్షణంలో ఎక్కడ అల్లాంటి రూపం, ఆకారం కనబడినా గుర్తు పట్టకుండా వుండలేను. అలాంటిది తూర్పుదేస అంతా గాలించినా కనబడలేదు. ఇది ఎవరో చెప్పగా విన్న సమాచారం కాదు. నాకై నేను గ్రహించిన సత్యం. నా మాట నమ్మండి. నూరువేల మంది నా సేన. అంతకు రెండు రెట్లు కన్నులలో

గిరుల వివరాలు, నదులు లోతులు, నగరాల వివరాలు, శబరుల గూడెములు కారడవులు, చిట్టడవులు వెదకి వెదకి జాడ తెలియక ఈ నిర్ణయానికి వచ్చాము. తుట్టతుదకు తూర్పు దిక్కున సూర్యుణ్ణి చూచి నమస్కరించి ఇలా వచ్చాము" అన్నాడు.

వినతుని మాటలు విన్న తరువాత తూర్పు దిక్కున సీత లేదనిపించింది. సుగ్రీవుని కనుసన్నలతో వినతుడు నిష్క్రమించాడు. మరునాడు పశ్చిమ దిక్కుకు వెళ్ళినవాళ్లు వచ్చారు. సేనా నాయకుడైన సుషేణుడు శ్రీరామచంద్రుని పదాబ్జ రజస్సును శిరస్సుతో స్పృశించి—

"నేను చూసినంత వరకు, నేను వెళ్ళిన దిక్కున సీత కానరాలేదు. పశ్చిమాన నేను చూడనిచోటు అంగుళం గూడాలేదు. అసురుల కళ్లల్లో దుమ్ముకొట్టి చూడని శైల గుహ ఒక్కటీ లేదు. గర్వంతో చెప్పడం కాదుగాని పశ్చిమ దిక్కున ఇలా గాలించి చూచిన మా కంటె మరొకడు సీతను చూడగలడని నేననుకోను" అని చెప్పంగానే పశ్చిమ దిక్కున సీత లేదని సుగ్రీవుడు నిర్ధారించుకున్నాడు.

ఉత్తర దిక్కుకు వెళ్లిన కపి సేనతో శతవలి ప్రస్రవణగిరి నివాస గుహాముఖ మందు ఉన్న శ్రీరామ సుగ్రీవులకు నమస్కరించి—

నేను వెళ్లిన దిక్కునందు సీత కనబడలేదని చెప్పడానికి సిగ్గు పడుతున్నాను. కాని నిజం చెప్పాలంటే సీత వున్న దిక్కునకు నన్ను పంపక పోబట్టే గదా నాకు దక్కవలసిన గౌరవాన్ని దక్కించుకోలేక పోయాను. ఎన్ని తిరిగామో చెప్పలేము. ఉత్తర దిక్కంతా వ్యాపించి వున్న సమస్తమైన కొండలు, కోనలు, నదులు, పల్లెలు అన్నీ కూలంకషంగా వెదికాము. కైలాస శృంగాలకు వెళ్ళాము. సీత జాడ మాకు తెలియదని అవి తెల్ల మొగాలు వేశాయి

సూటిగా ఆ మహేశ్వరుణ్ణే అడిగొద్దామను కున్నాము. కాని మధ్యలోనే ఆ స్వామికేం తెలియదని ప్రమథులు చెప్పారు.

సౌమగిరి చూచాము. పదకొండుగా నున్న రుద్రాకృతులను చూశాము. కాని సీతను మాత్రం చూడలేక పోయాం. సీతకు ఒక రాక్షసుడు ఎత్తుకుని వెళ్ళిపోయాడన్న సంగతి వాళ్లందరికీ చెప్పి వాళ్ళకి గూడా దుఃఖాన్ని కలిగించడం దేనికని వాళ్ళతో చెప్పకుండా ఇక్కడకు వచ్చేశాం" అన్నాడు. శతవలి చెప్పిన మాటలకు సీత ఉత్తర దిక్కున లేదని సుగ్రీవుడు నిర్ధారించుకున్నాడు. ఇంక మిగిలింది దక్షిణ దిక్కు. అటు వెళ్ళినవాళ్లు సామాన్యులు కారు. వాళ్ళల్లో ఆంజనేయుడు ఉండనే వున్నాడు. ఇంక ఆలోచించవలసిన పనిలేదు. హనుమ తప్పకుండా శుభవార్త తీసుకు వస్తాడు" అన్న భావం అందరికీ కలిగింది.

# దక్షిణ దిశాన్వేషణ

సీతను వెదకి చూడగల సామర్థ్య బల పరాక్రమాదులు ఎవరికి ఉన్నాయని జగత్తు అంతా అనుకుంటోందో - ఆ వ్యక్తి దీనంగా వింధ్యగిరి గుట్టలపై ఒక చెట్టు క్రింద నిల్చుని ఉన్నాడు. సీతను చూడలేక పోయాననే దిగులు-ముఖంలో కొట్టి వచ్చినట్లు కనబడుతోంది. ఇంగద జాంబవంతాదులు, మిగిలిన సైన్యాధిపతులు కళలేని ముఖాలతో దీనంగా ఉన్నారు. ఆశ్వయుజ మాసం పూర్తి కావస్తున్నా కించింతైనా సీత జాడ తెలియక పోవడం, కాలం తన్నుకుంటూ మీదకు వస్తూండటంతో ఏం చెయ్యడానికి పాలు పోవడం లేదు. గత వారం రోజులు అన్నము, నీళ్లూ లేక, నిలబడడానికి చెట్టు నీడలేక మండు టెండలకు కాళ్ళు వేడెక్కకుండా పెట్టుకోడానికి కనీసం గడ్డి తుప్ప గూడాలేని ఎడారిలో చరించారు తన పదహారు సంవత్సరాల

కొడుకు అకస్మాత్తుగా చనిపోవడంతో కోపం వచ్చి ఒక ముని శపించిన కారణంగా క్షామం వచ్చి ఆ భూ ప్రాంతమంతా ఎడారిలా తయారైంది. ఈ వారం రోజులు ఆ ప్రాంతంలోదక్షిణ దిక్కుకు వెళ్లిన వానర యోధు లందరూ అరికాళ్ళు, నడినెత్తి - మాడుతూ ఉండగా, నాలుకలు పిడచకట్టుకు పోతుండగా ఉసూరు మంటూ నడిచారు,

రౌద్రాకారంలో ఉన్న నల్లని కారుమబ్బు రంగలో ఉన్న రాక్షసుడొకడు 'మిమ్మల్ని అందరినీ నమిలి మింగేస్తా' అంటూ వానరుల మీదకు వస్తున్నాడు. వాడే రావణాసురుడై ఉంటాడనుకొని అంగదుడు - గట్టి ముష్టిఘాతంతో వాణ్ణి హతమార్చి మట్టి కరపించాడు. తరువాత వాడు రావణాసురుడేం కాదని తెలిసి నిరుత్సాహం చెందాడు.

పల్లెలు, పట్టణాలు, నదీనదాలు, గుట్టలు. మిట్టలు, అడవులు ఎన్ని గాలించినా సీత కనబడక పోయేసరికి అందరి ముఖాల్లోను కళ తప్పి, ధైర్యం ఉడిగి చచ్చుపడి పోయారు. ఆకలి దప్పులు బాధ తట్టుకోలేక పోతున్నారు అప్పుడు అంగదుడు వాళ్లను చూచి నెమ్మదిగా —

గుట్టలతోను, గుహలతోను, నిండి ఉన్న ఈ పర్వత ప్రాంతాన్ని మీరు నా మాట విని ఇంకొకసారి వెదకండి. మీ రందరూ సుగ్రీవునికి హితులు, ప్రియులు, అతని మాట జవదాటనివారు, అతని ఆజ్ఞకు ఎదురు చెప్పలేనివారు. మనలను ఈ దిక్కంతా వెదకి సీతను చూచి శుభవార్త తెలుప వలసినదిగా చెప్పి, లేదా వస్తే ఏం జరుగుతుందో గూడా చెప్పి పంపాడు. అవన్నీ దృష్టిలో ఉంచుకుని నా మాట విని విశాలమైన రహస్య గహ్వరాలు గలిగిన ఈ వింధ్యాద్రిని మరొక్కసారి వెదుకుదాం రండి. ఎత్తలేని బరువును ఎత్తుకున్నామన్న మాట సత్యమే! అయినా మాటకు

నిలబడాలి. డీలా పడిపోకూడదు. లెండి ! వింధ్య గుహల్లోకి బాణాల్లా దూసుకు పోదాం. ఇద్దరిని మనం గుర్తుపెట్టుకోవాలి. నియమోల్లంఘన జరిగితే నిర్దయుడై మనలను ఏమైనా చెయ్యగల సుగ్రీవుడు. భార్యాదూరుడై, మన రాక కోసం మనం అందిచ్చే వార్త కోసం వెయ్యి కళ్లతో ఎదురు చూస్తూ ఆరాటపడే కరుణా సముద్రుడైన శ్రీరాముడు. ఈ ఇద్దరిలో ఏ ఒక్కరికీ అన్యాయం చెయ్యలేము. శ్రమ అనుకోక బద్ధకానికి బుద్ధిచెప్పి బయలుదేరుదాం. వెదుకుదాం. ఊరికే ఇక్కడ కూర్చుని 'ఆకలి, దాహం' అంటూ చావడం మేలో, లేదా బ్రతుకు భారం ఆ శ్రీరామచంద్రుని మీద ఉంచి వింధ్యాద్రి గుహల్లో సీతను మరొక్కసారి వెదకడంలో ప్రాణాలు కోల్పోవడం మేలో మీరే ఆలోచించండి. నాకు తోచినది నేను చెప్పాను" అన్నాడు."

అంగదుని మాటలు విన్న తర్వాత గంధమాధనుడు నాలుకతో పెదవులు తడుపుకుంటూ —

"అంగదుడు చెప్పినదంతా నిజం. పని పూర్తి చెయ్యకుండానే పని అవదని శంకించి భంగపాటు పొందడం కంటే ప్రాణం పోయేదాకా పనిలో నిమగ్నమవడమే వివేకవంతుని, హితుని లక్షణం" అన్నాడు గంధమాదనుని మాటలకు అందరికీ మళ్లీ ఉద్వేగం వచ్చింది. వింటినారిని బాగా లాగి వదలినట్లైంది. అందరూ తిరిగి వింధ్య గిరి గుహల్లోకి జొరపడ్డారు.

అగస్త్యుడు వింధ్యాద్రిని అణగ ద్రొక్కడంతో సముద్రవసనం గలిగిన దక్షిణ భూభాగం చదునై మరింత గట్టిపడి, ఉత్తర దక్షిణ భూభాగాల మధ్య రహదారి ఏర్పడింది కపి వీరులందరూ వింధ్యాద్రిపై విడిదిచేసి చుట్టూరా వ్యాపించి ఉన్న మిట్టపల్లాలన్నీ వెదికారు. ఆఖరికి చిన్న చిన్న గుహలను, పుట్టలను, చెట్టు తొఱ్ఱలను గూడా వదలలేదు. దూరంగా

పగడాల తీగ కనబడితే సీత అనుకొని వెళ్లేవారు. చిగురుటాకుల గుబురులు కనబడితే సీత అనుకొని వెళ్ళేవారు కొండ శిఖరం మీద ప్రొద్దు తిరుగుడు పువ్వు కనబడితే సీత అనుకుని ఆశతో వెళ్లేవారు.

జల జలా ప్రవహించే సెలయేళ్లతో గిరి-రాజు ఇచ్చిన అర్ఘ్యపాద్యాదులు స్వీకరించి, అడవుల్లోని కందమూలాలు భక్షించి. అక్కడ ఉండే మృదుల ప్రదేశాల్లో విశ్రమించి, గుహల్లోంచి వచ్చే ప్రతిధ్వనుల రూపంలో 'అయ్యో ఇంకా సీతను కాంచలేదా' అన్న సానుభూతిని పొంది, అక్కడక్కడ ఉన్న ఆల్లమడుల కంకుల్ని త్రుంచి, అరచేతులతో వాటిని నలిపి ఊది నముల్తూ ఆ గిరిపై నుండి క్రిందకు దిగారు.

పండిన చేనులో కోసి వరుసగా సమదూరాల్లో పనలు పెట్టే విధంగా-వానర యోధులు తూర్పు దెస నుండి పడమర దెస వరకు వరుసలు తీరి ఆ ప్రాంత భూమిని కొలుస్తూ సాగర తీరం దాకా వెళ్లారు. గజ, గవయ, గవాక్ష. శరభ, గంధమాదన, మైంద, ద్వివిద, జాంబవంత, అంగద, నల, తార, సుషేణ, హనుమంతులు దక్షిణాపథాన్నంతా పనలు పెట్టి గాలించి గాలించి చివరకు అందరూ ఒక గుహా ముఖ ద్వారం వద్దకు చేరారు. అక్కడ –

ఋక్ష బిలమనే పేరుకల పెద్ద సొరంగం కనబడింది. ఆ సొరంగ ముఖం పెద్ద పెద్ద చెట్ల తీగలతోను కొమ్మలతోను ఆవరించి ఉంది. చూడ్డానికది రాక్షసుల నివాస మార్గమేమో అన్నట్లుంది. దాన్ని చూడంగానే వానరు లందరికి అది సరాసరి యమలోకానికి దారేమో ననిపించింది. ఒక ప్రక్క ఆకలిదప్పులతో సతమత మవుతున్నారు. కనీసం త్రాగటానికి నీరు ఎక్కడన్నా దొరికినా కొంత ఉపశమనము కలుగుతుందని అనుకుంటూ ఉంటే ఈ బిలం కనపడింది. లోపలకు వెళ్లితే ఏదైనా దొరకచ్చు

అనుకుందామంటే బిలం చూడ్డానికి మహా భయంకరంగా సూటిగా యమ సదనానికి మార్గంలాగా ఉంది. సూర్య కిరణాలు కూడా ప్రవేశించడానికి వీలులేదు. 'లోపలికి పోవడమా ? లేక ఆకలి దప్పులతో బయటే చని పోవడమా ?' అనే సందిగ్ధంలో పడ్డారు. భయం అనేది ఎరుగని వారు, బాహు బల పరాక్రమ సంపన్నులు, మహా రాక్షసుల ప్రాణాలకు భోక్తలు, దేవ కార్య నిర్వహణా దక్షులు, ఋషిపుంగవుల కృపకు పాత్రులైన వారు అయిన వానర సేనాపతులే ఆ బిలాన్ని చూసి లోపలికి వెళ్ళడమా వద్దా అనే విచికిత్సలో పడ్డారంటే - ఆ బిలం ఎంత భయంకరంగా ఉందో ఊహించవచ్చు. అమిత వేగంతో పరుగెత్తి, చివరకు కొద్దిలో తప్పించుకో గలిగిన లేడిని వెంబడించే వెఱ్ఱి ఆకలి గల పెద్దపులిలా ఒక్కొక్కళ్లు రోషంతో బిల ద్వారం వద్ద వెఱ్ఱి కేకల గర్జనలతో సతమతమౌతున్నారు.

## చిగురించిన ఆశ

ఇంతలో బిల ద్వారం దగ్గఱ ఏదో త్రాగి, ముక్కున ఏదో కఱచుకుని బయట ఆకాశం వైపుకు చటుక్కున ఎగురుతూ పక్షులు వరుసగా పోయిన దృశ్యం హనుమంతుడు చూడడం జరిగింది. పక్షులు ముక్కున కఱచుకున్నవి తామర తూండ్ల ముక్కలుగా గుర్తించాడు. అవి క్రౌంచ పక్షులు. వాటి రెక్కల కదలికలకు నీటి తుంపరలతో చల్లని గాలి వీచింది. వెంటనే హనుమంతుడు బిలం లోపల తప్పకుండా తామర చెరువులు ఉండి తీరాలని నిర్ధారించు కున్నాడు. అలా అనుకుంటూనే బిలంలోకి ప్రవేశించాడు. హనుమంతుణ్ణి చూస్తూ ఉన్న మిగతా కపివీరులు గూడా లోపలకు ప్రవేశించారు. లోపలకు వెళ్తున్న కొద్దీ వెలుగు సన్నగిల్లుతూ, అంధకార బంధురమై పోయింది. కన్ను పొడుచుకున్నా ఏదీ కానరావడం లేదు.

అందరూ విడిపోకుండా ఒకళ్ల చేతులు మరొకరి చేతులతో కలిపి వరుసగా ముందుకు సాగుతున్నారు. స్పర్శ తప్ప ఏ ఒక్క కోతికి మిగతా కోతుల్లో ఎవ్వరూ కనపడటం లేదు. తాను మిగతా కోతులకు కనపడటం లేదు. అలా దట్టంగా చీకటి పులుముకుని ఉంది. ఇంతలో ఎక్కడ నుండి వెలువడుతున్నాయో తెలియదు గాని ఘోరమైన సింహ గర్జనలు, పులుల గాండ్రింపులు చెవులు బ్రద్ధలయే లాగా వినబడ్డాయి. అందరూ హడలి పోయారు. ఎంత సేపు అలా వెళ్లాలో తెలియదు. ఎక్కడకు వెళ్తారో తెలియదు. ఎక్కడ ఉన్నారో తెలియదు. ఎంత దూరం పోతున్నా ఆ చీకట్లో నీటిబొట్టు గూడా ఉన్నట్టు కనబడదు. రాత్రి అయిపోయి వెలుగుతో ఎప్పుడు పగలు ప్రారంభమౌతుందో తెలియని విధంగా కొద్ది సేపటికి గుహాంతమై భూమి కనబడింది. ఆ ప్రదేశం నానావిధ పుష్ప, ఫలాలతో, తరు లతా గుల్మాలతో, పచ్చిక బయళ్లతో, తుషార మలయ మారుతంతో, తుమ్మెదల ఝుంకారాలతో భూతల స్వర్గంలా ఉంది. పెల్లుబికిన ఆనందంతో కపి వీరు లందరూ పట్టుకున్న చేతులు వదలి, ఒకళ్ల నొకళ్లు కౌగలించుకున్నారు.

స్వర్గంలాగా కనిపించే ఆ ప్రదేశంలో వానరు లందరూ ఆనందంగా పోతున్నారు. సీత, రాముడు, సుగ్రీవుడు వీళ్లెవ్వరూ వాళ్ల మనస్సుల్లో లేరు. వచ్చిన విషయమే గుర్తు లేదు. తామున్న వనమంతా కనకమయంగా ఉంది. బంగారు వృక్షాలు మణిమయ కాంతులు విరజిమ్ముతూ రమణీయంగా ఉన్నాయి. రంగు రంగుల పువ్వులు రకరకాల వాసనలు విరజిమ్ముతు న్నాయి. పువ్వులపైన తుమ్మెదల ఝుంకారాలు శ్రవణపేయంగా ఉన్నాయి. కళ్లకు ఎదురుగానే పూవులు తుమ్మెదలను ఆహ్వానిస్తూ ఎంతో రమ్యంగా రేకులు విప్పుతున్నాయి. 'వెన్నెల ముద్దలతో చేశారా–వెన్న ముద్దలతో చేశారా?' అన్నట్లు ఉన్నాయి పాలరాతి సౌధాలు. ఆ సౌధాలకు రత్నాలు

పొదిగిన ద్వారాలు, గవాక్షాలు, సౌధం చుట్టూరా వున్న ఉద్యానవనంలో అప్సరసల అపురూప సుందర భంగిమలతో శిల్పాలు. జలక్రీడలకై జలాశయాలు. పుష్పలతలతో ఉయ్యాలలు, చల్లని నీటి తుంపరలు వెదజల్లే సరంధ్ర జలయంత్రాలు ప్రణయ రతి కలాపాలకు పొదరిళ్లు.

సౌధాంతర ప్రవేశం చేస్తే ఇంకా ఎక్కువ ఆశ్చర్యం కలిగేట్లుగా ఎవ్వరి కోసమో ఎదురు చూస్తూ అన్ని ఏర్పాట్లూ సిద్ధంగా ఉన్నాయి బంగారు గిన్నెల్లో పానకాలు, భక్ష్యభోజ్య చోష్య లేహ్యాదులన్నీ కళ్లకు ఆకర్షణీయంగాను, నాసాపుటాలకు ఆస్వాదనీయంగాను ఉన్నాయి. బంగారు పట్టె మంచాలకు సరంధ్ర తెరసెల్లాలు, అగరు, జవ్వాది, అత్తరు, పన్నీరు హరి చందనాది సుగంధ ద్రవ్యాలు, తమలపాకులు, వక్కలు, మొదలైన తాంబూల ద్రవ్యాలు పన్నీరు బుడ్లు, గంధపు గిన్నెలు. మీగడ కట్టిన చిక్కటి పాలు గలిగిన పాత్రలు, పావకోళ్లు, రత్న కంబళీలు. అప్సరసలు కట్టే చీని చీనాంబరాలు సమస్తమూ తీర్చి ఏర్పాటు చేయబడి ఉన్నాయి. బయటకు చూడ్డానికి మామూలుగా ఉండే అన్ని పర్వతాల్లాగానే ఈ గిరి గూడా ఉంది కాని, లోపల ఇన్ని సంబారాలతో నిండి ఉండడం ఎవ్వరూ ఊహించలేరు. పైగా చిత్రమేమిటంటే లోపలకు సూర్యకాంతి గాని, చంద్రకాంతి గాని ప్రవేశించడానికి ఏ మాత్రం వీలులేక పోయినా లోపల ఉన్న అన్ని వస్తువులూ తళతళా మెరిసి పోతున్నాయి. ఇంకా ముందు ముందు ఏముంటుందో! ఇలా ఆశ్చర్య పడుతూనే ఆపదలపాలు గూడా గావచ్చు అనే ఉద్దేశ్యముతో ధీమంతుడైన హనుమను ముందుంచు కొని ముందుకు మెల్లగా నడుస్తున్నారు.

# స్వయంప్రభ

అలా మారుతిని ముందుంచుకొని గుహ లోపలకు పోతూ ఉంటే ఆ వానర యోధులకు ఒక చోట ఒక వినూత్నమైన యువతీ రత్నం కనబడింది. ఆమె దేహం నుండి నలు దిశలకు స్వచ్ఛమైన కాంతి కిరణ పుంజాలు వెదజల్లబడుతుంటే గాయత్రీ మాతేమోననిపించింది. కాని తగినంత శ్రద్ధ చూపకపోవడం వలన తల నీలాలు ఉండవలసిన రీతిలో లేక ఆమె ప్రోషిత భర్తృక రీతిలో ఉండడంతో ఆమె గాయత్రీదేవి కాదేమో అనిపించింది. శార్దూల చర్మధారిణి అవడంతో పార్వతీదేవేమో అనుకున్నారు. కాని జటా జూటంలో సురవాహిని గాని, సుధాకర రేఖ గాని లేకపోవడంతో ఆమె పార్వతీదేవి కాదేమో ననుకున్నారు. అయితే ఒక వేళ ఏ తల్లి కోసమై ఈ భూమి అంతా గాలిస్తున్నారో ఆ సీతమ్మ తల్లి తన ప్రభువుకు దూరమైనందున పరిదీనయై ఇలా యోగినిలా ఇక్కడ ఏకాంతంగా వేంచేసి వున్న దేమోనని అనుమాన పడ్డారు. కాని, ఆమె ఎవరై ఉంటుందో ఎవ్వరూ ఏమీ తేల్చుకోలేక పోయారు. అందరూ బుద్ధిశాలి అయిన హనుమంతుని దగ్గరగా చేరి- "ఎవరై ఉంటుంది. ఈమె ?" అన్నట్లు ప్రశ్నార్థకంగా చూశారు. తన సహజమైన మృదుమధుర వాక్కులతో—

"అమ్మా ! ఈ మణి సౌధం ఎవరిది ? ఈ ఉద్యానవనం ఎవరిది ? స్వదేహ స్వచ్ఛకాంతులతో దేదీప్యమానంగా వెలుగులు విరజిమ్ముతున్న నీకు మా గురించి గూడా చెప్పాలి. ఇంతవరకు వింధ్యారణ్య ప్రాంతమంతా తిరిగి తిరిగి తిండే తిప్పలు లేక. కనీసం త్రాగడానికి గూడ నీళ్ళు లేక, నాలుకలు పిడచ కట్టుకు పోతుంటే దిక్కు తోచక, ఇంక ప్రాణాలు పోవడం ఖాయం అని నిర్ణయించుకుని, ఉసూరుమంటున్న సమయములో ఈ కొండ గుహ ముఖద్వారాన్ని చూశాము."

"ఏదో ఆశ చిగురించింది. తీరా లోపలకు ప్రవేశిస్తే అంతా చీకటి గుయ్యారం కన్ను పొడుచుకున్నా కనబడని దట్టమైన చిక్కటిచీకటి. ఏమైపోతామో తెలియనిస్థితి. ఏమైపోయినా జీవితంలో చావు వస్తే ఒకసారే వస్తుంది. కాని రెండుసార్లు రాదని మొండితనంతో తెగించి ముందుకు సాగి వస్తే-అదృష్టవశాత్తు ఇక్కడ ఈసుందర ఉద్యానవనాలు, మణిమయసౌధాలు, కాంచన హర్మ్యాలు కనబడ్డాయి. ఒక్కసారే మాకు ఆశ్చర్యమేసింది. చూస్తున్నది వాస్తవ మేనా-భ్రమా ? లేకపోతే ఇంతటి గాఢాంధ కారమైన గిరి గహ్వరంలో ఇంతటి వైభవో పేతమైన సుందర దృశ్యాలా ? సకలము మణిమయమై రమణీయంగా వున్న ఈ కాంచన హర్మ్యాలను, నానావిధ పుష్పఫలజాతులతో సౌరభాలు వెదజల్లే ఈ ఉద్యానవనాలు, శరచ్చంద్రిక లను వెదజల్లే సౌధాలు ఎవరివి ? ఎవరిచేత నిర్మితమైనవి ? ఇక్కడున్న గుహల్లో కందమూలాలు, శాక పాకాలు షడ్రసోపేతమైన పిండి వంటలు స్వచ్ఛమైన పాత్రలలో వుండి నాసాపుటాలకు విందు చేకూరుస్తున్న సువాసన లతో ఉన్నాయి. ఎవరి కోసం అవన్నీ ? వాటిని ఆరగించడానికి వచ్చే ఆ మహాదేవ భోగులెవరు ? అవతల ఉద్యానవనంలోని తటాకాల్లో రంగు రంగుల మత్స్యాలు, కచ్ఛపాలు మనోహరంగా తళుక్కు తళుక్కు మంటూ చరిస్తున్నాయి. ఈ సంపద అంతా ఎవరిది ? ఆకలి దప్పులు తీర్చుకో డానికి అలమటించి పోతున్న ఈ అపురూప సంపద అనుభవించడానికి తొందరపడకుండా ఉండలేకపోతున్నాం. మాయందు దయయుంచి నీవుతప్ప కుండా మా సందేహాలు తీర్చి మమ్మ ఈ ఆపత్సమయంలో ఆదుకుంటావనే ఆశతో అడుగుతున్నాను, అనుగ్రహించు తల్లీ" అన్నాడు హనుమంతుడు.

హనుమంతుని మాటలను విన్న ఆ అపరత్రిపురసుందరి ఆంజనేయుని సునిశితంగా చూసి, అతని మహానుభావానికీ అమిత ఆశ్చర్యపడి, ఇతను

సామాన్యుడుగాడు. కపిరూపంలోవున్న కైలాసపతియే అని నిర్ధారించుకొని, ఇంక మౌనంగా వుండడం అంత సబబుగాదని సౌమ్యంగా ఆంజనేయుని ఉద్దేశించి ఇలా చెప్పింది—

"పూర్వం రాక్షసులకు రాజు ఒకడుండే వాడు. అతని పేరు మయుడు. బహుమాయావి. మీకు కనబడే ఈ బంగారు తోటలు అన్నీ అతడే సృష్టించాడు. సుధాసరస్సులను సృష్టించాడు. ఆపైన విశ్వకర్మ తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి మీరు చూసిన శశిశిలా సౌధాలు, ఆ సౌధాల్లోని సమస్త భోగవస్తు సముదాయాన్ని సృష్టించి, రామణీయకతను పెంచాడు. ఈ బ్రహ్మ సృష్టిలో అందిరికీ మొట్టమొదటగా హేమం మీద ఆశ ఉంటుంది. ఆ హేమాన్నే జపిస్తూ, దాని కోసమై తపిస్తూ మోహపడుతూ ఉంటారు. గదా! విశ్వకర్మ ఏం చేశాడంటే ఇంద్రపురమైన అమరావతి నుండి "హేమ" అనే పేరు గల అప్సరసను తీసుకువచ్చి, ఈ ఋక్షబిలంలో ఉంచి ఆ హేమ దేహకాంతులతో గుహ మొత్తం నిండిపోయేట్లు చేశాడు. దేవేంద్రుడు వూరుకుంటాడా! వెంటనే అతణ్ణి అంధతా మిశ్ర లోకాలకు అణగద్రొక్కాడు. దాంతో ఇక్కడవున్న ఈ సంపద, ఆస్తి అంతా హేమకు వచ్చింది. ఆ హేమ నాకు ప్రాణ సఖి. ఆమె నన్ను ఇక్కడే ఉండమని చెప్పింది. అప్పటి నుండి దీని రక్షణభారం అంతా నాదైంది. నా తండ్రి పేరు 'మేరుసావర్ణి' మిమ్మల్ని చూస్తూంటే చాలా అలసి సొలసి బడిలినట్లు న్నారు. అంతటి ఆకలిదప్పులతో అలమటిస్తూ ఉన్నా, ఎదురుగా అన్నీ తినమని ప్రలోభ పెట్టేట్టుగా ఉన్నా, అమితమైన ఓర్పుతో, నిగ్రహంతో మీరు తినకుండా ఉన్నారు. ఇంక మీరు ఆగవలసిన పనిలేదు. ముందు ఇవన్నీ ఆరగించండి" అంటూ బహు విధములైన ఫలములు, భక్ష్య భోజ్య చోష్య లేహ్యములు సుధానీరములు ఇచ్చింది. అందరూ అన్నీ ఆరగించి పరితృప్తమత్త చిత్తులయ్యారు. వారిని చూసి ఆమె మళ్లీ— "మేరుసావర్ణి

నా తండ్రి" అన్నది. ఆ పేరు వినంగానే కపివీరు లందరూ అవనత శిరస్కులయ్యారు. ఆమె చెప్పే మాటలను అతి శ్రద్ధాసక్తులతో వింటున్నారు. వారిని ఉద్దేశించి దేవి—

"ఇంక మీ శ్రమ తీరిందనుకుంటాను. ఇప్పుడు చెప్పండి. ఎవ్వరికీ కనిపించడానికి వీల్లేని ఈ బిలద్వారం మీకు ఎలా కనబడింది. అసలు మీరంతా ఎక్కడకు వెళ్తూ ఇలా వచ్చారో చెప్పండి ?" అంది. అందుకు ఆంజనేయుడు—

"అవక్ర విక్రమ పరాక్రమ సంపన్నుడు, అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయక ప్రతి రూపుడైన శ్రీరామచంద్రుడు అతనితో కలిసి అతని తమ్ముడు లక్ష్మణుడు అడవులకు వచ్చారు. అచ్చు నిన్ను బోలిన అతని ఇల్లాలు సీత గూడా అతణ్ణి అనుసరించి అడవులకు వచ్చింది. ఆపత్సమయంలో అదను చూసి రావణుడనే మహా రాక్షసు డామెను దొంగిలించుకు పోయాడు. ఆ వైరం కారణంగా మరో దేవ దానవ సంగ్రామానికి బీజం ఏర్పడబోతోంది. ఆ దైత్యుడు ఆ మహా తల్లిని ఎక్కడ దాచిఉంచాడో చూడడానికి నియోగింపబడి ఇలా దక్షిణ దిక్కు ప్రాంత మంతా వెతుకుతూ తిరుగుతున్నాము. వాలి తమ్ముడైన సుగ్రీవుని రాజాజ్ఞ ననుసరించి వానర యోధు లందరూ నాలుగు దిక్కులకూ నాలుగు విధాలుగా వెళ్లారు. ఈ దక్షిణ దిశకు మేము వచ్చాము. మాకు నాయకుడు అంగదుడు వాలి మరణానంతరం సుగ్రీవుని యందలి సఖ్యభావంతో రామచంద్రమూర్తి కిష్కింధకు సుగ్రీవుని రాజుగాను, వాలి సుతుడైన అంగదుని యువరాజుగాను చేశాడు. రఘురామునికి ఇంకొక సవతి తల్లి కొడుకు ఉన్నాడు. అతని పేరు భరతుడు. అతణ్ణి యువ రాజుగా చూడాలనే కాంక్షతో ఆ తల్లి కోరిన వరానికీ, తండ్రిగౌరవం దక్కించడానికీ గాను ఆ శ్రీరాముడు ఇలా వనాలకు విచ్చేయవలసి వచ్చింది. తన మనస్సు తెలుసుకో కుండా తల్లి ఇలా

కోరినందుకు బాధపడి వెంటనే రాముని తిరిగి రమ్మని ప్రతిమాలి, చివరకు లాభం లేక శ్రీరాముని పాదుకలను శిరస్సున ధరించి వెళ్లిపోయాడు తండ్రి మాట నిలబెట్టేందుకు స్వామి ఇలా వనాలకు వచ్చాడు. వానర రాజు సుగ్రీవుడు మాకు నెలరోజులు గడువు ఇచ్చాడు. మేము వెదకవలసిన భూభాగం లేదనే చెప్పాలి. మొత్తం వింధ్య పర్వతాన్ని మొలత్రాడులా చుట్టి వచ్చాము. అలసి సొలసి ఆకలి దప్పులతో అలమటించేవేళ భగవంతుడు ఈ బిలద్వారాన్ని చూపాడు. అప్పటి మా పరిస్థితి వర్ణనాతీతం. కాళ్లూ చేతులు కదపలేకుండా వున్నాం. వనాలు, పర్వతాలు వెదకి వెదకి డీలాపడి పోయిన ముఖాలు వ్రేలాడ వేసుకుని, కర్తవ్యంతోచని స్థితిలో ఈ బిలద్వారం లోపల నుండి కొన్ని హంసలు తామర తూడుల ముక్కలు ముక్కున కరచుకొని బయటకు వస్తూండగా చూచాను."

"హంసల రెక్కల విసురుకు నీటితుంపరలు వెదజల్లబడటం గమనించి లోపల ఎవరన్నా ఏదన్నా ఉండి ఉండవచ్చునని ఆశతో ద్వారం వెంబడి ప్రవేశించాము. ప్రవేశించామన్న మాటేగాని మా ప్రాణాలు ప్రాణాల్లో లేవు. అంతా నిబిడాంధకారం. కన్ను పొడుచుకున్నా కానరాదు. మాలో ఎవ్వరికీ మిగతావాళ్లు కనబడలేదు. చేతులు చెట్టాపట్టాలు వేసుకుని రాక్షసులెవరన్నా ఉన్నారేమోనని, ఏమౌతుందోనని భయభ్రాంతులతో అక్కడ కళ్లు మూసుకుని ఇక్కడ కళ్ళు తెరిచాము. మా అదృష్టం బాగుండి నీ దర్శనం జరిగింది. నీవు మా క్షుత్పిపాసలుతీర్చి మా ప్రాణాలు నిలిపావు. ఈ పుణ్యోపకారానికి ప్రత్యుపకారం చెయ్యడం ధర్మం. నీ ఆజ్ఞకై వేచియున్నాం. దయతలచవమ్మా కరుణాపయోనిధీ" అన్నాడు.

హనుమంతుని వచో వైశారద్యానికి ఆ యోగిని ఆనందాశ్చర్యాలను పొంది, కను రెప్పలను అతి మృదువుగా క్రిందకు వాల్చి తలను దానికి అను

గుణంగా క్రిందగా వంచి పైకెత్తింది. 'పుణ్య కార్యాల ఫలం వృథా పోదు' అనే భావం వేరేచెప్పకుండానే వ్యక్తమైంది. ఆ భావాన్ని గమనించిన హనుమ కళ్లల్లో పసిడి కాంతులు వెల్లివిరిసాయి. అటూ ఇటూ మసలుతున్నట్లు ఉంటూనే ఏదో ఒక మాట అనబోయి ఇంకో మాట నోరు జారినట్లు—

"కపిరాజు ఇచ్చిన గడుపు కాస్తా పూర్తయిపోయింది. మరి ఈ బిలం లోంచి బయటపడే మార్గం కనబడుటం లేదు. బయటపడటం ఎలా? అనుకుంటున్నాము. కాని, నిజానికి బయటపడినా ఏం చెయ్యగలం ? వచ్చిన పని సానుకూలం కానే కాలేదు. అయినా తెగించి వెళ్లినా కపిరాజుకు కనబడితే "మీరు వెళ్లి వెదకడం సీత కనబడటమూ గూడానా? ముచ్చు మొగాలూ మీరూను అని తిట్టి అందరినీ చంపినా చంపవచ్చు గూడా!" అన్నాడు.

ఆంజనేయుని మాటలు విన్న ఆ గుహ యోగిని—

ఈ గుహలోనికి ప్రవేశించడమే కష్టం. ఒకవేళ ప్రవేశించడమే జరిగితే బయటకు వెళ్లడం ఎవరి తరం కాదు. ఇంతవరకు అలా జరగలేదు. కాని నా తపశ్శక్తి చేత ఈ గుహ నుండి బయటపడేటట్లు చేస్తాను. అందరూ ఒక్కసారి కళ్ళు మూసుకోండి. పెసర కాడల్లా వున్న వేళ్ళతో దానికి తగ్గట్టుగానే వున్న కళ్లని మూసుకున్నారు వానరులందరూ. కళ్ళు మూయటం జరిగింది. లిప్తకాలంలోనే కళ్ళు మిరుమిట్లు గొలిపేలాగా కళ్ళల్లో సూర్య కిరణాలు గుచ్చుకున్నాయి. ఇది 'వింధ్యాద్రి, ఇది ప్రస్రవణాద్రి, ఇది సాగరం' అన్నది. అంటూనే అంతలోనే ఆ స్వయంప్రభాదేవి మరి కనబడలేదు. ఆ క్షణం లోనే మున్నెన్నడూ విననట్టి ప్రళయకాల పర్జన్య గర్జానునాద సంజనిత గగనాంతర ప్రతిధ్వనిని విన్నారు అందరూ! ఒక్కసారి ఎగిరి సముద్రం లోకి లంఘించారు నెత్తులమీద చేతులు పెట్టుకొని గొంతుకూర్చుని, నలు దిక్కులా విస్తరించిన అపార జల సముద్ర అఖండత్వాన్ని దర్శిస్తూ కాస్సేపు

ఆత్మానందాన్ని పొందారు. అత్మ దర్శనం జరిగిన పరమ యోగులే మరు నిమిషంలో ప్రాపంచిక విషయాలపైకి దృష్టి త్రిప్పుతారు గదా! అలాంటిది చపలత్వానికి మారు పేరైన వానరులకు స్థిరబుద్ధి, స్థిరదృష్టి ఎంతసేపు వుంటాయి? మరుక్షణం లోనే సముద్రం లోంచి వింధ్యాద్రి విశాలారణ్యాల సొంపుల్ని, పచ్చని వెన్నెలను తిలకించి తన్మయులైనారు మళ్లీ అందలోనే కర్తవ్యం గుర్తుకు వచ్చి గుండెలు గుభేలుమన్నాయి.

వనలక్ష్మి స్నానమాడి వాసక సజ్జిక లాగా వంటికి క్రొత్త చీర కట్టి నట్లుంది. మధుమాసవు శోభలకు పులకితులయారు. మామిడి చిగుళ్ళు కొరి కిన కోయిలలుగొంతెత్తి గంధర్వగానాన్ని ఆలపిస్తున్నాయి. అయినా భూజాత సీత జాడ తెలియలేదన్న విచారం ఆ గానాన్ని వినిపించుకోనీయటం లేదు. ప్రకృతి రామణీయకంగా ఉన్నా, ఆహ్లాదకరంగా ఉన్నా, మనస్సుల నిండా రామ కార్యం, సుగ్రీవాజ్ఞ ఇవి రెండే ఉండటంతో గుండెలు జారి కొండ చరియల్లో చతికిల బడ్డారు. దిగులు పడిన వానర వీరు లందరినీ వృష స్కంధుడు, బుద్ధిమంతుడు అయిన అంగదుడు చూసి –

## అంగదుని ఆంతర్యం

"మనం చేయగలిగినంతా చేశాం. నిజానికి ఈ మాత్రం కూడా ఎవ్వరూ చేయలేరు. అయినా దురదృష్టం మనల్ని పట్టుకుని వెన్నాడుతోంది. అవతల కపిరాజు కాలాతిక్రమణమౌతున్న కొద్దీ కారాలు, మిరియాలు నూరుతూ ఉంటాడు. మనందరమూ మన వళ్ళు దాచుకోకుండా వెదికాము. మీ రందరూ సామాన్యులు కూడా కాదు. ఒక్కొక్కళ్లు నాలుగు సముద్రాలను పుక్కిట బట్టగల సమర్థులు. అయినా మనం భూజాత జాడ తెలుసుకోలేక

పోయామంటే మనయందు దోషం లేదనే అంటాను. దీని కంతకూ దైవ కారణం వేరే ఉండాలి. మనయందు ఆ విధికి ఇంత వైర మెందుకో తెలియకుండా ఉంది."

"కార్యం చక్కబెట్టకుండా వెళ్తే సుగ్రీవరాజు ఏం చేస్తాడో ఊహిస్తేనే నా గుండె పగిలిపోతోంది. దైవం చూడొస్తే మనకు అనుకూలంగా లేడు. వాస్తవానికి ఆ సుగ్రీవరాజు తనంతకు తాను బయలుదేరి ఇక్కడకు వచ్చి భూమంతా త్రవ్వి వెదకినా సీత కనబడదు. అయినా "ఆయన రాజు, నేను భృత్యుడను" అన్న మాట ఎవ్వరూ కాదనలేని సత్యం. తండ్రి పోయి నపుడు నన్ను యువరాజును చేశాడంటే అవతల రామచంద్రుని మొహమాటం మీద చేశాడు. మా తల్లిని దగ్గరకు తీసుకుని ఆదరించాడంటే తనలోని కామభావం ఆ పని చేయించింది. కాబట్టి నన్ను రక్షిస్తాడని చెప్పుకోడానికి అవి రెండూ కారణాలు కానే కావు. ఒక్క ధర్మ సూక్ష్మం చెబుతా వినండి. ఆ రోజున తండ్రి పోయినపుడు నన్ను యువరాజును చేయకపోవడం అధర్మం కావచ్చు కాని ఇప్పుడు అప్పచెప్పిన కార్యం చక్కబెట్టలేదు కాబట్టి శిక్షించడం ధర్మమే అవుతుంది. నేను కనుక వస్తే నాతోపాటు మీకూ ఈ శిక్ష పడినా పడవచ్చు. కాబట్టి ఈ విషయాన్ని గుర్తుపెట్టుకుని నాతో వంతు పెట్టు కోకుండా మీరు కిష్కింధకు వెళ్లండి. నా తిప్పలు నేను పడతాను. నేను వస్తే ఆ రఘురాముడు కూడా నా విషయం పట్టించుకోక పోవచ్చు. ఎందు కంటే, సీత కనబడలేదనే వార్త విన్న శ్రీరామచంద్రుడు హృదయం బ్రద్దలై, నిరాశ నిస్పృహలతో నోటమాటలేని వాడౌతాడు గాని నా విషయం పట్టించుకునే స్థితిలో ఉంటాడని నేను అనుకోను. మరి అలాంటప్పుడు నా సవతితల్లిభర్త ఏం చేసినా ఎవరాపగలరు ? ఎవరు వారించకలరు ? అవన్నీ తలచుకుంటూ ఉంటే నా మృత్యువును నేను కళ్లారా చూసుకుంటు నట్లు ఉన్నది. లేదా ఇంక చేస్తే ఒక పని చేయాలి. పాతాళం త్రవ్వి

చూడాలి. అలా చేస్తే ఈ వింధ్యాచల ప్రదేశ మంతా సముద్రమై కాలూన డానికి కూడా సందు ఉండదు. ఏమైనా ఇచ్చిన నెల రోజుల గడువు దాటి పోయింది. ఇంక ఏమనుకొని ఏం లాభం ? ఎంత ఆలోచించినా ప్రాయోపవేశం ఒక్కటే నాకు కనిపిస్తోంది. కపి యోధులు రాజబంధువులు అయిన మీరు కిష్కింధకు వెళ్ళండి. రాజు అనుగ్రహమో ఆగ్రహమో మీ మీ అదృష్టాన్ని బట్టీ, మీ మీ ఆలోచనలను బట్టి మీకు దక్కుతుంది" అన్నాడు.

## వానరుల ఆలోచనలో మార్పు

ఎఱ్ఱబడ్డ కళ్ల వెంబడి అశ్రువులు కారుతున్న అంగదుడు అన్న మాటలు మూగవాళ్లలాగా కపి యోధు లందరూ విన్నారు. తిరిగి కిష్కింధకు వెళ్లడం-అంగదుడు చెప్పినట్లు మృత్యువును నెత్తిపైకి కొనితెచ్చుకున్నట్లే ! దాని కంటే ఈ సముద్రంలో పడి చావడం మేలు. ఏదో పెద్ద ప్రతికిస్తా నంటూ ప్రగల్భాలు పలికి శూన్య హస్తాలు చూపిస్తే ఆ రాముడు మటుక్కు సుగ్రీవుని పట్ల నిర్దయుడవడా ? చివరకు అదీ ఇదీ కలసి మన మీదకే వస్తుంది. అక్కడకు వెళ్లి దోషులుగా నికృష్టపు చావు చచ్చేకంటే యువ రాజైన అంగదుడు చెప్పినట్లు ఇక్కడే ఉండి ప్రాయోపవేశం చేసి మరణిస్తే అంగదుడి వెంట వచ్చినందుకు భృత్య ధర్మాన్ని పాటించినట్లన్నా అవు తుంది !! అని వానరు లందరూ అంగీకరించినట్లుంటే - తారుడు వాళ్ళ నుద్దేశించి—

# తారుని వత్తాసు

అందరం కలిసి ఇక్కడే ఉండిపోతే ఎవ్వరూ చావవలసిన అవసరమే ఉండదు కదా ! ఈ ప్రాంతానికి దేవతలూ, రాక్షసులూ రాలేరని ఆ స్వయం ప్రభాదేవి చెప్పనే చెప్పింది. కాబట్టి మనం ఇక్కడున్నా. మనలను వెతుక్కుంటూ ఇక్కడకు వచ్చి చంప గలిగిన వారు కూడా లేనపుడు చావు అనే ప్రసక్తే ఉండదు కదా! ఇక్కడున్న చెట్ల కాయలు, పళ్లు తిని ఎలాగో అలా బ్రతికేస్తాం. నోరు పెట్టుకొని అడగాలే గాని ఆ స్వయంప్రభాదేవి మనకు తప్పకుండా కాయలూ పండ్లు ప్రసాదిస్తుంది. ఏం ? అక్కడున్న ఆయనే రాజా ? 'ఇక్కడున్న ఈ అంగదుడు మనకు రాజు కాదు' అనేం లేదు కదా! నిజానికి ఈయన తండ్రిలేక పోబట్టే ఆయన రాజైంది. ఈ అంగదుడు మనకు రాజుతో సమానమే! కాబట్టి, మనం ఇక్కడ రాజులేని వాళ్లలాగా బ్రతకక్కరలేదు గూడా ! ఇంతకీ ఆ స్వయంప్రభాదేవి మళ్లీ మనకు దర్శన మవాలి. మన సమస్య పరిష్కార మవాలి. అసలు ఈ బిల ద్వారమే ఎవరికీ తెలియదు. కాబట్టి, ఈ గుహ నివాసం అన్ని విధాల శ్రేయస్కర మనిపిస్తోంది" అన్నాడు.

# హనుమంతుని సమయస్ఫూర్తి

తారుని మాటలు విన్న కపివీరు లందరూ ఆలోచనలో పడ్డారు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటున్నారు. "మనవాడు చెప్పింది బాగానే ఉంది" అనే భావన వాళ్ల ముఖాల్లో కనపడుతోంది. వ్యవహారం ప్రక్క దోవలు పట్టేట్లుందని గ్రహించి హనుమంతుడు –

"మీరు అనుకుంటున్నది ఇతరుల విషయంలో కర్తవ్యమౌతుందేమో గాని మీలాంటి వీరులకు, యోగులకు కాదు. మీరు బల పరాక్రమ సంపన్నులు, ధీరులు. ఇటువంటి మీరు అలా పేలవంగా మాట్లాడకూడదు. ఒక్కటడుగుతా చెప్పండి. మనకూ, ఆ స్వయంప్రభాదేవికీ ఏం చుట్టరికం ఉందని మనలను కూర్చోబెట్టి తిండిపెట్టి పోషించాల్సిన బాధ్యత ఆమెకుంది ? పైగా ఈ గుహలో ఉన్నదంతా ఆవిడ సొమ్మా ? అదంతా ఆ గుహాలక్ష్మి అయిన అప్సరసది. ఎదో సామెత చెప్పినట్లుంది ఒకళ్ల సొమ్ము ఒకళ్లు ఇస్తారా ? అసలు ఇవ్వవచ్చునా ? నన్నూ, నిన్నూ చూసికాదు ఆవిడ గుహ నుండి మనలను విడుదల చేసింది. రామనామం వినిపించడంతో ఆవిడకు మనయందు దయ కలిగి విడిపించింది. మళ్లీ మనం ఏం ముఖం పెట్టుకుని 'దేహి' అని అడుక్కుటాం ? మన వ్యవహారానికి ఆవిడకు కోపం వచ్చినా రావచ్చు."

"ఆమె అందర్నీ యోగ ప్రభావాగ్నిలో దహించి వేసినా వెయ్యొచ్చు. అయినా ఇక్కడకు రావడం ఎవరి శక్యమూ కాదని ఎవరు మీకు చెప్పారు మూడు లోకాల్లోనూ లక్ష్మణుడి చరణాలకు, బాణాలకు అగమ్య మనేది లేదని తెలుసుకోండి. ఏవేవో ఊహలతో ఏదో ఒకరోజు ఈ బిలమంతా కోతి మూకల నెత్తుటి ముద్దలు అయ్యేట్లుగా చేసేట్లున్నారు. ఉత్తముడైనవాడు అవరోధాలను లెక్క చేయడు. బుద్ధిబలంతోను, బాహుబలంతోను సాధించ కలిగినదానిని సాధించి తీరుతాడు. భీరులు, నిరర్థకులే అవరోధాలను పని మానడానికి అవకాశాలుగా తీసుకుంటారు. మీరు ఉత్తముల కోవకు చెందుతారో, నిరర్థకుల కోవకు చెందుతారో మీరే ఆలోచించుకోండి. మిగిలిన మూడు దిక్కులకు పోయిన వానరయోధులందరూ కూడా మీలాగానే ఊహ చేసి సీతను కనుక్కోలేక పోయామని భయపడి ఎక్కడివాళ్ళక్కడే వుండి

పోయారని అనుకోండి- అప్పుడు ఏం జరుగుతుందో తెలుసా ? చెబుతా వినండి. సుగ్రీవుడు ఒక్కడూ మిగులుతాడు. ఆయన మనకు ప్రభువే. కాదనను. కాని రఘురామ కార్యంపట్ల భటుడే! తానొక్కడే అయినా మనందరం చెయ్యలేక పోయిన కార్యాన్ని చక్కబెట్టడమేకాదు, నాలుగు దిక్కులా ఉన్న వానరసైన్యాన్ని దిశాంతాల్లోకి లీనం చెయ్యగలడు కూడా! సాహసవంతుడు సుగ్రీవుడని గుర్తుంచుకోండి! తాను ఈ మాత్రం పని చేసుకోలేకకాదు. తను స్వంతంగా చేసుకోవలసిన పనినిగూడా మనందరకూ వదిలేసి నిర్భయంగా ఉన్నాడంటే-మనందరినీ పూర్తిగా నమ్మి హృదయంలో పెట్టుకున్నట్లేకదా! అలా మనలను తన హృదయంలో పెట్టుకుని తనకూ మనకూ భేదం చూడనివానిపట్ల మనకు ద్రోహం చెయ్య బుద్ధి పుడుతుందా? చెప్పండి ?"

"అలా కాకుండా మనందరిపైన ఆధిక్య భావంతో, మనలను నమ్మకుండా, తానే సాహసంతో ఆ పని చేసుకున్నాడనుకోండి. మనందరికీ మనసులు నిర్మలంగా ఉండేవా ? తక్కువ చేశాడనే భావం ఏదో ఒకటి మనలో కలిగి, అతని కార్యాన్ని చెడగొట్టి మన అవసరాన్ని సామర్థ్యాన్ని గుర్తించేలా చేద్దామనే ద్రోహబుద్ధి పుట్టదూ ? చెప్పండి మీరే !' అని కాసేపాగి 'మీరం దరూ భుజపరాక్రమ సంపన్నులు, అజేయులు, నమ్మకస్తులు అని సుగ్రీవుడు చెప్పబట్టేకదా ఆ శ్రీరాముడు నమ్మింది. మీరందరూ నిజంగా ఏ పనినైనా సాధించకల సమర్థులు అని నమ్మే అలా చెప్పాడు అలా మనలను నాలుగు దిక్కులకూ పంపించాడు—అని గుర్తుంచుకోండి" అన్నాడు.

# హనుమంతుని హెచ్చరిక

హనుమంతుని మాటలు విన్న కపివీరు లందరూ నతశిరస్కులైనారు. అప్పుడు హనుమంతుడు అంగదుని చూచి—

"ఎందుకు నీ మనస్సు అలా విరిగి పోయింది? ఆ విరిగిన మనస్సుతో మిగిలిన వారిని కూడ ఎందుకలా పాడు చేస్తావు ? ఋక్షరజస కులదీపకుడ వనే గదా యువరాజుగా నీ కీ పని అప్పచెప్పింది. రఘువీరుని కార్యం చక్కబెట్ట గలగాలంటే తాను, లేదా తన తర్వాత తనంతవాడివి నువ్వు ఒక్కడివే అనే దృష్టితోనే ఈ మిగలిన కపివీరు లందరినీ నీ నాయకత్వంలో నీవెంట పంపింది. నీ స్థానాన్ని బేల భావంతో పాడు చేసుకోకు. ఎన్నాళ్లు సీత కనబడదో అన్నాళ్లూ వెళ్లనే వెళ్లం. కనబడిన తర్వాత వెళితే నిన్నే మంటాడు? మరింక భయం దేనికి ? చిన్న మబ్బు కూడా లేకుండా ఉరిమి నట్లుంది నీ ధోరణి. అయినా ఒకటి అడుగుతా చెప్పు. సీత అన్ని దిక్కు ల్లోనూ ఉంటుందా ? ఏ ఒక దిక్కునందే ఉంటుందా? — ఒక దిక్కునందే గదా ! మరి అలాంటప్పుడు సీత లేని దిక్కులకు వెళ్లిన వానర యోధుల కుత్తుకలన్నీ నీ పినతండ్రి పరపరా కోసేస్తాడా ? నీ బుద్ధి కీమాత్రం తట్ట లేందటే ఆశ్చర్యంగా ఉంది. నీమీద అతనికి కసి ఉండదు. ఉన్నా ఆ కసి తీర్చుకునే సమయం ఇది కానే కాదు. ఏనుగు మదమెక్కినదైతే - మద మెక్కినదని చంపుకుంటారా ఎవరన్నా? అందులోనూ ముందు ముందు పెద్ద సంగ్రామం పెట్టుకుని ? ఆ సంగ్రామంలో నీలాంటి వీరుల ఆవశ్యకత ఎంతటిదో తెలియనివాడంటావా నీ పినతండ్రి ? చూస్తూ చూస్తూ నిన్ను చంపుకుంటాడా ? వెర్రివాడా !.... అవతల పేరుకు సుగ్రీవుడు రాజుగాని వెనక ఉండి చక్రం తిప్పేది ఎవరు ? నీ తల్లి తార కదూ ? తార ఎంత చెపితే అంత సుగ్రీవునికి. ఈ విషయం కాదంటావా ?.... నేను, జాంబ

వంతుడు, నీలుడు మొదలైన మమ్మల్ని రాజ్యకాంక్ష, పదవీ వ్యామోహం గూడా సుగ్రీవుని నుండి వేరుచేయలేవని గుర్తుంచుకో! ఇంతకీ కాబోయే రాజువైన నీకు సూర్యసుతుడు కించిత్తు కూడా కీడు తల పెట్టలేదే! వాలి బాహుబలం ముందు నిలడగల వాడు సుగ్రీవుడే కాదు. ఈ లోకంలోనే ఎవ్వడూ లేడు. అంత మాత్రాన సూర్యసుతుణ్ణి తక్కువ అంచనా వెయ్యకు. తక్కిన యుద్ధ యంత్రాంగ విషయాల్లో సుగ్రీవుడే మిన్న. శత్రువు తన కంటె బలవంతుడై ఆ శత్రువు కొంచెం ప్రమత్తుడై వున్న తరుణంలో– తగుదునమ్మా అని ఆ శత్రువు మీదకువెళ్లి సర్వనాశనం కాడు వివేకం ఉన్న వాడెవడూ! ఆ శత్రువు వెంటనే సర్వసన్నద్ధు డౌతాడు. అనవసరముగా కదిలించిన వాడే ఆ తర్వాత గుక్కతిప్పుకోలేక సతమత మౌతాడు. కాబట్టి, ఈ కపివీరులను అనవసరంగా ప్రక్కదోవలు పట్టించక, ఇది పద్ధతి కాదు. వాళ్లకీ ఇళ్ల వద్ద భార్యాబిడ్డలు వున్నారు. వాళ్లని వీళ్లూ, వీళ్లని వాళ్లూ, ఎప్పుడు కలుసుకుందామా అని వుంటుంది. నీ మాట వింటే ఇంక వాళ్లగతి ఇంతే! నీ పరిచర్య చేసుకుంటూ భృత్యులై అడవుల వెంట తిరుగుతూనే జీవితం వెళ్లమార్చవలసి వుంటుంది. అక్కడితో ఆగవు వాళ్లకష్టాలు, ఈ సంగతి అవతల కిష్కింధలో తెలియనంత వరకూ ఫర్వాలేదు. తెలియక పోతే వూరుకోరు. తెలుసుకుంటారు ఈ స్వయంప్రభ గుహ మిమ్మల్ని రక్షిస్తుందనుకోకు. అవతల సౌమిత్రికి కోపం వస్తే అతని చాపం ముందు ఏవీ ఆగవు. ఏవీ దాగవు. ఇక్కడ జరిగిన రాజకీయ వ్యవహారం తెలిస్తే ఏమవుతుందో ఆలోచించు. ఎవ్వరికి తెలియదు గదా అని అనుకుంటున్న ఈ గుహ గురించి, ఈ రాజకీయం గురించి నాకు తెలుసు గదా! నా ద్వారా వాళ్లకి తెలిసిందే అనుకో! అప్పుడు ఏం జరుగుతుంతో అని ముందే ఆలోచించి నిర్ణయం తీసుకో. అంగదా! ఒక్కమాట చెబుతాను విను. మీ పినతండ్రి గురించి నా కంటె తెలిసినవాడు

ఇంకొకడు వుండడు. అతను పుణ్యవంతుడు, ధర్మకాముడు. దృఢవ్రతుడు, సత్యవచస్కుడు. నిన్ను కోరి యువరాజును చేసి చేతులారా చంపుకునే దుర్బుద్ధి ఎన్నడూ వుండదు. అన్న వాలిని చంపించిన తరువాత ఎంత బాధ పడ్డాడో నీకు తెలియదు. ఆ బాధను తగ్గించుకునేందుకే నీ తల్లిని దగ్గరకు తీసుకొని, భూమ్మీద మీరిద్దరూ అనాధలు కాదని, నువ్వు ఋక్షరజసుని వంశోద్ధారకుడవవాలని, కులదీపకుడవవాలని, నీ మీద పితృవాత్సల్యంతో ఉన్నాడు. కాని నువ్వు అది తెలుసుకోలేక ఇలా గుండెల్లో మాత్సర్యాన్ని నింపుకుంటున్నావు. ఇంకో సంగతి విను. అతనికి ఇంతవరకు కొడుకుల్లేరు. చిన్నప్పటి నుండి గారాబంగా నిన్ను ఎత్తుకుని మోశాడు. నీలో కొడుకుని చూసుకుంటున్నాడు. ఏ దిక్కున ఆ రాక్షసుడు సీతను దాచాడో ఆ దిక్కుకే నీ నాయకత్వంలో మమ్మల్నందరినీ నీ వెంట పంపాడు. ఏం ? పెద్దవాడు సమర్థుడు బుద్ధిశాలి అయిన జాంబవంతుడు వుండగా నిన్నే ఎందుకు నాయకుణ్ణి చెయ్యాలి చెప్పు ? కాబట్టి వేరే ఆలోచనలు పెట్టుకోక, నీ పిన తండ్రి మనస్సును అర్థం చేసుకోడానికి ప్రయత్నించు. వెదకడంలో నాలుగు రోజులు అటూ ఇటూ అయినా ఫరవాలేదు. కార్యం సాధించటం ముఖ్యం. సాధించిన తరువాత ఇవి లెక్కలోకి రావు." అనంగానే కపివీరులందరూ తిరిగి పోయారు. అంగదుడు ఆంజనేయుని మాటలు విన్నాడు. భయాందోళనలు కలిగినా యువరాజు పదవిని చూసుకుని ఆంజనేయునితో—

## అంగదుని అలక

"నువ్వు లక్ష చెప్పు, వెయ్యి చెప్పు, నువ్వు చెప్పే గొప్పతనం ఆ సుగ్రీవుని యందు నాకేం కనబడవు. ఓ శక్తి లేదు, శౌచమూ లేదు, సత్యవ్రతమూ లేదు. నువ్వైతే అవసరం వున్నవాడివి కాబట్టి అతణ్ణి

పొగడచ్చు, నాకు మాత్రం అతని ప్రవర్తన మొదటి నుండీ తప్పుదారిని పట్టినట్లుగానే అనిపిస్తుంది. గుహ లోపల నా తండ్రి వుండగా గుహ ద్వారానికి బండరాయి అడ్డం పెడతాడా ? ఈ తప్పుడు పని ఏదో సమర్థిస్తూ మీరు అతణ్ణి సద్గుణ సంపన్నుడని విశ్వసిస్తారు. ఇంక నేనేం చెప్పగలను ? తన భార్య రుమను నా తండ్రి గ్రైకొనడం తప్పట! మరి ఇప్పుడు తాను మా తల్లి తారను గ్రైకొనడం తప్పుకాదు ! ఏం చెప్తాం ఇంక ? రణరంగానికీ, క్రీడా రంగానికీ తేడా తెలియని మా తండ్రి బలపరాక్రమాల గురించి గానీ, ధర్మాభిరతిని గురించిగానీ లోకంలో ఎవరికి తెలీదుగనుక ? మరి ఈయనగారి సంగతీ అందరికీ తెలుసు. ఆ శ్రీరాముని చేత చేయించుకో వాల్సిన సహాయం అంతా చేయించుకుని, స్త్రీలోలుడై, కృతజ్ఞతాశూన్యుడై ఆ శ్రీరాముణ్ణే మరచిపోయి, నడమంత్రపు సిరితో కొట్టుమిట్టాడిన సంగతి ఒక్కటి జాలు మచ్చుకి ! ప్రళయకాల రుద్రునిలా ఉగ్రుడైన లక్ష్మణుడు చేసిన ధనుష్టంకారానికి కాళ్లు వణికి, కంగారు పుట్టి, నెత్తికెక్కిన కళ్లుదిగి మత్తువదిలి. అప్రమత్తుడై నలుదిక్కులకు కపిసేనను పంపిస్తే దానికేదో అతణ్ణి కీర్తిస్తారు. ఏం చెప్పను ఇంక ? నామీద ఆయనకు మమకారం వుంది, నే కాదనను. కాని నా తండ్రిని అడ్డు తొలగించుకోవాలనే కోరికా వుంది. ఈ రెండూ ఆయనకు సమానమే ! అయినా రాజ్యకాంక్ష ఎక్కువ అవడంతో అడ్డుతొలగించుకోడానికే ప్రాధాన్యం ఎక్కువ చూపుతాడు. అదీ అతని మనస్తత్త్వం. అప్పుడు నా తండ్రి అయినా, ఇప్పుడు నేనయినా ఈ విషయంలో ఒకటే. ఏదో దోషం చూపి అవకాశాన్ని సృష్టించుకోగలడు. కైకకు రాముడెంతో, సుగ్రీవునికి నేనూ అంతే. ఆవిడగారూ రాముణ్ణి అడవులకు పంపింది. ఈయనగారు నన్ను యమపురికే పంపుతాడు. అంతే తేడా ! అయితే అలా జగక్కుండా నేను కిష్కంధకు వెళ్లను. ప్రాయోపవేశం చేసి ప్రాణాలు ఇక్కడే విడుస్తాను."

"కరుణాపయోనిధి, ఆశ్రిత రక్షకుడు. కమనీయదేహుడు అయిన ఆ రఘురాముని కివే నా హృదయాంజలులు. ఇంకొక జన్మలోనైనా ఆయన కరుణకు పాత్రుడనౌతానని చెప్పి నా నమస్కృతులు తెల్పండి."

"విశుద్ధప్రవర్తన. విస్పష్టబుద్ధి కలిగిన లక్ష్మణస్వామిని చూస్తున్నప్పుడల్లా నాకు ఇటువంటి వారు ఉంటారా అనే ఆశ్చర్యం కలుగుతూ ఉండేది. అంటువంటి శౌర్యశీల సంపన్నునికి నా వినతులని చెప్పండి."

"పరమపావన మనోహర రాఘవానుగ్రహ సంపన్నుడు తత్ప్రాభవోద్ధురతర ధర్మశీలుడు, సూర్యసూనుడు, వానరేశ్వరుడు అయిన మా పినతండ్రి సుగ్రీవునకు నా ప్రణామములు. నా వల్ల జరిగిన దోషాలేమైనా వుంటే క్షమించమని వేడుకొన్నానని చెప్పండి."

"తల్లి అంటే ఎప్పుడూ తల్లే! ద్వేషము, నింద, మోహము, వ్యామోహాది మనోవికారాలు అంటని మూర్తి. నన్ను కన్నతల్లి అయిన తారయొక్క చరణ కమలాలకు నా సాష్టాంగ దండప్రణామాలని చెప్పండి. ఎల్లా చెబుతారో మరి! ఆవిడ హృదయం బ్రద్దలవకుండా, నా మీద దయతో ఆవిడకు సమయం చూచి మెల్లగా ఈ విషయం చెప్పండి."

"ఇంకా నా నమస్కారాలు అందుకోవలసిన మా తల్లి రుమ వుంది. ఆవిడ నిజంగా అమాయకురాలు. పిచ్చితల్లి. ఏమీ తెలియదు. నేను పెద్దరాజు అయ్యానన్నా, అవకుండానే పోయానన్నా గూడా ఆమె అనుభూతిలో మార్పు పెద్దగా వుండదు. అన్నింటికీ అతీతురాలేమో! మరి ఆ తల్లికీ నా కైమోడ్పులు తెల్పండి."

అని, అందరికీ తుది వీడ్కోలు చెప్పి దర్భాస్తరణము చేసి, అంగదుడు ప్రాయోపవేశం చేశాడు. అప్పుడు మిగిలిన కపి వీరులందరూ, మేమూ

సీతోడి వారమే" అని కుశాస్తరణము లేర్పరచి కూర్చొనగానే ఆంజనేయుడు తనలో తనే ఇలా అనుకున్నాడు.

## హనుమంతుని స్పందన

"పిల్లవాడు ఒక తప్పు చేసినందుకు తల్లి కోప్పడితే ఆ తప్పు ఒప్పుకోక పోవటం అటుంచి "నాకు అన్నమే అక్కర్లేదు" అని అలిగినట్లుంది ఈ అంగదుని వరుస చూస్తుంటే ! తనకు గలిగిన ఆలోచనకు అడ్డువచ్చినందుకు మనస్సులో ఆగ్రహము కలిగి. అభిమానం అడ్డువచ్చి . నన్ను సాధించడానికి కాకపోతే ఇలా ప్రాయోపవేశం చేస్తానని అలగడం. పట్టు పట్టడం ఎందుకు ? అయినా ఇదెంత సేపు వుంటుందో చూద్దాం ! నిజానికి ఈ సంగతి ఆ తల్లికి తెలిస్తే తననే కోపిస్తుంది. ఇప్పుడు చాలా జాగ్రత్తగా నటించాలి. అందటి ముందు యువరాజైన తనని నిష్ఠూరంగా మాట్లాడానని ఈసు. రోషము కలిగి వుంటాయి తన ఠీవికి తక్కువైందనిపించి వుంటుంది."

"చిన్నప్పుడు పినతండ్రియందు ఏ విధంగా గారాబాలు చూపేవాడో నాయందు గూడా అంతే! ఇప్పుడు నేను కాస్త బిగిసి, తను చేసిన తప్పు సర్ది, చీవాట్లు పెట్టాను గాబట్టి ఇలా మారు మాట్లాడకుండా అలిగి కూర్చున్నాడు. తనేకనక అలా చెయ్యకుండా" నీతి విరుద్ధంగా తప్పును సమర్ధిస్తే అన్యాయంగా బాలుణ్ణి త్రోవ తప్పిన వాణ్ణి చేసినవాణ్ణవు తాను. ఇల్లాంటి సమయంలో, నేనేదన్నా అంటే అలిగిన కోపంతో మరింత బిఱ్ఱ బిగుస్తాడు. నేనిప్పుడు లేని కోపాన్ని నటిస్తే తానే పలకరిస్తాడు. ఏది ఏమైనా పిల్లవాడు, కుఱ్ఱదనం. మనోధైర్యం మటుకు ఎంత సేపు ఉంటుంది ?"

"ఇదొక రకమైక తిక్కతనం. ఇంతకు మునుపెప్పుడూ తండ్రంతవాణ్ణి ఇలా అన్నది లేదు. ఇన్ని రోజులబట్టి ఇలాంటి భావాలు ఈ చిన్నారి హృదయంలో ఎక్కడ దాగివున్నాయో? ధర్మమో, అధర్మమో అన్యాయంగా తండ్రి గతించి పోయాడనే బాధ ఎప్పుడో ఒకప్పుడు ఏదో రూపంగా వ్యక్తమవక మానదేమో ?"

"తండ్రు లిద్దరి మధ్య వుండిన వైరం ఇవాళ దాకా గూడా పిల్లవాని మనస్సులో ఇంకా దాగి వుంటుందనుకోలేదు పిల్లవాడు పెద్దవాడయాడు. తెలివి పెరిగింది. వ్యంగ్య వైభవంతో మాట్లాడడం గూడా నేర్చాడు."

హనుమంతుడు ఇంకా తనలో తాను అనుకుంటూ చిరునవ్వు నవ్వు కొంటూనే కూర్చుండి వుండడం చూసి తక్కిన కపివీరు లందరూ అంగదుని చుట్టూ కూర్చుని పరి పరి విధాలుగా మాట్లాడసాగారు.

## కపి వీరుల కవ్వింపు మాటలు

"ఒక ప్రక్క గుహలో అన్నగారిని అసురులు ముట్టడిస్తే బయటవున్న తనకా మాత్రం పట్టదా ? చేతకాదా ? శౌర్యం లేదా ? శౌర్యం వున్నా లేకపోయినా అలాంటి సమయంలో రక్తబంధం లేని వాడైనా చూస్తూ వూరుకోడే ! మరి ఈయనగారు చూస్తూ వూరుకోవడం అలావుంచు, గుహ ద్వారానికే పెద్దరాతిని అడ్డం పెట్టి చక్కావచ్చాడంటే ఏమనుకోవాలి ?"

"అగ్నిలో అజ్యం పోసినట్లు ఆనాడు అన్నగారు మండిపడ్డాడంటే మండడూ ? అందులోను తిరుగులేని భుజపరాక్రమ సంపన్నుడైన

వాణ్ణిలా వదిలేసి ద్వార దిగ్బంధం చేసి వస్తాడా ? పూజ్యుడైన అన్నగారి సిరిని, సింహాసనాన్ని అనుభవిద్దామనే దురూహ లేకపోతే అన్నగార్ని అలా అసురుల పాలుజేసి సరాసరి గద్దె ఎక్కి రాజు ననిపించుకుంటాడా ?"

"ఆయన ఎక్కడ! ఈయన ఎక్కడ? బాహుబల పరాక్రమ సంపన్నుడాయన. ఏది ఏమైతేనేం, ఎవరెట్లా పోతేనేం, తనకుదక్కాల్సిన గద్దెదక్కింది అని కక్కుర్తి పడినవాడు ఈయన."

"తనకు మించిన శత్రువును గెలవటం కోసం ధర్మాధర్మాల గూర్చి విచారించకుండా ప్రవర్తించేవాడు గూడా శూరుడే అవుతున్నాడు. అతడేం చేస్తే అదే రాజ్యాంగ మౌతోంది. దాన్నే సమర్థిస్తున్నారు చుట్టూ చేరినవారు గూడా! అంతేగాని నిజమైనశూరుడెవ్వడు? ఎందుకు అతనికి కీడు జరిగింది? అని పట్టించుకోకపోవటం మహాత్ముడైన వాలి విషయంలోగూడా జరిగింది."

"రాజుకు సహజంగా రాజ లక్షణాలుండాలి, భుజబల పరాక్రమ సంపన్నుడై చూడంగానే రాజనిపించే ఠీవి, దర్పం సహజ సంపదగా వుండాలి. ఏదో ఒక సందర్భ విశేషంచేత మాత్రమే మణిలాగా మెరసిపోయే గాజు ముక్క రత్నమౌతుందా? శ్రీరామ సాన్నిధ్యం దూరమైతే తానూ, తన సహజస్థితి బయటపడిపోకుండా వుంటుందా? చూద్దాం!

"అన్నగారి ధాటికి ఆనాడు హడలిపోయి ఈ తమ్ముడుగారు ఋష్యమూకానికి మహావడిగా పరుగెత్తాడు. ఆ తర్వాత గూడా సమయానికి రామబాణం రాకపోయేసరికి అంతవడిగాను పరుగెత్తుకు పోయాడు. ఏ విషయాని కావిషయమే చెప్పుకోవాలి. మన రాజుగారు ప్రాకడంలోను, పరుగెత్తుకు పారిపోగలగడం లోను పెద్ద నేర్పరి ! జంటల విషయం చెప్పాలంటే స్వర్గ

నరకాలనే చెప్పాలి. లేదా ఈ అన్నదమ్ములనే చెప్పాలి ! ఇంత పొందిగ్గా సరిపోయిన జంట మూడవది వుండదేమో !''

ఈ విధంగా అందరూ యువరాజైన అంగదుని చుట్టూజేరి, వాలి సుగ్రీవుల బలపరాక్రమ సామర్థ్య వైవిద్యాలను ఏ విధంగా చెప్పితే అతనికి సంతోషం కలుగుతుందనుకున్నారో ఆ విధంగా చెబుతూ ఆడిపోసుకున్నారు. ఆ మాటలకు అంగదునిలో పెద్ద మార్పులేదు గాని ఆంజనేయుని అంతర్యం ఏమిటో, ఏమి ఆలోచిస్తున్నాడోనని ఆంజనేయుని వంకే చూస్తూ—

"నాయనా అంగదా ! నువ్వింకా చిన్నవాడివి. అల్లా మాట్లాడడం న్యాయం కాదు అంటూ, రా ! రా ! అని అప్యాయంగా చెయ్యి చాపి పిలిస్తే నేను దగ్గఱకు రాకుండా వుంటానా ? ఏదో ముఖం తెలియని పరాయి రాజుగా నన్ను చూచి పలకరిస్తున్నాడీయన. అటు తల్లీ దూరమై, ఇటు ఈయనా దూరమై మంత్రులుగా వుండవలసిన వాళ్లే లేనప్పుడు నాకు రాజ్యం దేనికి ? పినతండ్రిది దోషంకాదన్నా, తండ్రిది కాఠిన్యమన్నా ఎందుకో ఈ మనస్సు అంతగా అంగీకరించదు. దోషం వున్నపుడు పరాయివాళ్ళైతే పెద్దగా పట్టించుకోకపోవచ్చు గాని స్వయానా తమ్ముడే అయితే సవరించవలసినంత మేరకన్నా కర్కశత్వం, కాఠిన్యం వహిస్తే తప్పుకాదు గదా ! నేనిలా ఊహిస్తూ వుండిపోతే ఎలా ?"

''ఆ మోహన రూపుడైన రామచంద్రుని మనోహరాధర శుభాననాన్ని చూడడం గూడా నోచుకోను. ఆయనకు తెలీదా నా మనస్సు ? ఈయన గూడా బహుశః అదే ధైర్యంతో వున్నట్లున్నాడు. ఆ ముఖం బిగించుకుని కూర్చున్నతీరే చెబుతోంది ఇక మాట్లాడడు అని. నేనూ మాట్లాడను '' అని మనస్సులోనే అనుకొని అంగదుడు నోరు మెదపకుండా ఊరుకున్నాడు.

ఆంజనేయాంగదుల ఆంతర్యం మిగిలిన కపివీరు లెవ్వరూ అర్థం చేసుకోలేకపోయారు.

## విచిత్ర విహంగం

పశ్చిమ దిక్కున సాయం సంధ్యా తామ్రవర్ణ కాంతులు వెలువడు తున్నాయి. అప్పటి ఆ సాయం సంధ్య ప్రొద్దుట కట్టిన చీర నలిగి మాసి నందున, పగలనే స్త్రీ చెంగావి రంగుచీర కట్టిందా అన్నట్లుంది. ఎదురు రాబోయే రాత్రి అనే మదగజానికి ముఖం మీద ముద్దసిందూరం మెత్తినట్లుంది. ఆకాశమనే పెద్ద వృక్షము యొక్క పశ్చిమ దిక్కనే పెద్ద కొమ్మకు పూచిన చివురాకుల గుత్తిలాగా వుంది. సంజ అనే పిల్లవాడు దిష్టి తగిలి ఏడుస్తుంటే ఎఱ్ఱనీళ్ల తీసి పోసినట్లుంది. రాను రాను తామ్రవర్ణ కాంతులు చిక్కబడి, దట్టమైచీకట్లు క్రమ్ముకుంటున్నాయి కనురెప్పలు ఎన్నిసారులు మూసి తెరిచి ప్రయత్నిస్తున్నా కపివీరులకు చూడడం సాధ్య పడటం లేదు. ఒకచోటచేరి ప్రాయోపవిష్టులైన వానరవీరుల దేహాలకు సంధ్యతామ్ర వర్ణం పులుముకుని వుంది.

అక్కడి వింధ్యాచల గహ్వరంలో మేరు పర్వతంతో సమానమైన దృఢత్వం, పటుత్వం, విశాలత్వం ఉన్న తత్వం గలిగిన; అతిసూక్ష్మ దృక్శక్తి గలిగిన, చాలా వృద్ధుడు, ఛిన్నమైన రెక్కలతో వున్న ఒక మహా ఖగేంద్రుడు వసిస్తున్నాడు ఆ ఖగపతి పై నుండి క్రిందకు చూచినప్పుడు దర్భల మీద ప్రాయోపవిష్టులై వున్న కపివీరుల దేహాలు మాంసఖండాలుగా కనబడ్డాయి. ఒక్కసారి ముఖం పైకెత్తి క్రిందకు దించి చూచాడు. "ఆహా! ఎంతటి మహావకాశం. నిజంగా ఆ దైవాన్ని నమ్ముకున్నందుకు రెక్కలు తెగి ఎగరలేకుండా ఎంతో ఆకలితో వున్న నాకు ఎంత చక్కటి ఆహారాన్ని

ఏర్పాటు చేశాడు! ఈ వృద్ధునికి ఇన్ని రోజుల నుండి చాలీ చాలని తిండితో, తీరీ తీరని అకలితో అలమటించిపోయిన నాకు ఈ కోతుల మూకను మృష్టాన్న భోజనంగా ఏర్పాటు చేశాడా దేవుడు" అంటూ ఆనందపడుతున్న ఖగరాజు మాటలను విన్న వానరులు నిలువునా నీరైపోయారు. ఖగరాజు ఆకార పరిమాణాలను చూసి అదిరిపోయారు. రాక్షసులకు శిరోజాల మాదిరిగా పక్షులకు రెక్కలు, నిశితమైన దృష్టి వుండడం సహజం. రెక్కలు లేని పక్షి, అందులోను పర్వతాకార పరిమాణాలు చూడంగానే భయకంపితులై పోయారు.

"కిష్కింధకు పోతే చావు తప్పదని ఈ పర్వతం మీద ప్రాయోపవేశం చేస్తే–ఎదురుగా ఈ పక్షులకు వెగటును, వికారాన్ని కలిగించే ఈ పక్షి కనబడటం ఏమిటి ? దీన్నిబట్టి చూస్తే స్వర్గానికి వెళ్లినా దుర్ఘటమైన మృత్యువే తప్పదని మన ముఖాల మీద వ్రాసి వున్నట్లుంది" అని అనుకొంటున్నారు. వినడానికి ఉపక్రమించబోయే ఖగరాజును చూసి, హనుమంతునితో అంగదుడు—

## అంగదుని అంతరంగం

"చూడవయ్యా చూడు, ఎదురుగా కాలుడు వచ్చి కూర్చున్నాడు. కైక రాముణ్ణి అడవికి పంపడమనే విత్తనం తాలూకు వృక్షానికి ఈ రోజు కపి ప్రళయం ఫలంగా వచ్చింది. అక్కడకు వెళ్తే ఏదో ఘోరమైన చావు చావాల్సి వస్తుందని ఈ పర్వతం మీదెక్కి కూర్చుంటే అంతకంటె నికృష్టపు చావు ఎదురుగావచ్చి రమ్మనమని చేతులు చాస్తోంది. శ్రీరామ కార్యంలో నరవానర రాక్షస జంతు పక్షి సంధానం ఎంత విచిత్రంగా ఉందో ఇప్పుడు

తెలుస్తోంది. రామకార్య ధ్యేయాన్ని మరచిపోతే అన్నీ దుఃఖానుభవాలే మిగులుతాయి ఉత్తములైనవారి జీవితాల్లోగూడా ధర్మ సూక్ష్మాలు వాళ్ళని విచికిత్సలో పెట్టిగాని విశిష్టానుభూతులను కలిగింపజేయవు ప్రాణాలు ఎలాగూ పోతాయి. ఆ పోయేది రఘురాముని సన్నిధిలో అయితే కొంతలో కొంత మేలు. నా తండ్రికి ఆ అదృష్టం దక్కింది. ఆయన కొడుకునై పుట్టిగూడా ఆ అదృష్టానికి దూర మౌతున్నాను. ఈ విషయంలో జటాయువుకన్న నేనేమీ మిన్న కాదు. రామకార్య నిర్వహణలో ఆ జటాయువు ఆ రావణుణ్ణి కాలు ముందుకు కదపనివ్వకుండా రెక్కలు ముక్కలయే వరకు కడదాకా పోరాడి కొనప్రాణంతో మిగిలాడు. ఆ జటాయువు లాగానైనా రామకార్యంలో నా ప్రయత్నంగా నేను కడదాకా నిలబడి పోరాడతాను. సుగ్రీవుని భయము ఆ జటాయువుకు ఆ రోజు లేదు. నాకు ఈ రోజు ఉంది అంతే తేడా! ఈ భయంతో చచ్చే నాకు ఎలాంటి లోకాలు ప్రాప్తిస్తాయో మరి నే నూహించ లేను" అన్నాడు.

అంగదుని మాటలు విన్న హనుమంతుడులోలోపలే సంతోషించాడు. "తార అంగదుణ్ణి నీతిమంతునిగానే చేసింది. రామచంద్రునికి ఇతడు కేవలం బంటేకాదు. రాజ కార్యనిర్వహణలో నిపుణుడైన రాయబారి గూడా అవుతాడు." అని హనుమ అనుకొంటూండంగా— అవతలవున్న పక్షిరాజు కపివీరులను ఒక్కసారి చూసి—

## పక్షిరాజు పలుకులు

"అవును, మీ మాటల్లో మా తమ్ముడైన జటాయువు ప్రస్తావన వచ్చింది. అసలు మీరెరు ? మా తమ్ముడైన జటాయువు మీకు మిత్రుడా ? రావణుడంటారేమిటి ? మా చంటి వాడైన జటాయువు ఏం

సాహసం చేశాడు ? ఆ రావణుడేమి చేశాడు ? అన్నీ చెప్పి నాక్కాస్త మనస్సు కుదుటపడ నివ్వండి. పరాక్రమ సంపన్నుడైన రాము డెవరను కుంటున్నారు ? దేవతలకు మిత్రుడైన మా దశరథుని బిడ్డ. మా తమ్ముడూ ఆ దశరథుటూ ఇద్దరూ కూడా మిత్రులే. ఆ ఇద్దరి మధ్య సంబంధం కంటే అనుబంధమే ఎక్కువ. మా జటాయువు ఏంచేశాడు ? జటాయువు కేం జరిగింది ? చెప్పండి, ఏన్నాళ్ల కెన్నాళ్లకు మళ్ళీ నా తమ్ముని మాట ఈ గుహలో పడివున్న నాకు వినిపించింది ! నాకు ప్రాణంలేచి వచ్చి నట్లుంది. ముందు నన్ను ఈ గుహ దగ్గఱ నుండి క్రిందకు దించండి. నాకు మీరు చెప్పేది స్పష్టంగా వినబడాలి."

"శౌర్యంలో సముద్రం లాంటివాడు, ఉత్తమగుణ సంపన్నుడు అయిన మా చంటి తమ్ముణ్ణి నా ఱెక్కల మీద పెట్టుకొని ఊయల లూపేవాణ్ణి. అల్లాంటి మా పసి నాయనను ఆ రాక్షసాధముడు కసాయివాడిలా కనికరం లేకుండా చంపుతాడా ? అయ్యో ! ఆ రక్కసుణ్ణి ముక్కలు ముక్కలుగా చీల్చి చెండాడదామంటే ఱెక్కలు లేవే ! ఏదీ మీరు కాస్త దగ్గరకు రండి. ఱెక్కలు లేవు గదా. నేను మీ దగ్గఱకు రాలేను. ఆ దైత్యుడు ఆ పసి వానితో యుద్ధమేమిటి ? నాతో చేస్తే సరిపోయేది; దుంగను చెక్కినట్లు అవ యవాలన్నీ చెక్కి మొండాన్ని మిగిల్చేవాణ్ణి. దాదాపు పాతికేండ్లై ఉంటుంది. జనస్థానంలో తమ్ముణ్ణి చూసి. ఏమైంది వాడికి ? మీరు ముందా సంగతి చెప్పితే గాని నాకు మనస్సు కుదుట పడదు. అయ్యయ్యో, చూశారా ! మీరు ఆత్మబంధువు లవుతారనే విషయం తెలియక నేను మిమ్ములనందరినీ నా ఆకలికి ఆహుతి చేద్దామనుకున్నాను. నన్ను చూసి ఒక పెద్ద దయ్యం అనుకుని నా దగ్గరకు రావడానికి భయపడకండి. మనమంతా ఆత్మ బంధువులం, ముందు మా వాడి సంగతి చెప్పండి" అన్నాడు.

# అంగదుని సంశయం

పక్షిరాజు మాటలు విన్న అంగదుడు "అదృష్టం బాగుండి తను తలచిన, తలపెట్టిన కార్యం శుభ ఫలానికి దారి తీస్తోంది, అనుకొని సంతోషిస్తూ, ఇదంతా నిజమేనా ? లేదా – 'ఒకవేళ ఈ వృద్ధపక్షి ఏదైనా మోసం చేస్తోందా' ? అన్న అనుమానం గూడా కలిగి ఆలోచిస్తున్నాడు. మిగిలిన కపివీరులు గూడా అలాగే అనుమానపడ్డారు. మనలను భక్షించడానికి నిశ్చయించు కున్న ఈ పక్షి తన కుక్షిని నింపకుండా వూరుకుంటుందా ? ఎదురుగా విస్తరిలో పడిన తర్వాత గూడా వైరాగ్యం వస్తుందా ? ఇంక అనవసరం ఆలోచించడం. మనలను ఈపక్షి భక్షించటం ఖాయం. కుటుంబ కలహం వచ్చి ఏదో అంతంత మాత్రంగా నైనా రూపు మాస్తోందను కుంటూంటే మళ్లీ ఇదొక సంకటమా ? ఇంక మారుతి వెంట నడవడం మంచిది. నిజంగా ఆ పక్షి మోసబుద్ధితో వుంటే ఒక్క ముష్టి ఘాతంతో ముక్కలు ముక్కలు చేస్తాను. మారుతి వెనక నుండి దాని గొంతు పిసికి పీడ వదిలిస్తాడు. లేదా దాని వ్యవహారం సవ్యంగానే వుంటే రఘురాముని కార్యం చక్కబెట్టవచ్చు" "అని అంగదుడు పర్వతమ్మీద నుండి దిగి, అతి జాగ్రత్తగా పక్షిరాజును సమీపించి—

"అయ్యా, మీరెవ్వరూ ?" అన్నాడు. అందుకు పక్షి "నేను సంపాతిని, జటాయువు నా తమ్ముడు, నాయనా మీరందరూ ఎవరు ? నాకు మా తమ్ముణ్ణి గురించి సవిస్తరంగా వినాలని వుంది చెప్పండి" అన్నాడు అప్పుడు—

# పూర్వ వృత్తాంతం

"కపి సామ్రాజ్యానికి ప్రభువు, వీర్యవంతుడు అయిన ఋక్షరజసునికి వాలి, సుగ్రీవుడు అని ఇద్దరు కుమారులు. ఋక్షరజసుని తర్వాత అతి బలవంతుడైన వాలి రాజుగా వుండేవాడు. వాలి సుగ్రీవులకు పడకపోతే సుగ్రీవుడు రాముని సహాయంతో వాలిని చంపించాడు. ఆ సుగ్రీవుని ఆజ్ఞ మేరకు మేమందరమూ ఇక్కడకు వచ్చాము ఆ సుగ్రీవుని గుణ గణాలు రామునికి నచ్చడంతో ఇద్దరూ స్నేహితులైనారు. ఆ రాముడు సాక్షాత్తు మహేశ్వరుని తేజస్సుతో సమానమైన తేజస్సు కలవాడు. సుగ్రీవుని ఆజ్ఞ మేరకు రాముని భార్య, భూమిసుత అయిన సీతను వెతకడానికి వచ్చాము. ఈ సమస్త పృథివి ఆ రాఘవుల అధీనంలోకి వస్తుంది. రాముడు అరువది వేలమంది రాక్షుల వీరులను ముహూర్తకాలంలో హతమార్చాడు. హతులైన వాళ్లలోపినతల్లిబిడ్డలైన ఖరదూషణలు గూడా ఉండడంతో రావణునికి కోపం వచ్చి కసితో భూమిజను దొంగతనంగా ఎత్తుకుపోయాడు."

"రాముని తండ్రి దశరథుడు కైకకు ఇచ్చిన వరం ప్రకారం రాముడు అరణ్యాలకు రావలసి వచ్చింది. భరతుడు రాజ్యాన్ని చూస్తున్నాడు. రాముణ్ణి అనుసరించి లక్ష్మణుడు, సీతా అడవులకు వచ్చారు. ఆ సీతను రావణుడు ఎత్తుకుపోయాడు. ఆ సీతాన్వేషణకు నాలుగుదిక్కులకూ సుగ్రీవుడు కపివీరులను పంపాడు."

రావణుడు సీతను ఎత్తుకు పోతున్నపుడు కోడలులాంటి సీతకు వచ్చిన ఆపదను చూడలేక తన రెక్కల బలంతో జటాయువు పైకెగిరి రావణుణ్ణి ముప్పతిప్పలు పెట్టాడు.

"రావణుడు ఆ ధాటికి తట్టుకోలేక పోయాడు. ఆ సంగ్రామం ఎవ్వరూ చూచి ఉండరు. రాక్షసుని రథం ముక్క చెక్కలైంది. కవచం ఊడింది. హారకేయూర కిరీట కంకణాదులు విడిపోయి ముక్కలయ్యాయి. రాక్షసుడు ఓర్వలేక కరవాలంతో రెక్కలను ముక్కలుచేసి, డొక్కలో గ్రుచ్చి వెళ్లిపో యాడు. దీనస్థితిలో ఉన్న ఆ మహానుభావునకు శ్రీరామచంద్రుడు స్వంత తండ్రికి గూడా చెయ్యని అపరకర్మలు చేశాడు. నా తండ్రి వాలికి గూడా ఆ పుణ్యం దక్కలేదు. స్వంత తండ్రికే దక్కలేదు. మీ తమ్ముని జన్మ ఎంత మేలైనదో! ముక్తిని పొందిన మీ తమ్ముడు ఎంత ధన్యుడో !" [అందుకేనేమో రాముని బంధువు (రామబంధు–రాంబంధు–రాబందు) నిగా జటాయు జాతి స్థిరపడి పోయింది !]

"సుగ్రీవాజ్ఞగా సీతాన్వేషణకై మిగిలిన కపివీరులు మిగిలిన దిక్కులకు వెళ్లగా మేము ఈ దక్షిణ దిక్కుగా వచ్చాము. తాతా! మేము ఈ ప్రాంతంలో వెదకని చోటులేదు. మొత్తం అంతా గాలించాము. అయినా ఫలితం లేదు. సుగ్రీవుడు నెల రోజులే గడువు పెట్టాడు. నిన్ను చేరే లోపలే ఆ గడువు కాస్తా పూర్తయి పోయింది. చివరలో ఒక గుహలో ఒక మాసం అనుకోకుండా ఉండిపోవలసి వచ్చింది. ఇప్పుడు నెలగడువు పూర్తయి పోయింది. సీత జాడ తెలియకుండా కిష్కింధకు వెళ్తే సుగ్రీవుడు ఉగ్రుడవుతాడు. మండిపడతాడు, ఆ మంటల్లో పడడం కంటే ఇక్కడే చావడం మేలు, అనుకుంటున్నాము. మరి ఏం చేస్తాం అంతకంటే, 'ఆ క్ష్మకన్యను ఆ రాక్షసు డెక్కడ దాచాడో - ఏమో ! ఏమీ తోచక ఏం చెయ్యాలా?' అని ఆలోచించు కుంటున్న సమయంలో ఆప్త మిత్రునిలా నీవు కనబడ్డావు. ముందు నుయ్యి వెనక గొయ్యి అన్నట్లు కిష్కింధకు వెళ్తే చావు తప్పదని భయపడుతుంటే ముందుగా నీ భీకర ఆకారం కనబడింది.

'ఏం ఆపద వచ్చిపడిందిరా భగవంతుడా' అని మా ఇక్కట్లు మాలో మేము జటాయువు పోయిన దగ్గర నుండి వరుసగా చెప్పుకుంటూ వుంటే—'

"అవునవును, అప్పుడే నేను మీ మాటలు విని మిమ్మల్ని పలుకరించాను" అని సంపాతి "నాయనా నీ పేరేమి ?" అన్నాడు. అందుకు అంగదుడు "అంగదుడు" అన్నాడు. అప్పుడు సంపాతి దుఃఖ సంపాతియై అంగదా ! అని పిలిచి—

## సంపాతి జటాయువుల కథ

అది వృత్రాసురుడు, ఇంద్రుడు యుద్ధం చేస్తున్న సమయం. అప్పుడు మనువు గూడా ఇప్పటివాడు కాదు. ఇంతకు పూర్వం వాడు. అప్పటివాళ్లం నేనూ, మా తమ్ముడు. ఇద్దరం ఒకళ్ల కొకళ్లు ఉత్సాహంతో ఎవరు ఎంత ఎత్తుకు ఎగురుతారో చూద్దాం అని పోటీలు పడి పైకెగురుతున్నాం. స్వర్గలోకం గూడా దాటాము. ఆకాశానికి డొక్కలో గ్రుచ్చుకునేట్లుగా అమితమైన వేగంతో దూసుకుపోతున్నాం. నడిమింట నిప్పులు చెరుగుతున్న మధ్యందిన మార్తాండుడు గూడా మాకు గుర్తుకురాలేదు. అంతే, అంతలోనే తమ్ముడు మార్తాండుని మహోగ్ర కిరణపుంజ తేజోపీడితుడై సీల వూడిన విమానం లాగా పడుతుంటే, వెంటనే సూర్యుని మహోగ్రకిరణాలుపడకుండా నా రెండు రెక్కలు బాగా చాచి తమ్ముడికి గొడుగులాగా పట్టాను కొంచెం సేపటికి నాకేం జరిగిందో నాకే తెలియలేదు. తమ్ముడు ఎక్కడ పడ్డాడో తెలియదు. నా రెండు రెక్కలు రవిప్రతాపకిరణ ప్రకోపానికి మాడి బొగ్గై ఊడిపోయినట్లు క్రిందపడ్డ తర్వాత తెలిసింది. నేను ఈ ప్రాంతంలో

పడిపోయాను తమ్ము డెన్నాళ్ళకో వెతుక్కుంటూ వచ్చాడు. నా దీనస్థితికి విపరీతంగా దుఃఖించాడు. "అన్నా నా కోసం నువ్విలా అయిపోయావు. నేనింకా బ్రతికే వున్నాను" అంటూ వాపోయాడు. ఈ వృత్తాంతం ఎప్పటిదో! మీరు మా వాడిని గురించి చెప్పుకుంటున్నప్పుడు నాకు మా తమ్ముడు కళ్లల్లో మెదిలాడు. ఆనందం కలిగి మిమ్మల్ని అడిగాను. నాకు మా తమ్ముడి మీద అంత మమకారం. భూమిజను రాక్షసుడు తీసుకుపోతూ వుంటే చూచి అడ్డుపడకుండా వుంటాడా మావాడు. నా సంగతి చూడండి. ఒక్క జానెడు దూరం పైకి ఎగరలేను. ఆ రాక్షసుడు చేసిన తుచ్ఛమైన పనికి వాణ్ణి ఏమైనా చేసి వుండేవాణ్ణి. కాని ఇప్పటి నా పరిస్థితి వల్ల ఆ బాధనంతా గుండెల్లోనే పెట్టుకుని విలవిలలాడవలసి వస్తోంది" అంటూ తుడుచుకోవడానికి గూడా వీలుకాని స్థితిలో కన్నీరు కారుస్తుంటే వానరేశ్వరులు వచ్చి, సంపాతిని చుట్టుముట్టి, కన్నీళ్లు తుడిచారు. జటాయు గుణకీర్తన చేశారు. తమ్ముడి మీద అంతటి మమకారం గల సంపాతిని వేనోళ్ల కొనియాడారు. యుగాంతర జీవులైన అన్నదమ్ములిద్దరిని స్తుతించగానే సంపాతి తేరుకున్నాడు. సంపాతి, జటాయువుల అన్నాదమ్ముల ప్రేమవృత్తాంతం విన్న అంగదునికి తన తండ్రీ పినతండ్రుల వ్యవహారం గుర్తుకు వచ్చింది. తమ్ముడైన సుగ్రీవుణ్ణి అన్నగారైన వాలి ముష్టిఘాతాలతో ముప్పతిప్పలు పెట్టిన సన్నివేశం కళ్లల్లో మెదిలి సుగ్రీవుని పట్ల అభిమానం పెరిగింది. అంగదుడు సంపాతితో—

"ఆ రాక్షసుణ్ణి నువ్వు నీ ముక్కుతోను, గోళ్లతోనూ చీరి చెండాడలేదన్న కోర్కె, కోపము తీరలేదని బాధ పడక్కరలేదు. మేము నీ కోరిక తీరుస్తాము. వాడెటు వెళ్లాడో తెలియాలి, ఎక్కడున్నాడో తెలియాలి అంతే!" అన్నాడు. అప్పుడు సంపాతి గద్గదకంఠంతో—

# సంపాతి ప్రతిస్పందన

"కనీసం మాట సాయమన్నా చేసి ఆ రాక్షస కులం సమూలంగా ధ్వంసమయే రోజు చూస్తాను నేను. ఏమనుకున్నాడో ఆ రాక్షసుడు ? ఎంతో సుదూర తీరాలలోనున్న లోకాలను విస్పష్టంగా చూసినవాణ్ణి ఆ విష్ణు చరణాలను కళ్లారా చూశాను. అమృత మథనం చూశాను. ఇందిరాదేవితో ఆ విష్ణుమూర్తి కళ్యాణం చూశాను. కృతయుగం నాటి దేవదానవ యుద్ధాన్ని చూశాను. అంతటి వయసున్న ఈ ముసలివానికి ఈ రోజు ఈ రాక్షసుడు ఇంతటి అన్యాయం చేస్తాడా ! చూస్తాను వాడెలా బాగుపడతాడో ! మీకు నేను చేయగలిగిన సహాయం చేసి వాడి అంతు చూస్తాను. నా వంటి వానికి కన్నీళ్లు తెప్పిస్తాడా ? ఇదే మొదలు వాడి పతనానికి. గుర్తుకు వస్తోంది. ఆనాడు ఆకాశమార్గంలో ఈ రక్కసుడు పోవడం చూశాను. ప్రక్కనే శరచ్చంద్రికలా వెలుగుతూ, దీనంగా విలపిస్తూ, వంటిమీద నగలు తీసి భూమి మీదకు విదల్చిన పుణ్య పవిత్రమూర్తిని చూశాను. నోటితో నిర్విరామంగా "రామ" అన్న మాట వినబడింది. అప్పుడప్పుడు "లక్ష్మణా" అన్న పిలుపు గూడా వినబడింది. ఆమె తప్పకుండా సీతమ్మే అయి ఉంటుంది. తొందరపడకండి, ఆ రాక్షసుడి ఉనికి చెబుతాను. ప్రాయోపవేశాలు మానండి. నిజంగా నాకు రెండు రెక్కలూ ఉన్నట్లైతే మిమ్మల్ని నా రెక్కల మీద కూర్చోపెట్టుకుని, ఈ సముద్రాన్ని దాటి, సరాసరి ఆ రాక్షసుడి ప్రాణాల మీద వ్రాలేవాడిని. కాని నాకు రెక్కలు లేవు. ఇక్కడకు సూటిగా ఎగిరివెళ్తే సముద్రం వస్తుంది. అది వంద యోజనాల విస్తీర్ణం ఉంటుంది. ఆ వంద యోజనాలు దాటి వెళ్తే లంక వస్తుంది. అదే ఆ రాక్షసుడి నివాసం. ఆ లంకా పట్టణం ఇంకా అవతల ఎంతవాకా ఉన్నదో చెప్పలేనంత పెద్దది. ఏది ఏమైనా మీ పని తేలిక అయింది. మీకు మహా అయితే ఒక్కరోజు పని

అంతే! మీరు ఒక్కొక్కళ్లు సామాన్యులుగారు. బాహు బలం గలవారు లంఘనా చతురులు, గాబట్టి మీకు లంకను చేరటం ఏమంత కష్టం గాదు.

"ఈ దుష్టరాక్షసుడు సత్త్వగుణ సంపన్నుడైన కుబేరుని తమ్ముడే. విశ్రవసునికి కొడుకవుతాడు. వాడి దశకంఠాలకు రాముని బాణాలు చుట్టు ముట్టి, నెత్తురు లత్తుకనుమెత్తి, కంఠాభరణాలు లాగా భాసిస్తున్నట్లు నాకిప్పుడే కనబడుతున్నాయి. రత్నాలు పొదిగిన పాలరాతి కట్టడాలు, బంగారు ద్వారబంధాలతో వాకిళ్లు, తోరణాలు, పచ్చిక బయళ్లు, వివిధ ఫల వృక్ష జాతులు, జలాశయాలు, ఉద్యానవనాలు, కైలాసాన్ని మరపించే శివాలయాలు మొదలైన వాటితో అతి రమ్యంగా ఆ రావణుని గర్వానికి తగిన హుందాగా ఉండే ఆ లంకా పట్టణానికి కాబోయే ముప్పు గూడా నాకు కళ్లల్లో కనబడుతోంది. ధర్మానికీ, న్యాయానికీ దెబ్బతగిలితే దాని ఫలితం వూరికే పోతుందా ?"

వంటి మీద ఏ ఆభరణము లేకుండా బోసిగా ఉన్న వళ్లు, కన్నీరు నిండి ప్రవహిస్తున్న కళ్లు, చుట్టూ జేరిన వికృత రాక్షసాంగనల వికటాట్ట హాసాలు, వికృత-చేష్టలను – వినలేక, చూడలేక చెరువులోనుండి ఒడ్డునకు విసరబడిన చేప పిల్లలా అతి దీనావస్థలో వున్న సీత కూడా కనబడుతోంది."

"లాభం లేదు. మీరు అక్కడకు వెళ్లాలి. అక్కడ వికృతరూపులైన రాక్షసులుంటారు. వాళ్లని చూడండి. దీనంగా కనబడుతుంది సీతమ్మ. ఆమెను చూసి ఇక్కడకు వచ్చి, శ్రీరాముని దర్శించి, వివరంగా విషయాలన్నీ చెప్పండి. మీకు ఏ విధంగానూ అడ్డంకులుండవు. వెళ్లండి" అన్నాడు

సంపాతి మాటలు విన్న వానరులందరూ—

"తాతా! సీత అక్కడ వుంటుందని నీకెలా తెలుసు? లా
చెప్పగలవు?" అనంగానే సంపాతి—

## సంపాతి కులగోత్రాలు

"మా జాతి గురించి మీకు పూర్తిగా తెలియదు నాయనలారా! బలిభుక్కులు, క్రౌంచ కుదరములు, శ్యేనములు, గృధ్రములు హంసములు' చివరికి విష్ణువాహనమైన వైనతేయుడు పుట్టిన వంశము. జాతి మాది. ఇంతటి పరమపవిత్రమైన కులపథం మాకున్నది. ఆ గరుత్మంతుని సంతానమైన మేము ఇక్కడ వుండే మిథిలలో జరిగిన సీతారామ కళ్యాణం గూడా చూశాము. సహజంగానే నిశితమైన దృక్శక్తిగల మేము - మేము తీసుకునే నియమితమైన ఆహారం వల్ల నూరు ఆమడలు దూరం కన్న ఎక్కువ దూరం గూడా స్పష్టంగా చూడగల శక్తిని పరమేశ్వరానుగ్రహం వల్ల పొంద గలిగాము. వాడియైన, వంపుదీరిన, పటుత్వం గల గోళ్లు వుండటం వలన మమ్మల్ని మాంసఖాదులముగా బ్రహ్మ మా ముఖాల మీద వ్రాశాడు గాని-వాస్తవానికి మా జాతి పవిత్రత చేత, మా నియమజీవన విధానంచేత మాతో తులతూగేవారు లేరు. 'నా సోదరుని శత్రువు, రామునికి అపకారం చేసిన వాడు అయిన ఆ దైత్యుని రాముడు తప్పకుండా సంహరిస్తాడు' అని నేను విన్నది తెలిసినది మీకు చెబుతున్నాను. కాబట్టి మీరు ఈ సముద్ర లంఘనం చేసి లంకను ప్రవేశించే ప్రయత్నంలో వుండండి. మరి దయచేసి. నన్ను కాస్త అలా సముద్ర తీరానికి తీసుకుని పోతారా తమ్మునికి కనీసం నివాపవారినైనా వదులుతాను!" అన్నాడు.

సంపాతి అలా అనంగానే పూర్వం దేవదానవు లందరూ కలిసి క్షీర సముద్ర మథనానికి మందరపర్వతాన్ని తెచ్చినట్లు వానరు లందరూ కలిసి

సంపాతిని మోసి, సముద్ర తీరానికి చేర్చి, స్నానాదులైన తరువాతతిరిగి గిరి గహ్వరంవద్ద ఉంచారు. అలవాటు చొప్పున వంటి మీద ఉన్న నీటిని రెక్కలతో విదలించుకొనబోయి తీరా రెక్కలు లేవన్న సంగతి గుర్తుకు వచ్చిన సంపాతి అల్లాగే సూర్యకిరణాల కెదురుగా ఉండి, ఎండలో వంటిని ఎండబెట్టుకుంటున్న తరుణంలో వానరులందరూ అతని చుట్టూ చేరారు.

"ఏమిటీ! ఆ జటాయువు నీకు తమ్ముడా? ఇంద్రునికి భయపడి చాటుగా పయనమై పోయే మైనాకు డనుకున్నాను. మీ సోదర ప్రేమ ఎంత నిర్మలమైంది. రాముని కార్యానికి ప్రాణత్యాగం చేసిన నీ తమ్మునికి ప్రేమతో తర్పణాలు వదిలిన నీ జన్మ ధన్యము. చింత, శోకము ఈ రెంటి వల్ల కలుగు అశుచిత్వము నీవు చేసిన తర్పణ క్రియతో క్షాళనమై తమ్ముడు సుఖంగా ఉత్తమ లోకాలకు వెళ్లాడు. సరేగాని నువ్వు ఇంతకు పూర్వం 'నేను విన్నాను, మీరు లంకకు వెళ్లండి ముందు' అని ఏదో చెప్పావు చూడు దాని సంగతి కాస్త మాకు విశదంగా చెప్పరాదుటయ్యా వైనతేయ కులవుంగవా! ఎవరో చూచా రన్నావు. అ చూచినదెవరో, విన్న దేమిటో సవిస్తరంగా చెప్పి పుణ్యం కట్టుకోవయ్యా" అన్నాడు జాంబవంతుడు— ఇక్కడ నుండి 198 వ పేజీ చివరి వరను ప్రక్షిప్తము· అయిననూ అందరూ వ్రాయుచునే ఉన్నారు.

## సంపాతి పూర్వగాథ

జాంబవంతుడు కుతూహలంతో అడిగిన దానికి సమాధానంగా సంపాతి—

మా జటాయువు అంత పనిచేసి రెక్కలు పోగొట్టుకున్నా తెలియని నేను నిజంగా కళ్లు లేనివాణ్ణే! అసలు సంగతి అంతా చెప్తాను వినండి :

"సూర్యుని పటుతరమైన కిరణజ్వాలలకు మ్రగ్గి, రెక్కలు మాడి, వింధ్య గిరి గుహవద్ద పడ్డానని చెప్పాగదా! అప్పటి నుండి నా కొడుకు సుపార్శ్వుడు నా ఆకలి దప్పులను ఏ వేళ కావేళ కనిపెట్టుకుంటూ నన్ను కాపాడుకుంటు న్నాడు. ముసలితనంతో వివేకం పెరగటం మాట అటుంచి, ముందు విసుగు పెరుగుతుంది, విసుగుతో కోపం ! భోజనానికి కాస్త ఆలస్యమైతే ప్రాణాలు పోతాయన్నట్లే అనిపిస్తుంది. ఆ అల్పమైన వాటికూడా అధికంగా కోపం వస్తుంది. పోషిస్తున్న వారిపైనే ఆ విసుగునంతా వెళ్ళగ్రక్కుతూ విరుచుకు పడతాం. ఒక రోజున విపరీతమైన ఆకలితో ముఖం వ్రేలాడి ప్రాణాలు పోతాయా అన్నట్లుంది. సుపార్శ్వుడు ఎంతసేపటికీ రాలేదు. ప్రాణాలు కడగడుతుండగా అప్పుడు వచ్చాడు. నాకు వళ్ళు మండి పోయింది. నోరు తెరచి నానా తిట్లు తిట్టి చివాట్లుపెట్టాను. 'నేను చావాలని కోరుకుం టున్నావ్, అట్లాగే చస్తానులే! నీకు నా పీడ వదులుతుంది. ఇంకా ఎంతో కాలం బ్రతకను. కాస్త ఓపిక పట్టు. తొందరపడకు' అంటూండగా వాడు—

"అయ్యా నేచెప్పేది విను. నేను ఆలస్యంగా రావడానికి కారణం ఉంది. నీకు ఆహారం తెద్దామని మహేంద్రగిరి ద్వారం దగ్గఱకు వెళ్లాను. గుహ లోపల ఏవో శబ్దాలు వినబడ్డాయి. అవి సెలయేళ్ల ప్రవాహధ్వనులు, కానని నీటిని త్రాగుదామని నోరు తెరిచి గుహ దగ్గఱగా వెళ్లాను. గుహకు అడ్డుగా నిలబడ్డాను. అక్కడ ఒకడు కనబడ్డాడు. అడవిలోని మట్టి, గాలి ధూళి తగిలిన భల్లూక చర్మం ఎలా ఉంటుందో అలాంటి చర్మంతో బొద్దుగా వృత్రాసురునిలా కాటుక రాశిలాగా ఉన్నాడు వాడు. సూర్యోదయ ప్రభలతో వెలుగొందే ఒకామె గూడా వాడి ప్రక్కనే ఉంది. వాడు నన్ను—

"ఇది త్రోవేనా చెప్పు, త్రోవైతే దారివ్వు" అన్నాడు. వాడిన పూల మాలలాగా ఉండి, కన్నులు క్రిందకు వాల్చి, ముఖం మీద ముంగురులతో ఉన్న ఆ స్త్రీ వాని చేతుల మధ్య నుండి తప్పించుకోవాలని ప్రయత్నిస్తూ నాకు కనబడింది. నన్ను అడిగిన ప్రశ్నకు వాడి స్థితిని చూచిన నాకు తెలియకుండానే కోపం వచ్చింది. చిరాకు కలిగింది. అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఇష్టం లేనట్టుగానే అవునని చెప్పి పంపాను. అటుపైన అక్కడ ఖేచరులైన కొందరు సిద్ధులను 'ఇప్పుడలా దక్షిణ మార్గంగా పోయిన వాళ్లెవ'రని అడిగాను. అందుకు వాళ్ళు ముందు నాకు క్షేమం పలికి —

"నాయనా నీ అదృష్టం బావుండి వాడడిగిన దానికి విసుక్కోకుండా, కోపం తెచ్చు కోకుండా సమాధానం చెప్పావు. లేకపోతే వాడి ఆగ్రహానికి గురి అయేవాడివి. అసలు సంగతి విను. వాడు దశరథ పుత్రుడైన రాముని భార్యను దొంగిలించుకుని, రాక్షస నిలయమైన లంకకు కొనిపోతు న్నాడు" అన్నాడు నేను ఆలస్యంగా రావడానికి కారణం ఇది అయినా నీ కాహారంగా పుక్కిలి నిండా చేపలు పట్టితెచ్చాను. అయిన ఆలస్యానికి నన్ను మన్నించయ్యా" అని వాపోయాడు సుపార్శ్వుడు ఏం చెయ్య మంటారు చెప్పండి. వయస్సు ఉడిగిపోయింది. ఒక చోటు నుండి ఇంకో చోటుకు కదలలేను. ఆకలి బాధ తట్టుకోలేక కోపం విసుగు పెరిగాయి

సుపార్శ్వుడు చెప్పింది విన్నారుగా ! ఇంక మీరు అధైర్యపడక్కర్లేదు. మీరు సామాన్యులు గారు. బాహుబల సంపన్నులు. నయన తేజో విరాజమానులు. కంఠీరవగళ సమన్వితులు. మీ ముందు ఆ రాక్షసరాజు ఒక లెక్కా ? దిక్కులు పిక్కటిల్లే ధనుష్టంకారానికి దద్దరిల్లి, దాసోహ మనాల్సిందే ! ఇంత నిశ్చయంగా చెప్పడానికి కారణం వుంది, చెప్తా వినండి.

# సంపాతి చెప్పిన పూర్వగాథ

"నేను, తమ్ముడు జటాయువు పోటీలుపడి, పై పైకి ఎగిరి సూర్యుని దరిదాపులకు వెళ్ల ప్రయత్నించామని చెప్పాను గదా! అక్కడ సూర్యుని కిరణాగ్ని జ్వాలలకు మాడిపోయి, వళ్లు తెలియక, దిమ్మతిరిగి ఒక కొండ శిఖరం మీద పడ్డాను. స్మృతి లేకపోయినా నాలో వున్న ఏదో శక్తి నన్ను కొండను గట్టిగా పట్టుకొనేట్టు చేసి ఉన్నదేమో నా కిప్పటికీ తెలియదు. క్రిందపడి నిలిచినా వళ్ళంతా అగ్నిగోళంలా వుంది. సప్త సముద్రాలు, సప్త కుల పర్వతాలు అష్ట దిక్కులు అన్నీ ఒక్కసారి నా మనస్సులో మెదిలాయి. కొన ప్రాణంతో వున్నాను. ఆ స్థితిలో నున్న నన్ను ఆశగా నక్కలు, కొన్ని పక్షులు గూడా చూశాయి. ఇదేదో పరిచితమైన ప్రాంతమే ననిపించి చివరకు గుర్తు పట్టాను, అది వింధ్యగిరి అని. దాంతో ఏదో తెలియని ధైర్యం కలిగింది. కొద్దిగా ఓపిక వచ్చింది. కర్తవ్యమేమిటో బోధపడలేదు. ఇంతలో అది మార్గశీర్షమాన కాలమని గుర్తుకు వచ్చింది. నిత్యమూ నేను, జటాయువు దర్శించుకునే నిశాకరుడనే మౌనిరాజు గుర్తుకు వచ్చాడు. అయన అనుగ్రహం వల్ల ఏమైన మార్పు వస్తుందన్న ఆశగలిగింది. దాదాపు ఎనభై వేల ఏళ్ల నుండి అయనని నే నెఱుగుదును. మనస్సులోకి ముని గుర్తుకు రాగానే వెంటనే డొల్లుకుంటూ త్రోవలో రాళ్లు, రప్పలూ, కత్తి మొనల్లాంటి గడ్డిమొక్కలు వంటిపై గ్రుచ్చుకొంటున్నా లెక్క చెయ్యకుండా మౌని వుండే చోటుకు వెళ్లాను."

"ముని ఆశ్రమ ప్రాంతానికి చేరుకోంగానే శ్రమ దూరమైనట్లనిపించింది. మలయమారుత వీచికలు పుష్పసుగంధాలతో కలిసి మేనంతా తాకాయి ఎప్పుడూ ఆ ప్రాంతమంతా అలాగే వుంటుంది. పువ్వులేని రెమ్మ గాని, మగ్గినపండు కాని, కొమ్మకాని ఆశ్రమంలో లేవు. రాశీభూత

కారుణ్యంలా ముని ఎదుట సాక్షాత్కరించాడు. పాపాలను పటాపంచలు చేసే కరుణార్ద్రమూర్తి కృత్తివాసునివలె గోచరించాడు. వివిధ పక్షి, జంతు సరీసృప మృగరాట్సంతానములు మునిచుట్టూ వున్నా అత్యంత ప్రేమతో నావైపు చూశాడు. ఒక్కసారి లోపలకు వెళ్లి బయటకు వచ్చాడు. ఆయన చరణార విందాలకు నా ముక్కుతోనే ముందుగా మ్రొక్కాను. నన్నుచూసీ చూడడంతోనే—

"ఇదేమిటి ? ఇలా అయిపోయావు ? నీ రెక్కలు లేవే ? ఏమైనాయి ? అసలు నువ్వొక్కడవే వచ్చావేమిటి ? నువ్వూ నీ తమ్ముడు కలిసి వచ్చి నా కాళ్లమీద నతశిరస్కులయే వారు గదా ! అసలేం జరిగింది నాకంతా వివరంగా చెప్పు. అవును నీ తమ్ముడు పేరు జటాయువు, నీ పేరు సంపాతి కదూ ! వాయు వేగ మనోవేగాలతో ఎగర గలిగేవారు గదా ! ఏమైందిప్పుడు? మీ ఇద్దరూ వచ్చి దాదాపు వారంపైనే అయింది. ఈ పర్వత ప్రాంతాన్ని విడిచి ఆహారం కోసం దూరంగా వెళ్లిపోయారా ? లేకపోతే ఏదైనా వ్యాధి సోకిందా ? లేకపోతే ఎవరన్నా శపించారా ? అలా కాకపోతే తమ్ముడు తోడు రాకుండా. రెక్కలు లేని నీవు ఒక్కడివే వచ్చావంటే కారణం ఏదో ఉండాలిగా. చెప్పు అసలు సంగతి" అని హృదయము నిండా కరుణతో, కళ్ల నిండా ప్రేమతో అడిగాడు.

మునివర్యుడలా ప్రేమ ఒలికించగానే నాకు నోట మాట రాలేదు. కళ్లవెంట ధారగా కన్నీళ్లు కారాయి. 'ఇక్కడ దాకా వచ్చి అసలు సంగతి చెప్పకుండా ఎలా వుంటాం' అనుకుని కాస్త తేరుకుని – ముని కళ్లల్లో కళ్లు పెట్టి—

నేను, తమ్ముడు జటాయువు పోటీ పడి ఎవరు గొప్పో తెల్సుకునేందుకు సూర్యుని సాక్షిగా ఆకాశమార్గం పట్టాము. ఇద్దరం ఒక్క ఉదుటున వింధ్యాద్రి శిఖరానికి ఎగిరాము. ఆపైన "నీకంటే నేను ముందు" "నీ కంటే నేను ముందు కావలిస్తే చూసుకో" అనే స్పర్థ వాక్కులతో కొండలపైన, కోనలపైన పైపైకి ఎక్కడెక్కడికి వెళ్తున్నామో గూడా చూసుకోకుండా సూర్యుని సమీపించాలనే దీక్షతో పోతున్నాం. క్రింద భూమంతా చిన్న ఉండలా కనిపించింది పెద్ద పెద్ద నదులు దానిమీద చారల్లా కనబడ్డాయి. క్రింద భూమి ఎంత ఉందో అంతగా పైన రవి కనబడ్డాడు. ఒక్కసారి గుండె దడ పుట్టింది. ఇంక పోటీ ఆపి క్రిందకు వెళ్దామన్నా పైకి ఎంత దూరమో క్రిందకు అంతే దూరము అనిపించింది. ప్రక్కన జటాయు వున్నాడులే అన్న ఒక్క ధైర్యం తప్ప ఏ విధంగా చూచినా భయం. ఉల్లంలోనే రెక్కలాడించడం. అటు చూసేటప్పటికి జటాయువు ఉలుకు పలుకు లేదు. రెక్కలు వచ్చుపడి జారిపడి పోతున్నాడు. పటుతరమైన సూర్యకిరణ తీవ్రతకు వాని రెక్కలు చిటమట లాడుతున్నాయి. ఒక్కసారి తమ్ముని పరిస్థితి చూచి తట్టుకోలేక పోయాను. నా రెక్కలు కాలిపోతాయనైనా చూడకుండా తమ్ముని రెక్కలు కాలకుండా రక్షించుకోవాలనే ఊహ కలిగింది. అతడు ఎన్ని వంపులతో క్రిందకు పడుతున్నాడో అన్ని వంపుల లోను అతన్ని రెక్కలతో గొడుగులాపట్టి నేనూ క్రిందకు పడిపోతున్నాను. ఇంతలో నేను సూర్యకిరణ తీవ్రతకు పూర్తిగా లోనైనాను. ఈ వింధ్య గిరిపై పడ్డాను.

జటాయువు ప్రక్కన లేడు ఇంకో చోట పడ్డాడు. తీరాచూస్తే ఆ పడ్డది జనస్థానం అని తెలిసింది. అదే చివరి తెలివి. ఆ తర్వాత నాకు తెలివి పోయింది. ఏం జరిగిందో గుర్తు లేదు. వియద్గమనమూ లేదు.

తమ్ముడూ లేడు, చూసుకుంటే రెక్కలుగూడా లేవు. మీ దర్శనమైంది, శెలవిప్పించండి. ఏదో ఒక రోజు ఈ తనువును చాలిస్తాను. మీరు మరి శెలవివ్వండి" అన్నాను. ఆ మునిరాజు నా మాటలు విన్నాడు. మునిగదా మౌనంగానే అన్నీ గ్రహించాడు. "ఇంతకీ నన్ను శెలవివ్వ మంటావ్! నువ్వు నోరెత్తి అడగవు. ఇంతవరకు చెప్పినవాడివి రెక్కలు కావాలని అడగడానికి మొగమాట పడతావేం? నీకు రెక్కలు తెప్పించగలను, కాని ఇప్పుడు కాదు. నీవల్ల జరగవలసిన ఏ పనికైతే దేవుడు నిన్ను ఈ రీతిగా చేశాడో ముందు ఆ పని నీవలన నిర్వహింపబడాలి. అంతవరకు నీవు నిరీక్షించాల్సిందే మరి!

## నిశాకరముని వాక్కు

"ఏ సూర్యుడు నీ రెక్కలనిలా కాల్చి వేశాడో ఆ సూర్యవంశీయులు, అయోధ్యాధి పతులు, దిగంత యశశ్చంద్రికా ప్రబంధులు, శౌర్య బాహుబల పరాక్రమ సంపన్నులు అయిన వారి సంతతికి చెందిన నేటి భూపతి అయిన దశరథుడు పుత్ర సంతానం కోసం పుత్రకామేష్ఠి చేయగా నలుగురు కుమారులు పుట్టారు. వారిలో పెద్దవాడైన శ్రీరాముడు పినతల్లి మాట నను సరించి రాజ్యం వదిలి అరణ్యవాసం చెయ్యాల్సి వచ్చింది. భార్య సీత, తమ్ముడు లక్ష్మణుడు శ్రీరాముని అనుసరించి అడవికి వచ్చారు. మొగ వాళ్లిద్దరూ ప్రక్కనలేని సమయం చూసి ఆ దక్షిణ సముద్రంలో కనబడే లంకకు అధిపతియైన రావణుడు సీతను దొంగిలించుకొనిపోయి లంకలోనే భద్రంగా ఉంచాడు. రోజూ నవరసోపేతమైన మృష్టాన్న భోజనాదుల్ని ఎదురుగా పెట్టి తినమని బలవంత పెట్టినప్పటికీ చిక్కి శల్యమై కృశించి, నశించి పోవడానికైనా సిద్ధమైందేగాని తానుతినడానికి ఇష్టపడ లేదు. అమృత

తుల్యమైన భోజనాన్ని దేవతలు సీత ముందుంచితే దానిలో మొదటి ముద్ద తీసి– 'ఇది రామలక్ష్మణులకు చెందాలి' అని సమర్పించేది. అక్కడ అడవులలో ఉన్న రామలక్ష్మణులకు అవి చెంది వాళ్ళ ఆకలి దప్పులకు దూరమయేవారు. సీతను అన్వేషిస్తూ రామునిచే పంపబడిన వానరయూథ నాథులు ఇటుగా వస్తారు. అప్పుడు నువ్వు నేను చెప్పిన ఈ విషయాలు వారికి చెప్పడం కోసం ఈ కొండమీదే నిరీక్షిస్తూ ఉండు." అని నన్ను ఆ నిశాకర ముని పుంగవుడు ఆజ్ఞాపించాడు. అప్పటి నుండి ఇప్పటివరకు రెక్కలు లేకుండానే సహనంతో నిరీక్షిస్తున్నాను. అటు దేవతలకు, మునులకు, బ్రాహ్మణులకు అందరికీ వాంఛనీయమైన ఈ కార్యంలో పాల్గొన్న క్షణంలోనే నాకు మళ్లీ నా రెండు రెక్కలూ వస్తాయని గూడా ముని చెప్పాడు అక్కడ దేవదానవ సంగ్రామం చూడడం జరిగింది. మరి ఇప్పుడు ఇక్కడ రామరావణ మహా సంగ్రామం చూస్తావు. నేనుండడానికే వీలులేదు అదీ కాక నేను చూడాలనుకోవడం కూడా లేదులే ! అని గూడా ముని చెప్పాడు. అప్పటి నుండి దింపుకోలేని ఈ కార్యభారాన్ని పుక్కిటపట్టి వందఏళ్లు అయిన తరువాత ఇప్పటికి మిమ్ము చూడగలిగాను మీరు ఆ మునిని చూడలేదు గాని – సరిగా ఆ ముని చెప్పినట్లే అక్షరాలా జరిగింది. ముని తన ఆశ్రమంలోకి వెళ్లిపోయిన తరువాత నేను ఇంతటి మహాకాయంతో నేల మీద ముక్కుతో అదిమిపట్టి, డొల్లుకుంటూ ఈ కొండ యెక్కి మరింకెక్కడకీ కదలి వెళ్ళకుండా నిరీక్షించాను. ఈ నిరీక్షణలోనే నిట్టూర్పులు, నిరాశలు కలిగాయి. అసలు మీరు వస్తారో రారో అనే శంక కలిగింది. ముని గూడా ఈ లోపలే ఒకరోజు స్వర్గస్థుడైనాడు. వనంలోని జంతువులన్నీ వారం రోజులు అన్నం, నీళ్లు సరిగా ముట్టలేదు. ఆ మునికి బలులు అర్పించాము.

ఈ నెలరోజుల్లో నా పరిస్థితి మరీ అధ్వాన్నమైంది. ఆహారం తిని బ్రతడంకంటె అగ్ని తిని మరణించడం మేలనిపించింది. అసలు ఆ దశరథుడింతకీ యాగం తలపెట్టాడో లేదో అన్న శంకగూడా కలిగింది. పది లేదా తొమ్మిది నెలల పూర్వం మా సుపార్శ్వుడు చెప్పకపోతే నాకు నమ్మకం కలిగేదికాదు వాడు చెప్పంగానే – "ఒక పూట అన్నం లేకపోతే నేను చచ్చిపోతానా ఎమిటి ? అంతటి వార్త విన్న తర్వాత అ రావణుని వెంబడించి వాడి గుండె నెత్తురు చూడకుండా, ఇలా నా కోసం వచ్చి నాకు అప్రతిష్ఠ తెచ్చావు. నా గర్భాన చెడబుట్టావు. మన వైనతేయ వంశమే నీ మూలాన అపనింద పాలైంది" అంటూ సుపార్శ్వుణ్ణి ఒక లక్ష తిట్లు తిట్టాను. ప్రాణమిత్రుడైన దశరథుని ముద్దుబిడ్డకి వచ్చిన దుస్థితికి నేనేమీ చెయ్యలేక పోయానని ఎంత గుండెలు తల్లడిల్లాయో చెప్పలేను. తమ్ముడైన జటాయువు మహోన్నతంగా పోరాడి ప్రాణత్యాగం చేశాడు. నేను మాత్రం గూడు లేకపోయినా, రెక్కలు లేకపోయినా ఎవ్వరికీ ఏ విధంగానూ ఉపయోగపడక నికృష్టపు బ్రతుకు బ్రతుకుతున్నాను. కేవలం ఆమునీశ్వరుని ఆజ్ఞ పాటించడం కోసం, కపివీరుల రాకకోసం నెలల తరబడి ఇలా సహనంతో నిరీక్షిస్తున్నానే తప్ప బ్రతుకుమీద, రెక్కలమీద ఆశతోకాదు. మొట్ట మొదటిసారిగా ప్రాయోపవిష్టులైన మిమ్మల్ని చూచి వట్టి కోతిమూక అని ఒక పట్టు పడదామనుకొన్నాను ఇంత కథ వుంటే అలా ఎందుకు జరుగుతుంది ?" అన్నాడు

సంపాతి మాటలకు వానరవీరుల ఉత్సాహం వందరెట్లుగా, వెయ్యి రెట్లుగా పెరిగింది. సంపాతికి వున్న గాంభీర్యము, ఆ గాంభీర్యానికి తగిన పౌరుషము, ఆ పౌరుషానికి తగిన విజ్ఞానం, ఆ విజ్ఞానానికి తగిన మృదుల హృదయము చూచిన వానరవీరులకు మన్వంతర జీవులంటే ఎలా వుంటారో

అర్థమైంది. 'ఋషి వాక్కు ప్రకారం రామకార్యసిద్ధిలో తమ వంతు పాత్ర గూడా వుందన్నమాట' అని వాళ్లు సంతోషిస్తున్నారు.

ఒక సంవత్సర కాలం ఒక నిమిషములోకి కుంచించుకుని పోయినట్లు, ఒక వృక్ష వృత్తాంతమంతా ఒక విత్తనంలోకి ఒక్కసారిగా సంక్షిప్తం చెందినట్లుగా తనకు రెక్కలు రావడంతో గడచిన కాలమంతా ఒక్క మెఱుపు మెరిసినంత కాలంలో జరిగిపోయి నట్లనిపించి సంపాతి ఎంతగానో మురిసిపోయాడు. ఎదురు గుండా తనని చూస్తున్న వానరవీరులను చూస్తూ—

"చూశారా ! నా ప్రాణాలకు మిత్రుడైన ఆ నిశాకర మునిపుంగవుడు చెప్పినట్లు నా రెక్కలు నాకొచ్చేశాయి. మీరు వచ్చారు. నా రెక్కలు నా కొచ్చేశాయి. అంతా ఆ ముని చలవ. ఇప్పుడు నాకు పది పర్వతాలను ఒక్క సారి మ్రింగగల ఉత్సాహం కలిగింది. పూర్వం శక్తి నాకు పూర్తిగా వచ్చేసింది. చూశారా ? ఆ ముని మాట లెంత ఆశ్చర్యంగా వున్నాయో ! ఇంక ఆలస్యం చేయకండి. మీరంతా నా రెక్కల పైకి ఎక్కండి. మిమ్మ ల్నందరినీ ఆ లంకాపట్టణం చేరుస్తాను" అనంగానే అంగదుడు సంపాతికి నమస్కరించి—

"తాతా ! నువ్వు మేరుపర్వతమంత బలశాలివే కాదనను. కాని, మేము అసంఖ్యాకంగా వున్నాము. నీ రెక్కలమీద మా కందరకు స్థలం చాలదు. అదీగాక మేము ఒక్కొక్కళ్లము పర్వతతుల్యులము. సముద్ర లంఘనం చేయగలవారము· ఆ రావణుణ్ణి పది తలల జుట్లు ఉట్టికట్టి తేగలం అన్నాడు. అందుకు సంపాతి "ముని చెప్పినట్లు, కోరినట్లు చేశాను. సరే ! ఇంక మీ ఇష్టం. నేను ప్రస్రవణగిరి మీదుగా మా శ్రీరామచంద్రుని చూచి పోతాను" అని ఎగిరి వెళ్లిపోయాడు.

# వానరుల ఉత్సాహం

సంపాతి చెప్పిన పూర్వగాథా విశేషాలు విన్న వానర యోధులందరూ ఉత్సాహం పెచ్చు పెరిగి రెచ్చిపోయారు. మాటి మాటికీ కనురెప్ప లారుస్తూ, పళ్లికిలిస్తూ, చెట్లకు వీపు రాచుకుంటూ, కొమ్మల మీద నుంచి క్రిందకు దూకుతూ, తలక్రిందుగా వ్రేలాడుతూ, క్రిందనుంచి పైకెగురుతూ; హీహీ అంటూ ఒకళ్ళ ముఖాల్లోకి ఒకళ్లు పెట్టి కవ్విస్తూ, అరుస్తూ, చెట్ల మీద కాయలను, పళ్ళను సగం సగం కొరికి పారేస్తూ, ఆకులు త్రుంచుతూ, కొమ్మలు విరుస్తూ, పెడబొబ్బలు పెడుతూ, జబ్బలు చరుస్తూ, అవ్వలిస్తూ, బుజ్జాలు గోక్కుంటూ, ఒకళ్ల తలమీద పేలు ఒకళ్లు కుక్కుకుంటూ, నానా గందరగోళంగా యథేచ్ఛగా స్వైర విహార విన్యాసాలు చేసారు. చివరకు దక్షిణ దిక్కున ఉన్న సముద్రం చేరారు

సముద్రం మహా భయంకరంగా ఉంది, ఉరిమే మేఘాల్లాగా సముద్ర కెరటాలు ఘోషిస్తున్నాయి. అంబరాన్ని చుంబిస్తాయా అన్నంతగా అలలు పైపైకి ఎగసి అందుకో లేక నిట్టూరుస్తూ తిరిగి నేలను తాకు తున్నాయి. ఒడ్డున ఉన్న వారికి పాదాభి వందనం చేస్తూందా అని ముచ్చటపడేంతలోనే పాదాలక్రింద మట్టినికాస్తా అలలు లాక్కుని వెళ్లిపోతున్నాయి. పూర్వం దేవతలు, దానవులు కలిసి తనను మథించారన్నది సముద్రుడికి గుర్తు ఉన్నది. అందుకే ఇంకా తనను ఎవరూదరి జేరనీయకుండా తగిన జాగ్రత్త కోసం అలల విజృంభణతో భయపెడుతున్నాడా అన్నట్లుంది - సముద్రం చూస్తూన్నపుడు. "ఎక్కడైనా కట్టిన చీరకు గాలి తగిలితే వంటి మీద చెంగు తొలగిపోతుంది. కాని భూదేవికి కట్టిన సముద్రపు చీరకు గాలి తగిలితే వంటి మీద నుండి తొలగిపోదు సరిగదా మరింత హత్తుకుంటుంది" అని వివరిస్తూన్నది సముద్రపు అలల వాలకం. బయట లోకంలో వర్షా

కాలం ఒక్క ఋతువుకే పరిమితం. కాని నాగలోకంలో మిగిలిన ఐదు ఋతువులలోను వర్షం కురుస్తుంది, గావును. అలా వర్షం కురిసిన నీరే ఈ మనక్కనబడే సముద్రమేమో! సముద్రాన్ని చూస్తూన్న కొద్దీ ఇలాంటి వింత వింత వూహలు కలుగుతున్నాయి కపి వీరులకు

సముద్రాన్ని అలా చూడగా చూడగా కపివీరులకు మొదట్లో ఉన్న భయం కొంచెం తగ్గి, ఆశ్చర్యం పెరిగింది. ఈ సముద్రాన్ని దాటగలమా అనే ఆలోచనలో పడ్డారు. నిరాశ, నిస్పృహలు పెరిగాయి. గుటకలు మ్రింగుతున్నారు. సంపాతి వాక్కులు వినక పూర్వం ప్రాయోపవేశం చేసినా బాగుండేది. సంపాతి వాక్కుల వల్ల ఏమీ ప్రయోజనం సిద్ధించేట్లు లేదను కుంటున్న కపివీరులను చూసి అంగదుడు—

"వీరులైనవారికి సోమరితనం పనికిరాదు. అది వారిపట్ల దుఃఖాన్ని తెలియజేస్తుంది. ఉత్సాహం చైతన్యాన్ని కలగజేసి, కార్యసిద్ధికి దారి తీస్తుంది. ఈ మాత్రం వివేకం లేకపోతే మనం వీరులెలా అవుతాము, "సముద్రాన్ని దాటలేము" అని చెప్పడానికి ఇంతదాకా రావడం మాత్రం దేనికి ? అక్కడే వుంటే సరిపోయేదిగా ? సంపాతి, నిశాకరుని మాటలు వృథాపోతాయా ? వాళ్ల మాటలు యథా తథంగా జరిగి తీరతాయనే నమ్మకమున్నా మనం ఇప్పుడు రెండో ఆలోచనతో వెనుకంజ వెయ్యం. సముద్రం ఈ ఒక్క దిశలో వున్నదా ఏమిటి ? తక్కిన మూడు దిశల్లోనూ వుంటాయి. అటువైపు వెళ్లిన మన కపివీరులు గూడా ఇలాగే అనుకొని అప్ప చెప్పిన పని మానేస్తారా ? మనం ఈ దిశకు వచ్చాం. మన ప్రయత్నం మనం చేసి తీరాలి. తేడా వస్తే ఊరుకునేవాడు కాదు పినతండ్రి సుగ్రీవుడు. చండశాసనుడు. అలా అని ఆత్మహత్య చేసుకోవడం గూడా నీచమైన పనే!

రౌరవాది నరకాలకు దారితీసే అలాంటి పని. హేయమైన పని వీరులైన వారెవరూ చేయరు. దానికంటే చచ్చి స్వర్గానికి పోవడమే శ్రేయము."

"ఈ దిక్కువైపుగానే సీత వుంటుందని మన సుగ్రీవరాజుకు నమ్మకం. జటాయువు ఈ దిశనే చూపించాడని శ్రీరామచంద్రమూర్తి చెప్పాడు. జటాయువు అన్న గూడా అదే విషయం నిర్ధారణ చేశాడు. ఇక్కడ వుండే సముద్రాన్ని లంఘించగలవాడు మనలో ఉండి ఉంటాడని తెలియకుండా రాజు మనల్ని ఇటుగా పంపించడు — సుగ్రీవుడూ, శ్రీరాముడూ ఇద్దరూ కూడాబలుక్కున్నట్లుగా మనల్ని ఎంతో నమ్మకంతో ఈ దిశకు పంపారు. ఎంత విశ్వాసం లేకపోతే ఈ దిక్కుకు మనల్ని పంపిస్తారు ? కాబట్టి ఈ సముద్రాన్నే కాదు, ఇంతకంటే భీకరమైన రత్నాకరాన్నైనా దాటగల వీరుడు మనలో వుండివుంటాడు. ఇతర దిక్కులకు సేనతోపాటు ఒక్కొక్క వీరుణ్ణి పంపించాడు. కాని ఈ దిక్కుకు ఒకడుగాదు, ఇద్దరుగాదు, పన్నెండుమంది మహావీరులను పంపించాడంటే ఆ సుగ్రీవుని చిత్తంలో ఏముందో అర్థం చేసుకోండి. మీరందరూ ఎవరికి వారు మాకు కాదు మాకు కాదని కూర్చుంటే నిర్ణయించడం నాకు తప్పదు గదా !"

## సముద్ర లంఘన సామర్థ్యం

"ఈ సముద్రాన్ని పగలు చూశాం. రాత్రి ఇంకెలా ఉంటుందో గూడా ఊహించుకుని మరీ నిర్ణయించుకోవాలి. ఎట్లా లేదన్నా కనీసం వంద ఆమడలన్నా ఉంటుంది. ఉత్తుంగ తరంగాలతో, దరిచేరిన వానిని ఉసిగొలుపుతూ ఉండే ఈ సముద్రాన్ని మనం దాటాలి. ఇది మన ముందర ఉన్న మహాకార్యం. మహాదేవ, వాయుదేవ బలసమన్వితులైన వారికి తప్ప ఇలాంటి కార్యం సాధ్యమయ్యే పని కాదు."

"ఈ దాశరథయోధు లందరూ తిరిగి ఇంటికి వెళ్లి భార్యాబిడ్డలను చూచుకొనగలిగేలా జేయగల సుందరమూర్తి మనలో ఎవరు ? ఈ రామకార్యాచరణకు ముందుండి సాధించగలిగే ఆ ధీరుడెవరు ? ఈ మహా సాగరాన్ని లంఘించగలిగి గరుత్మంతుణ్ణి మరపించగల జంఘాచణుడెవరు? వియత్పథంలో వాయుదేవునిలా విహరిస్తూ ఈ దక్షిణాంబుధిని దాటి దిశాంతాలకు చేరగలిగి వానరేశ్వరుని శాసనభీతికి భయపడి మరణించ కుండాను, కోపాగ్నికి దగ్ధం కాకుండాను రక్షించగల ఆ ధీరుడు, మహనీయమూర్తి ఎవరు ? భూజాత సీత జాడను తెలుసుకొనిరాని భీరత్వానికి శిక్షగా రాఘవుని నిశిత శరాగ్ని జ్వాలామాలికలకు భస్మీకృతి కావడం తప్పించగలిగే వైనతేయ వేగలంఘన పటుత్వ బలసంపన్ను డెవరు ? 'వీడెవడురా నన్ను లంఘించేది' అనే అభిమాన భావం పొడచూప కుండా, ఇలా లంఘించడం వల్ల పొందినఫలం తనను లంఘించడంవల్లనే గదా రామచంద్రమూర్తి పొందాడు – అని జీవితాంతం ఆ సముద్రునికి గుర్తుండేలా ఈ శతయోజన విస్తీర్ణాన్ని దాటగలిగే ఆ మహావీరు డెవరు ?" అన్నాడు."

అంగదుని మాటలను విన్న వానరవీరులెవరికీ మారు పలకడానికి గుండెలు చాలలేదు. ఒక్కడూ నోరు విప్పకపోవడంతో మళ్లీ అంగదుడు—

"ఒకప్రక్క కార్యభారం నెత్తికెక్కి కూర్చుంటే–ఏ ఒక్కరూ పెదవి కదల్చరేం ? అయితే సరే ! ఇంకో రకంగా అడుగుతా నుండండి అని, క్రొత్త ఉత్సాహంతో – అందరినీ ఉద్దేశించి – "ఎవరెవరు ఎంతెంతదూరం దూకగలరో నాకిప్పుడు చెప్పండి ముందు. తర్వాత సంగతి నేను చెబుతాను" అని అన్నాడు – అప్పుడు గజ, గవాక్ష, గవయ, శరభ, గంధమాదన మైంద, ద్వివిద, సుషేణులు వరుసగా పదినుండి పది పది

యోజనాల చొప్పున ఎక్కువ దూరం దూకగల సమర్థులమని చెప్పి ఊరు కున్నారు. అప్పుడు అందరిలోకి వృద్ధుడైన జాంబవంతుడు—

"తొంభై యోజనలు దూకగలనని చెప్పగలను కాని, అది పూర్వం మాట. అంతటి జవసత్త్వాలు ఇప్పుడు లేవు. పెద్దవాణ్ణయిపోయాను. సుషేణాదులు పది పది తక్కువగా చెప్పినా, నేను తొంభై అని చెప్పినా ప్రయోజనం లేదు గదా! ఇదంతా చూస్తోంటే "ఇది రామకార్యమా ? లేక కపివీరుల లంఘన సామర్థ్యానికి పోటీ పరీక్షా ?" అన్నట్లు తయారైంది చివరకు. పూర్వం మూడు లోకాలకు సరిపడ శరీరంతో నిండిన త్రివిక్రమునికి ప్రదక్షిణాలు చేశాను. కాని ఏం లాభం ? ప్రస్తుతం రామకార్య నిర్వహణలో ఒక్కపదికి కొఱపడ్డాను. ఏదైనా కాలప్రభావం మహాబలవంత మైంది గదా! ఇన్ని మహాకల్పాలు బ్రతికి గూడా అవసరమైన పనికి అక్కరకు రాలేకపోతున్నాను. 'నేనొక్కణ్ణి ఇట్లా అయినంత మాత్రాన ప్రభు కార్యం తక్కువ కారాదు 'అని నా నమ్మకం." అనంగానే అంగదుడు—

"నేను వందయోజనాలు పోగలను. కాని తిరిగి రాలేననే భయం వుంది, ఏం చెయ్యను" అన్నాడు. అప్పుడు జాంబవంతుడు—

"చాల్చాలు. నాకు తెలీదా నీశక్తి. వందైనా, లక్షైనా నీవు వెళ్లడ మేమిటి ? నువ్వు మా స్వామివి. మేము నీవు చెప్పినట్లు వినాల్సిన వాళ్లం, చెయ్యాల్సిన వాళ్లం. అట్లాంటి మమ్మల్నందరినీ వదిలి, నువ్వు వెళ్లడ మేమిటి ? నడిపించవలసినవాడివి నువ్వు వెళ్లితే మాకింక దిక్కెవరు ? నువ్వు మాకు నాయకుడవే కాదు ! మనందరి నాయకుని కుమారునివి గూడా! మా అందరికీ ఆధారమైన నిన్ను పంపడం వృక్షమూలాన్ని వదులు కోవడమే ! మాకు మూలాధారమైన నిన్ను ఆశ్రయించే మా బుద్ధులు

విక్రమిస్తాయి. మా ధర్మార్థాలు సార్థకమౌతాయి." అనంగానే అంగదుడు హనుమంతుని చూచి, జాంబవంతునితో—

"నేను చేయకూడదు. ఇతరులు చేయరు. అయితే ఇంక నా నాయకత్వంలో రామ కార్యం ఇలా నిష్ఫలమవాలా? దీనికంటే ప్రాయోపవేశమే నయం గదా! ఈ సంధి సమయంలో నేను రాజున నగలనా? కాదనగలనా? నీ వాక్సంధాన విధాన మట్లావుంది. నన్ను నాయకుడన్నా, సైనికుడన్నా లేదా మరేమి పేరు పెట్టి పిల్చినా ప్రస్తుతం పని సానుకూలమయే మార్గం చూడాలి. బాహుబల సంపన్నులైన వారందరూ ఏమీ పట్టనట్లు మౌనంగా కూర్చునివుంటే సర్వాధికారి సుగ్రీవుడు నన్ను వీళ్లందరితోనూ పంపినందుకు నేనూ ఊరుకుంటే ఏట్లా? నాకు చేతనైనట్లుగా చేస్తాను. మధ్యలో నేనేమైపోయినా సరే! నిజానికి సుగ్రీవుడు మీ అందరికీ నన్ను నాయకుణ్ణిగా చేసి పంపాడా? మీ అందరూ ఏదో వూహించుకుంటున్నారు తప్ప" అన్నాడు. అప్పుడు జాంబవంతుడు అంగదుని బాధను, అంతర్యాన్ని అర్థం చేసుకుని—

"నాయనా నీ కెందుకు? నువ్వు ఊరుకో. నేను సానుకూలం అయేట్టు చేస్తాను" అని అంతవరకూ మాట్లాడకుండా, దూరంగా పోయి కూర్చుని వున్న హనుమంతుని దగ్గఱకు వెళ్లి నిస్సహాయ స్థితిలో వున్న వానర సేనను చూపించి—

"నువ్వు కాక పోతే ఈ వానరుల దుఃఖాన్ని తీర్చగల వాడెవడు? మరి నిన్ను చూడపస్తే ఏమీపట్టనట్లు, మూగనోము పట్టినట్లు కూర్చున్నావు. అవడానికి నీకు రాజైనా అంగదుడు నీకు భక్తుడే! నువ్విప్పుడు అతన్ని ఆదుకుని మన్నించాలి. నీ నోటిమాట కోసమే నిరీక్షిస్తు

న్నాడు. మరి నువ్వు ఏకాంతంగా, దూరంగా, ఒంటరిగా మౌనంగా కూర్చు న్నావు. ఇలా అయితే రామకార్యాన్ని మనం చక్కబెట్టగలమా ? ఎదురు గుండా సముద్రుడుగూడా ఆందోళిత మనస్కుడైనట్లు ముందువెనుకకు తార ట్లాడు తున్నాడు."

"శౌర్యంలోగాని, బలంలోగాని, వేగంలోగాని, పాండిత్యంలోగాని నిన్ను సుగ్రీవుడే గాదు. రామలక్ష్మణులు గూడా మించలేరని నాఅభిప్రాయం, అసలు నీ జన్మలోనే ఉంది ఒక ప్రత్యేకత" అని అంటూ ఉండగా సర్వ సేనాపతులు సర్వవానర సేన రెప్పలార్చకుండా హనుమంతుణ్ణే చూస్తు న్నారు. అప్పుడు జాంబవంతుడు మళ్ళీ—

"నాగ సర్ప జాతులలో అగ్రగణ్యుడైన అనంతుడు మోసే బ్రహాండా లన్నిటిని తన రెక్కల సందులలో దాల్చగలిగిన అరిష్టనేమి పుత్రుడు. వినతా సూనుడు ఐన గరుత్మంతుడు గగనవీధిలో పోతూ సాగరపారాన్ని చేరడం నేను ఎన్నోసార్లు చూశాను. అట్లాంటి వైన తేయుడుగానీ, ఈ రామలక్ష్మ ణులుగానీ నిన్ను జవ సత్వ వేగప్రౌఢిమిలో మించలేరు. బలంలోగాని, బుద్ధిలోగాని, శక్తిలోగాని, తేజస్సులోగాని, ఈ మూడు లోకాల సృష్టిలోను నిన్ను మించినవాడు నాకు కనబడ లేదు. మౌనంమాని వళ్ళు విరుచుకో ! లే!" అంటూ ఉండగా సర్వవానరపతులు, సర్వవానరసేన విప్పారిన కళ్లతో చూస్తూ ఉండగా జాంబవంతుడు హనుమంతుని ఉద్దేశించి మళ్లీ—

## హనుమ పుట్టు పూర్వోత్తరాలు

"నువ్వు మహానుభావుడవు. ఒకప్పుడు నేను విన్న నీ జన్మ కథాసుధా ఝరిని వినిపిస్తాను విను—

"ఒకరికొకరు అత్యంత మిత్రులైన అగ్ని, వాయుదేవులు ఒకసారి అడవిలో ఒకళ్ళనంటి నొకళ్ళు కలిసి విహరిస్తుండగా అగ్ని వాయుదేవుణ్ణి చూచి—"మిత్రమా ఒక్క సంగతి ఎన్నో రోజులనుండి విన్నడిగి తెలుసుకోవాలను కుంటున్నాను. చెప్పు. నీకూ అంజనా దేవికి జత ఎలాకూడింది ? అసలు ఈ వానర కులంతో పొందు ఎలా ఏర్పడింది ? మనిద్దరి మధ్య ఉన్న అత్యంత స్నేహభావంతో అడుగుతున్నాను నువ్వు ఏమీ అనుకోనంటే చెప్పు?" అన్నాడు.

"తను లేకపోతే అగ్ని గడ్డిపోచ విలువ కూడా చెయ్యడు. ఏదైనా తనుంటేనే అతని ప్రతాపం. అయినా కాల్చేసేవాడు అతను కాబట్టి తను శాంతంగా ఉండి అతని మాట వింటాడు, కాదనడు. అలాంటి విచిత్రమైన స్నేహబంధం ఇద్దరి మధ్య. అందుకే అగ్ని అడగంగానే వాయువు ప్రక్క నున్న చెట్ల చివురాకుల మధ్యలోంచి ఈలలు వేసుకుంటూ చెప్పడం ప్రారంభించాడు—

"గిరినితంబిని, మోహనఘనస్తనీ అయిన అప్పటి ఆమె నా కళ్ళలో ఇప్పటికీ మెదల్తూనే ఉంది. ఆమె 'పుంజికస్థల' అనే పేరుగల అప్సరస. శాపంచేత కుంజరుడనే మహా కపీశ్వరునికి కూతురుగా పుట్టింది. కేసరి అనే వానరుని భార్య అయింది. కామ శరీరంతో కాననాల్లో శకరకాల ఆకృతులతో విహరిస్తూ ఉండేది. ఒక్కముఖంలో మాత్రం మానవత్వం కనబడుతుంది గాని మిగతా శరీరాంగాలన్నిటిలో అలౌకికమైన ముగ్ధత్వం మూర్తీభవించిన ట్లుండి, ముక్కంటికి గూడా మోహాన్నిరేకెత్తించే విధంగా అందంగా ఉంటుంది. రతికేళీ విలాస వృత్తుల్లో మాటయేమోగాని వంపుసొంపుల సోయగాలతో శిల్పకాఠిన్యము, పుష్పలావణ్యమూ కలిగిన మనోజ్ఞమైన రూపం లోమాత్రం ఘృతాచి, ఊర్వశి, రంభ మొదలైన అప్సరసలు పుంజిఖస్థలతో పోల్చడానికి సరిపోరు."

"మరుని వశంలో మైమరచిన సమయం చూసి, ఆమె వక్ష రక్షక వస్త్రాన్ని, జఘ నాచ్ఛాదిత వసనాన్ని హరించాను. ఈ సంగతి అమెకు స్పృహలోకి రాకమునుపే గాఢంగా కౌగలించుకున్నాను. అమెకు స్పృహ వచ్చి భయంతో సిగ్గుపడింది. ఎవరు నాశరీరరాన్ని స్పృశించింది ? సౌందర్యాన్ని హరించింది ? అంది. అప్పుడు ఆమెను నేను ఓదార్చుతూ, "భయపడకు. నీకు కీడు. దుష్కీర్తి వాటిల్లేట్లు చెయ్యను. ఆ పాపం నాకే కాని నీకురాదు" అన్నాను. అప్పుడు పుట్టాడు నన్ను మించిన జవ సత్త్వ వేగాలతో మా హనుమ. పుట్టగానే ఆకాశానికి ఎగిరి, ఊతపళ్లగుత్తిలా కనబడిన సూర్యబింబాన్ని కబళించి, ఆకలిని తీర్చుకోబోయాడు. ఎవరో క్రొత్త రాహువు ఘన సూర్యుణ్ణి కబళించడానికి వస్తున్నాడనుకొని, ఇంద్రుడు తన వజ్రాయుధంతో హనుమ చెక్కిలిపై కొట్టాడు. హనుమ మూర్ఛిల్లాడు. ఈ సంగతి తెలిసి అంజనాదేవి గళమెత్తి ఆక్రోశించింది. అంతే ! వెంటనే ముల్లోకవాసులకు, ముక్కోటి దేవతలతో సహా అందరికీ గాలి బిగించి ఊపి రాడకుండా చేశాను. అందరూ కాళ్లా వేళ్లా పడ్డారు. మా హనుమను పునర్జీవితుణ్ణి చేశారు." అని వాయుదేవుడు అగ్నికి తన పూర్వచరిత్ర, హనుమ జన్మ చరిత్ర చెప్పాడు. అని జాంబవంతుడు మళ్లీ, అంతేగాదు, ఆ ఇంద్రుడు నీకు ఇచ్ఛామరణాన్ని ప్రసాదించాడు. అస్త్ర శస్త్రాదులేమీ నిన్ను ఏమీ చేయలేవు. నీ శరీరం నింగికి-నేలకు మధ్యనుండే దిక్కులమధ్య గూడా పట్టదు. పరాక్రమంలో నీకు సాటి సముద్రుడవే ! ఉదయపర్వతం మీద ఒక కాలు, అస్తాద్రిపైన రెండోకాలు వేసినిలబడి, సూర్యుని నిరంతర సాపేక్ష గమనంతో శ్రుతి గలిపి సమస్త శ్రుతులను శాస్త్ర వ్యాకరణాదులను ఆ జ్ఞాన భాస్కరునివద్ద నేర్చుకున్నావు. ఇది అనితర సాధ్యమైన విషయం. 'పక్షిణా తోనభవిష్యతి. అల్లాంటి నీకు ఈ సముద్ర లంఘన యేపాటిది ? గోటి

మీది పని ! మేమందరమూ సముద్రంలో మునిగిపోకుండా కాస్త కరుణ వహించు" అని విన్న వించాడు.

జాంబవంతుడు చెప్పిన హనుమంతుని పూర్వ గాథను విని, సర్వ వానరపతులు, సర్వవానర సేన మహా ఆశ్చర్యాన్ని పొందారు. భయభ్రాంత బాష్పనేత్రాలతో తలలు వంచి నిలబడ్డారు. అప్పుడు జాంబవంతుడు మళ్లీ –

"మునుపొకసారి విష్ణుమూర్తి త్రివిక్రముడైనపుడు నా చిన్నతనంలోనే ఆనాడు ఆయనకు ముమ్మారు ప్రదక్షిణ చేశాను. కళ్లనిండా ఆ రూపాన్ని నింపుకున్నాను. అంతపని నేనే చేయగలిగాను కదా ! మరి ఇప్పటి ఈ పని నీకెంతటిది ? ఆపదలో చిక్కుకుని బయటపడలేక వున్న మా అందరినీ నీవు ఆదుకో ! నీ బాహు బలపరాక్రమ సంపన్నతను ప్రత్యక్షంగా చూడాలని సమస్త వానరవాహిని ఎదురు చూస్తున్నది. అందరినీ ఆదరించి ఆనంద పరచు" అన్నాడు.

## హనుమ విజృంభణ

జాంబవంతుని యదార్థ వచనాలను హనుమంతుడు వివృతలోచనాలతో వివరంగా విన్నాడు. విస్తృత దేహుడయాడు. తనను గూర్చిన విశేష ఆత్మజ్ఞానాన్ని పొందాడు. యోగివలె వామనునిలా కూర్చున్నవాడు వానర యోధులు చేసే స్తోత్రాలు వింటున్న కొద్దీ విక్రమిస్తూ విజృంభిస్తున్నాడు. వానరోత్తముల ఆశ్చర్యానికి, ఆనందానికి అవధుల్లేవు హనుమంతుడు కూర్చున్నవాడు కూర్చున్నట్లుగానే ఒక్కసారి నలుదిక్కుల్ని చూశాడు. ఉద్వేగం, ఉత్సాహం ఉవ్వెత్తున పెల్లుబికి అమితంగా పెరిగిన తోకను ఒక్క సారి నేలకేసి కొట్టాడు. నేల దద్దరిల్లింది. వసుధను మోస్తున్న భోగేంద్రుని

మస్తకం ఆదిరి అదుపు తప్పింది. వానరోత్తముల ముఖాల్లో భయభ్రాంత హర్షప్రకర్ష, ప్రమోదిత, మిశ్రవికారభావాలు పొడసూపాయి.

పెద్ద పర్వత గుహలో గాఢ నిద్ర నుండి లేచి ఒక్కసారి వళ్లు విరుచుకుని భూమ్యాకాశాలు దద్దరిల్లేలా మహా గర్జనం చేసే సింహం యొక్క వక్త్రంలా వున్న ఆంజనేయుని విస్తృతాస్యగహ్వారంలో విహాయసాన్ని విలోకించారు. పూర్వం త్రిభువనాలు నిండినట్లుగా త్రివిక్రముడు విజృంభించిన రీతి ఇలాగే ఉండి ఉంటుందన్నట్లుగా, ఇలాతలంనుండి ఇంతకు అంతయై ఆకాశం దాకా ఆక్రమించిన ఆంజనేయునిలో చూశారు. అందరూ మహాకపీశ్వరుడని ప్రస్తుతించడం, మంత్రిగా అధికారికదర్పము, ప్రస్తుత కార్యనిర్వహణా సామర్థ్యజనిత గౌరవము– వీటన్నిటిలో మనస్సు ఉప్పొంగి, దేహం ఉప్పొంగి, భూతలం నుండి, మేఘమండలాలు దాటి అంతరాళంలోకి విస్తరించాడు. అట్టి హనుమంతుని చూచి గుండెలు గుభేలు మన్నాయి అందరికీ ! హనుమంతుడు వృద్ధ కపీశ్వరులకు నమస్కరించి –

"సమస్త జీవకోటికి ప్రాణాధారమైన వాయుదేవుని ఔరసపుత్రుణ్ణి ! బాహుబల జవసత్త్వ వేగాల్లో నాకు నేనేసాటి. ఎప్పుడు ఎంతటివాణ్ణి కావాలో అంతటివాణ్ణి కాగల ప్రతిభాసంపన్నుడను. అనుకున్న కార్యాన్ని సాధించగల కల్పతరువును. నా జవసత్త్వ బలాలు – మనస్సునకు అందేవికావు. దిక్కులు పిక్కటిల్ల జేయగల గళము, గ్రహాలను గుప్పిటపట్టి విసరగల బలము గలవాణ్ణి ! గరుత్మంతుణ్ణిమించి వియత్పథంలో విహరించగలవాడిని· పుడమిని రెండుగా చీల్చి, కొండలను పిండి చేయగలవాణ్ణి. సముద్ర జలాలను భూమి నిండా నింపుతాను. గగన తలంలో స్వాతీ నక్షత్రంలా చరిస్తాను. లంఘన సమయంలో పదాహతికి, నా దేహభారానికి తట్టుకోలేక భూమి దిగబడి మహాబిలంలా అయిపోతుంది. మింటికేగుతుంటే చూడండి

త్రివిక్రమ విస్తరణ. గరుత్మంతుడు, పవనుడే నావేగానికి ఆగగలిగేది నా ముందర. పదివేల యోజనాలు దూకుతాను. చాలా ? ధరణీజాతను చూచి వస్తాను. మీరింక భయాన్ని వీడండి. ఇదీ చాలదనుకుంటే ఆ లంకను పెల్లగించి తెస్తాను. ఇంద్రుని చేతిలోని అమృత భాండాన్ని పట్టుకువస్తాను. నేను చేయలేని పని అంటూ ఈ సృష్టిలో లేదు" అన్నాడు.

పూర్వం శ్రీరామచంద్రుడు శివధనుస్సును విరచినపుడు ముల్లోకాలు భయాందోళనలతో ఎలా భయభ్రాంతులు పొందాయో ఈనాడు ఆంజనేయుని విక్రమ ప్రతాపానికి ప్రపంచాలన్నీ ప్రకంపించిపోయాయి. విక్రమించే వాడు తమ జాతివాడు, రామకార్యం ఇలా తమచేత సమర్ధవంతంగా నిర్వహింప బడుతోందనే భావాలు ఉండబట్టి కపీశ్వరుల హృదయాల్లో భయంకంటే విస్మయం, ఆందోళన కంటే ఆనందం ఎక్కువగా వున్నాయి. అప్పుడు జాంబవంతుడు హనుమంతుని మాటలు విని, వానరుల సంతోషాన్ని చూచి సంతుష్టుడై -

"నాయనా ! కేసరి పుత్రా ! వీరచూడామణీ ! నీ వాళ్లందరూ ఆనందించే రీతిలో సముద్రాన్ని లంఘించి, రామ కార్యాన్ని సాధించుకు రావయ్యా ! గురుకృప, సమస్త ఋషుల అనుగ్రహము నీకుంటాయి. వెళ్ళి పని సాధించుకునిరా. నీ కోసం మేమందరం ఇక్కడే ఒంటికాలి మీద తపస్సు చేస్తూ ఉంటాము". అనగానే ఆంజనేయుడు -

"నేను కనక ఈ చిన్న కొండమీద నుండి పాదం మోపి లంఘిస్తే నా పాదహతికి ఈ కొండ ఆగదు, అణగారి పోతుంది. ఎందుకొచ్చింది ? నేను మహేంద్రగిరి శిఖరానికి వెళ్తాను" అంటూ మహేంద్రగిరి శృంగానికి ఎక్కాడు. మేరు పర్వతంమీది పంకజాసనునిలాగా మహేంద్రగిరి శృంగం అధిరోహిం

చాడు. ఒక్కసారిగా రెండు పాదాలను గిరి శృంగంపై తన్ని పట్టి మేఘగర్జన చేసి లంఘించాడు—

గిరిపై గల సకల ప్రాణులు భయంతో కంపించాయి. సింహం మదపు టేనుగును చఱచినట్లు కెవ్వున గిరిరాజు కేకపెట్టాడు. తడిగుడ్డను చేతులతో పిండినట్లు గిరిరాజు జలపాతాలను ఓడ్చాడు. పళ్ళతో కూడిన కొమ్మను దులిపేసినట్లు మహేంద్రగిరి నుండి ఘనమైన శిలా ఖండాలు ప్రయ్యలై జారుతూ నేలను చేరాయి. చవుడులో ఒప్పినట్లుగా నగరాజు ఒక్కసారి పై కెగసి క్రిందకు వ్రాలాడు. కొండపాములు బుసలుకొడుతూ ఉసూరు మన్నాయి బిలసీమలు పెళ్ళగిల్లాయి. కొండపై తపస్సులు ఉండే సిద్ధులు వదిలివెళ్ళిపోవడంతో గిరిపై విరక్తిభావం పునుముకున్నట్లైంది. ఒక్కసారి జయ జయ ధ్వానాలు మిన్ను ముట్టాయి.

మంగళమూర్తీ! మరణాంధకారార్కా! మర్కటా! పంచవక్త్రా! సర్వాంగదకంఠహారా! రామకాంతాదర్శనభాగ్యప్రదాతా! హనుమంతా! ఆపదుద్ధారకా! ఆంజనేయా! ప్రసన్నాంజనేయా! ప్రభాదివ్యకాయా! ప్రకీర్తిప్రదాయా! వియద్వీథీవిహంగా! జయోఽస్తు విజయోఽస్తు! ప్రభోసుందరాంగా!

(కిష్కింధాకాండ సమాప్తం)

# అనుబంధము

(వాలివధ ధార్మికమా ? అధార్మికమా ?)

శ్రీమద్రామాయణము, మహాభారతము ఇవి రెండును భారతీయులకు ఇతిహాసగ్రంథములు. ఇతిహాస మనగా ఒకప్పుడు జరిగిన గాథ. దీనినిబట్టి రామాయణ భారతములలో ఒకప్పుడు జరిగిన విషయములనే వాల్మీకి, వ్యాసుడు వ్రాసిరి-గాని జరిగియుండవచ్చునని గాని, ఇట్లు జరిగిన బాగుండు నని మనసుపడి-వ్రాసినవిగాని కావు.

శ్రీరాముడు చాటుగా నుండి బాణము వేసి వాలిని వధించెనని పూర్వము జరిగిన గాథను అనుసరించి వాల్మీకి రామాయణములో వ్రాసెను. మరియు వాలి తన వధను గురించి అడిగిన ప్రశ్నలకు శ్రీరాముడు ధర్మబద్ధ మైన సమాధానములు చెప్పినాడని, వాటికి వాలి పూర్తిగా సంతృప్తి చెందిన తరువాత ప్రాణములు విడిచెనని గూడ జరిగిన గాథను అనుసరించియే వ్రాసెను. ఈ రెండు విషయములు వాల్మీకికి దర్శనము జరుగగా వ్రాసినవే! అయినను రాముని సమాధానములకు వాలి సంతృప్తి పడియుండడని కొందరి అభిప్రాయము. పై రెండు విషయములను జరిగినవని దర్శించి చెప్పిన వాల్మీకియే ప్రథమ ప్రమాణముగాని, స్వంతముగా అభిప్రాయపడెడు వారు కాదు. కావున జరిగిన సంగతిని యథాతథముగా తెలిసికొనవలె నన్నచో వాల్మీకి చెప్పిన విషయములనే పూర్తిగా నమ్మవలెను గాని-మరి యొక మార్గమును అనుసరించరాదు, సమర్థించరాదు.

రామాయణములోని వాలి వధను గురించి పెద్దల ప్రసంగములు విన్న తరువాత, స్వయముగా చదివిన తరువాత గూడ కొంతమందికి వాలి వధ ధార్మికమా ? అధార్మికమా ? అను సందేహము నివృత్తి గాదు. నివృత్తి అయిన తరువాత గూడ మరికొందరు ప్రతి ఒక్కరి దగ్గర ఈ విషయమును లేవనెత్తుదురు. అది వారి విలక్షణ స్వభావమే తప్ప జిజ్ఞాసు

లక్షణము గాదు. ఇట్టి విలక్షణ స్వభావము గలవారికిగా నిజముగాక విషయములను తెలిసికొని సందేహనివృత్తి చేసికొనదలచిన వారికి మాత్రమే ఈ సంక్షిప్తవ్యాసము ఉద్దేశింపబడినది. వాలి అడిగినప్రశ్నలను అందుకు రాముడు చెప్పిన సమాధానములను వ్రాసి సందేహమును నివృత్తి గావించుటకు ప్రయత్నించెదను.

వాలి అడిగిప్రశ్నలు ముఖ్యముగా మూడు. అవి—

## మొదటి ప్రశ్న

"బలపరాక్ర సంపన్నుడనైన నాతో నీవు పొత్తు పెట్టుకొనినచో "సీతను నీకు అప్ప చెప్పవలసినదిగా రావణుని అజ్ఞాపించి, ఆమెను ఇప్పించి అతిసులువుగా నీ సమస్యను పరిష్కరించి ఉండెవాడను. కాని, ఆ మాత్రపు లోకజ్ఞానము లేక శక్తిహీనుడగు సుగ్రీవునితో పొత్తుపెట్టుకొని తిప్పలు పడుచున్నావు. దీనికి నీ వేమి చెప్పుదువు ?

## రెండవ ప్రశ్న

నీకు నేను విరోధిని గూడ కాదుగదా ! నన్ను ఎందులకు చంపితివి ? నేను నీకు చేసిన అపకార మేమి ?

## మూడవ ప్రశ్న

ఎదురుగా నిలబడి యుద్ధము చేయక నన్ను చంపుట ఎంతవరకు సమంజసము ?

అందుకు శ్రీరాముని సమాధానములు :

## మొదటి ప్రశ్నకు సమాధానము

తమ్ముడైన సుగ్రీవుడు బ్రతికి యుండగా ఏదో నెపముతో అతనిని దేశబహిష్కృతుని గావించి, అతని భార్యను అతని వెంట పంపకుండా నీవు

అపహరించి, అనుభవించుట నీ నీచప్రవృత్తికి పరాకాష్ఠ. బలపరాక్రమ సంపన్నుడు, శక్తిసామర్థ్యములు కలవాడు గదా అని నీ వంటి నీచప్రవృత్తి గల వానితో పొత్తుపెట్టుకొని, స్వంత పనిని చక్కబెట్టుకొను నంతటి దుఃస్థితిలో మా రఘువంశస్థు లుండరు. అది కుటిల రాజకీయపుటెత్తు అగును గాని న్యాయబద్ధమైన, ధర్మబద్ధమైన పొత్తుకాదు. అందులకే నీతో పొత్తు పెట్టుకొనలేదు. మాకు కావలసినది న్యాయప్రవృత్తి, ధర్మ ప్రబోధము గాని లౌక్యము. చాకకక్యము, స్వార్థము కాదు.

## రెండవ ప్రశ్నకు సమాధానము

నీవు నాకు వ్యక్తిగతముగా విరోధివి కావు కాని ప్రస్తుతము ఈ కిష్కింధా రాజ్యము గూడ మా రఘువంశీయుల సామంత రాజ్యము క్రిందకే వచ్చును. మా రాజు ప్రస్తుతము భరతుడు. నేను రాజ ప్రతినిధిని మా రాజ్యములో ఎక్కడైనను ధర్మవ్యతిరేకమైన పనులు జరిగినపుడు ఆ ధర్మమును పునరుద్ధరించుట మా కర్తవ్యము. అందముగా నున్నదని తమ్ముడు బ్రతికియుండగనే తమ్ముని భార్యనే అనుభవించిన నీవు-అంతకన్న అందమైన స్త్రీని ఈ ప్రాంతములో చూచుట జరిగినచో-ఒంటికాలి మీద లేచి అనుభవించుటకు వెనుకాడవు. అనగా నీవు ఈ ప్రాంతములోని స్త్రీల పట్ల ఒక దుండగీడువు (రౌడీవి, గూండావి) అన్నమాట! అట్టి నీ వలన ఈ ప్రాంతపు స్త్రీలకు రక్షణ యుండదు. నీ బలపరాక్రమ శక్తి సామర్థ్యములు వారిని అనుభవించుటకు పనికివచ్చును కాని-రక్షించుటకు పనికిరావు. నా భార్య సీతను ఎత్తుకుపోయిన రావణుని చంపుటయే తగిన శిక్ష అని నేను నిర్ణయించితిని. ఇంకొకరి భార్యకు ఇట్లే జరిగినపుడు గూడ ఆ చర్యకు కారకుడైన వానిని చంపుటయే శిక్ష అని నిర్ణయింతును. తనకొక ధర్మము పరాయివారి కొక ధర్మము అని ఉండదు. ఇది మా సూర్యవంశీయుల పారిపాలనా విధానము. అందులకే నిన్ను వధించితిని.

## మూడవ ప్రశ్నకు సమాధానము

తమ్ముడు బ్రతికియుండగా అతని భార్యను అపహరించి, అనుభవించిన నీవు ద్రోహిగా, నేరస్థునిగా (Chlprit Criminal) నిర్ణయింపబడితివి.

నేరస్థుని, దొంగను చేతులు కట్టి గూడ దండించివచ్చును. ధర్మబద్ధముగా అతనికి ఒక కత్తి యిచ్చి ఎదుట నిలబడి యుద్ధము చేయవలసిన పనిలేదు. నేరస్థునికి, హంతకునికి మరణశిక్షను అమలుపరచునపుడు ఈ సంగతి తేట తెల్లమగును. "అహింసా పరమో ధర్మః, ధర్మహింసా తథైవచ" - అనగా అహింస ఉత్తమమైన ధర్మము. అట్లే ధర్మమును నిలబెట్టుటకు చేయు హింస గూడ ధర్మమే అగును. హింసకాదు. నిన్ను ఒక్కని వధించినచో ఈ ప్రాంతములోని స్త్రీలకు భయము తొలగి, రక్షణ చేకూరును. నేరస్థునిగా నిరూపింపబడిన నిన్ను ఏ విధముగానైనను చంపవచ్చును.

తన ప్రశ్నలకు శ్రీరాముని ధర్మబద్ధమైన సమాధానములను వాలి వినెను. అదియును గాక తన యెదుట, తార ఎదుట, సుగ్రీవుని ఎదుటనే తన కొడుకైన అంగదుని శ్రీరాముడు యౌవరాజ్య పట్టాభిషిక్తుని చేయు తలంపు గూడ చరమ దశలో వినెను. ఇట్టి రాముని ధర్మప్రవృత్తికి వాలి ఆనంద ముగా ప్రాణములు విడచెను.

ఇక్కడ మరియొక చిన్న విషయము గూడ తెలియపరచుట అవసరము.

"సూర్యసుతుడైన సుగ్రీవునితో సఖ్యము చేసి, ఇంద్రసుతుడైన వాలిని చాటు నుండి చంపుట అధర్మము" అని శ్రీరామునికి అనిపించి యుండవచ్చునట ! అందులకే ఆ తప్పును దిద్దుకొనుటకు మరుజన్మలో కృష్ణునిగా పుట్టినపుడు—ఇంద్రసుతుడైన అర్జునునితో సఖ్యము చేసి, సూర్య సుతుడైన కర్ణుని వధింపజేసెనట ! ఇట్లు వ్రాసి కొందరు అవతారమూర్తి చర్యను సరిదిద్ది సమర్థించితి మనుకొనిరి. కాని ఇట్లు చెప్పుటలో అవతార మూర్తికే అవలక్షణమును అంటగట్టిన విషయమును విస్మరించిరి. చేసిన తప్పులు దిద్దుకొనువాడు అయ్యావారు అగును కాని, అవతారమూర్తి కాడు. (తూచ్చి, ఛూ-నా బొడ్డులు అవతారమూర్తికి ఉండవు !) అవతారమూర్తి రామునిగా వాలిని చంపుట ఎంత ధర్మబద్ధమో కృష్ణునిగా కర్ణునిచంపించుట గూడాఅంత ధర్మబద్ధమే ! ఈ విషయము ప్రస్తుతము అప్రస్తుతము గాన వివరించుట లేదు.

# జగద్గురు పీఠము - గుంటూరు శాఖ

## ప్రచురించిన పుస్తక వివరములు

## 1) ప్రేయరు :

దేశ, విదేశములలోని జగద్గురు పీఠమునకు చెందిన సోదర సోదరీ మణులందరూ ప్రతి రోజు ఉదయం 6 గంటలకు, సాయంత్రం 6 గం॥లకు "కామన్ ప్రేయర్" పేరిటచేయు ప్రార్థనా పూర్వక ధ్యానమునకు సంబంధించిన వివిధ అంశముల గూర్చి సరళమైన భాషలో సంక్షిప్తముగా వివరించబడినది. వెల ; రూ. 4/-

## 2) గాయత్రి :

గాయత్రీ వైశిష్ట్యమును గూర్చి ఋషులు, ఆర్షసూక్తులు తెలిపిన శ్లోకములు, వాటి భావములు, "మంత్రము", 'గాయత్రీ' పదముల నిర్వచనములు, గాయత్రీ మంత్రములోని అక్షరముల సంఖ్యా నిర్ణయమును గూర్చి, గాయత్రీమాత పంచశీర్షముల గురించి, భూర్భువస్సువరాది వ్యాహృతుల గురించి వివిధ సమన్వయార్థములు సశాస్త్రీయముగా వివరింపబడినవి. వెల ; రూ. 5/-

## 3) శాంతి పాఠము :

"శన్నోమిత్రశ్శం వరుణః....శాంతిః" అను శాంతి పాఠములోని ప్రతి పదమునకు గల అర్థమును, విశేషార్థమును, మంత్రతాత్పర్యము, శాస్త్రీయ వివరణము గల చిన్న పుస్తకము. వెల : రూ. 2/-

## 4) జాతక చక్రమును గుణించు పద్ధతి :

జాతక చక్రమును గుణించుటలో తెలియవలసిన భూగోళ, ఖగోళ శాస్త్ర సాంకేతిక పదముల అర్థములు. నిరయణ, సాయన పద్ధతులతో జాతక చక్రమును గుణించు పద్ధతులు, వివిధ రకముల ఎఫిమిరస్ (పంచాగము) లను ఉపయోగించు విధములను, గ్రహముల మధ్య దృష్టులు గుర్తించు విధానము, దేవ మానవ చక్రము గ్రహదశలు, గర్భభుక్తి, దశాశేషమును కట్టు విధానము మొదలగు అంశములన్నియు ఉదాహరణ లెక్కలతో విపులముగా వివరింపబడిన గ్రంథము (పునర్ముద్రితము కావలెను). (28 వ సాధారణ తెలుగు పుస్తకముల జాబితా 'బి' లోని సైటేషన్ నెంబరు 11506/సా.తె/1203)

## 5) తైత్తిరీయోపనిషత్తు :

శిక్షావల్లి, ఆనందవల్లి, భృగువల్లులలోని ఉపనిషత్ మంత్రములకు శాస్త్రీయమైన వివరణ ఇవ్వబడిన పుస్తకము. భారత ప్రభుత్వ మానవ వనరుల మంత్రిత్వశాఖ వారిచే కొనుగోలు చేయబడి భారత దేశములోని అన్ని విశ్వవిద్యాలయ గ్రంథాలయములకు పంపిణీ చేయబడిన గ్రంథము. ఆంధ్రప్రదేశ్ లోని ప్రతి జిల్లా గ్రంథాలయము లోను, గుంటూరు జిల్లా గ్రంథాలయ సంస్థవారి వివిధ గ్రంథాలయముల వారిచే కొనుగోలు చేయ

బడిన గ్రంథము. (పునర్ముద్రితము కావలెను) [28 వ సాధారణ తెలుగు పుస్తకముల జాబితా 'బి' లోని సైటేషన్ నెంబరు 10752/సా.తె/100/554]

## 6) పాదుకా పట్టాభిషేకము :

శ్రీ మద్రామాయణములోని అయోధ్యాకాండలోని పాదుకాపట్టాభిషేక ఇతి వృత్తము నందలి శ్రీరామ భరత లక్ష్మణుల మధ్య సంభాషణములు, జాబాలి నాస్తిక వాదమునకు శ్రీరాముడు తెలిపిన హేతుబద్ధ సమాధానము మొదలగు అంశములన్నియు సరళమైన శిష్ట వ్యవహారిక భాషలో వివరింపబడిన గ్రంథము. వెల : రూ. 20/-

## 7) అరణ్యకాండ :

శ్రీమద్రాయణములోని మూడవకాండ అయిన అరణ్యకాండలోని విరాధ వధ, అగస్త్యుని కథ, శూర్పణఖ వ్యథ, ఖరదూషణాదులతో శ్రీరాముని యుద్ధము, మాయలేడి, సీతాపహరణము, జటాయు కథ, కబంధ శబరుల వృత్తాంతము మొదలగు సన్నివేశములన్నియు హృదయరంజకముగా వివరింపబడిన గ్రంథము. వెల : రూ. 55/-

గ్రంథాలయ ప్రతి వెల : రూ. 70/-

## 8) కిష్కింధాకాండ :

శ్రీమద్రామాయణములోని నాల్గవ కాండఅయిన కిష్కింధాకాండ లోని శ్రీరామ సుగ్రీవుల సఖ్యము, వాలి వధ, తార తెలివి, శ్రీరాముని ధర్మ వచనాలు, సీతాన్వేషణా కార్యక్రమము, హనుమంతుని పుట్టుపూర్వోత్తరాలు, హనుమంతుని - సముద్ర లంఘనోత్సాహము, కుండలినీ యోగముతో రామాయణ కాండలకు గల సమన్వయము, మొదలగునవి అత్యంత రమణీయముగా వివరింపబడిన గ్రంథము. వెల : రూ. 55/-

గ్రంథాలయ ప్రతి వెల : రూ. 70/-